# వేణుగోపాల శతకము

*రచన*

**పోలిపెద్ది వేంకటరాయకవి**

**(క్రీ.శ. 1800-1875)**

*పరిష్కరణ - తాత్పర్య రచన*

"సాహితీ వాచస్పతి" - "ఉపన్యాస చతురానన"

**శ్రీ మొవ్వ వృషాద్రిపతి**

*సంపాదకులు-ప్రకాశకులు*

**ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు**

*వ్యవస్థాపక అధ్యక్షులు*

**శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య (శ్రీరస)**

బెంగుళూరు

**2020**

**VENUGOPALA SATAKAMU,** by **Polipeddi Venkatarayakavi** (1800-1875 A.D.), Commentary by **Sri Movva Vrushadripati,** M.A., and Edited and Published by **Prof. T.V.Subba Rao**, Founder President, Sri Krishnadevaraya Rasajna Samakhya (R.), Bengaluru - 560 060.

**No. of Pages:** xxxvi + 280 (Including 56 pages of colour photos)

**First Edition : 12-08-2020**

శార్వరి నామసంవత్సర శ్రావణ బహుళ అష్టమి – శ్రీకృష్ణజయంతి

**No. of Copies :** 1000

**Price:** Rs.300/-

© Prof. T.V. Subba Rao (99454 22742)

ప్రతులకు:-

**1)** విశాలాంధ్ర బుక్ హౌస్, విజయవాడ మరియు దాని శాఖలు.

**2)** సాహితీ ప్రచురణలు, విజయవాడ

**3)** నవచేతన బుక్ హౌస్, హైదరాబాద్ మరియు దాని శాఖలు

**4)** నవోదయ బుక్ హౌస్, హైదరాబాద్

**DTP:**
**Nagasri Graphics**
H.No.1-18, Plot No.17
Brindavana Colony
Near Agnimaremma Temple
Gundlasagaram Village - 517 425
Gudupalli Mandal; Chittoor District
Andhra Pradesh; Mobile: 8500619283

*Printing :*
**Omkar Offset Printers**
Bengaluru-560 002
Phone: 080-26708186; 26709026

# స్వామివారి దివ్యాశీస్సులు

చిత్తూరుజిల్లా కార్వేటినగరంలో వెలసియున్న శ్రీ వేణుగోపాలస్వామివారి దివ్యాశీస్సులు ఈ క్రింది బంధుమిత్రులకు, వారి కుటుంబ సభ్యులకు ఎల్లవేళలా లభించుచుండుగాక!

1. ఈ శతకముద్రణకు ధనసహాయం చేసిన ఉదారహృదయులందరికిని –
2. మా అన్నదమ్ములకు, మా చిరంజీవులకు – కొడుకులకు, కోడళ్ళకు, కూతుళ్ళకు, అల్లుళ్ళకు, మనుమలకు, మనుమరాండ్రకు, మునిమనుమలకు, మునిమనుమరాండ్రకు –
   - 2.1 ప్రత్యేకంగా: 02-12-2020 నాటికి 60 శరత్తులు నిండిన మా పెద్దమ్మాయి చి॥ సౌ॥ తంగిరాల సీతామహాలక్ష్మికి –
   - 2.2. మా సీతమ్మతో పాటే ఈ యేడాది (2020)లో షష్టిపూర్తి అయిన మా బుల్లి తమ్ముడి అల్లుడు కర్నల్ (డా॥) గిడుగు వెంకట రామదాసుగారికి (గిడుగు రామమూర్తిపంతులుగారి మునిమనుమడు) – (షష్టిపూర్తి: 18.07.2020)
   - 2.3 మా మేనకోడలు డా॥ చల్లా సీతామహాలక్ష్మికి – (షష్టిపూర్తి: 12.10.2020).
   - 2.4 మా అన్నయ్యగారి ఆఖరి అమ్మాయి చి॥ సౌ॥ తంగిరాల జయదుర్గా భవానికి – (షష్టిపూర్తి: 21-10-2020)
   - 2.5 ఈ ముసలితనంలో నన్ను శ్రద్ధగా చూసుకుంటున్న మా మూడవ అబ్బాయి చి॥ శ్రీనాథుడికి, వాడి కుటుంబానికి –
3. "రైతుబాంధవుడు" శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారికి (పార్లమెంటు సభ్యులు, నంద్యాల) – ప్రసిద్ధ వ్యవసాయశాస్త్రవేత్త డా॥ కాదరబాద్ రవీంద్రనాథ్‌గారికి (నంద్యాల) –

4. "దానరాధేయ" శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారికి – శ్రీనారపరాజు సూర్యనారాయణగారికి –
5. నాకు నచ్చిన పండితప్రకాండులు ఆచార్య శలాక రఘునాథశర్మగారికి, ఆచార్య బేతవోలు రామబ్రహ్మంగారికి–డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రిగారికి
6. "శ్రీరస" కార్యవర్గసభ్యులకు, ట్రస్టుబోర్డు సభ్యులకు, మహారాజపోషకులకు, రాజపోషకులకు, పోషకులకు, వార్షిక సభ్యులకు –
7. శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారికి, శ్రీ గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి, డా॥ సంగనభట్ల నరసయ్యగారికి –
8. చిత్తూరుజిల్లా మిత్రులకు–ప్రత్యేకంగా ఎ.రాధాకృష్ణంరాజుగారికి, శ్రీ కె. గంగరాజుగారికి, శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారికి, శ్రీ పి. కృష్ణంరాజుగారికి, ప్రొ॥ ఎం.కుమారస్వామిరాజుగారికి, శ్రీ ఎం.ఏ. గోవిందరాజుగారికి, ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారికి –
9. ఒకప్పుడు భారతీయ విజ్ఞానసంస్థలోను, ఇప్పుడు సంజయనగర్‌లోను శ్రీరససభలు జరుపుతూ ఉంటే, నాకూ, ముఖ్యఅతిథి శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికీ ఎంతో ఆప్యాయంగా ఆతిథ్యం ఇస్తూన్న దంపతులకు; చేదోడు వాదోడుగా ఉంటూన్న ఇతర దంపతులకు –
10. "కళాప్రపూర్ణ" డా॥ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారి శతజయంతి సందర్భంగా 07–03–2020 నాడు నన్ను "జీవిత సాఫల్య పురస్కారం"తో సత్కరించిన "సి.పి.బ్రౌన్. సేవాసమితి" వ్యవస్థాపక అధ్యక్షులు, తెలుగు విజ్ఞానసమితి ప్రధానకార్యదర్శి, ప్రియమిత్రులు శ్రీ ఇడమకంటి లక్ష్మిరెడ్డిగారికి–
11. ఏప్రిల్ 25వ తేదీ (2020) నాటికి అరవై వసంతాలు నిండిన మా "శ్రీరస" వ్యవస్థాపక కార్యదర్శి, ద్విభాషాకవయిత్రి, రచయిత్రి శ్రీమతి అంబికా అనంత్‌గారికి – శ్రీమతి "చంటమ్మాయి"కి, శ్రీమతి "విజ్జి"కి –
12. గత 20 ఏండ్లుగా మా "శ్రీరస"లో ప్రసంగాలు చేస్తున్న శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారికి, వారి శ్రీమతి శ్రీవల్లిగారికి, వారి గురువు ఆచార్య కోలవెన్ను మలయవాసినిగారికి –

13. ఎం.ఏ.లో (1961–63లో) నా సహాధ్యాయులు ఈ నాటికీ నా ప్రాణ మిత్రత్రయం: శ్రీ మెట్టు రామచంద్ర ప్రసాద్, శ్రీ మోపూరు వేణుగోపాలయ్య, ప్రొ॥ లింగమనేని బసవశంకరరావులకు – అనుజ తుల్యుడు ప్రొ॥ ఆర్వీయస్ సుందరానికి, అనుంగు శిష్యుడు ప్రొ॥ జి.యస్. మోహన్‌కి –

14. ఉత్తమ జానపద సాహిత్యవేత్త, నా నిరంతర శ్రేయోభిలాషులు, ఆప్తమిత్రులు, ఇంట్లో గుట్టలు గుట్టలుగా పడివుండి దుమ్ము కొట్టుకుపోతున్న, నిరంతరం ఆడవాళ్ళ ఆగ్రహావేశాలకు గురిఅవుతున్న నా ప్రియమైన పుస్తకాలకు మోక్షమార్గం చూపించిన మహానుభావుడు ఆచార్య తంగెడ కిషన్‌రావుగారికి – ఈ విషయంలో వీరితోపాటు నా కోసం ఎంతో కష్టపడిన ప్రముఖ కవయిత్రి, రచయిత్రి అయిన శ్రీమతి అయినంపూడి శ్రీలక్ష్మిగారికి –

15. దొక్కశుద్ధిగల పండితుడు, “లోనారసి” చూడగల పరిశోధకుడు, ఉత్తమ దేశికుడు, నన్ను ఎల్లప్పుడూ గురువుగా భావించి గౌరవించే “ఏకలవ్యశిష్యుడు”, అన్నింటికీ మించి హృదయానికి దగ్గరగా వచ్చే స్నేహశీలి, అయిన ఆచార్య బూదాటి వెంకటేశ్వర్లుగారికి–వీరి శ్రేష్ఠపర్యవేక్షణలో ఈ యేడాది (2020లో) పిహెచ్.డి. డిగ్రీ పొందిన నా ప్రియశిష్యుడు డా॥ తోట వెంకటస్వామికి –

16. ఎప్పుడో (1969–1995 మధ్య) ఏదో ఉత్సాహంగా తెలుగు సాహిత్యం బోధించాను. నేను రిటైరయిపోయి పాతికేళ్ళు దాటింది. అయినా ఇప్పటికీ నాయందు నఖశిఖపర్యంతం గురుభక్తితో నిండిపోయిన అర్జునునివంటి నా అంతేవాసులు: ఆచార్య చన్నా ప్రగడ జయలక్ష్మి, డా॥ ఎం. రుక్మాంగద నాయుడు, డా॥ వి. నారాయణప్ప, ఆచార్య ఎం. రామనాథం నాయుడు, డా॥ పల్లవోలు మాధవి, డా॥ ఎన్. ఆర్. సదాశివరెడ్డి, డా॥ యెనిశెట్టి శ్రీరంగనాయకి, శ్రీ వై. రామమోహన్, డా॥ ఇ. నాగరాజు, శ్రీ ఏటిగడ్డ అశ్వత్థనారాయణ, శ్రీ ఎం. రవిశేఖర్, శ్రీ జి. చిత్తనగరి, శ్రీ సి. కృష్ణమూర్తి, శ్రీ గొల్ల కృష్ణప్ప, శ్రీమతి కె. మంజులమ్మ, శ్రీ మురళి, శ్రీ జగన్నాథ్, డా॥ పి.యు.బి. శర్మగారు, డా॥ ఇప్పగుంట మాధవరావుగారు, శ్రీమతి ఎన్. రాజేశ్వరి, శ్రీ ఖండాపు మన్మథరావు, ప్రొ॥ ఆర్. శేషశాస్త్రి, ప్రొ॥ జోస్యుల సదానంద శాస్త్రి, కన్నడ విద్యార్థులు: శ్రీ మార్కండపురం శ్రీనివాస్,

ప్రొ॥ మీరాసాబిహళ్ళి శివణ్ణ మొదలైనవారు ఎందరో–అందరికీ పేరుపేరునా స్వామివారి ఆశీస్సులు అందుగాక!

17. మా 'శ్రీరస' పరంగా భారతీయ విజ్ఞానసంస్థలో 14.12.2013 శనివారం నాడు ఒక లక్షా 25వేల రూపాయల ఖర్చుతో శ్రీమల్లాప్రగడ బృందంవారిచే "భువన విజయం" ప్రదర్శింపజేసిన పూర్వ పరిశోధక విద్యార్థి డా॥ వంజరి శివరామకృష్ణగారికి, వారికి చేదోడు వాదోడుగా ఉన్న త్రిమూర్తులు డా॥ హరి పవన్‌కుమార్, డా॥ జి.పి.ఆర్. యశస్వి, డా॥ వంజరి శేషాద్రి శ్రావణకుమార్‌గారలకు –

18. ప్రతిసంవత్సరం శ్రీకృష్ణజయంతినాడు, కార్వేటినగరంలోని శ్రీ వేణుగోపాల స్వామివారికి, క్రమం తప్పకుండా 50 ఏండ్లపాటు (1966 నుండి 2015 వరకు) నాట్యార్చన చేసిన మహాభక్తులు, బొబ్బిలి రాజవంశీకులు, సంగీత సాహిత్య రసికులు, నా ప్రియతమ మిత్రులు అయిన శ్రీ వి.ఎ.కె.రంగారావు గారికి –

ఇట్లు

**తంగిరాల వెంకట సుబ్బారావు**



**శ్లో॥ కస్తూరీ తిలకం లలాటఫలకే, వక్షస్థలే కౌస్తుభం,**
**నాసాగ్రే నవమౌక్తికం, కరతలే వేణుం, కరేకంకణమ్।**
**సర్వాంగే హరిచందనం, చ, కలయన్, కంఠేచ ముక్తావళిం,**
**గోపస్త్రీ పరివేష్టితో, విజయతే, గోపాలచూడామణిః**

(–బిల్వమంగళ లీలాశుకుడు)

## ఈ గ్రంథముద్రణకు
## ధనసహాయం చేసిన ఉదారహృదయులు

1. "రైతుబాంధవుడు" శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు, పార్లమెంటు సభ్యులు, నంద్యాల, కర్నూలు జిల్లా.
2. "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు, బెంగుళూరు.
3. శ్రీమతి పర్వతవర్ధని–శ్రీ నారపరాజు సూర్యనారాయణ దంపతులు, బెంగుళూరు.
4. శ్రీ పెద్ది సత్యనారాయణగారు, బెంగుళూరు.
5. డా॥ టి.ఆర్. మీనలోచనగారు, బెంగుళూరు.
6. డా॥ సి. సుబ్బలక్ష్మిగారు, బెంగుళూరు.
7. శ్రీ తెలిదేవర సుబ్బారావుగారు, బెంగుళూరు.
8. శ్రీమతి బి. శ్రీకృష్ణవేణిగారు, జిల్లా ట్రాన్స్‌పోర్టు కమీషనర్, ఒంగోలు, ప్రకాశంజిల్లా.
9. శ్రీ వడ్డె బాలనరసింహుడుగారు, నంద్యాల, కర్నూలు జిల్లా
10. శ్రీ తంగిరాల వేంకట కృష్ణసోమయాజులుగారు, తణుకు, పశ్చిమ గోదావరి జిల్లా.
11. కర్నల్ తంగిరాల కృష్ణమూర్తిగారు, కాకినాడ, తూర్పుగోదావరి జిల్లా,
12. శ్రీమతి తంగిరాల జయదుర్గాభవానిగారు, హైదరాబాద్.
13. శ్రీమతి అంబికా అనంత్‌గారు, బెంగుళూరు.
14. డా॥ పి.యు.బి. శర్మ (పోతుకూచి ఉమాభట్టీశ్వరశర్మ)గారు, హైదరాబాద్.

15. కీ.శే. శివకవి ఎన్. శివగౌడుగారి స్మారకంగా వారి కుమారుడు శ్రీ ఎన్. జగన్నాథగౌడుగారు, బెంగుళూరు.
16. కీ.శే. శేషగిరి సత్యనారాయణగారి స్మారకంగా వారి కుమారుడు శ్రీ శేషగిరి వెంకటేశ్వరరావుగారు, బెంగుళూరు.
17. శ్రీమతి పద్మలత – శ్రీ బాపనపల్లి గోపాల్ దంపతులు, బెంగుళూరు.
18. శ్రీమతి చాగంటి కామేశ్వరి – శ్రీ కె.బి.జె. శ్రీనివాస్ దంపతులు, సామర్లకోట, తూర్పుగోదావరి జిల్లా.
19. శ్రీమతి పరమేశ్వరమ్మ – శ్రీ మెట్టు రామచంద్రప్రసాద్ దంపతులు, నెల్లూరు.
20. శ్రీమతి చలంచర్ల రంగనాయకమ్మ ("అమ్మాయి")గారు, ఒంగోలు, ప్రకాశంజిల్లా.
21. డా॥ చల్లా సీతామహాలక్ష్మిగారు, నున్న, విజయవాడ.
22. శ్రీ ఎ.కె. జయచంద్రారెడ్డిగారు, బెంగుళూరు.
23. శ్రీమతి సూర్యకుమారి – ప్రొ॥ వేదుల సుబ్రహ్మణ్యం దంపతులు, బెంగుళూరు.
24. డా॥ ఎ. రాధాకృష్ణరాజుగారు, అధ్యక్షులు, తెలుగు విజ్ఞాన సమితి, బెంగుళూరు.
25. ప్రొ॥ కె. ఆశాజ్యోతి – ప్రొ॥ కె. జనార్ధన్ దంపతులు, బెంగుళూరు.
26. శ్రీమతి మారుతి శ్రీలత – శ్రీవి. సురేంద్రనాథ్ దంపతులు, బెంగుళూరు.
27. శ్రీ ఎం.ఏ. గోవిందరాజుగారు, బెంగుళూరు.
28. ప్రొ॥ తంబిశెట్టి రామకృష్ణకవిగారు, బెంగుళూరు.
29. శ్రీమతి భారతలక్ష్మి – డా॥ తోట వెంకటస్వామి దంపతులు, కుప్పం, చిత్తూరు జిల్లా.
30. డా॥ గన్నమరాజు గిరిజామనోహరబాబుగారు, వరంగల్లు
31. శ్రీమతి ఆర్. పద్మావతి – శ్రీ ఆర్. వెంకటరామారావు దంపతులు, బెంగుళూరు.

(మిగిలిన దాతల పేర్లు గ్రంథాంతంలో చూడ ప్రార్థన)

# వేణుగానము

## (విషయ సూచిక)

**మ. నుదుటం కస్తురిబొట్టు, నాసిక తుదన్ ముత్తెంబు, శ్రీగంధసం**
**పద నెమ్మేనఁ, గరంబులం గటకముల్, వంశంబు హస్తాగ్రమం,**
**దెదపై నిస్తుల కౌస్తుభంబు, నఖుతన్ శృంగార హారంబు, నిం**
**పొదవం, గృష్ణుఁడు గోపికావృతుఁడు, సర్వోత్కృష్టుడై వర్తిలున్.**

(– వెలగపూడి వెంగనామాత్యుడు)

# వేణుగోపాల శతకము

– ఆచార్య కె. గోపాలకృష్ణారావు

ఈ శతకకర్తృత్వమునుగూర్చి విమర్శకులు భిన్నాభిప్రాయములు వెలువరించియున్నారు. క్రీ.శ. 1800–1875 ప్రాంతమున జీవించిన లావణ్యశతక కర్త పోలిపెద్ది వేంకటరాయకవియే వేణుగోపాల శతకమును కూడ రచించెనని కొందఱు చెప్పగా వింటిననియు, నందులకు సాక్ష్యములేదనియు నిడుదవోలు వేంకటరావుగారు శతకవాఙ్మయచరిత్ర అనుబంధమునందు వివరించిరి. పోలిపెద్ది వేంకటరాయకవి తిట్లదండకమునందు వేణుగోపాలుడు తనకిష్టదైవమని వివరించెను. వేణుగోపాలునిపై రచింపబడిన శతకము పోలిపెద్ది వేంకటరాయ కృతమని భావించుట కీ కారణములే ఆధారములు. కార్వేటి నగరాధీశ్వరుడగు పెరుమాళ్రాజేంద్రుని ఆస్థానమునగల ఒకానొక అధికారి కవిని అనాదరించె ననియు, తత్కారణమున సంస్థానమునందలి ఆక్రమములను, సాంఘిక వ్యవస్థలోని కల్లోలపరిస్థితిని కవి నిశితముగ విమర్శించెననియు, ప్రతీతి. ఈ శతకమున రాజునుగాని, తన నవమానించిన మంత్రినిగాని, ఇతరాధికారులనుగాని కవి పేర్కొనలేదు. కలియుగధర్మముల ననుసరించి సంఘమునందేర్పడిన స్థితిగతులను కవి వివరించుట వలన దురాచారములు మున్నగునవి యుగధర్మ ప్రభావమున గలిగినవని కవి భావించెనని స్పష్టమగుచున్నది. "అహహ కలియుగ ధర్మమేమనఁగ వచ్చు నన్నిటికి నోర్చి యూరక యుండవలెను" నని సమకాలిక స్థితిగతులను సమీక్షించి బాధనొందెను. రాజులు రాజ్యపాలనమునందాసక్తి వహింపక భోగలాలసులై వ్యసనాసక్తులై యుండిరి. వారిలో సాహసపరాక్రమము లంతరించినవి. వారి సేనయు పరాక్రమ విహీనమైనదని కవి ఒక పద్యములో స్పష్టమొనర్చి 'వీరగుణము లేని భటులకు ఆయుధము లేల' అని అధిక్షేపించెను. రాజులు మందబుద్ధులగుటవలన మంత్రులు తదితరాధికారుల దౌష్ట్యము

మితిమీరియుండెను. యాచకులు ప్రభువులను దర్శింపనీయక వారు తమ అధికారమును నిరంకుశముగా కొనసాగించుచుండిరి. ఉన్నతగుణసంపన్నుడగు వ్యక్తిని మంత్రిగా నియమించుకొనినచో రాజునకు రాజ్యమునకు సకల శ్రేయములు చేకూరునని ఈ సందర్భమునందే సన్మంత్రి లక్షణముల నిట్లు నిర్దేశించెను. ఆకర్షకమగు అంగసౌష్ఠవము, సరసవాచాలత, లోకజ్ఞత, సంధ్యానుష్ఠానత, ప్రభువిశ్వాసమును పొందినవాడు మంత్రిగా నుండవలయునని కవి సూచించెను. పాలనలేని భూపతికి మంత్రి ధగిడీగా నున్నచో దాతలకు, విద్వాంసులకు ప్రమాదము. కవి పండితులకు జరీవస్త్రములొసగి గౌరవింపుమని రాజు ఆదేశించినను దుష్టమంత్రులు తప్పించుకొని నిర్లక్ష్యభావమున వర్తించుచుండిరి. కొందఱు మంత్రులు ప్రభువును కవిపండితుల నాదరించవలదని దుర్బోధగావించు చుండిరి. ఆస్థానములందు వేశ్యలకు ప్రాధాన్యముండెను. పండితులు సభలలో ప్రవేశించినపుడు వారు లేచి నిలబడక వారిని పరాభవించుచుండిరి. "అట్టివేశ్యలను తలగొరిగించి మెత్తనిసున్నము బూసి, బొగ్గుగంధము బొట్టుపెట్టి, చెప్పులు మెడగట్టి, గాడిదపై గూర్చుండబెట్టి, కాలమెట్టి, గ్రామప్రదక్షిణం బొనరింపజేసి నిల్చిన చోట పేడనీళ్ళు చల్లి, విప్రదూషకులను ఆ వేశ్యల వెంటనే యమపురికి పంపవలయు"నని కవి చెప్పిన పద్యమువలన ఆస్థానములందు విప్రులకు, కవి పండితులకు తగినస్థానము లేకుండెనని స్పష్టమగుచున్నది. రాజులలో సహృదయత కవితారసజ్ఞత లేకుండెను. అట్టి ప్రభువులకు సదుపదేశము గావింపవలయునని మంత్రులకు కవి సూచించెను. ఈ వర్ణనలవలనను కవిగావించిన అధిక్షేప ప్రధానములగు విమర్శనములవలనను నాటి ప్రభువులును, మంత్రులును, పరస్పరము రాజ్యక్షేమమును కాంక్షించుదృష్టితో నుండక, ఎవరికి తోచిన విధముగ వారు స్వతంత్రులై నిర్లక్ష్యభావమున వర్తించిరని స్పష్టమగుచున్నది.

కలియుగప్రభావమున వర్ణాశ్రమధర్మములు నశించినవని అధిక్షేపశతక కర్త లందఱు నొకేవిధముగ సాంఘిక వ్యవస్థను తీవ్రముగా విమర్శించిరి. "తండ్రి మధ్వాచారి, తనయు డారాధ్యుండు, తల్లి రామానుజ మతస్థురాలు. ఆలు కోమటి జాతిది. తమ్ముడు బౌద్ధుడు, సడ్డకుడు సర్వేశ్వర మతస్థుడు. అక్క జంగమురాలు, బావగారిది బలిజకులము. మఱదలు, కోడలు మాఱువాడి. కలియుగములో

వర్ణసంకరము కలిగిన ఫలమిది" అని కవి చమత్కార పూర్వకముగ నధిక్షేపించి, విప్రులధోగతిపాలై అన్యజాతులవారు పండితులగుచున్నారని కవి వివరించెను. విప్రుల దీనస్థితిని అనాగరికులు విమర్శించిన ధోరణి, పూర్వశతకముల కనుకరణ ప్రాయమై యున్నది. నిశ్చలభక్తివిహీనులై వివిధమతస్థులు కపటడాంబికా చారములకు మాత్రమే ప్రాధాన్యము నొసగిరి. వైష్ణవులు తిరుమణి పట్టెలు ధరించి భుజములు కాల్చికొని నంత మాత్రమున మతగురువులు కారనియు, వాయువు బంధించి కన్మూతలేసినంతనే ముక్తి లభించదని కవి ఆయా మతాచారపరుల నధిక్షేపించెను. సామాన్యసేవకు లధిపులై యుండిరి. మహమ్మదీయు లైశ్వర్యమున తులఁదూగుచుండిరి. అధికారులు విప్రుల మాన్యముల నపహరించుచుండిరి. ఒకరి వృత్తి నొకరు అవలంబించుచుండిరి. నాటి దొరలు కొండెసిగ, తలగుడ్డ, పాకోళ్ళు, బొజ్జలకతార్లు, కాసెకోకలు, జందెములు, డాలువార్లు, తిరుచూర్ణపు చారలు, జొల్లు వీడెములతో సొగసుకోరులై యుండిరి.

**రామాండకతలెల్ల మే మెఱుంగనియవె?**
**కాటమరాజుకుఁ గర్ణుడోడె**
**భాగోత కతలంత పలుమారు వినలేదె**
**యిగనేశుఁ డర్జను నిరగఁబొడిసె.** (59వ పద్యము)

అను పద్యమున వేణుగోపాలశతకకర్త ప్రాకృతజనులఅజ్ఞతను పరిహసించెను. ఈ కవి సంఘమునందలి వివిధ వృత్తులవారిని వర్ణించిన సందర్భము లన్నియు స్వభావోక్తి పూర్ణములై లలితమైన హాస్యమును ధ్వనింపజేయుచున్నవి.

**వంకర పాగాలు, వంపుముచ్చెలజోళ్ళు,**
**చెవిసందు కలములు, చేరుమాళ్ళు;**
**మీగాళ్ళపై పింజె బాగైన దోవతుల్,**
**జిగితరంబైన పార్షీమోహర్లు;**
**చేపలవలెను ఋస్తీ మీసము, ల్కలం**
**దాన్పెట్టెలును, జేత దస్త్రములును** – (61వ పద్యము)

– గల కరణముల వేషములు కన్నులకు గట్టినట్లున్నది. మునిషీ, మజుందార్లు,

శిరస్తాదారు, దొమ్మరులు, జాతరగాండ్లు, సుంకరులు మొదలగువారిని శతక కర్త సందర్భానుసారముగ బేర్కొనెను.

ఈ శతకమునందు స్త్రీనిగూర్చి కవి వివరించిన అభిప్రాయములు కొన్ని పరిశీలింపదగియున్నవి. అనుకూలవతియైన భార్యవలన భూతలస్వర్గసుఖము లభించుననియు, మూగతల్లి, అనాథకూతురు, దొంగకోడలు, ఇంటిగుట్టును పరులకు వెల్లడించు చెల్లెలు, అనురాగములేని భార్య మున్నగువారివలన సంసారము దుర్భరమై నరకబాధలు తప్పవని కవి వివరించెను. స్త్రీలకు చనవిచ్చినచో వారు చంకనెక్కుదురని వచించి, వంధ్యకు భర్తపై వలపెక్కువయనియు, గొడ్రాలికి గొంతు పెద్ద అనియు స్త్రీల మనస్తత్వమును చిత్రించెను. పరస్త్రీ నాసించిన పురుషునకు పదిమందిలో నగుబాటు, అపకీర్తి, ఆచారహీనత, ఆరోగ్యహాని కలుగుననియు, అగ్నిసాక్షిగా వివాహమాడిన స్త్రీల ననురాగమున జూడవలయుననియు, హితోపదేశమొనర్చి, వేశ్యలవెంట తిరుగు పురుషులను ముచ్చెలతో గొట్టవలయునని కవి మందలించెను. ఈ వర్ణనలన్నియు నాటి సంఘమున వేశ్యలకుగల ప్రాభవమును, పురుషుల భోగలాలసతను, స్త్రీలకు సంఘమునందుగల స్థానమును నిరూపించుచున్నవి. కూచిమంచి కవులు, అడిదము సూరకవి మొదలగువారి శతకముల ధోరణిలో ఈ శతకము రచింపబడినది. సరసములైన లోకోక్తులు, నుడికారములు, జాతీయములు, దృష్టాంత నిదర్శనములు, ఉపమానములు కవి సామాన్యరీతిలోను, వ్యంగ్య చమత్కృతులతోడను, అధిక్షేప ప్రధానముగను బోధించిన నీతులకు నూత్నమైన శక్తిని ప్రసాదించినవి. అడిదము సూరకవి సమకాలిక పరిస్థితులను పరిశీలించి వ్యక్తీకరించిన అభిప్రాయములును ఇందు చేరినవి. "వండలేనక్కకు వగపులుమెండు–కూటి కియ్యని విటకాని కోర్కెమెండు – వచ్చిరాని వకీలు డంబము పెద్ద – గుడ్డి గుఱ్ఱము గుగ్గిళ్లు తిన పెద్ద – బలవంతునింట పడచుగొన తగదు – ముసలికి పడుచు, దారిద్ర్యమునకు పెక్కు తనయులు, పొరుగున అత్తిల్లు, వానకాలపు ప్రయాణము మరణాంతక మగు"నట్టివి. ఆడిదము సూరకవి ననుసరించి "కుక్కపోతుకు జరీకుచ్చులేల" – అని ఈ శతకకర్త వచించెను. సంఘమునందలి వివిధ వర్ణములవారిని, జాతులవారిని సరసముగ చిత్రించుట ఇందు ప్రధానముగ గమనింపదగినది. వేణుగోపాల శతకాంతము

నందుగల దాదాపు ఇరువది పద్యములు అడిదము సూరకవి రామలింగేశ శతకమునందలివే. శతక మకుటము మాత్రము భిన్నముగ నున్నది. ఈ రెండు శతకములు సీసపద్యములలో వ్రాయబడినందునను, శతకరచనావిధానము నందును, వస్తువివరణమునందును అనుకరణము లధికముగా నున్నందున సూరకవి పద్యముల ఛాయ లధికముగా ఈ శతకములో ప్రవేశించుటయేకాక కొన్ని యథాతథముగను చేరినవి. వేణుగోపాలశతకకర్త అనుకరణధోరణి ననుసరించి లేఖకు లీ పద్యములు జేర్చియుందురు. లేక కవియే రామలింగేశశతక పద్యములను తన కృతియందనుసరించి యుండును. ఇట్టి ధోరణి అనేక శతకములందును, వాని అనుకరణములందును గన్పించును. శతకమునందు అన్యదేశ్యములు, వ్యావహారిక పదములు, వేషభాషలు, ఆభరణములు, వివిధ వృత్తులవారి ఆచారవ్యవహారములు, మొదలగునవి ఎన్నియో పరిశీలింపదగినవి కలవు. వకీలు, దివాను, మిర్జా, ఇస్తి, దర్బిస్తి, గ్రామదండుగ, ఈడిగెముత్తి పచ్చల బాజుబందు, కడియాల పోగులు, తాటాకు దుద్దులు, పాకోళ్ళు – మున్నగు వెన్నియో ఇందుల కుదాహరణములు.

కలియుగ ప్రభావముననో, కాలక్రమమునం దేర్పడిన మార్పుల ఫలితముగనో, వర్ణాశ్రమధర్మములందును, కవి దృక్పథమునందును కలిగిన పరిణామదశలను సహజముగ చిత్రించుట గమనార్హము. వేదవిద్యలు, కవితారంగమున సంస్కృతాంధ్రభాషలందు ప్రవీణులైనవారి పరమున నుండెను. వర్ణసాంకర్య మేర్పడుటవలన, వర్ణాశ్రమవిధానము ఛిన్నాభిన్నమగుటవలన ఒకరి వృత్తిని వేరొకరు స్వీకరించుట ఆచారమగుచు వచ్చినది. అగ్రవర్ణములవారే కాక ఇతర జాతులవారును కవితారంగమున ప్రవేశించి ఉత్తమకవులుగా రాణించిరి. ఈ యుగమున వెలువడిన శతకములలో "కవుల కీయవద్దని కన్నుగీటు" అధికారుల దుండగములు వర్ణింపబడుట విశేషముగా గమనింపదగియున్నది. ప్రభువులు అధికారుల సమక్షమున "కొండెగాండ్ర" ప్రాబల్య మధికమగుట, వారి స్వార్థము ననుసరించి అధికారులు వర్తించుట అధికారవర్గమువారి అరసికతను సూచించు చున్నది. వేణుగోపాలశతకకర్త ఏలకో ద్విపదకావ్య ప్రక్రియను సునిశితముగ ఖండించెను. "ద్విపదకావ్యంబు, ముదిలంజ, దిడ్డిగంత – ఇయ్యనేరని రండ

నాల్గేకరాశి" అని కవి విమర్శించెను. అందు సరసకవితారచన మొనర్చుట సాధ్యము కాదని కవి భావించియుండును. "తాళ్ళపాక చిన్నన్న రోమములైన తంబుర దండెకు తంతు లౌనె!" – "ఏలేశ్వరోపాధ్యాయు బుఱ్ఱయు రాచూరి పెద్ద ఫిరంగి యౌనె" – అను పద్యములందు వారి నధిక్షేపించుటయు గమనింపదగినది. ఈ శతకకర్త వింతగా కవితనల్లు కవుల నీసడించి "కవులమంచును వింతగా నల్లినగాదు, చిత్ర ప్రబంధముల్ చేయవలయు"నని చిత్రకవితపై తనకుగల ఆసక్తి వ్యక్తీకరించెను. అనుకరణ ప్రధానమైనను వేణుగోపాలశతకకర్త తన వ్యక్తిత్వము నీ విధముగా నిలుపుకొనెను.

("ఆంధ్ర శతకసాహిత్య వికాసము, పుటలు: 440–444)

---

**శ్లో॥ అంసాలంచిత వామకుండలభరం, మందోన్నత భ్రూలతం,**
**కించిత్కుంచిత కోమలాధరపుటం, సాచిప్రసారేక్షణమ్,।**
**ఆలోలాంగుళి పల్లవైర్మురళికా మాపురయంతంముదా,**
**మూలే కల్పతరో, స్త్రిభంగి లలితం, జానే, జగన్మోహనమ్॥**

తా॥ వేణువు నూదుచున్న జగన్మోహనుడైన శ్రీకృష్ణణ్ణి ధ్యానించి తెలుసుకుంటున్నాను. ఆ మురళీకృష్ణుడు ఎలా ఉన్నాడంటే – ఎడమ ప్రక్కగా తల వంచడంచేత ఆ ప్రక్కనున్న చెవిపోగు బరువు ఎడమమూపుపై ఆనింది. కనుబొమలతీగ కొంచెం పైకి లేచింది. కొద్దిగా ముడిచిన మృదువైన పెదవులు కలవాడు. (పిల్లనగ్రోవిని ఊదేటప్పుడు మృదువైన పెదవులు కొంచెం ముడిచాడు.) చూపులు అడ్డంగా వ్యాపిస్తున్నాయి. (తల కొంత వంచి ఒక ప్రక్కకు వాల్చి, వేణువును ఊదేటప్పుడు చూపులు అడ్డంగా నిగుడుతున్నాయి – చూపులు ప్రక్కలకు వాలుతున్నాయి – పక్కచూపులు చూస్తున్నాడు.) చలిస్తున్న (అంటే మురళిపై రంధ్రాల మీదుగా సంచరిస్తున్న) చిగుళ్ళవంటి వ్రేళ్ళచేత వేణువును సంతోషంగా పూరిస్తున్నాడు. కల్పవృక్షం (మందారవృక్షం) మూలంలో (మొదలు దగ్గర) ఉన్నాడు. మూడు వంపులచేత (త్రిభంగిచేత) సుందరమైనవాడు. (పాదాలనుండి కటివరకు ఎడమవైపుగా ఒక వంపు; కటినుండి తలవరకు కుడివైపుగా ఒక వంపు; తల ఎడమవైపుగా ఒక వంపు.) లోకాలను మోహింపజేసేవాడు.

సంపాదకీయం:

# నేను–నాకృష్ణభక్తి

– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

నాకు చిన్నతనంనుంచీ శ్రీకృష్ణుడంటే చాలా ఇష్టం. దీనికి కారణం మా అమ్మగారు–కీ.శే. తంగిరాల సీతామహాలక్ష్మిగారు (1907–1990). ఆమె నా బాల్యంలో శ్రీకృష్ణునిగురించి ఎన్నో శ్రావ్యమైన పాటలు పాడేది. "కస్తూరి రంగరంగా! నా యన్న కావేటి రంగరంగా!" అంటూ శ్రీకృష్ణజననంపాట; "మేలుకోరా! నన్నూగన్నయ్యా! నా నల్లానయ్యా!" అంటూ శ్రీకృష్ణుని మేలుకొల్పులు; శ్రీకృష్ణుని చల్దులు; కాళీయమర్దనం–ఇలా ఎన్నో పాటలు పాడేది మా అమ్మ. అవన్నీ నా మనసులో హత్తుకుపోయాయి. ప్రాథమిక పాఠశాలలో రెండవరగతి చదువుతూ ఉండగా (1942లో) మా ఉపాధ్యాయాలు శిష్ట్లా రామారావుగారు నాకు ఒక అందమైన బాలకృష్ణుని బొమ్మను బహూకరించారు. అది వటపత్రశాయి వర్ణచిత్రం. మఱ్ఱి ఆకుమీద పడుకొని, కాలిబొటనవ్రేలు నోటిలో పెట్టుకొని, ఎంతో సుందరంగా ఉంది ఆ బొమ్మ. ఇప్పటికీ ఆచిత్రం నా మనస్సులో నిలిచిపోయింది.

పిమ్మట నా యౌవనదశలో రంగస్థలంమీద ఎందరో కృష్ణపాత్రధారుల్ని చూచి, వారి పద్యగానం విని ఆనందించాను. ముఖ్యంగా "ఈలపాట" రఘు రామయ్యగారంటే నాకు ఎంతో ఇష్టం. పాతిక సంవత్సరాలపాటు నాటకాలలోను, సినిమాలలోను ఆయనే అందమైన కృష్ణుడు. తరువాత చలన చిత్రాలలో ఎన్.టి.రామారావుగారు వచ్చారు. రాముడిపాత్రకు, కృష్ణుని పాత్రకు ఆయనకు ఆయనే సాటి అనిపించుకున్నారు. ఇటీవలి కాలంలో పద్యనాటకాలలో డా॥ అక్కిరాజు సుందరరామకృష్ణగారు, శ్రీ గుమ్మడి గోపాలకృష్ణగారు, డా॥ మీగడ రామలింగస్వామిగారు మొదలైనవారు చూడముచ్చటగా ఉండే కృష్ణులే! అన్నట్టు, ఈ శతక పరిష్కర్త శ్రీ మొవ్వవృషాద్రిపతిగారు కూడా ప్రముఖ కృష్ణపాత్రధారియే! ప్రసిద్ధ రంగస్థల కృష్ణపాత్రధారి షణ్ముఖి ఆంజనేయరాజుగారిది మా తణుకే! వారితో నాకు బాగా పరిచయం ఉండేది.

సుమారు 30 సంవత్సరాల క్రిందట దూరదర్శన్‌లో శ్రీరామానందసాగర్‌గారు రామాయణాన్ని, శ్రీ బి.ఆర్. చోప్రాగారు మహాభారతాన్ని సీరియల్‌గా ప్రదర్శించారు. ఈ రెండు ఇతిహాసాలూ చాలా బాగా వచ్చాయి. మొత్తం దేశమంతా ఎంతో ఆసక్తిగా చూసింది. రామాయణంలో శ్రీ అరుణ్ గోవిల్ రాముడుగాను, మహాభారతంలో శ్రీనితీష్ భరద్వాజ్ కృష్ణుడుగాను మహాద్భుతంగా నటించారు. ఇద్దరూ చాలా అందంగా జగన్మోహనంగా ఉన్నారు. (సినిమాలలోకాని, నాటకాలలో కాని ఒక నటుడు అందంగా ఉన్నాడా లేదా అని నిర్ణయించడానికి ఒకే ఒక పరీక్ష (లిట్మస్ టెస్ట్) ఉంది. అతడు కృష్ణుని వేషానికి, రాముడి వేషానికి సరిపోతాడా లేదా అనేది ఆ పరీక్ష. సరిపోతే అందమైన నటుడు, లేకపోతే సామాన్యనటుడు.) కాని వీరిద్దరినీ చూస్తూ ఉంటే నాకు ఒక పెద్ద అసంతృప్తి కలిగింది. ఉత్తరాదివాళ్ళకి మన పురాణపాత్రల గురించిన అవగాహన బొత్తిగా శూన్యం! (అది మొత్తం భారతదేశం మీద మన తెలుగువారిలోనే పుష్కలంగా ఉంది.) రాముడు, కృష్ణుడు నీలమేఘశ్యాములని, కువలయదళ నీలురని కావ్యాలు పురాణాలు ఘోషిస్తున్నాయి. ఈ మహాపురుషులకు నీలిరంగుతో మేకప్ చేయాలి. కాని దూరదర్శన్‌లో ఈ ఇద్దరికీ ఎఱ్ఱగా మేకప్‌చేసి చూపించారు. (రాముడు నలుపు, లక్ష్మణుడు ఎరుపు; కృష్ణుడు నలుపు, బలరాముడు ఎరుపు.) వీళ్ళ ఎఱ్ఱటి ముఖాలు చూస్తూ నేను చాలా బాధపడ్డాను. ఆ గోవిల్‌కు, భరద్వాజ్‌కు నీలిరంగు మేకప్ చేసివుంటే ఇంకా ఎంత బాగుండేవారో కదా! అని అనిపించింది. ఆ హిందీ నిర్మాతలు తెలుగువారి పౌరాణిక చిత్రాలలో ఎన్.టి.ఆర్. రాముని పాత్రను, కృష్ణుని పాత్రను సరిగ్గా గమనించినట్లు లేదు.

నాకు భారతదేశంలో ఉన్న ప్రసిద్ధ కృష్ణదేవాలయాలన్నీ దర్శించాలనే కోరిక బలంగా ఉండేది. గురువాయూరు, ఉడిపి, పండరీపురం, పూరీ, మధురలలోని శ్రీకృష్ణపరమాత్మను దర్శించి పులకించి పోయాను. బృందావనంలోని రాధా కృష్ణమూర్తిని, ద్వారకానగరంలోని శ్రీకృష్ణుని చూడలేకపోయాను. ఒకసారి "వాడి" రైల్వేస్టేషన్‌లో పండరీనాథుని క్యాలెండర్ చూసి, అలాగే గుల్బర్గాలో ఒక హొటల్‌లో కౌపీనధారియైన గురువాయూరు కృష్ణుని క్యాలెండర్ చూసి ఆనందపారవశ్యంలో మునిగిపోయాను.

1995లో బిల్వమంగళ లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతం చదివి ఆశ్చర్యచకితుణ్ణి అయిపోయాను. దానిలోని ఎన్నో శ్లోకాలు కంఠస్థంచేసి వేశాను. 1996లో పుట్టిన మా మనుమరాలికి "వైజయంతి" అని పేరు పెట్టాను. ఈ కావ్యానికి ప్రముఖ పండితులు మల్లంపల్లి శరభయ్యగారిచేత తెలుగులో వ్యాఖ్య వ్రాయించి, 'బాపు' గారిచేత ముఖచిత్రం వేయించి, 1997లో అందంగా ముద్రించి శ్రీకృష్ణజయంతినాడు ఆవిష్కరించాను. (ఈ ఆవిష్కరణ మద్రాసులో నాకు మిక్కిలి యిష్టమైన చలనచిత్ర నటుడు యస్.వి. రంగారావుగారి యింట్లో, కృష్ణభక్తులు, సంగీత సాహిత్య ప్రియులు అయిన చిరకాల మిత్రులు శ్రీ వి.ఎ.కె. రంగారావుగారు ఆవిష్కరించారు.) ఈ గ్రంథానికి నేను 62 పుటల సుదీర్ఘమైన పీఠిక వ్రాశాను. దీనిలోని శ్లోకాల ఛందస్సును మాన్యమిత్రులు ప్రొ॥ కోవెల సంపత్కుమారాచార్య గారు చక్కగా విశ్లేషించారు. 1995-96 సంవత్సరకాలంలో మైసూరుజిల్లా గుండ్లుపేట దగ్గర గోపాలస్వామికొండమీద నున్న "హిమవద్ గోపాలస్వామి'' వారిని దర్శించడం కూడా నా జీవితంలో గొప్ప అనుభవం. ఈ స్వామిని గురించి కన్నడంలో చిన్న పుస్తకం వ్రాసి ప్రచురించాను. (ఈ స్వామి తలచుట్టూ ఎప్పుడూ మంచు ఉంటుంది. అందుకే ఆయన హిమవద్ గోపాలుడయ్యాడు.)

మా స్వగ్రామం పశ్చిమగోదావరిజిల్లాలో తణుకుతాలూకాలో (ఇప్పుడు ఇరగవరం మండలంలో) ఉన్న "కాకుల యిల్లిందల పఱ్ఱు". ఇక్కడ మా తాతగారు తంగిరాల జగన్నశాస్త్రిగారు 1925లో వేణుగోపాలస్వామివారి దేవాలయాన్ని నిర్మించి, దానికి ఒక ఎకరం పొలం దానంగా వ్రాసి యిచ్చారు. ఆ దేవాలయంలో బలరామకృష్ణుల విగ్రహాలను మా తల్లిదండ్రులు ప్రతిష్ఠించారు. మేము 1948లో చదువుల నిమిత్తం తణుకు వచ్చి స్థిరపడ్డాము. అప్పటినుంచి ఇప్పటివరకు తణుకే మా స్వగ్రామం అయింది. ఈ తణుకులో (పాతవూరులో) అతిప్రాచీనమైన శ్రీకేశవస్వామివారి దేవాలయం ఉంది. ఈ స్వామిమీద ఎవరైనా ప్రాచీనకవి వ్రాసిన శతకం ఉందేమో, దానిని తాత్పర్య సహితంగా ముద్రించాలనుకున్నాను. అటువంటిది ఏదీ లభించలేదు. (ఆధునిక కాలంలో నా మిత్రుడు కీ.శే. ప్రొ॥ లకంసాని చక్రధరరావువ్రాసిన "శ్రీకేశవశతకము'' ఉంది.) అందువల్ల చిరకాలమిత్రులు, సంగీత నాట్యరంగాలలో కృషిచేసినవారు, శ్రీకృష్ణభక్తులు, బొబ్బిలి రాజవంశీకులు అయిన శ్రీ వి.ఎ.కె. రంగారావుగారు ఏకధాటిగా యాభై

సంవత్సరాలపాటు (1966 నుండి 2015 వరకు) ప్రతిసంవత్సరం శ్రీ కృష్ణజయంతి నాడు ఎంతో భక్తిప్రపత్తులతో నాట్యార్చన చేసిన కార్వేటినగరం (చిత్తూరు జిల్లా)లోని శ్రీ వేణుగోపాలస్వామివారు జ్ఞాపకం వచ్చారు. ఆ స్వామిమీద పోలిపెద్ది వేంకటరాయకవి రచించిన "వేణుగోపాల శతకం" గుర్తుకు వచ్చింది. అందువల్ల దీనిని గ్రహించి, ప్రియమిత్రులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారిచేత పరిష్కరింపజేసి, తాత్పర్యాలు వ్రాయించి ప్రచురిస్తున్నాను.

ఈ పోలిపెద్ది వేంకటరాయకవి క్రీ.శ. 1800 నుండి 1875 వరకు జీవించాడని తెలుస్తోంది. (1) వేణుగోపాలశతకము, (2) లావణ్యశతకము, (3) తిట్లదండకము ఇతని రచనలు. కార్వేటినగరంలో నెలకొన్న శ్రీ వేణుగోపాల స్వామివారు ఈ కవి కులదైవం, ఇష్టదైవం. ఇతడు క్రీ.శ. 1860 నుండి 1884 వరకు కార్వేటి నగరాన్ని పరిపాలించిన శ్రీకుమార వేంకట పెరుమాళ్ళ రాజుగారి ఆస్థానకవి. తాను వేణుగోపాలస్వామి భక్తుడననీ, శ్రీ వేంకట పెరుమాళ్ళ రాజుగారి ఆశ్రితుడననీ తిట్లదండకంలో స్పష్టంగా చెప్పుకున్నాడు.

శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు ప్రముఖ పండితులు, ప్రసిద్ధకవి, బహుగ్రంథకర్త, రంగస్థల నటులు, "సాహితీ వాచస్పతి" – "ఉపన్యాస చతురానన" బిరుదాంకితులు. ప్రస్తుతం "శ్రీకృష్ణదేవరాయ విజయ ప్రబంధము" అనే మహాకావ్య రచనా నిమగ్నులై ఉన్నారు. ఇప్పటికే రెండు సంపుటాలు వెలువడ్డాయి. మూడవ సంపుటం త్వరలో రాబోతోంది (ఒక్కొక్క సంపుటంలో సుమారు వేయి పద్యాలున్నాయి). ఎంతో పని ఒత్తిడిలో ఉండి కూడా, నా కోరికను మన్నించి ఈ శతకాన్ని పరిష్కరించి, తాత్పర్యాలు రచించారు. కేవలం తాత్పర్యాలు వ్రాయడమే కాదు, ప్రసక్తానుప్రసక్తంగా ప్రతిపద్యంలోనూ ఎన్నో విషయాలు తెలియజేశారు. పూర్వపండితులు ఈ శతకంలో ఏయే పదాలు, పాదాలు మార్చి వేశారో వాటినన్నింటినీ పరిశోధించి తమ వ్యాఖ్యలో తెలియజేశారు. మౌలికంగా కవి వ్రాసిన పదాలను మార్చే హక్కు ఎవ్వరికీ ఉండదు కదా! (అవి మిక్కిలి అసభ్యంగా ఉంటే అక్కడ చుక్కలు లేదా ఒక గీత పెట్టవచ్చును.)

నేను మొదటినుండీ కృష్ణభక్తుణ్ణి అని చెప్పాను కదా! అందువల్ల ఈ శతకం అనుబంధంలో కృష్ణుణ్ణి గురించి అనేక భక్తుల నాల్కలపై నిత్యమూ తాండవించే కొన్ని జనప్రియమైన అష్టకాలను ఇచ్చాను. ఊరకే ఇవ్వడం కాదు, వాటికి

తాత్పర్యాలు కూడా వ్రాయించాను. కష్టపడి ఈ తాత్పర్య రచన చేసిన పండితకవి నాకు అనుజన్ముని తుల్యులు విద్వాన్ గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి (నంద్యాల) మిక్కిలి ఋణపడి ఉన్నాను. ఈ అష్టకశ్లోకాలను, వీటి తాత్పర్యాలను ఒకసారి పర్యవేక్షించి, తగిన సూచనలు చేసిన విద్వాంసులు డా॥ కొడిమడుగు నాగేశ్వరశాస్త్రి గారికి నా నమోవాకములు!

ఒకసారి, ప్రముఖ ప్రవచనకారులు, హాస్య ప్రసంగ శిఖామణి, కవి పండితులు డా॥ గరికిపాటి నరసింహారావుగారు మా "శ్రీరస"లో పింగళి సూరనగారి కళాపూర్ణోదయం గురించి మూడు రోజులపాటు ఎంతో అద్భుతంగా ప్రసంగించారు. సహస్రావధానులు కదా! అందులోని శ్రీకృష్ణదండకాన్ని అలవోకగా అప్పచెప్పేశారు. నేను ముగ్ధుడనైపోయి, అప్పటినుంచీ ఆ దండకాన్ని నిత్యం పారాయణం చేయడం మొదలు పెట్టాను. దానిని కూడా ఈ శతకంలో ఒక అనుబంధంగా ఇచ్చాను. పండిత మిత్రులు డా॥ సంగనభట్ల నరసయ్యగారు ఈ దండకానికి ప్రతిపదార్థ తాత్పర్యాలు వ్రాశారు. వారికి ఎంతో కృతజ్ఞుడను.

ఇది వేణుగోపాలునిగూర్చిన శతకం కదా! దీనిలో కృష్ణునిగురించి భక్తి రసభరితమైన పద్యాలు ఎక్కువగా ఉంటాయని నేను మొదట భావించాను. తీరా చూస్తే అటువంటి పద్యాలు మిక్కిలి తక్కువగా ఉన్నాయి. ఆనాటి సామాజిక విమర్శతో కూడిన పద్యాలు ఎక్కువగా ఉన్నాయి. ఈ కవికి తన కాలంనాటి సంఘవాతావరణాన్ని చూచి ఒళ్ళుమండిపోయింది. దీనికి తోడు ఒకరాజుగారు (బహుశః కార్వేటినగర ప్రభువు అయి ఉండాలి) తనకు ఘనంగా సన్మానం చేయాలని సంకల్పిస్తే ఆయన దగ్గరనున్న మంత్రి దానికి అడ్డుపడ్డాడు. దీనితో అగ్నిలో ఆజ్యంపోసినట్లయింది. కవిగారు రెచ్చిపోయి పరుషమైన పదజాలంతో, (అక్కడక్కడ అశ్లీలంగా కూడా) సమాజాన్ని విమర్శిస్తూ, ప్రత్యేకంగా తనను అవమానించిన ఆ దుష్టమంత్రిని పరోక్షంగా తిడుతూ ఎన్నో పద్యాలు అల్లాడు. కాని ఈ శతకంలో కొన్ని చోట్ల మంచి మంచి సాంఘిక నీతులు, ధర్మాలు, మోక్షమార్గం, వేదాంతం, ఉత్తమరాజు లక్షణాలు, ఉత్తమమంత్రి లక్షణాలు, తల్లిదండ్రులపై భక్తి మొదలైనవి కూడా చెప్పాడు ఈ పోలిపెద్ది వేంకటరాయకవి.

కాని, ఆనాటి సమాజంలోని వివిధ వర్ణాలను దూషించిన తీరు చూచి, నేను ఈ శతకాన్ని ముద్రించడానికి కొంచెం వెనుకంజ వేశాను. అప్పుడు మిత్రులు

శ్రీవృషాద్రిపతిగారు "ఫరవాలేదు లెండి. ఈ శతకంలో ఉన్నవి మన అభిప్రాయాలు కావు; కవి అభిప్రాయాలు. అవి 19వ శతాబ్దిలో ఉన్న ఆనాటి ఆంధ్రదేశ సామాజిక స్థితిగతులు. వాటిని ఈనాటిదృష్టితో ఎవరూ చూడరులెండి!" అని ధైర్యం చెప్పారు. అప్పుడు ముందుకు వెళ్ళాను.

ఈ శతకంలోని ప్రయోగాలను పండితులు "శ్రీసూర్యరాయాంధ్రనిఘంటువు" లోకి స్వీకరించారు. ఇది ఈ శతక వైశిష్ట్యానికి ఉత్తమ తార్కాణం.

ఈ శతకకర్తయైన పోలిపెద్ది వేంకటరాయకవి తన కన్న నూరు సంవత్సరాలు ముందున్న అడిదము సూరకవి (క్రీ.శ. 1720-1780) రచించిన "రామలింగేశ శతకము"ను కొన్ని చోట్ల అనుకరించెను; మరికొన్నిచోట్ల యథాతథముగా అందలి పద్యములను స్వీకరించెను(?). ఇట్టి పద్యములను కవియే తీసికొనెనో లేక తరువాతి కాలమున తాళపత్రగ్రంథప్రతులు వ్రాయు లేఖకులు ఇందు చేర్చిరో నిశ్చయముగా చెప్పలేము. ఈ శతకములో 73వ పద్యమునుండి 92వ పద్యమువరకుగల 20 పద్యాలు, మళ్ళీ 96వ పద్యం నుండి 99వ పద్యం వరకుగల 4 పద్యాలు మొత్తం 24 సీసపద్యములు సూరకవి రామలింగేశ శతకమునుండి యథాతథముగా స్వీకరించినవి (వీనిని పూలగుర్తులతో సూచించాను). ఇన్ని పద్యములను (పైగా వరుసగా) ఒక కవి తన పూర్వకవినుండి స్వీకరించెననుట సమంజము కాదు. కాబట్టి ఇది ఎవరో "లేఖకాధముడు" చేసిన పని అని నా అభిప్రాయము. ఈ వేణుగోపాలశతకములో నున్న మొత్తము పద్యముల సంఖ్య 105. వీనిలో 24 పద్యములు అడిదము సూరకవివి. కాబట్టి పోలిపెద్ది వెంకటరాయకవి రచించిన పద్యములు 81 మాత్రమే మనకు లభించుచున్నవని నిశ్చయింపవలెను.

విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారి "శతకవాఙ్మయ సర్వస్వము"లో నాకు అదనంగా ఒక పద్యం లభించింది. దానితో కలిపి మొత్తం 82 పద్యాలు.

* ఈ శతకాన్ని గురించి గొప్ప పరిశోధన చేసిన పండితులు విద్వాన్ వేదము వేంకట కృష్ణశర్మగారు. వీరికి క్రీ.శ. 1880-క్రీ.శ.1949 మధ్య ముద్రితములైన వేణుగోపాలశతక ప్రతులు ఏడు లభించినవి. వీటిని గురించి శర్మగారు ఈ విధంగా వ్రాశారు "నా యొద్దనున్న వేణుగోపాల శతక ప్రతులేడింటిలోను మిక్కిలి ప్రాచీనమైనది క్రీ.శ. 1880లో ముద్రింపబడినది. అర్వాచీనమైనది క్రీ.శ. 1949లో అచ్చువేయబడినది. మొదటి దానిలో 83 పద్యములున్నవి. రెండవ దానిలో 96 పద్యములున్నవి. మిగిలిన ప్రతులలో 80-90

వేణుగోపాలశతకము ప్రాచీనమైన ముద్రణ క్రీ.శ. 1880లో జరిగింది.*
అర్వాచీనమైన ముద్రణ 2013 ఆగస్టునెలలో డా॥ శ్రీరంగాచార్యగారి సంపాదకత్వంలో శ్రీ కొత్త పాండురంగయ్య గారు ప్రచురించారు. మేము (అంటే నేను, నా మిత్రులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు) ఈ ప్రతిని అనుసరించినాము. కాని దీనిలో అడగడుగునా ఎన్నో తప్పులు దొర్లాయి. డా॥ రంగాచార్యగారు "అర్చనం" పేరుతో నాలుగు పుటల పీఠిక వ్రాశారు కాని శతకపద్యాలను ఏమీ పరిష్కరించలేదు. పైగా పద్యసంఖ్య కూడా తప్పుగా ఇచ్చారు. చివర్లో మూడు పద్యాలను పునరుక్తం చేసి, 105 సంఖ్యను 108గా సరిపెట్టారు లేదా కిట్టించారు. ఇందులో 104వ పద్యం 67వ పద్యానికి, 105వ పద్యం 69వ పద్యానికి, 108వ పద్యం 72వ పద్యానికి పునరుక్తములు.

విజయవాడలోని నవరత్న బుక్ హౌస్‌వారు 2013 సెప్టెంబరు నెలలో డా॥ వెలగా వెంకటప్పయ్యగారి సంపాదకత్వంలో "తెలుగు శతకమంజరి"ని ప్రచురించారు. దీనిలోని వేణుగోపాల శతకములో 100 పద్యాలున్నవి. వీటిలో రామలింగేశశతకమునుండి గ్రహింపబడిన పద్యాలు కూడా చేరి ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు 1982లో ప్రొ॥ కె. గోపాలకృష్ణారావు గారి సంపాదకత్వంలో "అధిక్షేప శతకములు" అనే గ్రంథాన్ని ప్రచురించారు. దీనిలోగల "వేణుగోపాలశతకము"లో కూడ 105 పద్యాలున్నవి. కాని వీనిలో 72 నుండి 91వరకుగల 20 పద్యాలు, తిరిగి 95 నుండి 98 వరకుగల 4 పద్యాలు, మొత్తం 24 పద్యాలు అడిదము సూరకవి రామలింగేశశతకములోనివే!

విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు 1954లో "శతకవాఙ్మయ సర్వస్వము" (ప్రథమ సంపుటము)ను వెలువరించినారు. దీనిలో క్రీ.శ. 1160 నుండి 1860 వరకు 700 సంవత్సరాలలో గల 52 మంది శతకకవులనుగురించిన వివరాలతో

---

పద్యములకు నడుమ పలు సంఖ్యలుగా ఉన్నవి. పైగా 1880 ప్రతికి 1949 ప్రతికి పాఠభేదములు పరిశీలించినచో నా రెండు ప్రతులకును తేడా హస్తిమశకాంతరముగాఁ గనిపించుచున్నది. మూలకవి భావములను బరిష్కర్త లంతుపట్టుటకు వీలులేని విధముగాఁ బాదములకుఁ బాదములే పూర్తిగా మార్చిరి. అట్లు చేయుటవలన, బొత్తిగ కవి భావములనే చాల చోట్ల ధ్వంస్వీకరించిరి." – శతకవాఙ్మయ సర్వస్వము, ప్రథమ సంపుటము, పుట-136.

కూడిన చక్కటి వ్యాసాలు, ఆయాశతకముల వైశిష్ట్యములు సోదాహరణముగా నీయబడినవి. ఈ వ్యాసములలో 21వ వ్యాసము పోలిపెద్ది వేంకటరాయకవిని గురించి ఉన్నది. ఇది చాలా గొప్పవ్యాసం. దీనిని ఈ గ్రంథంలో అనుబంధంగా ఇచ్చాను. ఈ వ్యాసంలో శర్మగారు 19 సీసపద్యాలను ఉదాహరించారు. వీటిలో ఒక పద్యం నేడు లభిస్తున్న వేణుగోపాలశతకప్రతులలో దేనిలోనూ లేదు. పద్యభావమునుబట్టి (ఇది లోభిని గురించిన పద్యము కాబట్టి) దీనిని ఈ శతకంలో 101–102 పద్యాల మధ్య చేర్చాను. పాఠకులు గమనించగలరు.

నేను "తెలుగు శతకమంజరి"లోని వేణుగోపాలశతకమును, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారి "అధిక్షేపశతకములు" లోని వేణుగోపాలశతకమును, శతకవాఙ్మయ సర్వస్వములో వేణుగోపాలశతకమునుండి ఉదాహరింపబడిన 19 పద్యములను, అడిదము సూరకవి రామలింగేశశతకమునుండి గ్రహింపబడిన 24 పద్యములను జాగ్రత్తగా పరిశీలించి, పాఠభేదములను సూచించాను. వీనిని శ్రీ వృషాద్రిపతిగారు వ్రాసిన తాత్పర్యాల క్రింద "సంపాదకవ్యాఖ్య" అనే పేరుతో ఇచ్చినాను.

అడిదము సూరకవి రచించిన రామలింగేశశతకములో 105 పద్యములున్నవి. (మా.శతకరత్నాకరము, ప్రథమ సంపుటము, పుటలు 186–205). సూరకవి తిట్టుకవిగా ప్రసిద్ధుడు. "సూరకవి తిట్టు కంసాలి సుత్తిపెట్టు!" అని వాడుక. ఇతని చాటువులెన్నియో సుప్రసిద్ధములు. ఇతడు క్రీ.శ.1759లో విజయనగరమును పాలించిన చినవిజయరామరాజుగారి ఆస్థానకవి. "చంద్రాలోకము–కవిసంశయ విచ్ఛేదము–రామలింగేశ శతకము – ఆంధ్రనామశేషము – శ్రీరామదండకము" మొదలైన గ్రంథాలను ఇతడు రచించాడు. ఇతడు సింహాద్రి నారసింహశతక కర్తయైన గోగులపాటి కూర్మనాథకవికి సమకాలికుడు. అతని వలెనే కళింగాంధ్ర (ఉత్తరాంధ్ర)కు చెందినవాడు. సూరకవి రామలింగేశ శతకాన్ని సీసపద్యాలలోనే వ్రాశాడు; ఎత్తుగీతులూ తేటగీతులే! "రామలింగేశ! రామచంద్రపురవాస!" అనేది ఈ శతకమకుటం. ఈ రామచంద్రపురం శ్రీకాకుళం జిల్లాలోనిది.

ఈ శతకంలో భక్తి పద్యాలు తక్కువగా ఉన్నాయని కృష్ణభక్తులైన పాఠకులు నిరుత్సాహపడవలసిన పనిలేదు. వీరికి సంతృప్తిగా ఉండటంకోసం అనుబంధంలో కృష్ణుని గురించిన సుప్రసిద్ధ అష్టకాలు, అష్టోత్తరశతనామాలు (నామస్తోత్రము–

నామావళి), పింగళిసూరనగారి కృష్ణదండకం ఇచ్చాను. అంతేకాదు, ఏదైనాపుటలో ఖాళీవస్తే, అక్కడ బిల్వమంగళ లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతమునుండి ఒక అత్యద్భుతమైన శ్లోకాన్ని ముద్రించి, దానికి తాత్పర్యం వ్రాశాను. ఈ శ్లోకాలు కూడా శ్రోతలకు "కర్ణామృతము" కాగలవు అనడంలో ఏ మాత్రమూ సందేహం లేదు. భక్తపోతన పద్యాలు కూడా అక్కడక్కడ చేర్చాను. వీటిని పారాయణం చేసి ఆనందింతురుగాక!

**కృతజ్ఞతలు**

మొదటి నుండియు అత్యుత్తమ విలువలతో జీవితాన్ని గడుపుతున్న, నాకు నచ్చిన - జనంమెచ్చిన రాజకీయవేత్త, సాహిత్యరసికులు, నిరంతర గ్రంథ పఠనాభిలాషులు, చూచినతోడనే మిక్కిలి ఆకర్షణీయమును వీరరసస్ఫోరకమును అగు ముఖ్యవర్చస్సు కలవారు, మహారాష్ట్ర-తమిళనాడు రాష్ట్రాల పూర్వగవర్నరు అయిన శ్రీ చెన్నమనేని విద్యాసాగరరావుగారికి నమశ్శతములతో కూడిన నా హృదయపూర్వక కృతజ్ఞతలు... వీరికి కృతజ్ఞతలు చెప్పడానికి రెండు ప్రత్యేక కారణాలున్నాయి:-

(1) నేటి భారతప్రధాని గౌరవనీయులు శ్రీ నరేంద్రమోదీగారంటే నాకు చెప్పలేనంత వీరారాధన (Hero Worship)! అటువంటి మోదీగారి పార్టీకి చెందిన పార్టీలో (భారతీయ జనతాపార్టీలో) ఉంటూ ప్రజాసేవ చేస్తున్నందుకు-

(2) తెలంగాణలోని వీరి స్వగ్రామంలో (రాజన్న-సిరిసిల్ల జిల్లా- "నాగారం" గ్రామంలో) తమ పెద్దన్నగారైన, ప్రసిద్ధ ఆర్థిక శాస్త్రవేత్త, Planning Commission Ex-Chairman, పద్మభూషణ్ శ్రీ చెన్నమనేని హనుమంతరావుగారి పేరుతో ఒక గ్రంథాలయాన్ని స్థాపించి, గ్రామీణ ప్రజలలో గ్రంథపఠనాభిలాషను పెంచి, జ్ఞానాభివృద్ధిని కావిస్తున్నందుకు-

వీరు చేస్తున్న మంచి పనికి నేను కూడా తోడ్పడాలనే ఉద్దేశంతో నా దగ్గరనున్న మిక్కిలి విలువైన ఉత్తమ గ్రంథాలను (సుమారు 3,000) ఆ గ్రంథాలయానికి పంపించాను. వీటిలో వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ - భారత - భాగవతాలు (శ్లోక తాత్పర్యాలతోను, పద్యతాత్పర్యాలతోను, వచన రూపంలోను ఉన్నవి), వివిధ వ్యాఖ్యానాలతోకూడిన భగవద్గీతలు, టీకాతాత్పర్య సహితంగా ఉన్న మనుచరిత్ర-

ఆముక్తమాల్యద వంటి ఉత్తమ ప్రబంధాలు, ఎఱ్ఱన హరివంశము, నృసింహ పురాణము (టీకాతాత్పర్య సహితము), కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలము (టీకా తాత్పర్య సహితము) మొదలైనవి ఉన్నాయి. ఆధునిక సాహిత్యంలో విశ్వనాథ సత్యనారాయణగారి "రామాయణ కల్పవృక్షము" – "వేయిపడగలు" నవల; జాషువ, శ్రీశ్రీ, తిలక్, శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి, రాచకొండ విశ్వనాథశాస్త్రి మొదలైన ప్రసిద్ధకవి, రచయితల సమగ్ర సంపుటాలున్నాయి. "ఆంధ్రనాటక పితామహుడు" ధర్మవరం కృష్ణమాచార్యులవారి నాటక సమగ్ర సంపుటాలున్నాయి. "పాతికేళ్ళ తెలుగు కథ" (1990నుండి 2014వరకు), "వందేళ్ళ కథకు వందనాలు" మొదలైన కథాసంపుటాలున్నాయి. కాశీమజిలీకథలు, ఇతర జానపదకథలు ఉన్నాయి. నా రచనలు: "కాటమరాజుకథలు" – "రేనాటి సూర్యచంద్రులు" – "తెలుగు వీరగాథాకవిత్వము" – "శ్రీకృష్ణకర్ణామృతము" మొదలైనవి ఉన్నాయి.

ఈ గ్రంథాలన్నింటినీ ఎంతో సహృదయంతో స్వీకరించిన గౌరవనీయులు శ్రీ చెన్నమనేని విద్యాసాగరరావుగారికి మరోమారు నిండు హృదయంతో నా ధన్యవాదాలు తెలియజేసుకుంటున్నాను.

నేను ఈ వేణుగోపాలశతకాన్ని, మరో గ్రంథం "కాటమరాజు కథలు" – మూడవ సంపుటాన్ని ముద్రిస్తున్నానని మాన్యమిత్రులు, "రైతుబాంధవులు", "రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి" వ్యవస్థాపక అధ్యక్షులు, నంద్యాల పార్లమెంటు సభ్యులు అయిన శ్రీ పోచాబ్రహ్మానందరెడ్డిగారికి లేఖ వ్రాశాను. వారు వెంటనే స్పందించి, ఎంతో ఉదారహృదయంతో నాకు రూ. 50,000/– లు విరాళంగా పంపించారు. వారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నాను. (ఈ విరాళంలో నుండి 20 వేల రూపాయలు తీసి ఈ శతకముద్రణకు ఉపయోగిస్తున్నాను. మిగిలినది కాటమరాజుకథలకు ప్రత్యేకించాను.)

ఈ శతకముద్రణకు కొందరు బంధుమిత్రులు, శిష్యులు ధనసహాయం చేశారు. వారందరికీ నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు, ఆశీస్సులు!

"దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు; మా "శ్రీరస"కు "కల్పవృక్ష"మైన మాన్యమిత్రులు శ్రీ నారపరాజు సూర్యనారాయణ గారు – నాకు ఎల్లప్పుడూ మూలబలం! వీరికి నా నమోవాకములు!

కార్వేటి నగరంలోని శ్రీ వేణుగోపాలస్వామివారి ఫోటోలను సేకరించి యిచ్చిన వారు ప్రియమిత్రులు శ్రీ కె. గంగరాజుగారు. వీరికి నా ప్రత్యేక ధన్యవాదములు!

శ్రీ వి.ఎ.కె. రంగారావుగారి ఫోటోలను పంపిన చిరంజీవి శ్రీలింగమనేని మహేష్‌కుమార్‌కి నా అశీస్సులు.

చివరిగా, కాని ముఖ్యంగా చెప్పవలసిన విషయం:- నేను వ్రాతప్రతిని పదేపదే మారుస్తూ ఉంటాను. తీసివేతలు, మార్పులు, చేర్పులు చాలా ఉంటాయి. పైగా నేను రెండు ప్రూఫులతో సరిపెట్టుకోలేను; మూడు ప్రూఫులు కావాలి. ఈ చాదస్తాలన్నింటినీ ఓర్పుతో సహించి, నా వ్రాత ప్రతులన్నింటినీ నీట్‌గా డి.టి.పి. చేసి యిస్తున్న ప్రియశిష్యుడు డా॥ తోట వెంకటస్వామికి నా అనంతమైన ఆశీస్సులు...

| | |
|---|---|
| బెంగుళూరు | ఇట్లు |
| 12.08.2020 (శ్రీకృష్ణజయంతి) | **తంగిరాల వెంకట సుబ్బారావు** |

---

**శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!**
**లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా**
**నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! నిర్వాణసంధాయకా!**
**నీకున్ మ్రొక్కెదఁ ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!**

(-బమ్మెరపోతన భాగవతము)

**శ్లో॥ మధురైకరసం వపుర్విభోః / మథురావీథి చరం భజామహే।**
**నగరీ మృగశాబలోచనా / నయనేందీవర వర్ష వర్షితమ్॥**

**తా:** మేము (కౌమార)కృష్ణుని కాంతివంతమైన శరీరాన్ని పూజిస్తాము. అది ఎటువంటిదంటే - శృంగారంయొక్క లేదా సౌందర్యంయొక్క ముఖ్యమైన సారంలాంటిది (the important essence of beauty)! మథురానగర వీథుల్లో సంచరించేటువంటిది. ఆ నగరంలోని, లేడిపిల్లల కన్నులవంటి కన్నులు కలిగిన యువతులయొక్క కన్నులనే నల్లకలువల వానలో తడిసిపోతున్నటువంటిది!

(-శ్రీకృష్ణకర్ణామృతము, 3-19)

**శ్లో॥ "మాతః-కిం యదునాథ? - దేహి చషకం-కింతేన? - పాతుంపయః-**
**తన్నాస్త్యద్య-కదాస్తివా? -నిశి-నిశాకావా? -అన్ధకారోదయః"।**
**ఆమీల్యాక్షియుగం, "నిశాప్యుపగతా, దేహీ" తి, మాతుర్ముహుః**
**వక్షోజాంశుక కర్షణోద్యతకరః కృష్ణస్సపుష్ణాతునః**

(శ్రీకృష్ణకర్ణామృతము, 2-60)

**తా:** ముద్దుకృష్ణుడికీ తల్లి యశోదకీ పగలు సంభాషణ జరుగుతోంది: "ఓ అమ్మా!" - ఏమిరా! నాయదురాజా?" "నా ఆపుకోర (పాలుత్రాగే గిన్నె) ఇయ్యి!" - "దానితోం ఏంపని?" - "పాలు త్రాగడంకోసం!" - "పాలు ఇప్పుడులేవు" - "మరి ఎప్పుడు ఉంటాయి?" - "రాత్రివేళ" - "రాత్రి అంటే ఏమిటి?" - "చీకటి పడటం" అని తల్లి చెప్పగానే, ఆ బాలకృష్ణుడు తన రెండు కళ్ళూ గట్టిగా మూసుకొని, "అమ్మా! ఇదిగో రాత్రి వచ్చేసింది! నా పాలగిన్నె యియ్యి!" అంటూ తల్లి అయిన యశోద పైటకొంగు పట్టి లాగడంకోసం చేతులు పైకి ఎత్తిన ఆ చిన్నికృష్ణుడు మమ్మల్ని కాపాడుగాక!

**శ్లో॥ "కస్త్వం బాల? -బాలానుజః! - కిమిహతే? - మన్మందిరా శంకయా! -**
**యుక్తం తన్నవనీతపాత్ర వివరే హస్తం కిమర్థం న్యసేః? - ।**
**మాతః! కంచన వత్సకం మృగయితుం, మాగా విషాదం క్షణాత్"**
**ఇత్యేవం వరవల్లకీ ప్రతివచః కృష్ణస్య పుష్ణాతు నః ॥**

(శ్రీకృష్ణకర్ణామృతము, 2-82)

**తా:** బాలకృష్ణుడు వెన్న దొంగిలించడంకోసం ఒక గోపిక యింట్లోకి చొరబడ్డాడు. అప్పుడు అతనికి ఆ గోపికకు ఇలా సంభాషణ జరుగుతోంది: "బాలకా! ఎవడవు నీవు?" - "బలరాముని తమ్ముడను!" - "ఇక్కడ నీకేంపని?" - "మాయిల్లు అనుకొని వచ్చేశాను!" - "అది బాగానే ఉంది. కాని వెన్నకుండలో చేయి ఎందుకు పెడుతున్నావు?" - "అమ్మా! (ఈ పాత్రలో) ఒక లేగదూడను వెతుకుతున్నాను. కొంచెం సేపు బాధపడకు!" - అని ఈ విధంగా చిన్ని కృష్ణుడు గోపికకు ఇచ్చిన మేలైన సమాధానం మమ్మల్ని కాపాడుగాక!



# హృదయావిష్కరణ

తెలుగు సాహితీప్రక్రియలలో శతకప్రక్రియకు మహోన్నతస్థానం ఉన్నది. నా దృష్టిలో స్వచ్ఛమైన కవితాప్రక్రియ ఇది. శ్రవ్యకావ్యరచనలో కవి వ్యక్తావ్యక్తస్వరూపుడు. తన స్వీయభావాలనే కాక, సందర్భానుసారంగా పాత్రల అభిప్రాయాలను కూడ వెల్లడించవలసివస్తుంది. నాటకరచనలో కవి కన్పించడు.

శతకసాహిత్యంలోని భావాలు స్వచ్ఛంగా కవిహృదయంనుండి మొగ్గ తొడిగినవే. అందుకే దానికి ఆత్మాశ్రయకవిత్వమనే పేరు సార్థకం. కావ్య సాహిత్యంతో రమారమి సమానస్థాయిలో గౌరవమర్యాదలందుకొన్న శాఖ యిది. ఒక కావ్యంలోని ఒక ఘట్టం కూడా పఠింపని అక్షరాస్యులు ఒక శతకపద్యమైనా చెప్పగలిగి ఉంటాడనేది సత్యబద్ధం. శతకవాఙ్మయశాఖలో భక్తిశతకాలదే ప్రధాన స్థానం. అధిక సంఖ్యాస్థానం కూడా! సుమతీ, వేమన, భాస్కర, కుమార, కుమారీ శతకాలవంటి నీతిశతకాలు, ఎంత ప్రాశస్త్యం వహించినా, ఎంతవ్యాప్తి కలిగి ఉన్నా భక్తిశతకాలు సంఖ్యాపరంగానే గాక, పాఠకపరంగా కూడా అధిక సంఖ్యాకాలే. అయితే భక్తిశతకాలలో నీతి ప్రబోధంఉండదనుకొంటే, అది పొరపాటే. ప్రతి భక్తిశతకంలోను, నీతిప్రబోధం కొద్దిగానో గొప్పగానో ఉండే ఉంటుంది.

కావ్యరచన చేయకున్నా కేవల శతకరచనా హేతువుతో మహాకవుల సరసన పెద్దపీట పెట్టించుకొన్నవారున్నారు. ధూర్జటి మహాకవి శ్రీకాళహస్తి మాహాత్మ్య రచన చేయకపోయినా శ్రీ కాళహస్తీశ్వర శతకంతోనే మహాకవిగా పరిగణింప బడతాడు. అదే ఒరవడిలో కాసుల పురుషోత్తమమహాకవి తొలివరుసలో ఉంటాడు. ఒక వేళ తెలుగులోనికి భాగవతాన్ని పోతన మహాకవి అనువదింపకపోతే ఎవరనువదించి ఉండేవారన్నప్రశ్నకు తిరుపతి వేంకటకవులు, కాసుల పురుషోత్తమ కవి యనువదించి ఉండేవాడన్నారంటే, కవులలో కాసులవారి స్థానం లెక్కించవచ్చు. దాశరథీశతకం, కృష్ణశతకం, శ్రీకాళహస్తీశ్వరశతకం, నరసింహశతకం, దేవకీ

నందనశతకం, వృషాధిపశతకం వంటి లెక్కలేనన్ని శతకాలు నేటికీ ప్రజల నాలుకలపై తాండవిస్తూనే ఉన్నాయి. 'శేషప్పకవి' ఒకే ఒక్క నరసింహశతకంతో, కంచెర్ల గోపన్న (రామదాసుగారు) దాశరథీశతకం ద్వారా మహాకవుల సరసన ఉన్నారు. ఈ శతకాలలో అతివేలంగా భక్తితత్త్వం వెల్లివిరిసిన శతకాలెన్నో ఉన్నాయి. వ్యాజస్తుతిశతకాలు, అధిక్షేపశతకాలు, బూతుశతకాలు కూడా ఎన్నో ఉన్నాయి. కుందవరపు కవిచౌడప్ప వ్రాసిన కవిచౌడప్పశతకం పచ్చిబూతు శతకమైనా, అందులో ఎన్నో నీతులను త్రవ్విపోశాడు. "బూతాడక నవ్వుపుట్టదు దొరకున్" అని ప్రకటించి, పది నీతులు – పది బూతులు కలగలిపి శతకం వ్రాస్తానని ప్రతినచేసి, దానిని చెల్లించుకొన్నాడు. 'గువ్వలచెన్నా' వంటి ఐహిక వ్యక్తుల పేరుతో వెలసిన శతకాలున్నాయి. శతకకవి ఏమాత్రం భయకంపం లేకుండా తాను అనుకొన్న భావాలను యథాతథంగా వెల్లడిస్తాడు. శ్రీకృష్ణదేవరాయల ఆస్థానకవిగా, "స్తుతమతియైన ఆంధ్రకవి ధూర్జటి పల్కులకేల గల్గె నీ యతులిత మాధురీమహిమ' అన్న ప్రశంసలందుకొన్నవాడు, "రాజుల్ మత్తులు – వారి సేవ నరకప్రాయంబు, వారిచ్చునం, భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మ వ్యథా బీజంబుల్" అనీ, 'రాజన్నంతనె పోవునా దయయు' అని, "ఈ రాజకీటము'' లనీ స్వచ్ఛమనస్సుతో చెప్పగలిగినాడు. ఒక్కొక్కశతకం, ఒక మహాపరిశోధనా గ్రంథంగా ఉన్న శతకాలెన్నో ఉన్నాయి. అంతేకాదు ఒక్క శతకపద్యంచాలు మానవజీవితం, సుఖతరం కావటానికి. అలాంటి పద్యాలు సుమతీశతకం నిండా ఉన్నాయి. వేమన సామాజికస్పృహ కలిగిన కవితల్లజులలో నేటికీ ప్రథముడుగానే ఎన్నబడుతున్నాడు.

శతకపద్య భావాలు ఎంత తీవ్రంగా, ఎంత తీక్షణంగా, ప్రజలలోనికి చొచ్చుకొనిపోయి, సత్యాన్ని కూడా కాదని, తామే వ్యవహారం నిర్వహిస్తాయో ఒక్క విషయం మనవిచేస్తాను. కృష్ణవేణీ స్రవంతి, 'ఏటిమొగ' అనే గ్రామం దగ్గఱ సాగరసంగమం చేసింది. కాని, చరిత్రకారులు, ప్రకృతి పరిశోధకులు, లోక ప్రజలు కృష్ణానది హంసలదీవియొద్ద సాగరసంగమం చేసిందని వ్రాశారు; వ్రాస్తున్నారు. ఇది సత్యదూరం. అఖండ కృష్ణవేణి సాగరసంగమార్థం, ముందుకు సాగిపోతూ 'పులిగడ్డ' అనే గ్రామ సమీపంలో ఒక పాయచీలి, హంసలదీవివఱకు

ప్రవహించి, సాగరనిమజ్జనంచేసింది. కాని మొత్తంనది 'ఏటిమొగ' దగ్గఱ బంగాళాఖాతంలో కలిసింది. మరి యీ పొరపాటుకు కారణం, కాసుల పురుషోత్తమ మహాకవి వ్రాసిన 'హంసలదీవి వేణుగోపాలశతకం'. ఆయన మకుటంగా ఆ శతకానికి –

**"భావజవిలాస! హంసలదీవివాస!**

**లలితకృష్ణాబ్ధిసంగమస్థలవిహార!**

**పరమకరుణాస్వభావ! గోపాలదేవ!"** అని వ్రాశాడు.

ఆ శతకమెంతవ్యాప్తిని చెందిందంటే, పరిశోధకులను సైతం, కృష్ణానది హంసలదీవి దగ్గఱ సముద్రంలో కలిసిందని వావిడిచి చెప్పించే వఱకు వ్యాప్తి చెందింది. ఇప్పటికి అదే విషయం పునఃపునః ఉటంకింపబడుతున్నది. ఆ శతక కవి వాక్కునకుగల బలమెంతో అర్థమౌతుంది.

ప్రస్తుతానికి వస్తున్నాను. ఈ శతకం, వేణుగోపాలశతకం. దీనిని రచించిన కవి పోలిపెద్ది వేంకటరాయకవి. ఇది అధిక్షేపశతకం. ఇది ఆంగ్లప్రభుత్వకాలంలో నిషేధింపబడింది. దానికి కారణం, భావాలలోనే కాక, శబ్దాలలో సైతం, ఒక విప్లవమార్గాన్ని పాటించినవాడీయన. మనం, నిత్యం బూతుపదంగా భావించి, నలుగురిలో, సభ్యసమాజంలో ఉచ్చరించటానికి అంగీకరింపని బూతుపదాలను యథాతథంగా ఉపయోగించటమే కాక, కులాలను, ఇచ్చవచ్చినట్లు విమర్శించి ఉన్నాడు.

**'గోవుల కోయంగఁ గోసి వండుకతిను**

**మాలమాదిగలు భూపాలురైరి'** – అంటాడు. అమెరికా బ్రిటన్ మొదలైన పాశ్చాత్య దేశాలలో గోమాంసం వారికి ఆహారపదార్థం. మనకు గోవు ధర్మస్వరూపం; పరమపవిత్రం; పరమపూజనీయం. అందువల్ల కవి అంతఘాటుగా విమర్శించటానికి వెనుదీయలేదు.

ఇందులో సూక్ష్మంగా పరిశీలిస్తే బ్రాహ్మణేతరకులాల నన్నింటిని దూషణకు గురిచేసిన భావం పాఠకునకు తప్పక అనుభూతమౌతుంది. బ్రాహ్మణేతరులు కవులుగా గాయకులుగా చెలామణికావటనికి ఆయన అంగీకరించడు. మనదేశంలో వర్ణవ్యవస్థ ఆరోగ్య ప్రదమైన ఆలోచనాకుడ్యాలపైననే నిర్మితమైంది. నైయాయిక గౌతముడు "ఆర్యాః త్రైవర్ణికాః" అన్నాడు. శ్రీకృష్ణస్వామి "చాతుర్వర్ణ్యం

మయాసృష్టం గుణకర్మవిభాగశః" అన్నాడు. ఇందులో మన విద్వత్ప్రముఖులు 'చాతుర్వర్ణ్యం మయాసృష్టం' అన్న దానివఱకే స్వీకరించారుగాని తదుపరి భావాన్ని విస్మరించారు. అంతేకాదు–

**'జ్ఞానం విజ్ఞానమాస్తిక్యం బ్రహ్మకర్మ స్వభావజం'**
**'దానమీశ్వరభావశ్చ క్షాత్రంకర్మ స్వభావజం'**
**'కృషి గౌరక్ష్య వాణిజ్యం వైశ్యకర్మ స్వభావజం'**
**'పరిచర్యాత్మకంకర్మ శూద్రస్యాపి స్వభావజం'**

అని మోక్షసన్యాసయోగంలో శ్రీకృష్ణస్వామి పేర్కొన్నాడు. అంటే కుమ్మరి కొడుకు కుమ్మరియని, వైశ్యుని కొడుకు వైశ్యుడని అర్థంకాదు. ఒక వ్యక్తి మనస్సులో సహజంగా ఏర్పడిన భావసంపదనుబట్టి కులం నిర్ణయింపబడవలెనని ఆయన తాత్పర్యమేగాని, పుట్టుకచేతనే అవి నిర్ణయింపరాదని అర్థము. పూర్వపాలకులందఱు క్షత్రియవంశజులా? కారు. వారు క్షత్రియులమనే చెప్పుకొన్నారు. క్షాత్రం వారి స్వభావకర్మ. దానిని బట్టి అతని కులం భావింపబడవలెనని గీతాచార్యుని భావం. దీనిని వదలటం వల్లనే యిన్ని అనర్థభావాలేర్పడటానికి కారణాలయ్యాయి. కీ.శే. సాహితీ తలస్పర్శమొనరించిన పింగళివారు, కులవిభాగ నిర్ణయం, మరల జరుగవలెనంటూ ఉండేవారు.

'నాస్తితు పంచమః' అని మనపూర్వులే అన్నారు. అందుకే జాషువా మహాకవి–

**"ముసలివాడైన బ్రహ్మకు పుట్టినారు**
**నలుగురు కుమారులనుట విన్నాముగాని**
**పసరమునకన్న హీనుండు భాగ్యరహితు**
**డైదవకుమారుడెవ్వడమ్మా? సవిత్రి!"** అని భారతాంబను ప్రశ్నించాడు.

ఈనాడు నేను చూచిన రెండు నవలలలో బూతులు (అసభ్యపదాలు) యథాతథంగా వాడుకొన్నారు. అయినా! సమాజం వారిని తప్పు పట్టలేదు. వారికి పురస్కారాలు కూడా అందించిన విషయం నాకు తెలుసు.

ఏది ఏమైనా ఈ కవికి లోకజ్ఞానం చాలా ఎక్కువ. ఆ అనుభవాలన్నింటిని ఇందులో కుప్పపోశారు.

**"మాచకమ్మ సమర్త మఖ పుబ్బ హస్త చి**
**త్తాయెనేమి పునర్వసాయెనేమి?"**

కన్య తొలిరజస్వలానక్షత్రం మంచిది కాకుంటే అనేక దోషనివారణ పూజాపురస్కారాలను ఆచరించాలి. అసలే మాచకమ్మ. అంటే ఆమె రజస్వలకాదు. స్త్రీత్వం రాదు'. అలాంటి స్త్రీ రజస్వల కావాలిగాని, అది మంచి నక్షత్రమో? కాదో? అని ఎంచట మెందుకు? ఆమెకు స్త్రీత్వం వచ్చింది – అదే చాలు.

"వేశ్య కొడుకు అబ్బకు పెట్టు తద్దినంబు" తన తండ్రి ఎవడని? ఎవ్వరికి పెడతాడు తద్దినం? ఇవన్నీ వ్యర్థాలని కవి భావం. ఇలాంటివి శతకంలో కోకొల్లలు.

వేణుగోపాలశతకాలు నేను చూచినవే నాలుగు దాకా ఉన్నవి.

కాసుల పురుషోత్తం మహాకవి హంసలదీవి గోపాలశతకం గురించి ముందే విన్నవించాను. పోలిపెద్దివారి శతకమిది. ఇవి కాక, "పూడివాడ" నా అభిజనం. అది ఒక కుగ్రామం. మా పితామహులు మహర్షి వేంకటదాసస్వామిగారు స్వయంగా రాజ్యలక్ష్మీ సత్యభామా హనుమత్సమేత వేణుగోపాలస్వామి దేవాలయం కట్టించి, తన ఆస్తిలో ఎక్కువ భాగం స్వామికే సమర్పించారు. శతసంవత్సరాలు దాటిపోయినా నేటికీ ఆ ఆలయం, నిత్యోత్సవ, పక్షోత్సవ, మాసోత్సవ, వార్షికోత్సవాలతో మహావైభవంగా భక్తుల నాకర్షిస్తున్నది. మాతాతగారు సంస్కృతాంధ్ర విద్వన్మణులు. శతాధిక గ్రంథకర్త. మా తండ్రిగారు బాష్యాంత తర్కవిద్వాంసులు. మా మూడవ పినతండ్రి దాశరథి సూరిగారు తర్కవేదాంత విపశ్చితులు. ఆస్వామి దయచేతనే, యీ శతకం నేను పరిష్కరించటం జరిగిందేమో!

మా తాతగారు పూడివాడ వేణుగోపాలశతకం నుండి మచ్చునకు ఒక పద్యం: –

**వరరుక్మిణీమనస్సరసీజ దినరాజ!**
**భద్రావధూమణీ భావనిలయ!**
**రాధా సమారాధనాధార! సత్యభా**
**మా శయోల్లాస నివేశితాంగ!**
**జాంబవత్తనయా ప్రశస్తార్చణార్హ! కా**
**ళిందీ హృదబ్జ మిళింద! నగ్న**
**జిత్సుతాప్రియ! విలాసీలక్షణా మిత్ర**
**విందానుమోదిత విభవధుర్య!**

**షోడశ సహస్ర కామినీ షోడశోప**

**చార సంతోషితస్వాంత! జలజనాభ!**

**వర్ణితవిలాస! శ్రీపూడివాడవాస!**

**వేణుగోపాల! జగతీ పవిత్రశీల!**

ఈ విధంగా భక్తిభావబంధురంగా ఈ శతకం వ్రాశారు.

మా పినతండ్రిగారు కీ.శే. దాశరథిసూరిగారు –

**"............గాంగేయమయ దుకూల!**

**మదనగోపాల! రాధికాహృదయలోల"**

అనే మకుటంతో ఒక శతకం వ్రాశారు.*

ఈ విధంగా మా ఇలువేలుపైన శ్రీ వేణుగోపాలుడే ఈయవకాశం శ్రీ తంగిరాలవారి ద్వారా నాకందించాడేమో!

ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారు నిత్యసాహిత్య పరిశోధకులు. నిరంతర సాహితీవిచార భావామృతసాగర నిమగ్నచిత్తులు. ముఖ్యంగా పరశు రామునికథలు, అంకమ్మకథలు, పల్నాటివీరకథలు, కాటమరాజుకథలు, బొబ్బిలికథ, దేసింగురాజుకథ, ఆరెమరాటీలకథ, ఉయ్యాలవాడ నరసింహారెడ్డికథ, చిన్నపరెడ్డికథ మొదలైన వీరగాథలను లోతుగా పరిశీలించి, ప్రామాణికమైన ఎన్నో అద్వితీయ పరిశోధనాగ్రంథాలను వెలువరించిన జ్ఞానశిఖరి. నిత్యమందస్మిత వదనులు; మధురభాషి; "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య"ను అను సాహిత్య సంస్థను స్థాపించి, ఆ ప్రాంతమంతా సాహితీశతపత్త్రపరిమళములతో సాహితీ రసికహృదయాలను మత్తెక్కించిన రసప్రవాహసదృశులు. ఇతరులలోని గుణాలను దర్శించి ప్రోత్సహింపగల సహృదయులు.

నేను యం.ఏ శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో చదువుతున్నవేళ (1963–65) వారు పరిశోధనచేయుచున్నారు. అక్కడే కీ.శే. పింగళివారికి శుశ్రూషచేసి, అత్యధిక జ్ఞానసంపదతోపాటు, 'డాక్టరేటు' పట్టాకూడా సంపాదించి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు సాహితీ విభాగాన్ని స్థాపించి, దానికి

---

*ఈ శతకాన్ని నేను తాత్పర్య సహితంగా త్వరలో ముద్రించబోతున్నాను– తంగిరాల

ఆచార్యులుగా అధ్యక్షులుగా ఎన్నో ఏండ్లు తెలుగు సాహితీ సరస్వతిని అర్చించారు.

నేను 1991 ప్రాంతంలో వారి శిష్యరికంలో పరిశోధన చేయటానికి బెంగుళూరు వెళ్ళి వారిని కలిశాను. వారంగీకరించారు. అప్పటికి నేను ఉద్యోగ విరమణకు దగ్గఅలో ఉన్నాను. నా కుమార్తె వివాహం చేయవలసి వచ్చింది. కొన్ని ఆర్థిక, కుటుంబ పరిస్థితుల వల్ల నేనా ప్రయత్నం విరమించవలసివచ్చింది.

పూజ్యులు డా॥ శ్రీరంగాచార్య మహోదయుల పీఠికతో వెలువడిన వేణుగోపాలశతకం ఆచార్య తంగిరాలవారే నాకు పంపారు. దానిని పరిష్కరిస్తే ప్రచురిస్తామన్నారు. మా యిద్దరికి, ఉమ్మడి స్నేహితు లొకరున్నారు. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఆచార్యులు శ్రీమాన్ తంగెడ కిషన్‌రావుగారు. వారు నన్ను ప్రోత్సహించారు. ఆచార్య తంగిరాలవారు ఈ శతకాన్ని పూర్తిగా పరిశీలించి "ఈ పద్యాలు కొన్ని యీనాటి ఆచారవ్యవహారాలకు భిన్నంగా ఉన్నాయి. మనం ప్రకటించవచ్చా?'' అని అనుమానించారు. "ఇంతకు ముందు ఎందరో ప్రకటించారు. సాహిత్య అకాడమీ కూడా ప్రచురించింది. ఆనాటి సాంఘికపరిస్థితుల కోసమైనా యథాతథంగా ప్రచురించవచ్చు" నన్నాను. వారు సహృదయతతో వెంటనే అంగీకరించారు.

ఈ గ్రంథాన్ని పాఠకకరకమలాలకు అందిస్తున్న ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావుగారికి, విశ్రాంతాచార్య తంగెడ కిషన్‌రావుగారికి, శ్రీమాన్ శ్రీరంగాచార్య గారికి, చక్కగా నిర్దోషంగా డిటిపి చేసిన మా బంధువు డా॥ తోట వెంకటస్వామి గారికి, సుందరంగా ముద్రించిన ఓంకార్ ఆఫ్‌సెట్ ముద్రాపకులకు, సహస్ర కృతజ్ఞతాపూర్వక నమస్సులు.

రేపల్లె<br>శర్వరీ – కార్తీకం<br>22.11.2020

ఇట్లు<br>'సాహితీ వాచస్పతి'<br>**మొవ్వ వృషాద్రిపతి**



## దేవకీసుతుఁ డేవేళ దిక్కు నాకు!

సీ. కుప్పించి యెగసినఁ గుండలమ్ముల కాంతి
గగన భాగంబెల్లఁ గప్పికొనఁగ,
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేఁగున జగతి గదలఁ
జక్రంబుఁ జేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ,
'నమ్మితి నాలావు, నగుఁబాటు సేయక
మన్నింపు,' మని క్రీడి మరలఁ దిగువఁ

తే. గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి,
'నేఁడు భీష్మునిఁ జంపుదు, నిన్నుఁగాతు,
విడువుమర్జున' యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు!

**తా.** ఆనాడు యుద్ధరంగంలో నా శరవర్షానికి తట్టుకోలేక, నన్ను చంపి అర్జునుని రక్షించాలనే ఉద్దేశంతో, నా పైకి చక్రాన్ని చేపట్టి దుముకుచున్న నీ వీరగంభీర స్వరూపం నాకు ఇప్పటికీ కన్నులకు కట్టినట్లుగానే ఉంది. రథంపైనుండి ఎగిరి దూకుతున్నప్పుడు నీ కుండలాల కాంతి ఆకాశమంతటా వ్యాపించింది. ముందుకు లంఘిస్తున్నప్పుడు కుక్షిలోనున్న పిండాండం కదలిపోగా, దాని బరువుకు వెలుపలనున్న బ్రహ్మాండమంతా కంపించింది. చక్రాన్ని చేత ధరించి ముందుకు దూకుతున్నప్పుడు పైనున్న బంగారు ఉత్తరీయం క్రిందకు జారిపోయినా, భక్త సంరక్షణార్థం నడుముకట్టిన స్వామి, వేషాన్ని చక్కదిద్దుకోవడంలో శ్రద్ధ చూపలేదు. నా పరాక్రమంపై నాకు విశ్వాసం ఉందని నమ్ముకొన్ననన్ను నలుగురిలో నవ్వులపాలు చేయవద్దని, క్రీడి వెనుకకు లాగుతున్నా, ఆ ఆర్తత్రాణ పరాయణుడు పట్టించుకోలేదు. ఏనుగుపై లంఘించే సంహింపిల్లలాగ ముందుకు దుమికివేశాడు. "ఈ రోజు భీష్మణ్ణి చంపి, అర్జునుణ్ణి రక్షిస్తాను" అని అరిచాడు. "నన్ను విడిచిపెట్టు. ఈ గాంగేయుని సంగతి నేటితో సరి" అని పై బడిన భక్తరక్షణపరాయణుడు నాకు సదా రక్షగా నుండుగాక!

# వేణుగోపాల శతకము

## పోలిపెద్ది వేంకటరాయకవి

సీ॥ శ్రీ రుక్మిణీ ముఖసారస మార్తాండ!
సత్యభామా మనశ్శశి చకోర!
జాంబవతీ కుచశైల కంధర! మిత్ర
విందా సుధాధరబింబ కీర!
భద్రవయోవన భద్రేభరాజ! క
ళిందాత్మజా చిదానందనిలయ!
లక్షణా శృంగార వీక్షణ కాసార
హంస! సుధేష్ణాగుణాపహార!
తే॥గీ॥ సుందరకపోల! విబుధసంస్తుత కృపాల
వాల! ధృతశైల! కాంచనవర్ణచేల!
మదిరపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 1

ఈ వేణుగోపాల శతకము తొలుత 1936లో డైమండ్ ముద్రాక్షరశాలలో ముద్రింపించి ప్రకటింపబడినది. తరువాత ఎందరో దీనిని ప్రచురించినారు. కవి మహాప్రతిభాశాలి. కాని సమాజరీతిని చూచి కోపించి పద్యములలో ఎన్నో బూతులు వ్రాసినాడు. అందువలన ఈ మహాశతకము ప్రభుత్వముచే నిషేధితమైనది. తరువాత పండితులు – ఆ బూతులను సంస్కరించి నిర్దుష్టముగా ప్రచురించిరి. 2013వ సంవత్సరమున శ్రీ కొత్త పాండురంగయ్యగారిచే డా॥ శ్రీ రంగాచార్యగారి

సంపాదకత్వములో హైదరాబాదునుండి ప్రచురింపబడిన శతకములో ఈ పద్యము మూడవ పద్యముగా ప్రచురింపబడినది. నా యొద్దనున్న ప్రాచీనప్రతిలో ఈ పద్యమే ప్రథమము. ఇదే ఔచిత్యవంతమని నా అభిప్రాయము. మహాకవులందఱు శ్రీకారముతోనే శతకరచన ప్రారంభించిరి. శ్రీకృష్ణుని పట్టపురాణి రుక్మిణి. ఆమె లక్ష్మీస్వరూప. అందులకై ఆమె ప్రార్థనతో పద్య ప్రారంభము చేయుట సర్వవిధముల సముచితము. (పాండురంగయ్యగారు ప్రచురించిన శతకమునే నేను ఆధారముగా చేసికొని, నా దగ్గరనున్న ప్రాచీన ప్రతితో పోల్చుకొనుచు, ఈ శతకమును పరిష్కరించుచు, తాత్పర్యములు వ్రాసితిని.)

**తాత్పర్యము:** శ్రీ రుక్మిణీదేవి ముఖపద్మమునకు సూర్యుడవైనవాడా! సత్యభామా మనశ్చంద్రునకు చకోరమైనవాడా (వెన్నెలపులుగు) జాంబవతీ స్తనయుగ్మ పర్వతమును మేఘమువలె ఆక్రమించినవాడా! మిత్రవిందాదేవి క్రింది పెదవియను అమృతము వంటి దొండపండునకు రామచిలుకవైనవాడా! భద్రాదేవీ యౌవనారణ్యములో భద్రగజరాజమువలె సంచరించువాడా! కాళిందీ హృదయమునకు చిదానంద స్వరూపమైనవాడా! లక్షణాదేవి శృంగారపు చూపులనే సరోవరములో రాజహంసవై విహరించువాడా! సుధేష్ణాదేవి సద్గుణములను కొల్లగొట్టినవాడా! చక్కని చెక్కిళ్ళు గలవాడా! పండితులచే (దేవతలచే) కొనియాడబడుచున్న దయకు స్థానమైనవాడా! గోవర్ధన పర్వతమును ధరించినవాడా! బంగారు వస్త్రమును ధరించినవాడా! మదించిన శత్రువుల నడగించువాడా! (కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములను అంతశ్శత్రువుల నడగించువాడా!) మునుల హృదయములందు నిరంతరము చరింప ఆసక్తి కలవాడా! వేణువును ధరించి గోవులను, గోపాలురను కాపాడినవాడా! భక్తులను రక్షించుటయే శీలముగా కలవాడా! (మదరిపు విఘాల–మద = మదించిన; రిపు = శత్రువులను; విఘాల = నశింపజేయువాడా!; భక్త సంత్రాణశీల – భక్త = భక్తులను; సంత్రాణ = చక్కగా రక్షించుటయను; శీల = గుణము కలవాడా!; వేణుగోపాల = ఓ వేణుగోపాలుడా!)

**సంపాదక వ్యాఖ్య:-**

ఈ పద్యమును కవి శ్రీకారముతో ప్రారంభించుటయు, ఇందు శ్రీ కృష్ణుని అష్టభార్యలను గురించి ప్రస్తావించుటయు కారణముగా, ఈ పద్యమే తొలి పద్యమనుటకు సందియము లేదు. శ్రీకృష్ణుని అష్టమహిషులు "రుక్మిణి-సత్యభామ-జాంబవతి-మిత్రవింద-భద్ర-సుదంత-కాళింది-లక్షణ". కాని ఈ కవి 'సుదంత'కు బదులుగా "సుధేష్ణ" అనినాడు - "సుదంతా గుణాపహార" అనినను గణభంగము కాదు. "సుధేష్ణ" విరటుని భార్య. కాసుల పురుషోత్తమకవి తన "హంసలదీవి గోపాలశతకము"ను కూడ అష్టమహిషుల స్తుతితోడనే ప్రారంభించినాడు. అతడు "సుదంత"నే పేర్కొనినాడు. కాబట్టి ఈ కవి "సుదంత"కు బదులు "సుధేష్ణ"ను పేర్కొనుట పొరపాటు. నవరత్న బుక్ హౌస్, విజయవాడవారు 2013లో సెప్టెంబరు నెలలో డా॥ వెలగా వెంకటప్పయ్యగారి సంపాదకత్వములో "తెలుగు శతకమంజరి" అను గ్రంథమును ప్రచురించినారు. దానిలో వేణుగోపాల శతకము" ఉన్నది. అందు "సుదంతా గుణాపహార!" అనియే యున్నది. కాని మేము (అనగా నేనును మిత్రులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారును) 2013 ఆగస్టు నెలలో శ్రీ కొత్త పాండురంగయ్యగారు, డా॥ శ్రీ రంగాచార్యగారి సంపాదకత్వములో ప్రచురించిన "వేణుగోపాలశతకము"ను అనుసరించినాము. దురదృష్టవశాత్తు ఈ శతకములో అడుగడుగునను ఎన్నియో తప్పులు దొరలినవి. వానిలో నిది యొకటి. దీనినిబట్టి తెలుగు శతకమంజరి లోని వేణుగోపాలశతకములో తప్పులు లేవని అర్థము కాదు. పాండురంగయ్య, రంగాచార్యుల శతకములో కన్న తక్కువగా నున్నవి - అంతే. ఇటీవల మిత్రులు శ్రీవాడపల్లి శేషతల్పశాయిగారు (andhrabharati.com) ఒక పాత ప్రతిని నాకు పంపినారు. దానిని కూడ ఒక దానిని కూడ సరిపోల్చుకొనుచు ఈ శతకములోని పద్యములను సవరించుకొనుచు పాఠాంతరములు సూచించినాను. శేషతల్పశాయి గారు పంపిన ప్రతి 1982లో ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమివారు ప్రచురించిన "అధిక్షేప శతకములు"లోని "వేణుగోపాలశతకము." కాని దీనిలో కూడ "సుధేష్ణా గుణాపహార!" అనియున్నది. ఇది కూడ తప్పని నా భావన - తంగిరాల.

**సీ॥ కౌస్తుభవక్ష! శ్రీకరపాదరాజీవ!**
**దీనశరణ్య! మహానుభావ!**
**కరిరాజవరద! భాస్కరకోటిసంకాశ!**
**పవనభుగ్వరశాయి! పరమపురుష!**
**వేదవేద్యానంతవిభవ! చతుర్దశ**
**భువనశోభనకీర్తి! పుణ్యమూర్తి!**
**వైకుంఠపట్టణవాస! యోగానంద!**
**విహగరాడ్వాహన! విశ్వరూప!**
**తే॥గీ॥ నీలనిభగాత్ర! శ్రీరమణీకళత్ర!**
**సద్గుణస్తోమ! యదుకులసార్వభౌమ!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 2**

**తా:** మదశత్రు వినాశకా! మౌనిజన హృదయలోలా! భక్తరక్షణ పారీణా! ఓ వేణుగోపాలా! కౌస్తుభదివ్య రత్నమును వక్షఃస్థలమున ధరించువాడా! శుభములు కలిగించు పాదపద్మములుగలవాడా! దీనులైనవారికి శరణు పొందదగినవాడా! మహానుభావా! గజేంద్రునకు వరములిచ్చినవాడా! కోటిసంఖ్యాక సూర్యతేజస్సు గలవాడా! వాతాశనుడైన ఆదిశేషుడే శయ్యగా గలిగినవాడా! ఓ పరమపురుషా! మోక్షమిచ్చుట కధికారివైనవాడా! వేదములచే తెలియదగిన అనంత తత్త్వము కలిగినవాడా! పదునాల్గులోకములకు వ్యాపించిన శుభకీర్తి కలవాడా! పుణ్యమే ఆకారముగా గలవాడా! వైకుంఠనగరమే వాసముగా గలవాడా! యోగనిద్రా పరవశుడవై ఆనందస్వరూపుడవైనవాడా! పక్షిరాజైన గరుత్మంతుని వాహనముగా కలవాడా! విశ్వమే ఆకారముగా గలవాడా! నల్లని క్రొక్కారు మేఘు వర్ణముచే శోభించు శరీరము కలవాడా! శ్రీ లక్ష్మీరమణీమణిని భార్యగా పొందినవాడా! సద్గుణ సమూహములకు స్థానమైనవాడా! యదువంశ సార్వభౌమా! (అన్నియు సంబోధనములే)

కౌస్తుభము = ఒక దివ్యరత్న విశేషము. దేవదానవులు క్షీరసాగరము మథింపగా నందు జనించినది. దానిని శ్రీహరి వక్షస్థలమున ధరించెను. పవనభుక్ = గాలినే ఆహారముగా తీసికొనునది – పాము. తెలుగులో దీనిని "గాలిమేపరి" యందురు. విహగము = ఆకాశమునందు గమించునది – పక్షి. వీనికి రాజు గరుత్మంతుడు – విహగరాట్.

ఈ పద్యము తేటగీతిలో ప్రతిపాదములోను అంత్యప్రాసను పాటించినాడు. పై సీసపద్యమున నొక పాదమున పాటింపబడినది.

**సీ॥ నిను సదా హృత్కంజమునఁ బాయకుండ నా**
**ప్రహ్లాదువలెను నేర్పరినిఁ గాను,**
**ఏ వేళ నిన్ను ధ్యానించుచుండుటకు నా**
**దృఢచిత్తుఁడైనట్టి ధ్రువుఁడఁ గాను,**
**సతతంబు నిన్ను సంస్తుతి సేయుచుండ నా**
**వేశిరంబుల సర్పవిభుఁడఁ గాను,**
**నీ విశ్వరూపంబు సేవించుటకు సహ**
**స్రాక్షముల్ గల్గు వాసవుఁడఁ గాను,**
**తే॥గీ॥ ఇట్టి వారలఁ గృపఁజూచు టెచ్చుగాదు**
**దేవ! నావంటి దీనునిఁ బ్రోవవలయు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 3**

తా: వేణుగోపాలా! నిన్నెల్లప్పుడును మనోంబుజమున వదలకుండ నుండుటకు ప్రహ్లాదుని నేర్పువంటి నేర్పుకలవాడను కాను. అన్నివేళలయందును నిన్ను ధ్యానించుచుండుటకు దృఢచిత్తుడైన ధ్రువుడను కాను. ఎల్లప్పుడును నిన్ను స్తుతించుచుండుటకు వేయితలలు కలిగిన శేషుడను కాను. నీ విశ్వరూపమును సందర్శించి సేవించుటకు వేయి నేత్రములుగల ఇంద్రుడను కాను. ఇటువంటి వారిని దయతో బ్రోచుట గొప్పతనము కాదు. నా వంటి దీనుని బ్రోవవలయును. అదియే గొప్పతనము.

ఈ పద్యమున–"దృఢచిత్తుఁడైనట్టి ధ్రువుఁడcగాను" అను పాదమున యతి భంగమైనది. దృ–ధ్రులకు యతిమైత్రి చెల్లదు. "ధ్రువముగా దృఢమనో ధ్రువుఁడcగాను" అని మారిస్తే దోషపరిహరణమౌతుంది.

సీసపద్య చివరిపాదములో "సహ, స్రాక్షముల్ గల్గు వాసవుఁడcగాను" "సహస్ర + అక్ష = సహస్రాక్ష" – 'స్రా'మీద అచ్చు 'అ' ఉన్నది. దానికి, సకారముతో యతి అఖండయతి. దానిని పూర్వకవులు అంగీకరింపలేదు. కావున "సహ, "స్రాక్షముల్ గల హరిహయుఁడcగాను" అనినచో, అఖండయతి దోషము తొలగిపోవును.

అట్లే, "ఏవేళ నిన్ను ధ్యానించు" దీనిని "ఇంచుకాగమయతి" అందురు. దీనిని లాక్షణికులు అంగీకరింపలేదు. పూర్వకవులు ప్రయోగింపలేదు. ఆధునిక కవులు దీనిని విరివిగా ప్రయోగించుచున్నారు.

**సీ॥ భానుకోటి ప్రభాభాసురంబగు వెల్గు,**
**పరులు సూచినఁ గానఁబడని వెల్గు;**
**గురుకృపచేఁ గాక నరయనేరని వెల్గు,**
**నమృతంపు దృష్టిచే నమరు వెల్గు;**
**విద్యుల్లతా పరివేష్టితంబగు వెల్గు,**
**ఘననీలకాంతులఁ గ్రక్కు వెల్గు;**
**దశవిధ ప్రణవనాదములు గల్గిన వెల్గు,**
**మౌనులెన్నఁగ రమ్యమైన వెల్గు;**
**తే॥గీ॥ ఆది మధ్యాంత రహిత మైనట్టి వెల్గు,**
**నిట్టి వెల్గును సేవింపనట్టి చెడ్డ**
**వారి కేల లభించుఁ గైవల్యపదము?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 4

**తా:** ఓ వేణుగోపాలా! కోటిమంది సూర్యులు ఒక్కసారి ఉదయించినచో ఎటువంటి దేదీప్యమానకాంతి కలుగునో అంతటి కాంతికలవాడా! జ్ఞానరహితులు, పరమాత్మ

విషయము తెలియనివారు చూచినను కనబడకపోవని కాంతికలవాడా! (భక్తులకు–జ్ఞానులకు ఆ వెలుగు దేదీప్యమానముగా గోచరించును. అజ్ఞానులకు, నాస్తికులకు గోచరింపదు.) గురుకృపాకటాక్షముచేతనే ఆ వెలుగును చూడగలము తప్ప లేనిచో చూడలేము. అమృతదృష్టితో నతిశయించిన కాంతి. మెఱపుతీగల కాంతిచే పరివేష్టింపబడిన (చుట్టబడిన) కాంతి, నీలమేఘకాంతులను వెదచల్లు దివ్యకాంతి – శ్రీకృష్ణస్వామి నీలమేఘశ్యామసుందరుడు కదా! పదివిధముల ఉచ్చారణగల 'ఓం' అను ప్రణవాక్షర దివ్యనాదము విననైన కాంతి. మునీశ్వరులకు రమ్యాతిరమ్యమైన కాంతి. పుట్టుక – వృద్ధాప్యము మరణరహితమైన ఆదిమధ్యాంత రహిత కాంతివైనవాడా! అటువంటి దివ్యమైన వెల్గును దర్శింపనేరని వారికి మోక్షపద మెట్లు లభించగలదు? ఇందు క్రింది గీతపద్యమును పంచపాదిగా వ్రాసెను. కైవల్యమును వైష్ణవులు మోక్షముగా పరిగణింపరు.

ఇక్కడ భగవద్గీతలో శ్రీకృష్ణస్వామి చెప్పిన మూడు శ్లోకములు స్మరింపదగినవి.

**శ్లో॥ "సుదుర్దశమిదం రూపం దృష్టవానసి యన్మమ**
**దేవా అప్యస్య రూపస్య నిత్యం దర్శన కాంక్షిణః (11–52)**

**తా॥** నా రూపం సామాన్యులెవ్వరూ దర్శింపలేరు. నీవు దర్శించిన నా రూపము దర్శించుటదుర్లభం. దేవతలు కూడ ఆ రూపం చూడాలని ఉవ్విళ్లూరుతుంటారు.

**శ్లో॥ "నాహం వేదైః నతపసా నదానేన న చేజ్యయా**
**శక్యం ఏవం విధో ద్రష్టుం దృష్టవానసి మాం యథా. (11–53)**

**తా॥** వేదాధ్యయనముచేగాని–తపస్సుచేగాని, దానముచేగాని యజ్ఞముల చేయుటచే గాని నా విశ్వరూపమును దర్శింపలేరు.

**శ్లో॥ "భక్త్యా త్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున**
**జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప!" (11–54)**

**తా॥** అర్జునా! అనన్య భక్తిచే మాత్రమే నన్ను తెలిసికొనుటకు – దర్శించుటకు శక్యమగును. ఆ వెలుగే శ్రీకృష్ణరూపం. అకార – ఉకార – మకారముల సమ్మేళనం ఓంకారం. భగవంతుడు ప్రణవమూర్తి. అకారో విష్ణుః, మకారం లక్ష్మి, ఉకారం జీవప్రతీక. ఈ ప్రణవమే సర్వసృష్టికి మూలం.

**సీ॥ వేదంబులును నీవె, వేదాంగములు నీవె,**
**జలధులు నీవె, భూజములు నీవె;**
**క్రతువులు నీవె, సద్వ్రతములు నీవె, కో**
**విదుఁడటంచన నీవె, నదులు నీవె;**
**కనకాద్రి నీవె, యాకాశంబు నీవె, ప**
**ద్మాప్తసోములు నీవె, యగ్ని నీవె;**
**యణురూపములు నీవె, యవనీతలము నీవె,**
**బ్రహ్మము నీవె, గోపతియు నీవె;**
**తే॥గీ॥ యిట్టి నిను సన్నుతింపఁగా నెంతవాఁడ?**
**కించనుఁడ నన్నుఁ బ్రోవు నీ కింకరునిగ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 5**

**తా.** ఓ వేణుగోపాలా! వేదములు నీవే! వేదాంగములైన 1) శిక్ష, 2) వ్యాకరణము, 3) ఛందస్సు, 4) నిరుక్తము, 5) జ్యోతిషము, 6) కల్పము – అను వేదాంగములారును నీవే! సముద్రములు నీవే! వృక్షములు నీవే! యజ్ఞయాగాది క్రతువులు నీవే! పుణ్యకాది వ్రతములు నీవే! పండితుడవన్న నీవే! నదులు నీవే! మేరుపర్వతము నీవే! ఆకాశము నీవే! సూర్యచంద్రాగ్నులు నీవే! అణుస్వరూపుడవు నీవే! ఈ భూమి నీవే! పరబ్రహ్మము నీవే! శ్రీకృష్ణుడవు నీవే (ఆలపోతువు నీవే! – ధర్మపతివి నీవే!) ఇటువంటి నిన్ను స్తుతింపగా నేనెంతటివాడను? పాపినైన నన్ను నీ కింకరునివలె రక్షింపుము.

'సర్వం విష్ణుమయం జగత్' అను సూత్రమునకు భాష్యరూపము ఈ పద్యము.

"కింకరోతి" – "ఇప్పుడేమి చేయవలెనో ఆజ్ఞాపింపు"మని కోరెడు భృత్యుడు కింకరుడు.

**సం.వ్యా.** తేటగీతి రెండవపాదము "తెలుగు శతకమంజరి"లో భిన్నముగా నున్నది: "కింకరుని జేసి ప్రోవు మకించనుండ" అని యున్నది. అప్పుడు "నేను పాపరహితుడను. నన్ను నీ దాసునిగా జేసి రక్షింపుము" అని తాత్పర్యము.

ఆం.ప్ర.సాహిత్య అకాడమి ప్రతిలో "కించనుఁడ నన్నుఁబ్రోవు నీకింకరునిగ" అనియే యున్నది.

**సీ॥ వేదాంతమనుచు బ్రహ్మాదులెంచిన వెల్గు,**
**నాదాంతసీమల నదరు వెల్గు;**
**సాధుజనానంద సంపూర్ణమౌ వెల్గు,**
**బోధకు నిలయమై పొసఁగు వెల్గు;**
**ద్విదళాబ్జ మధ్యమం దుదయమౌ వెల్గు, సు**
**షుమ్నానాళంబునఁ జొచ్చు వెల్గు;**
**చూడఁ జూడఁగ మహాశోభితంబగు వెల్గు,**
**నిఖిలజగంబున నిండు వెల్గు;**
**శతకోటి సారసహితుల మించిన వెల్గు,**
**మేరువు శిఖరంబు మీఁద వెల్గు;**
**తే॥గీ॥ అట్టి వెల్గును నెపుడు బాహ్యాంతరములఁ**
**దెలియ నేర్చిన యతఁడె పో దేవుఁడనఁగ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 6**

**తా.** వేద + అంతము = వేదాంతమనగా వేదశిఖలైన ఉపనిషత్తులు. శ్రీకృష్ణస్వామి భగవద్గీతలో "త్రైగుణ్య విషయా వేదాః నిస్త్రైగుణ్యో భవార్జున" (2–45) అని ఉపదేశించినాడు. (ఓ అర్జునా! వేదములందలి పూర్వభాగమగు కర్మకాండము త్రిగుణాత్మకములగు సంసార విషయములను తెలుపునవి. నీవు త్రిగుణములవలన కలుగు విషయాలను త్యజించినవాడవు కమ్ము!) వేదములు కేవలము సత్త్వరజస్తమస్సులతో కూడినవి. వానిని దాటి జ్ఞానకాండను చర్చించినవి ఉపనిషత్తులు. అవియే వేదాంతము. ఆ వేదాంతమిదియని, బ్రహ్మ–శంకరుడు–ఇంద్రుడు మొదలైనవారు భావించిన కాంతి.

నాదాతీతుడు పరబ్రహ్మ. ఆంగ్లములో "Music is the royal road for salvation" అందురు. "సంగీతము మోక్షమునకు రాచబాట". అటువంటి

నాదాంతములయందు అతిశయించిన కాంతి.

సాధువులైనవారి హృదయములలో వికసించిన సంపూర్ణమైన కాంతి. "మునీనాం హృదయేషు రమతీతి రామః" అని ఆ మహనీయుల హృదయాలలో సంపూర్ణజ్ఞానముయొక్క కాంతి.

జ్ఞానబోధకు స్థానమైన కాంతి. ద్విదళాబ్జమధ్యమందు జన్మించే కాంతి. సగుణోపాసన – నిర్గుణోపాసనల మధ్య, లేక జ్ఞాన – కర్మముల మధ్య, లేక పరమాత్మ – జీవాత్మల మధ్య వెలుగు కాంతి. "ఇళా పింగళికా మధ్యామృణాళీ తంతురూపిణీ!" అని లక్ష్మీసహస్రం. ఇళాపింగళ నాడుల మధ్య ఉదయించెడి కాంతి. అనాహత, విశుద్ధ చక్రముల మధ్య సూర్యతేజస్సుతో అమృత ప్రవాహముగా పరబ్రహ్మ మున్నదని శ్రీచక్రోపాసకుల నమ్మకము. కుండలినీశక్తిని సుషుమ్నా నాడిద్వారా సహస్రారమునకు చేర్చిన జీవుడు ముక్తుడగుచున్నాడు. ఆ సుషుమ్నా నాళంబును ప్రవేశించిన కాంతి; చూడగా చూడగా అత్యధికముగా శోభించుకాంతి; సర్వవిశ్వములను నిండి వెలుగుచున్న కాంతి; నూరుకోట్ల సూర్యుల కాంతిని మించిన వెలుగు; దేవతల నివాసమైన బంగారుకొండ మేరుశిఖరము మీద ఉదయించు వెలుగు; – ఆ వెల్గును అనంత బాహ్యజగత్తులోను, తన అంతరంగములోను, దర్శించినవాడే దైవము. అనగా –

"బ్రహ్మవిద్బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలిసివాడు స్వయముగా బ్రహ్మమే యగుచున్నాడు.

'నాదాంతసీమల' అను పాదమునకు "బిందునాదకళాతీతా" అనుస్తోత్ర వాక్యము ప్రమాణము.

"యోమాం పశ్యతి సర్వత్ర సర్వంచ మయి పశ్యతి"

ఎవడు ఈ అనంత విశ్వమునందు నన్ను దర్శించుచున్నాడో, నాయందు ఈ అనంత విశ్వమును చూచుచున్నాడో అతడే జ్ఞాని అని, మోక్షార్హుడని భగవద్గీతలోని వాక్యమును చివఱ ఎత్తుగీతిలో పొందుపఱచినాడు.

ఇందలి సీసపద్యమును పంచపాదిగా రచించెను.

'నాదాంతసీమల నడరు వెల్గు' యతిస్థానములో (అడరు = అతిశయించు) అడరు శబ్దంలోని తొలియక్షరముతో యతి చెల్లించెను. ఇది అఖండయతి. 'నడచు

వెల్గు' అనివేసికొనినచో దోషము పరిహృతమగును. ("నాదాంత సీమల నడచు వెల్గు")

ఈనాడు కవిత్వమనగనే, "సామాజికస్పృహ" ఉన్నదా? అని ప్రశ్నించుట ఒక అలవాటైనది. అది ఆధునికులు ప్రధానమని పలికినను, ఇప్పటి కవితలలో అది నభః పుష్పసమమైనది. పూర్వశతకములలో సామాజికస్పృహ అతివేలముగా కన్పించుచున్నది. సుమతీ – వేమన – భాస్కర శతకాదులలోనే కాక శ్రీకాళహస్తీశ్వర శతకము, నరసింహశతకము – మొదలైన భక్తిశతకాలలో కూడ ఈ సామాజిక స్పృహ ప్రధానస్థాన మాక్రమించుచున్నది.

**సీ॥ వేదాంతయుక్తులు విని రెండు నేర్చుక**
**వాగునాతఁడు రాజయోగి కాఁడు**
**కల్లు లొట్టెడు త్రావి కైపెక్కి తెలియక**
**వదరినంతనె శాస్త్రవిదుఁడు గాఁడు**
**పట్టపురాజు చేపట్టి యుంచంగానె**
**గుడిసెవానికి భూరిగుణము రాదు**
**ముండపై వలపున రెండెఱుంగక మోవి**
**యానగానే చొల్లు తేనె గాదు**
**తే॥గీ॥ కోఁతి పైనున్న సింగంపుఁగొదమ గాదు,**
**ఎంత చదివిన గుణహీనుఁ డెచ్చు గాదు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 7**

**తా.** ఎవ్వరో జ్ఞానులు ఉపదేశించుచుండగా వేదాంతోపాయములు రెండు నేర్చుకొని, పదిమందికడ వానిని వాగువాడు రాజయోగి కాడు. ఒక లొట్టెడు కల్లు త్రాగి మైకంపైకెక్కి మంచి చెడులు తెలియక, వదరుబోతుగా వరుసగా ఇష్టము వచ్చినటులు మాటాడినవాడు శాస్త్రవేత్త కాడు. పట్టణమునేలు రాజు ఉంపుడుగత్తెగా ఉంచుకొనిన గుడిచేటి – దేవదాసికి ఉత్తమ గుణము రాదు. (ఇక్కడ "పట్టపురాజు చేపట్టియుంచంగానె గుడిసెవానికి" అని పాఠమీయబడినది. గుడిసెలో నివసించు

వానికి రాజు ఆశ్రయమిచ్చి చేరదీసినంతమాత్రమున గుడిసెవానికి భూరి గుణమురాదు" అని చెప్పబడినది. కాని ఇది సరికాదు. పండితులు ఈ పాదాన్ని దిద్దివేశారు. "గుడిచేటిముండకు గుణము రాదు" అనునది కవి వ్రాసిన పాదము.) ఉంచుకొన్నదానిపై అధికమోహముచేత సిగ్గెగ్గులు తెలియక, దాని క్రీపెదవి చుంబించినంత మాత్రముచేత, అచ్చటనున్నది చొల్లేగాని, తేనెకాదు. పండితులందఱు క్రింద కూర్చుండగా ఒక అల్పుడు పైనున్న మాత్రముచేత గొప్పవాడు కాదు. క్రింద సింహశార్దూలాది జంతువులుండగా ఒక క్రోతి చెట్టుమీద నున్నంత మాత్రాన అది సింహపుపిల్ల కాదు. నీచుడైన వాడెంతచదివినను, ఔన్నత్యమును పొందలేడు. ఈ భావం భాస్కరశతకకర్తది.

పండితులైనవారు దిగువం దగనుండఁగ నల్పుఁడొక్కఁడు
ద్దండతఁ బీఠమెక్కిన బుధప్రకరంబుల కేమి యెగ్గగున్?
గొండొక కోఁతి చెట్టుకొనకొమ్మల నుండఁగఁ గ్రింద గండభే
రుండ మదేభ సింహ నికురుంబము లుండవె చేరి భాస్కరా! (61వ పద్యం)

ఇందలి మూడవ పాదంలో రాజు ఆశ్రయమిచ్చినంత మాత్రముచేత గుడిసెలో నివసించువానికి గొప్ప గుణమురాదు – అన్నది సరికాదు. మన మహర్షులు – గొప్ప తత్త్వవేత్తలు అడవులలో పర్ణశాలలోనే నివసించిరి. వారికి భూరి గుణములేదా? నివాసమునకును గుణమునకును సంబంధమున్నదా?

ఈ శతకము, ఆంగ్లేయుల కాలములో నిషేధమునకు గురియైనది. ఇందు కవి, సమాజ వర్తనముపైననో, అధికారుల పైననో, రాజుల పైననో కోపముతో కొన్ని బూతుపదాలను యథేచ్ఛగా వాడియున్నాడు. అపుడీగ్రంథాలను ప్రకటించుటకు పండితు లెవరికిచ్చవచ్చినట్లు వారు దిద్ది, బూతులు లేవని నిరూపించి ప్రకటించిరి. నేను చిన్నప్పుడు చదివినది– "గుడిచేటి ముండకు గుణము రాదు" అని. "గుడిచేటి" అంటే "దేవదాసి". ఆ వ్యవస్థ పరమపవిత్రముగా ప్రారంభింప బడినను, అనేక దోషాలకది ఆలవాలమైనది. గుడిచేటులు కేవలము పెద్దవారికి భోగసానులుగా మారి, వారు ఊరు ఉమ్మడి సొత్తుగా మారినారు. వారే దూతికలుగా మారినారు. అందువల్ల 'గుడిసేటి ముండ' అనే వ్యావహారికనామ మేర్పడినది.

"కల్లు లొట్టెడు త్రావి" అనేది వామాచార ఖండనము. అంటే శ్రీవైష్ణవంలో "మత్స్యం–మాంసం–మద్యం–ముద్రా–మైథునము" అనే ఒక తంత్రం ఆచారంలో

ఉండినది. దీనినే వామాచారమందురు. ఇది వైష్ణవమతవిషయం కాదు. కొందరు స్వార్థపరులు, స్వశరీరసుఖాలకోసం, యీ ఆచారాన్ని వ్యాప్తి చేసి రామానుజ మతంగా చెప్పి, శ్రీమద్రామానుజుల యశశ్శరీరానికేమసిబూయుటకు ప్రయత్నించుచున్నారు. వారి విశిష్టాద్వైత సిద్ధాంతానికి అపఖ్యాతిని తెచ్చారు. వారందఱు త్రాగి కైపెక్కి వదరుచుందురు. "అందరూ శ్రీవైష్ణవులే! మధ్యలోని కల్లుకుండ ఏమైనది?" అనే సామెత ఉద్భవించినది.

**సం.వ్యా.** పై సీసపద్యములోని రెండవపాదము రెండవదళము, మూడవ పాదములోని రెండవదళము 'తెలుగు శతకమంజరి'లో భిన్నముగా నున్నవి: "వదరినంతనె శాస్త్రవిదుఁడు గాఁడు" = "ప్రేలినంతనె శాస్త్రవేత్త గాఁడు"; "గుడిసెవానికి భూరిగుణము రాదు" = "గుడిసెవేటుకు భారిగుణము రాదు". "గుడిసెవేటు" = కులట. దీని రూపాంతరము "గుడిసెవాటు". పై పద్యములో "గుడిసెవాటికి" అనుటకు బదులుగా "గుడిసెవానికి" అని తప్పుగా ముద్రింపబడినది. "బారి" = గొప్ప. సాహిత్య అకాడెమి ప్రతిలో పై దళములు రెండును "వదరినంతనె శాస్త్రవిదుఁడు గాఁడు" – "గుడిసెవాటికి బారిగుణము రాదు" అని యున్నవి.

**సీ॥ దండక మండలు ధారులై కాషాయ**
**ములు ధరించిన దాన ముక్తి లేదు;**
**భూతి గంపెడు పూసి పులిచర్మమును బూని**
**ముక్కు మూసిన దాన ముక్తి లేదు;**
**తిరుమణి పట్టెడు తీసి పూసియుఁ దన**
**భజములు కాల్చిన ముక్తి లేదు;**
**వాయువు బంధించి, ప్రాణంబులలయంగ**
**మూఁత వేసిన దాన ముక్తి లేదు;**
**తే॥గీ॥ గురుపదాంబుజముల భక్తికుదిరి, తమ్ముఁ**
**దామెఱుంగక ముక్తి లేదవనియందు;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **8**

**తా.** ఓ వేణుగోపాలా! దండము – కమండలువు ధరించి కాషాయ వస్త్రాలు ధరించినంత మాత్రముచేత మోక్షము రాదు. గంపెడు విభూతిని ఒడలంతయు పూసికొని, వ్యాఘ్రచర్మమును దాల్చి ముక్కు మూసికొనిన మాత్రముచేత మోక్షము రాదు. తిరుమణి (నాము–వైష్ణవుల ఊర్ధ్వపుండ్రము తిరుమణితో పెట్టుకొని, మధ్య శ్రీచూర్ణముతో పుండ్రమును తీర్చెదరు) ఒక పట్టెడు నీటిలో అరగదీసి శరీర భాగములందు ద్వాదశ ప్రదేశములలో (12) ఊర్ధ్వపుండ్రాలు పెట్టుకొని భుజములు కాల్పించుకొన్నందువలన ముక్తి లభింపదు. (వైష్ణవములో పంచసంస్కారమను ప్రక్రియ ఉన్నది. 1. తాపము, 2. పుండ్రము, 3. నామము, 4. మంత్రము, 5.వైష్ణవేష్టి. తాపము అంటే భుజములమీద శంఖచక్రముద్రలను వేయుట. (రాగితో చేయబడిన శంఖము – చక్రములను కాల్చి, కుడిభుజముపై చక్రమును, ఎడమ భుజముపై శంఖమును వేయుదురు). వాయువులను బంధించి ప్రాణములు బాధపడేటట్లు ఉచ్ఛ్వాసనిశ్వాసములను నిల్పి యోగమునందున్నను ముక్తి లభింపదు. సద్గురుని పాదపద్మములందు నిశ్చలమైన భక్తి కుదిరి, తమను తాము తెలిసికొన్నచో మోక్షప్రాప్తి జరుగును.

పంచప్రాణములను అరికట్టి యోగములో కూర్చుండిన అనగా, ప్రాణములైదు: ప్రాణము – అపానము – సమానము – ఉదానము, వ్యానము – అనునవి. ఆ ప్రాణవాయువులను బంధించి కూర్చున్నను ముక్తి లభింపదు.

తనను తా నెఱుగక మోక్షము చేకూరదు. శంకర భగవత్పాదులు. "కస్త్వం కోఽహం – కుత ఆయాతః" అనే మూడు ప్రశ్నలకు సమాధానము తెలిసికొన్నచో సర్వమును తెలిసికొనినట్లే. అందులో మొదటిది. 'కస్త్వం?' = నీవెవరు? 'సైన్సు' ప్రకారము కూడా విశ్వములోనున్న దేదీ నశించదు. క్రొత్తగా ఏదీ రాదు. ఏది వచ్చినను, అది మొదటినుండి విశ్వములో ఉన్నదే. కనుక 'నీవు' మొన్నటిదాకా లేవు (పుట్టుకముందు). ఇప్పుడున్నావు. మరికొన్నాళ్లకు ఉండవు. నీ వెవరివి? ఎక్కడనుండి వచ్చితివి? అందుకే రమణమహర్షి ఎవరినైనా, "నీవెవరివో నీవు తెలిసికొన్నావా?" అని ప్రశ్నించేవారట. అంటే నిన్ను నీవు తెలిసికొంటే పరమాత్మను

తెలిసికొన్నట్లే. అది తెలియవలెనన్న గుర్వనుగ్రహము పూర్తిగా ఉన్ననే లభించును.

మొదటి పాదములో సన్న్యాసులుగా సంచరించువారిని, తరువాత వీరశైవులను, "ఆవగింజంత భూతి మైనలందుకొనిన, వెలంది! గుమ్మడి కాయంత వెఱ్ఱిపుట్టు" – అని శ్రీనాథుడు హరవిలాసమున చెప్పినట్లు మిండ జంగమాచారాదులను తిరస్కరించెను. ఇక మూడవ పాదమున వైష్ణవములోని కూచిమాచి మతస్థుల నందఱిని తిరస్కరించెను. తరువాత ప్రాణాయామాది యోగ విద్యలు కూడ మోక్షప్రాప్తికి సాధనములు కావని వెల్లడించెను.

తేటగీతి రెండవ పాదమున "తామెఱుంగక ముక్తిలే దవనియందు" అనుచోట 'తా' – 'అ' లకు యతి చెల్లించెను. ఇదియు అఖండయతి.

"తమ్ముఁదామెఱుంగక ముక్తి తనరఁబోదు?" అన్నచో దోషపరిహరణ మగును.

"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః" అన్నట్లు మనస్సు నిశ్చలము చేసి పరమాత్మను గుర్తెఱుగవలెను.

**సం.వ్యా.** పై సీసపద్యములోని మూడవపాదము అకాడెమి ప్రతిలో "తిరుమణి పట్టెడు తీసి పట్టెలు తీర్చి, భుజము గాల్చిన దాన ముక్తి లేదు" – అని యున్నది. నాల్గవపాదములో "ప్రాణంబులలయంగ"="ప్రాణంబు నలయఁగ"అని యున్నది.

**సీ॥ దారిద్ర్యమనెడు భూధరచయంబులఁ గూల్ప**
**హరి! నీదుభక్తి వజ్రాయుధంబు;**
**అజ్ఞానమనెడు గాఢాంధకార మణంప**
**నీదు సపర్య భానూదయంబు;**
**ఘోరమౌ దుష్కృతాంభోరాశి నింకింపఁ**
**గా నీదు సేవ దవానలంబు;**
**చపలంబనెడు రోగసమితిని మాన్ప, న**
**బ్జాక్ష! నీ స్మరణ దివ్యౌషధంబు;**
**తే॥గీ॥ వెన్న గలిగియు నేతికి వెదకినటులఁ**
**బరులఁ దలఁతురు నీ మహత్తెఱుఁగ లేక;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 9

**తా.** దారిద్ర్యము (నిఱుపేదతనము) అను పర్వతసమూహములను కూలగొట్టుటకు, ఓ శ్రీహరీ! నీయందలి భక్తి వజ్రాయుధము. వజ్రము దేవేంద్రుని ఆయుధము. దానిని ప్రయోగించినచో కొండలు బదాబదలైపోవును. దారిద్ర్యమనెడి కొండలను కూల్చుటకు శ్రీహరిభక్తియే వజ్రాయుధము. వజ్రాయుధ మేరీతి కొండలను పగుల గొట్టునో శ్రీహరియందలి భక్తి దారిద్ర్యము నా విధముగా కూలగొట్టును.

అజ్ఞానమనే కటిక చీకటిని పోగొట్టుటకు నీకు సపర్య చేయుటయే సూర్యోదయము. సూర్యోదయము కాగానే చీకటులు అణగిపోవును. శ్రీహరిసేవ చేసినచో అజ్ఞానము తొలగి జ్ఞానము లభించునని భావము.

ఘోరములైన పాపములనెడి సముద్రమును ఇంకించుటకు, నిన్ను సేవించుటయే కారుచిచ్చు. పాపములనునవి సముద్రము. దానిని ఇంకించ వలెననిన నీదు సేవయనెడి కారుచిచ్చు కావలయును. కారుచిచ్చు సాగరము నింకించినట్లు నీ పాదసేవ పాపముల నణగించును.

(కారుచిచ్చు ఘోరారణ్యములను దహించునుగాని, సముద్రజలము నింకించునని, ఇంతకుముందు ఏ కావ్యమునందును దర్శింపనైతిని. ఈ విషయము చింత్యము – "హరి సేవయే బడబానలంబు" అనవలెను. బడబానలము సముద్రము పొంగకుండ వచ్చిచేరు నదీ జలంబులను ఆవిరిచేయుచున్నదట.)

చపలత్వ మనెడి రోగమును మాన్పుటకు ఓ పద్మనేత్రా! నిన్ను సదా స్మరించుటే శ్రేష్ఠమైన ఔషధము. ఔషధము రోగములు మాన్పునటుల నీ స్మరణము రోగములను మాన్పును.

వెన్న ఉన్నను నేతికొఱకు వెదకినట్లు, నీవు కన్పించుచున్నను ప్రజలు పరదేవతలను పూజించుచుందురు. వారు నీ మహత్త్వము నెఱిగినవారు కారు.

ఇందు నాల్గవ పాదమున 'చపలంబనెడు రోగసమితి' అని యున్నది. చపలుని భావము చాపల్యము. ఇది భావార్థక తద్ధితము. కనుక 'చాపల్యమను రోగసమితికి' అని ఉండవలయును. పూర్వప్రతులలో కూడ 'చపలంబనెడు

రోగసమితి' అనియే యున్నది. అట్లనరాదు. "చాపలంబను రోగసమితిని మాన్ప–న" అన్నచో సరిపోవును.

ఇందు దారిద్ర్యమను పర్వతములు – అజ్ఞానమను అంధకారము – పాపములను సముద్రము – చాపల్యమను రోగము – అనునవి రూపకములు. ఆరోప మూలకము రూపకము. అనగా ఉపమానవస్తువును ఉపమేయ వస్తువునం దారోపించుట. దారిద్ర్యము ఉపమేయము. పర్వతము ఉపమానము. పర్వతమును దారిద్ర్యమునందారోపించెను. అన్నియునిట్లే. ఇందు రూపకాలంకారము కలదు.

**సం.వ్యా.:** 'తెలుగు శతకమంజరి'లో ఎత్తుగీతిలోని రెండు పదములు కొంచెము భిన్నముగా నున్నవి. "వెన్నగలిగియు" = "వెన్నయుండియు"; "పరులఁదలఁతురు" = "పరుల వేఁడితి".

**సీ॥ సూక్ష్మపానము చేసి సొక్కినవేళ, సా**
**మిత ధారణము చేసి మెలఁగువేళ;**
**బదలిక పైనంబు నడచివచ్చినవేళ,**
**సురతాస్తి హాయని సొక్కువేళ;**
**నొంటరిగాఁ జీఁకటింటఁ బండినవేళ,**
**నలుకతోఁ బవళించునట్టివేళఁ;**
**దెఱఁగొప్ప మనమున దిగులు సెందినవేళ,**
**భక్తిగన్నట్టి విరక్తివేళ;**
**తే॥గీ॥ లక్ష్యభావంబుఁ జూడ సలక్షణమునఁ**
**బండువెన్నెలగతిఁ గానఁబడును ముక్తి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 10

**తా.** పూర్వప్రతియందు 'సూక్ష్మ స్నానము చేసి' అని యున్నది. అది ఎచ్చట ఎప్పుడు ముద్రింపబడినదో తెలియదగిన పత్రము లందులేవు. 'సూక్ష్మ స్నానము' గణభంగము కనుక ఈ ప్రతిలో 'సూక్ష్మ పానము చేసి' యని మార్చబడినది.

సూక్ష్మ శబ్దమునకు, చిన్నది – సన్ననిది అను అర్థములతోపాటు పరతత్త్వము – ఆత్మతత్త్వమను నైఘంటికార్థములును కలవు. కాని తరువాత చెప్పిన పాదములయం దెచ్చటను తత్త్వసంబంధమైన విషయము లేదు గనుక, ఐహికముగనే అన్వయించుట సముచితమని భావించుచుంటిని. పరతత్త్వ విషయమును పానము చేసి పరవశించిన వేళలందును, సామితధారణము చేసి మెలగు వేళలను – అని చెప్పవచ్చునుగాని, తరువాత పాదములకు కొంచెము దూరాన్వయము కావలసివచ్చును. సామితము = ? (అర్థము తెలియుటలేదు)

కొలదిగా పానము చేసి, మై మఱచి పరవశించిన వేళ, సామిత ధారణము చేసి మెలగు సమయమున, ప్రయాణపు టాయాసముతో నడచివచ్చిన వేళ, స్త్రీతో రమించి, ఆహా! యని పరవశించు సమయమునందును, ఒంటరిగా చీకటి యింట్లో పండుకొనిన సమయమందును, అలిగి (కోపగించి) పండుకొనిన సమయము నందును, క్రమముగా మనస్సులో దిగులు పొందిన తఱి, పురాణాదులు విని భక్తినెలకొని 'ఆఁ! ఈ ప్రపంచమంతయు మిథ్య' అను వైరాగ్యము కలిగిన పట్టునను, తాను ఏ లక్ష్యముతో చూచుచున్నాడో అది సలక్షణముగా పండువెన్నెల వలె ముక్తి కన్పించును.

ఇది వ్యంగ్యభావవిలసిత పద్యమని నా భావము. "ఒరేయ్ ఈమెట్లెక్కేటప్పటికే దేవుడు కన్పిస్తాడురా!" అన్న బాధాభరిత భావమెట్టిదో, ముక్తి కన్పించుననుటయు నట్టిదే యని నా భావము.

ఇంతకన్న ఔచిత్యవంతమైన భావమెవ్వరు చెప్పినను అంజలిబద్ధుడనై స్వీకరింతును.

ఇందు 'సురతాస్తి' సరియైన పదప్రయోగము కాదు. 'సురతాప్తి' అనుట సముచితము. ఇది ముద్రారాక్షసము కావచ్చును. ఆప్తి = పొందు.

**సం.వ్యా.** తెలుగు శతకమంజరిలో – "సురతాస్తి" = "సుఖమంది"; "పండినవేళ" = "ఉండిన వేళ". తెలుగు అకాడెమీ ప్రతిలో – "సూక్ష్మపానము" = "సూక్ష్మస్నానము"; "సురతాస్తి" = "సురతాప్తి"; "పండినవేళ" = "ఉండినవేళ". "సూక్ష్మపానము" – "సురతాప్తి" అను పదములే సరియైనవి.

**సీ॥ అగ్రజన్మము, తీరమందు వాసంబును,**
**వితరణంబు, ననుభవించు నేర్పు;**
**సంగీతసాహిత్య సంపన్నతయు, మతి**
**రసికత, బంధుసంరక్షణంబు;**
**ననుకూలమైన చక్కని భార్య, రాజస**
**న్మానంబు, ప్రఖ్యాతి, మానుషంబు;**
**సౌందర్య, మతిదృఢశక్తి, విలాసంబు,**
**జ్ఞానంబు, నీ పదధ్యాననిష్ఠ;**
**తే॥గీ॥ ఇన్ని విధములు గలిగి వర్తించు నరుఁడు**
**భూతలస్వర్గపదములఁ బొందుచుండు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 11**

**తా.** ఓ వేణుగోపాలా! బ్రాహ్మణ కులమున జన్మించుట, నదీతీరమునందు నివసించుట, దానమునొసంగి, అందలి ఆనందము ననుభవించుట, సంగీత సాహిత్యములందు చక్కని పాండిత్యము, రాసిక్యము (అనగా కావ్యరసము నాస్వాదించు శక్తి–ఉన్నత భావములను కార్యములను మెచ్చుకొను స్వభావము), బంధువులను కష్టములనుండి కాపాడుట, అనుకూలవతియైన అందమైన భార్యను కలిగియుండుట, రాజులచే సన్మానింపబడుటయు (ఏదియో ఒక కళారంగముననో, సాహితీరంగముననో ప్రతిష్ఠను పొంది రాజుగారిచే గౌరవింపబడుట), లోకము నందు కీర్తియు, మానవత్వమును, సుందరమైన మనస్సు–అనగా నిష్కల్మషము నిష్కపటమైన మనస్సును, మానసికమైన అధికశక్తియు, మనోజ్ఞమైన ప్రవర్తనము, జ్ఞానము, నీ పాదములను ధ్యానించెడి నిష్ఠ మొదలగు ఇన్ని గుణములు గలిగి సంచరించు మానవుడు, ఇచ్చటనే స్వర్గసుఖముల ననుభవించును – ఆతనికి భూతలమే స్వర్గలోకము.

'వితరణంబు ననుభవించు నేర్పు' అనగా దానమును గ్రహించి, దానిని అనుభవించెడి నైపుణ్యమనియు అర్థము చెప్పనొప్పును.

ఇందు ప్రథమ పాదమున అపుష్టార్థమను దొసంగు కలదు. అగ్రజన్మము యొక్క సమీపమున వాసము అను దాని కర్థమెట్లు? బ్రాహ్మణులకు సమీప నివాసమనియా? అప్పుడగ్రజన్ముల తీరమని గదా ఉండవలె? అగ్రజన్ముడన బ్రహ్మదేవుడు. ఆయన తీరమందని చెప్పుట అసంభవము. దీనికి నేను సమీపార్థము నే వ్రాసితినిగాని, శబ్దార్థ రూఢ్యర్థములను కాదు. 'రసికుడు' అను శబ్దమునకు, అర్థవిపరిణామమేర్పడి, పదిమంది స్త్రీలతో వ్యభిచరించువాడు రసికుడని చెప్పబడుచున్నాడు.

'అనుకూలమైన చక్కని భార్య' అనుదానికి పూర్వము 'అనుకూలవతియైన అందంపుటాలు' అనే పాఠాంతరముకూడ ఉండెడిది.

తేటగీతి మొదటి పాదమున "ఇన్ని విధములు గల్గి వర్తించు నరుడు", 'ఇన్ని' లోని అచ్చు 'ఇ' కి, 'వర్తించు' 'ర్తి' మీద ఉన్న 'ఇ'తో యతి చెల్లించినాడు. ఇదే ఇంచుకాగమయతి. ఇది చెల్లదని లాక్షణికులు తమ గ్రంథములలో ఉద్ఘాటించిరి. కాని ఆధునిక కవులు విరివిగా ప్రయోగించుచున్నారు. శబ్దదారిద్ర్యమే దీనికి కారణమని యొక విమర్శకుడు ఘంటాపథముగా నిర్దేశించినాడు. "ఇన్ని విధములుగాఁ జరియించునరుఁడు' అంటే దోష నివృత్తియగును. 'అనుకూలమైన చక్కని భార్య'. చక్కనిభార్యకు విశేషణము అనుకూలము. ఇది అన్వయింపదు. చక్కని భార్య స్త్రీ లింగము. దానికి విశేషణము స్త్రీలింగమందే యుండవలెనుగాన, "అనుకూలవతియగు" అనియే యుండవలయును.

**సం.వ్యా.** తెలుగు శతకమంజరిలో – సీసపద్యము రెండవ పాదములో "మఱి రసికత" = "మతి రసికత". 'మఱి' అను గణపూరణ శబ్దము కన్న 'మతి' అనునదియే బాగున్నది. విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మగారు 1954లో "శతక వాఙ్మయ సర్వస్వము" (ప్రథమ సంపుటము)ను వెలువరించినారు. దానిలో ఈ పోలిపెద్ది వేంకటరాయకవిని గురించిన వ్యాసములో ఈ శతకమునుండి 19 సీసపద్యములను ఉదాహరించినారు. వానిలో నీ పద్యమున్నది. దానిలోని పాఠభేదములు ఇట్లున్నవి: "వితరణంబు, ననుభవించు నేర్పు" = "వితరణగుణము, వివేకగరిమ"; "మఱి రసికత, బంధుసంరక్షణంబు" = "మఱి రసయుత విబుధ

సంరక్షణంబు"; "ఇన్ని విధములు గలిగి వర్తించు నరుఁడు" = "ఇన్ని విధముల నొప్పి వర్తించు నరుఁడు"; "భూతల స్వర్గపదములఁ బొందుచుండు" = "భూతల స్వర్గసుఖములు పొందుచుండు".

**సీ॥ అబ్బ మేలోర్వలేనట్టి వాఁడైనను,**
**మోహంబుగల తల్లి మూఁగదైన;**
**ఆలు రక్కసియైన, నల్లుఁడనాదైనఁ,**
**గూఁతురు పెను అంకుఁబోఁతునైనఁ;**
**గొడుకు తుందుడుకైనఁ, గోడలు దొంగైనఁ,**
**దనకు సాధ్యుఁడు గాని తమ్ముఁడైన;**
**గృహకృత్యములు పొరుగిండ్ల వెంబడిఁబోయి**
**చెప్పి యేడ్చెడి చెడ్డచెల్లెలయిన;**
**తే॥గీ॥ నరుని ఖేదంబు వర్ణింపఁ దరము గాదు!**
**అంతటను సన్న్యసింపంగ నగును మేలు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **12**

**తా.** శ్రీ వేణుగోపాలా! తండ్రి తన (కొడుకుయొక్క) మేలును భరించలేని వాడైనను (త్రాగుబోతులు – తిరుగుబోతులు కుమారుని మేలునకై యత్నింపరు. దురభ్యాసరతులై సంపద పాడుచేయుదురు గాని ప్రగతిపథమున జను పుత్రుల విద్యాధిక్య సంపాదనకు ధనము వ్యయమొనరింపనివారు ఎందరో గలరు); ప్రేమకలిగిన తల్లి మూగదైనను (మంచి చెడులు చెప్పవలెననియున్నను చెప్పలేదు. ఒక వేళ తెలిసినను ఈ విధి ఆపదరాబోవుచున్నదని పుత్రునకు చెప్పలేదు కదా!); భార్య రాక్షసియైనను, ప్రతికార్యమునకును వ్యతిరేకించి బాధించునదైనను; అల్లుడు అనాథుడైనను; కూతురు అత్యధికమైన వ్యభిచారిణియై తిరుగుబోతైనను; కొడుకు దుందుడుకు స్వభావము కలవాడై, ఐనదానికిని, కానిదానికిని తొందరపడు స్వభావము కలవాడైనను; కోడలు దొంగయైనను, (ఇక ఇంట నేవస్తువును

దాచుకొనుటకు సాధ్యముకాదు – ఇంటి దొంగనీశ్వరుడైన పట్టలేడు కదా); తమ్ముడు తన మాటకు లోబడనివాడైనను; ఇంటిలోని లొసుగులు, పొరుగిరుగిండ్లకు పోయి, తనను సరిగా చూచుటలేదని చెప్పి యేడ్చెడి చెల్లెలైనను; ఆ మానవుని దుఃఖమింతయని వర్ణించుటకు సాధ్యము కాదు. అట్టివాడు సంసారమును వదలి సన్న్యసించుట అన్ని విధముల మేలు.

'అల్లుడనాదైన' ఇది సరియగు ప్రయోగము కాదు. 'అనాథ' సంస్కృతపదము. దీనికి 'అల్లుఁడనదయైన' అని ఉండవలెను. 'అనాథ'కు – 'అనద' సరియగు తెలుగు రూపము. రక్షణలేనివాడు, అసమర్థుడని అర్థములు వచ్చును.

'మాసోదరి మాయింట భుజియించి, మా అన్నయింట చేయికడుగు' నని వాడుక.

'చెప్పి యేడ్చెడు ముండ చెల్లెలయిన' పాఠాంతరము. విధవరాలు అన్న యింట్లోనే యుండును గనుక పొరుగిండ్లకు పోయి చెప్పియేడ్చుట. ఇదియే తగు పాఠమేమో!

**సం.వ్యా.** తెలుగు శతకమంజరిలో – "ఆలు రక్కసియైన, నల్లుడనాదైన" = ఆలు రాకాసైన నల్లుడనాథైన"; "పెను ఱంకుఁబోతునైన" = "పెను ఱంకుఁబోతు దైన"; "సన్న్యసింపంగనగును" = "సన్న్యసించుటయైన". అకాడెమి ప్రతిలో: "ఆలు రక్కసియైన, నల్లుఁడనదయైన"; "పెనుఱంకుఁబోతుదైన"; "సన్న్యసింపంగనగును". "శతక వాఙ్మయ సర్వస్వము"లోని పాఠభేదములు: "ఆలు రాకాసైన అల్లుఁడనాథైన" – "పెనుఱంకుఁబోఁతుదైన" – "సన్న్యసించుటయైన మేలు".

**సీ॥ విధవచెవులకు నేల విరివి వజ్రపుకమ్మ**
**లుఋకుతొత్తుకు విటుఁడుండనేల?**
**గ్రుడ్డిముండకు మంచి గొప్ప యద్దంబేల?**
**సరవి గుడిసెకుఁ బలు చాందినేల?**
**యూరపందులకుఁ బన్నీరు గంధంబేల?**
**బధిరున కల వీణపాటలేల?**
**కుక్కపోతుకు జరీకుచ్చుల జీనేల?**
**పూటకూళ్ళమ్మకుఁ బుణ్యమేల?**

**తే॥గీ॥ తనకు గతిలేక యొకఁ డిచ్చు తఱిని, వాని**
**మతినిఁ జెఱపెడి రండకుఁ గ్రతువులేల?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 13**

**తా.** ఓ వేణుగోపాలా! విధవరాలి చెవులకు వజ్రములు తాపించిన బంగారు దుద్దులు ఎందులకు? (పుణ్యస్త్రీలు చెవికమ్మలు లేకుండ సోదరులకు తల్లిదండ్రులకు కన్పింపరాదని శాస్త్రవాక్యము. అలా కర్ణభూషణ రహితయైన సోదరిని, పుత్రికామణులను చూచిన వారి సంపద నశించునట - విధవరాలు ఎలా కన్పించినను ఒకటేకదా! అని భావము) పుణ్యస్త్రీ వజ్రపుకర్ణాభరణధారిణి యగుచో, భర్తకే కాదు, చూచు వారందఱకు ఆమె అందము ఆనందము కల్గించును కాన పుణ్యస్త్రీకి తప్పక కమ్మలు చెవుల నిరంతరము ఉండదగును.

విటులకొఱకు అన్ని దిక్కులకు ఉఱుకులు పరుగుల మీద ఉచితానుచితములు కానక పరుగెత్తు సానిదానికి ప్రత్యేకముగా ఒక విటుడు ఉండనేమిటికి?

పుట్టుగ్రుడ్డి, పైగా విధవరాలు. ఆమె మోమును చూసుకొనుటకు మంచి విలువైన అద్దమెందులకు? ఎలాగూ ఆమె దర్శించుకొనలేదు. గ్రుడ్డిముండ యనునది వ్యావహారికము.

అది తాటియాకుల గుడిసె. దానికి మంచి మేలుకట్టెందులకు? 'చాందిని' అంటే 'మేలుకట్టు'. ఇండ్ల కప్పులక్రింద శుభకార్యములకు వేసిన పందిళ్ళక్రింద, పైని ఆకులు పెండెములు కన్పింపకుండ తెల్లని వస్త్రమును కట్టెదరు. అదియే మేలుకట్టు? అది గుడిసె కెందుకు?

ఊరపందులు బురదలో పొరలాడును. పెంటకుప్పలవైపు పరుగులెత్తును. అటువంటి పందులకు, పన్నీటి సుగంధమెందులకు? ఆ సుగంధము నవి ఆస్వాదింపలేవుగదా! వేమన యిదే పాదమును ఒక పద్యములో "పందికేల మంచి పన్నీటి గంధంబు" అన్నాడు.

బ్రహ్మచెవుడు - ఏమీ విన్పింపవు. వానికి వీణాగాన మెందులకు? వినలేడు. ఆస్వాదింపలేడు. వ్యర్థము. శ్రేష్ఠమైన మేలుజాతిగుఱ్ఱమునకు మంచిజీను వేసి

రౌతు దానిపై కూర్చుండి స్వారీచేయును – తెగబలిసిన మనగుక్కకు మంచి అందమైన జరీకుచ్చుల జీను ఎందులకు? కుక్కపై ఎవ్వరును ఎక్కి స్వారీచేయరుకదా!

పూట కూళ్ళమ్మకు పుణ్యమెందులకు? ఆమెకు కావలసినది లాభము. శుచిగా – శుభ్రముగా, మంచి పదార్థములతో వంటచేసి పెట్టవలసిన అవసర మామె కేమున్నది? ఎట్లు పెట్టినను, తనకు పరమార్థము ధనలాభమే తప్ప – పుణ్యము కాదు కదా!

ఇతరుల కీయగలిగిన స్థితి తన కెట్లును లేదు. ఇతరులు దానమిచ్చుటకు సిద్ధముగానున్న సమయమున ఆ దాతదగ్గఱకు పోయి, లేనిపోని యబద్ధములు చెప్పి ఆదాన మీయకుండ చేసిన రండకు (రెండు కులముల వ్యక్తుల కుద్భవించిన వాడు) ఎన్ని క్రతువులు చేసినను ఫలము రాదు. అట్టివాడు క్రతువులు చేసియు ప్రయోజనము లేదు.

ఈ శతకకర్త పాండిత్యమునకు, కవితాశక్తికి మెచ్చి గొప్ప సన్మానమును చేయవలయునని ఆ దేశపు రాజు నిర్ణయించుకొనెనట. ఆ రాజు దగ్గఱ ఉన్న దివాను (మంత్రి) ఈ కవిపై ఎందులకో ఈర్ష్య గలిగి, యీయనపై కొండెములు చెప్పి ఆ సన్మానము జరుగకుండ చేసెనట. ఆక్రోధముతో ఈ మహాకవి శతకమును బూతులతో నింపినాడు. ఆ బూతులు అచ్చమైన బూతులుగా కాక నీతులుగనే పరిణమించివి. అందుకే అవకాశము వచ్చినప్పుడెల్ల ధ్వనిపూర్వకముగా ఇట్లధిక్షేపించుచునేయుండును. ఇట్టివి తెలుగుసాహిత్యమున నెన్నియో గలవు. నీలాద్రి ప్రభువున కంకితముగా కూచిమంచి జగ్గకవి, "చంద్రరేఖావిలాస"మను కావ్యమును రచించెను. వేంకట మనీషి యను పండితుని మాట విని నీలాద్రి రాజు చంద్రరేఖావిలాసమును స్వీకరింప నిరాకరించెను. కోపించిన కవి చంద్రరేఖావిలాస శృంగారకావ్యమును, "చంద్రరేఖావిలాపము"గా బూతు కావ్యముగా మార్చి ప్రచురించుట లోకవిదితమే.

ఇందు తొలిపాదమున గణభంగము. "విధవ చెవులకేల" అంటే సరిపోతుంది. 'విధవ చెవులకునేల?' అని ఏల దిద్దిరో తెలియదు. పూర్వప్రతిలో "సరవి గుడిసెకు బలు బొందియేల?" అని యున్నది.

ఈ ప్రతిలో "సరవి గుడిసెకు బలు చాందినేల?" అని యున్నది యతిని సవరించినారు గాని గణభంగమట్లే ఉన్నది. "సరిగుడిసెకు బలు చాందినేల?" అంటే దోషరహితమవుతుంది.

**సం.వ్యా.** పై సీసపద్యములోని మొదటిపాదము, రెండవపాదము శతకమంజరిలోను, అకాడెమీ ప్రతిలోను భిన్నముగానున్నవి. "అఱవ చెవులకేల యరిది వజ్రపుఁగమ్మ, లూరితొత్తుకు విటుండుండనేల?; గ్రుడ్డికంటికి.... సరవి గుడిసెకు బల్‌చాందినేల?" (శతకమంజరి). "విధవ చెవులకేల యరిది వజ్రపుఁగమ్మ, లుఱుకు తొత్తుకు విటుఁడుండనేల?; గ్రుడ్డిముండకు... సరవిగుడిసెకు బల్ చాందినేల?" (అకాడెమీప్రతి). "చెవులకేల" – "బల్ చాందినేల" అను పాఠముల వలన గణభంగమునకు ఆస్కారములేదు. "అఱవ" = విధవ.

ఈ శతకకవియైన పోలిపెద్ది వేంకటరాయకవికన్న సుమారు నూరు సంవత్సరములు ముందు జీవించిన సుప్రసిద్ధకవి అడిదము సూరకవి (క్రీ.శ. 1720–1780) "రామలింగేశ శతకము"ను రచించెను. దానిలోని "కోతికి జల్తారు కుళ్ళాయి యేటికి?, విరజాజి పూదండ విధవకేల?" అను 30వ పద్యమునకు ఈ పద్యము అనుకరణము.

**సీ॥ అలకాధిపతి నేస్తుఁడైనప్పటికిని బా**
**లేందుమౌళికి భిక్షమెత్తవలసెఁ!**
**గమలాసనుని కెంత కరుణరా నడచినఁ**
**గలహంసలకుఁ దూఁటికాడలేను!**
**క్షీరాబ్ధిలంకలోఁ జేరినప్పటికైనఁ**
**గొంగతిండికి నత్తగుల్లలేను!**
**బరఁగు సాహేబు సుబాయెల్ల నేలిన**
**బేగములకుఁ గుట్టుపోఁగు లేను!**
**తే॥గీ॥ ఒకరి కుండెనటంచు మేలోర్వ లేక**
**నేర్వఁగారాదు, తనప్రాప్తి నెన్నవలయు!**

**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **14**

**అర్థములు:** బాల + ఇందుమౌళి = బాలచంద్రుని తలమీద ధరించిన శంకరుడు; పరcగు= ప్రసిద్ధమగు.

**తా.** ఓ వేణుగోపాలా! అలకానగరానికి అధిపతి కుబేరుడు. ఉత్తరదిక్కునకధిపతి. అంతేకాదు, సంపదల కాతడే అధినాథుడు. అటువంటి ధనికి, శంకరుడు దగ్గఱ మిత్రుడు. ఐనా శంకరుడు భిక్షమెత్తవలసి వచ్చినది.

('బ్రహ్మ, పార్వతీదేవి సౌందర్య దిదృక్షా ముగ్ధత్వమున ఆమె పాలిండ్ల నంట బోయెను. అది గమనించిన శంకరుడు త్రిశూలముతో బ్రహ్మదేవుని తల నరికెను. అంతకు ముందు ఆయన పంచముఖుడట. ఆ నరకిన తల గర్దభాకారము కలదట. శివునకు అందువలన బ్రహ్మహత్యాపాతకము కలిగినదట. దానిని పోగొట్టు కొనుటకు శంకరుడు భిక్షమెత్తవలసిన దుర్గతి సంప్రాప్తమైనది. చివఱకు కాశీ విశాలాక్షీ అన్నాపూర్ణాదేవి యిచ్చిన భిక్షతో ఆయనకు కలిగిన బ్రహ్మ హత్యా పాతకము తొలిగినదని పురాణవచనము. అందుకే వేమన – "ఆడదానిcజూడ నర్థంబుcజూచిన, బమ్మకైనcబుట్టు రిమ్మ తెగులు" – అనినాడు.)

కమలాసనుడు బ్రహ్మదేవుడు. సృష్టికర్త. ఆయన వాహనము రాజహంస. ఆ రాజహంస బ్రహ్మదేవుడు పొగడదగినట్లుగా సంచరించినను, హంసల కాహారము తూటికాడలే కదా! అఘటన ఘటనా సమర్థుడైన బ్రహ్మదేవుడు వానికి ఉత్తమ ఆహారము కల్పించవచ్చును కదా! తూటికాడలనునవి కాలువలలో నీరు ప్రవహించకుండ దట్టముగా అల్లుకొనును. అవి నిరుపయోగములు. పైగా ప్రవాహాటంకములు. కావున రైతులు వానిని పనికిమాలినవిగా భావించి బయటకు లాగి గుట్టలు వేయుదురు. ఆ పనికిమాలిన తూటికాడలే హంసల కాహారము కదా! (తూcడు = తామరపువ్వు మొదలగువానికాడ, బిసము)

పాలసముద్రము శ్రేష్ఠమైనది. శ్రీ మహావిష్ణువునకు శయనస్థానము. అట్టి పాలసముద్రములో లంకలున్నవి. ఆ లంకలలో సంచరించు కొంగలకు అక్కడ కూడ నత్తగుల్లలే కదా ఆహారము! పాలసముద్రము నారాయణుని శయ్యాస్థానము,

అంతటి సముద్రపులంకలలోనైనను కొంగలకు ఉత్తమాహారము లభించునా? లేదు.

సాహేబు సుబాను ఏలుచున్నాడు. (రాజ్యమును కొన్ని చిన్న చిన్న సుబాలుగా మహమ్మదీయరాజులు, తమ పాలనకాలమున విభజించిరి. నేటి మండలము వంటిది). ప్రభువు సంపన్నుడు. ఐనా వాని భార్యల చెవులకు కుట్టుపోగులే కదా!

మహమ్మదీయాచారములో చెవులకెన్నో కుట్టుపోగులుండును. ప్రభువునకు ధర్మపత్నులైనను ఆ ఆచారము తప్పదు.

ఇతరులకు ఉన్నదని, వారిపై యీర్ష్యతో వారి మేలును చూచి ఓర్వకుండ నుండరాదు. వారిని నిందింపరాదు. తనకెంత ప్రాప్తమో అంతే లభించును. సముద్రమున చెంబు ముంచిన చెంబెడు నీరే వచ్చునుగాని, సముద్రము పెద్దదిగదాయని కుండెడు నీళ్ళు రావు. "తనకు లేదని ఏడిస్తే ఒక కన్నుపోయిందట. వారికున్నదే – నాకు లేదే యని ఏడిస్తే రెండు కళ్లు పోయాయట"–సామెత.

**సం.వ్యా.** శతకమంజరిలోను, అకాడెమీప్రతిలోను సీసపద్యము మొదటి పాదములోని రెండు పదములు కొంచెము భిన్నముగానున్నవి: "నేస్తుఁడైనప్పటికిని" = "నేస్తమైనప్పటికిని"; "భిక్షమెత్తవలసె" = "బిచ్చమెత్తవలసె" (ఇట్లనుటయందే తెలుగునుడికారమున్నది.)

**సీ॥ అల్లునిఁ జేర్చిన నధికప్రసంగియౌ,**
**ముద్దుసేసినఁ గుక్క మూతి నాకుఁ;**
**గోళ్ళ సాఁకినఁ బొంతకుండలో విష్ఠించుఁ,**
**గొద్దితొత్తుల పొందు రద్దికీడ్చు;**
**గూఁబలు వ్రాలినఁ గొంప నాశముఁజేయుఁ,**
**జనువిచ్చినను నాలు చంకకెక్కుఁ;**
**బలువతో సరసంబు ప్రాణహాని యొనర్చు,**
**దుష్టుండు మంత్రైన దొరను జెఱచుఁ;**
**తే॥గీ॥ గనుక నివి తెల్సి జాగ్రత్తగాను బ్రజలఁ**
**బాలనము సేయుటది రాజపద్ధతియగు;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 15

**అర్థములు:** కొద్ది తొత్తులు = అల్పమైన లంజెలు; రద్దికీడ్చు = రచ్చకీడ్చు, రట్టుచేయు; పలువ = చెడ్డవాడు; పొంత = ప్రక్కన; విష్ఠించు=మలవిసర్జనము చేయు.

**తా.** ఓ వేణుగోపాలా! రాజైనవాడు (పాలకుడు) అల్పుడైనవానిని (నీచుని) దగ్గఱ చేర్చుకొన్నచో వాడు మంచిచెడు లెఱుగనేరక, సమయము సందర్భము లేక–ఉచితానుచితస్థితి మఱచి, అధిక వాచాలు డగును. ఏదేదియో వాగుచుండును. దానివలన అనేక కష్టనష్టము లేర్పడును.

కుక్కను ముద్దు చేసినచో అది వచ్చి యజమానుని మూతిని నాకుచుండును. కోళ్ళను పెంచినచో అవిపోయి పొంతకుండలో మలమును విసర్జించును. (పూర్వము కట్టెలపొయ్యిలో వంటచేసెడివారు. పొయ్యికి రెండువైపుల రాళ్ళనుంచి, ఒకవైపున రాళ్ళకు బదులుగా ఒక కుండ నుంచెడివారు. దానిలో నీళ్ళు పోసెడివారు. ఆ పొయ్యి పైని, అన్నము – పప్పు– కూరలు మొదలగునవి వండుచుందురు. ప్రక్కనున్న కుండలోని నీరు కాగుచుండును. ఇంటిలోనివారు స్నానమునకు ఆ కుండలో నీటిని తోడుకొనిపోయి వేడినీళ్ళ స్నానము చేయుదురు. నీళ్లు తోడగానే ఆ కుండను చన్నీళ్ళతో నింపెడువారు. మరల ఇంకొకరు నీళ్లు తోడుకొని, మరల చన్నీళ్ళతో నింపువారు. అవి కాగుచునే ఉండును. దానిని 'పొంతకుండ' అని పిలిచెడివారు. కోళ్లు ఆ కుండ మీద కెక్కి, ఆ కుండలో అవి మలము విసర్జించిన కారణముగా ఆనీరు స్నానమునకు పనికిరాదు. పొయ్యిపైని కుండ బెట్టి నీళ్లు కాచిన దానిని 'నీళ్ళకాగు' లేక 'కాగుకుండ' అందురు.)

నీచురాండ్రైన లంజెలను మరులుకొని తగులుకొన్నచో, వారు, చాల గొప్పగా ఫలానివాడు నన్నుంచుకొన్నాడని అందరికిని చెప్పి సమాజమున రచ్చకీడ్చెదరు.

గ్రుడ్లగూబ యింటిలో దూరినచో ఆ యిల్లు ఆరు మాసములవఱకు వాసయోగ్యము కాదని పాడుబెట్టవలసినదే. కనుక గూబలు చేరి కొంపలను నాశము చేయును.

భార్యకు అధికమైన చనవిచ్చినచో భర్త చంకకెక్కును. ఇక దిగమన్నను దిగదు. అనగా భర్తమాట వినక తనమాట చెల్లవలయునని, కార్యములు సక్రమముగా సాగనీయదు.

పలుగాకి వానితో (దుష్టునితో) సరసమాడినచో క్రమముగా అది కలహముగా మారి ప్రాణములనే తీయును. మంత్రి దుష్టుడైనచో దొరను చెడగొట్టును. ఈ విషయ మనేకపర్యాయములు కవి చెప్పుచునే యుండును. తనకు రాజు చేయదలచిన సన్మానమును మంత్రి చెడగొట్టెననుట నిశ్చయమని తేలుచున్నది.

కనుక రాజు అనగా పాలకుడైనవాడు ఈ విషయములన్నియు చక్కగా గ్రహించి జాగ్రత్తగా జనుల పాలింపవలెను. ఆ విధముగా పాలించుటయే రాజపద్ధతి.

తేటగీతి తొలిపాదమున గణభంగమైనది. "కనుక నివి తెలిసి జాగ్రత్తగాను ప్రజల". కాబట్టి కనుక ఆ పాదమును "కనుక నివితెల్సి జాగ్రత్తగాను ప్రజల" అని మార్చినచో సరిపోవును.

"మంత్రి + ఐన". సంస్కృత పదములపై తెలుగుపదముతో సంధి సరికాదు. 'య'డాగమము వచ్చి "మంత్రియైన" అనియుండవలెను. కాని యీకవి "మంత్రైన" అనినాడు. ఇట్టి ప్రయోగములు ఇతడు పెక్కు కావించెను. ఇప్పటి కవులును చేయుచున్నారు. ఇది వ్యాకరణ విరుద్ధ ప్రయోగమే.

**సం.వ్యా.** "చనువిచ్చినను నాలు చంకకెక్కు" = "చనవియ్యఁగా నాలు చంకకెక్కు" (శతకమంజరి) – "చనవీయఁగా నాలు చంకకెక్కు" (అకాడెమీప్రతి). "కనుక నివి తెల్సి జాగ్రత్తగాను బ్రజల" = "కనుక నివియెర్గి జాగరూకతను బ్రజల" (శతక మంజరి) – "కనుక నివి దెల్సి జాగ్రత్తగాను బ్రజల" (అకాడెమీ ప్రతి)

**సీ॥ అవనీశ్వరుఁడు మందుఁడయిన నర్థుల కియ్య**
**వద్దని యొద్ద దివాను సెప్పు,**
**మునిషీ యొకఁడు సెప్పు; మొనసి వష్కీ చెప్పుఁ,**
**దరువాత నా మజుందారు సెప్పు;**
**దలఁద్రిప్పుచును శిరస్తా చెప్పు, వెంటనే**
**కేలు మొగిడ్చి వకీలు సెప్పు;**
**దేశపాండ్యా తాను దినవలెనని చెప్పు,**
**ముసరద్ది చెవిలోన మొనసి చెప్పు;**

**తే॥గీ॥ యశముఁగోరిన దొరకొడుకైనవాఁడు**
**ఇన్ని చెప్పులు గడఁద్రోసి యియ్యవలయు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 16**

**తా.** స్వామీ! వేణుగోపాలా! భూమీశ్వరుడైన రాజు మూర్ఖుడైనచో (తెలివితక్కువ వాడైనచో) ఆతడు యాచకులకు అధికముగా దానము చేయదలచినను, ఆయన దగ్గఱనున్న మంత్రి అది ఇవ్వవద్దని చెప్పును. తరువాత, మునిషీ (చదువు చెప్పువాడు లేక వ్రాయసగాడు) చెప్పును. వష్కీ కూడ ఈయవలదని చెప్పును. తరువాత మంజుదారు (రాజునొద్ద లెక్కలు సరిచూచువాడు) ఈయవలదని చెప్పును. ఆ తరువాత తలత్రిప్పుచు శిరస్తా (న్యాయస్థానములలో లెక్కలను సరిచూచు అధికారి) చెప్పును. ఆ వెంటనే చేతులు రెండును జోడించి యీయవలదని వకీలు (న్యాయవాది) చెప్పును. దేశపాండ్యా (చిన్నజమీందారు) తానే ఆ ధనమును గూడ భక్షింపవలయునని యీయవద్దని చెప్పును. ముసరద్ది రాజుచెవిలో గట్టిగా చెప్పును. కీర్తిని కాంక్షించెడు రాకుమారుడు. అనగా పాలకుడు ఎందఱు చెప్పినను, చెప్పుడుమాటలు వినక వానిని ప్రక్కకు త్రోసి అర్థులకీయవలయును. అపుడతడు యశశ్శాలి యగును.

ఈ పద్యమున కవి ప్రయోగించిన, “దివాను – మునిషీ – వష్కీ – మంజుదారు – శిరస్తా – వకీలు” – అనునవి హిందీ లేక ఉర్దూ పదాలు. ఆంగ్లేయులు ఈ రాజ్యపాలనకు రాకముందు రాజాస్థానములలో నీపదములే ఉద్యోగులకు వాడబడుచుండెను. తురకల పాలనము నుండి యీ పదములు వ్యాప్తములైనవి.

“వష్కీ” – అను పదమునకు నైఘంటికార్థము లభ్యముకాలేదు. “వష్క” అనగా “ఈనిన ఆవు” అనే అర్థమున్నది. కనుక ‘వష్కీ’యనగా రాజుగారి ఆలకాపరియా? అనగా అంతచిన్నవాడు కూడ అర్థుల కీయవద్దని చెప్పుచుందు రనుటకీ కవి ప్రయోగించెనేమో? ఇది నా ఊహ మాత్రమే. విజ్ఞులెవరైన తెల్పినచో వందనములతో తప్పును దిద్దుకొందును.

‘ముసరద్ది’ ఏ పదమో కూడ నాకు అంతుపట్టదయ్యె.

తేటగీతి రెండువ పాదమున "ఇన్ని చెప్పులు కడ ద్రోసి" అని కవి ప్రయోగించుట అపార్థదము. 'ఇన్ని చెప్పుటల్ కడద్రోసి' అన్న కొంతమేలు. కాని "ఎంద రెటుచెప్పిన వినక యీయవలయు" అనినచో అది సక్రమ పాఠమగును. (కవి, తనకు ఈయవలదని రాజుతో చెప్పిన వారిపై మిక్కిలి కోపముతో, వారిని "చెప్పులు" - పాదరక్షలుగా పోల్చి చెప్పినాడని కూడ భావించవచ్చును - సంపాదకుడు)

**సం.వ్యా.** "వద్దని యొద్ద దివానుసెప్పు" = "వద్దని యొద్ది దివాను చెప్పు" (శతక మంజరి)-"వద్దని వద్ది దివాను చెప్పు" (అకాడెమీప్రతి). "మొనసి వష్కీ చెప్పు" ="మొనసి బక్షీ చెప్పు (శతకమంజరి మరియు అకాడెమీప్రతి). "ముసరద్ది చెవిలోన మొనసిచెప్పు"="మొసరద్ది చెవిలోన మొఱిగి చెప్పు" (శతకమంజరి). శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠభేదములు: "ఈయవద్దని వద్ది దివాను చెప్పు" ఇచ్చట "వద్ది"కి అర్థములేదు. "ఒద్ద-వద్ద" పదములున్నవి కాని "వద్ది" పదములేదు. "మునిషీ యొకఁడు చెప్పు- బకిషీ యొకఁడు చెప్పు (యతిభంగము)

**సీ॥ ఆత్మ తెలియని యోగి కద్వైతములు మెండు,**
**నెఱఱంకులాడికి నిష్ఠ మెండు;**
**పాలుపిండని గొడ్డుబఱ్ఱె కఱపులు మెండు,**
**కల్లపసిండికిఁ గాంతి మెండు;**
**గెలువని రాజుకుఁ బలు గెల్పులును మెండు,**
**వంధ్యకు విభునిపై వాంఛ మెండు;**
**దబ్బఱ పాటకుఁ దలత్రిప్పుటలు మెండు,**
**పసిమిరోగపు తొత్తు మిసిమి మెండు;**
**తే॥గీ॥ వండలేనక్కకు వగపులు బలు మెండు,**
**. . . తేనేరనన్నకుఁ దిండి మెండు,**
**కూఁటికియ్యని విటగాని కోర్కెమెండు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల** **17**

**తా.** శ్రీవేణుగోపాలా! ఆత్మజ్ఞానము తెలియని యోగికి అద్వైతములు మెండు (అనగా ఇటు చేయకూడదు – అటు చేయకూడదు – అని ఎన్నియో నియమనిష్ఠ లాచరింపవలయునని వేధించుట, తానాచరించుట. పచ్చి వ్యభిచారిణికి నిష్ఠ చాల ఎక్కువ. పాలీయని బఱ్ఱెకు అఱపులధికము. కల్ల బంగారమునకు కాంతి యధికము. రణములందు విజయము సాధింపలేని రాజునకు గొప్పలు చెప్పుకొనుట ఎక్కువ. గొఱ్ఱాలికి భర్తపై (రతిపై) కోరిక అధికము. మోసగాని పాటకు తలత్రిప్పుట హెచ్చుగా నుండును. "గనేరియా" (పచ్చసెగ) అను సుఖరోగమున్న లంజెకు శరీరము మిసమిసలాడుట ఎక్కువ. వండలేనమ్మకు వగపులు (ఏడ్పులు) ఎక్కువ. భార్యతో రతిక్రీడాసుఖం బాగా అనుభవిస్తాడు కాని సంపాదించి తేలేడు – అటువంటి వానికి తిండి ఎక్కువ. వేశ్యకు కనీసము కూటికైనను ధనమునీయని విటునకు కామము ఎక్కువ.

ఈ పద్యము క్రింది తేటగీతిలో రెండవ పాదములో తొలి సూర్యగణము లోపించి చుక్కలతో చూపబడినది. ఇచ్చట కవి ఒక గురువు ఒక లఘువుతో కూర్చిన "రతిక్రీడ సలిపి" అను అర్థము నిచ్చెడి అచ్చతెలుగు బూతు పదమును ప్రయోగించినాడు, అటులే 'కూటికీయని విటగాని పోటు మెండు' – అని మొదటి పాఠము.

**సం.వ్యా.** "ఆత్మ తెలియని యోగికి"= "ఆత్మగానని యోగికి" (శతకమంజరి); "అఱపులు మెండు" = "ఈఁతలు మెండు" (శతకమంజరి), "అదుపుమెండు (అకాడెమీ ప్రతి); "పలుగెల్పులును" = "పలుగచ్చులును" (శతకమంజరి మరియు అకాడెమీ ప్రతి. ఇదియే సరియైన పాఠము. గచ్చులు = బీరములు); "విభునిపై వాంఛ" = "భర్తపై వలఁపు" (శతకమంజరి); "పసిమిరోగపు తొత్తు మిసిమి మెండు" = "రోగపుఁదొత్తు మెఱుంగు మెండు" (శతకమంజరి); "వండలేనక్కకు" = "వండలేనమ్మకు" (శతకమంజరి); అకాడెమీ ప్రతిలో పై తేటగీతిలోని 1,2, పాదములు కలిపి, సీసపద్యములోని 5వ పాదముగా చూపబడినవి:– "వండలేనక్కకు వగపులు బలుమెండు, తేలేని యన్నకుఁ దిండిమెండు". తేటగీతిలో శతకమంజరిలో "మాచకమ్మకు మనసున మరులు మెండు" అను పాదము అదనముగానున్నది. ఇదే పాదము అకాడెమీ ప్రతిలో కొంచెము మార్పుతో –

"మాచమ్మకు మోహంబు మదిని మెండు" అని యున్నది. ఇది మేము అనుసరించిన శ్రీరంగాచార్య ప్రతిలో లేదు.

**సీ॥ ఆలిని వంచుకోఁజాలక తగవర్ల**
**బ్రతిమాలుకొనువాని బ్రతుకు రోఁత,**
**నర్తనాంగనల వెన్నునఁ జేరి తాళముల్**
**వాయించువాని జీవనము రోఁత,**
**వ్యభిచరించెడి వారవనిత గర్భంబునఁ**
**బురుషత్వము వహించి పుట్ట రోఁత,**
**బంధుకోటికి సరిపడని దుర్వృత్తినిఁ**
**బడియున్న మనుజుని నడత రోఁత,**
**తే॥గీ॥ అరసికుండైన నరపతి ననుసరించి**
**కృతులొనర్చెడు కవి నెత్తిగీఁత రోఁత;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 18**

**తా.** మదించిన శత్రువులను సంహరించువాడా! మౌనుల హృదయములందుండు వాడా! భక్తరక్షణశీలా! ఓ వేణుగోపాలా!

మగవాడు తన భార్యను అదుపులో ఉంచుకొనవలెను. అలా అదుపులో ఉంచుకొనలేక, తన భార్యకు తగురీతి నీతులుపదేశింపుడని మధ్యవర్తుల నాశ్రయించినవాని బ్రతుకు అసహ్యము. నట్టువరాండ్రు రంగస్థలమున నాట్య ప్రదర్శనమాచరించుచుండ వారి వెనుక చేరి తాళములు గొట్టువాని జీవితము రోత. సదా పరపురుషులతో వ్యభిచరించు వేశ్యాస్త్రీకి మగపిల్లవాడై పుట్టుట రోత. వేశ్యాస్త్రీకి కుమార్తెగా జనించినచో ఆమె కూడ అదే వృత్తిలో జీవించును. కాని మగపిల్లవాడు జనించినచో వాడు తల్లి ప్రవర్తనమాన్పలేక, ఇంటికి వచ్చెడి విటులను జూచి, సహింపలేక, బయటప సమాజమునుండి వచ్చుహేళనలను సైరింపలేక, చావను లేక బ్రతుకను లేక వ్యథచెందునని భావము. బంధుసమూహము అసహ్యించుకొను చెడ్డవృత్తిలో (చేటుదు) సంచరించు మానవుని వర్తనము

పరమాసహ్యాము. రసికుడుకాని రాజును ఆశ్రయించి, కావ్యములు చెప్పు కవిమోమున బ్రహ్మవ్రాసిన గీత రోత.

"ఆలిని యొంచుకోజాలని" అని యిప్పటి పాఠము. "వంచుకోజాలని" ప్రాంత పాఠము. "ఒంచుకొను – వంచుకొను" రెండును సమానార్థకములే గాని 'వంచుకొను' నకు ప్రథమరూపము 'ఒంచుకొను'.

"నర్తనాంగనల వెన్నునఁ జేరితాళముల్" అన్న పాదమున యతి తప్పినది. కనుక, "నర్తనాంగనల వెన్కన జేరి" అని గాని "నర్తనాంగనల వెంటను జేరి" అనిగాని ఉన్నచో ఆదోషము పరిహరింపబడును.

**సం.వ్యా.** పై పద్యములోని రెండు చిన్న పదములు శతకమంజరిలోను, అకాడెమీ ప్రతిలోను కొంచెము భిన్నముగానున్నవి. "వెన్నున" = "వెన్కను"; "అనుసరించి" = "ఆశ్రయించి" (ఇవియే సరియగు పాఠములు).

**సీ॥ ఆస్థానమందు విద్వాంసులఁగని లేచి**
**మ్రొక్కవేయని వారమోహినులను**
**దల గొఱిగించి, మెత్తని సున్నమును బూసి,**
**బొగ్గు గందంబున బొట్టమర్చి;**
**చెప్పులు మెడఁగట్టి చింపిచేఁటలఁ గొట్టి,**
**గాడిద పైఁ బెట్టి, కాలమెట్టి;**
**తటుకున గ్రామప్రదక్షిణంబొనరించి,**
**నిల్చినచోట వేనీళ్లు చల్లి;**
**తే॥గీ॥ విప్రదూషకులను వారి వెంట నిచ్చి,**
**సాగనంపింపవలయును శమనపురికి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 19

**తా.** ఓ వేణుగోపాలా! ఆస్థాన పండితులను, కవులను చూడగనే లేచి ఆస్థాన వారవనితలు వారికి వందనము లాచరించుట ఆచారము. అలా లేచి నమస్కారము చేయని వారస్త్రీలకు ముందు తలలు గొరిగింపవలె. ఆ పైని మెత్తని సున్నమును

పూయవలె. బొగ్గు గంధము తీసి దానిని బొట్టుగా పెట్టవలె. చెప్పుల దండలను వారి మెడలలో వేసి, చిరిగిపోయిన చేటలతో కొట్టవలె. తదుపరి కాళ్ళతో తన్ని, గాడిదలపై నెక్కించి వెంటనే ఊరు చుట్టును త్రిప్పవలెను. ఆ గాడిదలు నిలిచిన చోట వెంటనే నీరు చల్లవలయును. బ్రాహ్మణనిందకులను వారివెంట నిచ్చి యమపురమునకు వారిని సాగనంపవలయునట. (శమనపురి=యమలోకము).

"ఆస్థానమందు విద్వాంసులcగని లేచి" అను ఈ పద్యము తొలిపాదమున యతి తప్పినది. 'ఆ' కును 'ద్వా' కును యతి చెల్లదు. 'ఆస్థాన విద్వాంసు లరుదేరc గని లేచి' అని యుండవలయును.

'మ్రొక్కువేయని' అని యీ ప్రతిపాఠము, పాత ప్రతులలో 'మ్రొక్కనేరని వారమోహినులను' అనునదే సరియగు పాఠమని నా తలంపు.

'నిల్చిన చోట వే నీళ్లు చల్లి' అనునది పూర్వప్రతులలో 'నిలుచుచోటc బసుపు నీళ్లు చల్లి' అని అని యున్నది. ఇదియే సరియగు పాఠము. మనమేదైనను శుద్ధి చేయదలచినచో పసుపునీరు చల్లు ఆచారము నేటికిని యున్నది.

'వారమోహిను'లనగా వేశ్యాస్త్రీలు. వారు నిత్యసువాసినులు. వారికి భర్త ఉండదు గనుక వైధవ్యముండదు. విధవాస్త్రీలు పూర్వము నలుపు తిలకమును దాల్చువారు. అది వారి విధవాత్వమునకు చిహ్నము. కనుక బొగ్గుబొట్టు పెట్టి వారిని విధవలుగా మార్చవలయునని కవి ఆశయము.

అట్టి వేశ్యాస్త్రీలతోపాటు బ్రాహ్మణ నిందకులను కూడ యమపురికి పంపుట కవి ఆశయము.

**సం.వ్యా.** "విద్వాంసులcగని" = "విద్యావంతులకు" (శతకమంజరి) "వేనీళ్ళ" = "పేణ్ణీళ్ళ" (శతకమంజరి మరియు అకాడెమీప్రతి. పేడ+నీళ్ళ=పేణ్ణీళ్ళ); "వారి వెంట నిచ్చి" = "దాని వెంటనిచ్చి" (శతకమంజరి), "శతకవాఙ్మయ సర్వస్వము"లోని పాఠములు: "మ్రొక్కువేయని" = మ్రొక్కు బూనని"; "నిల్చిన చోట వేనీళ్ళ చల్లి"="నిల్చినచోట పేణ్ణీళ్ళ చల్లి"; "శమనపురికి" = "శునకుపురికి" (శతకమంజరి–కాని యిచ్చట యతిభంగము); "శమనుపురికి" (శతకవాఙ్మయ సర్వస్వము). "శమనపురికి – శమనుపురికి" రెండును సాధురూపములే!

**సీ॥ పెట్టనేరని రండ పెక్కు నీతులఁ బెద్ద,**
**గొడ్రాలిముండకుఁ గొంకు పెద్ద;**
**మంకుబుద్ధికిఁ దన మాట సాగుట పెద్ద,**
**రిక్తుని మదిని కోరికలు పెద్ద;**
**అల్పవిద్వాంసుండు నాక్షేపణకుఁ బెద్ద,**
**మూర్ఖచిత్తుఁడు కోపమునకుఁ బెద్ద;**
**గ్రుడ్డిగుఱ్ఱము తట్టగుగ్గిళ్లు దినఁ బెద్ద,**
**వెలయ నాఁబోతు కండలును బెద్ద;**
**తే॥గీ॥ మధ్యవైష్ణవునకును, నామములు పెద్ద,**
**పెట్టనేరని విభుఁడు కోపింపఁ బెద్ద;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 20**

**తా.** ఓ వేణుగోపాలా! దానం చేయలేని రండ అనేకమైన నీతులు చెప్పటానికి పెద్ద. బిడ్డలులేని గొడ్రాలి ముండకు సిగ్గు ఎక్కువ. పెంకి బుద్ధిగలవానికి తన మాట చెల్లించుకొనుటయే పెద్ద. ధనహీనుని మనస్సులో కోరికలు పెద్ద. తెలిసీ తెలియని విద్వాంసుడు పరవిద్వాంసులను విమర్శించుటకు పెద్ద. మూర్ఖమైన మనస్సు కలవాడు కోపానికి పెద్ద. గ్రుడ్డిగుఱ్ఱము స్వారీచేయుటకు, బండి లాగుటకు పనికిరాదుగాని, ఒకతట్టెడు గుగ్గిళ్లు తినుటకు పెద్ద. ఆబోతుకు కండలు పెద్ద. పూర్వ ప్రతులలో "వెలయ నాఁ బోతు వట్టలును పెద్ద" అని పాఠాంతరము. మధ్యలో వైష్ణవమతమును స్వీకరించినవాడు పెట్టుకొనే నామములు పెద్ద. "పెట్టనేరని విభుఁడు కోపింపఁబెద్ద" (దానము చేయలేని రాజు కోపించుటకు పెద్ద). (ఈ పాదము 2013 ప్రతిలో లేదు. సి.వి. కృష్ణా బుక్ డిపో, చెన్నపట్టణమువారు వేసిన శతకమునుండి ఈ పాదము స్వీకరింపబడినది. ఇందు ముద్రణవత్సరము లేదు.)

**సం.వ్యా.** "కొంకుపెద్ద" = "గొంతుపెద్ద" (శతకమంజరి, అకాడెమీప్రతి); "మంకు

బుద్ధికిఁ దనమాట సాగుట పెద్ద" అనుపాదమునకు బదులుగా శతకమంజరిలో "డబ్బురాని వకీలు డంబంబు కడుఁబెద్ద" అని పూర్తిగా భిన్నమైన వేరొక పాదమున్నది. "ఆఁబోతు కండలును బెద్ద" = "కండలను" (శతకమంజరి, అకాడెమీప్రతి); "పెట్టనేరని విభుఁడు కోపింపబెద్ద" అను పాదమునకు బదులుగా శతకమంజరిలో "కాసునియ్యని విటకాని గాసిపెద్ద" అని పూర్తిగా భిన్నమైన పాదమున్నది. శతకవాఙ్మయ సర్వస్వములో "తొడపల్చనగు నింతి నడిగండి బలుపెద్ద" అను సీసపద్యపాదములోని మొదటిదళము ఉదాహరింపబడినది. ఇది పై పద్యములోనిదే! కాని ఏ దళమునకు మూలమైనదో తెలియుట లేదు.

**సీ॥ ఈడిగె ముత్తికి జోడుశాలువ లిస్తిఁ,**
**గురుబ గంగికి జరీకోక లిస్తిఁ;**
**గడియాలు గోసంగి కనకంకుఁదీసిస్తిఁ,**
**బోఁగులు కోణంగి పోలి కిస్తిఁ;**
**బోఁచీలు చాకలి పుల్లి చేతుల వేస్తి,**
**దాని తల్లికి నూఱు దారఁబోస్తి;**
**దాసరచ్చికి దేవతార్చన లమ్మిస్తి,**
**గుఱ్ఱాన్ని యుప్పర కొండి కిస్తి;**
**తే॥గీ॥ ననుచుఁ బాత్రమపాత్రములనక యిచ్చి,**
**చెప్పుకొందుఱు మూఢులు సిగ్గుమాలి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 21**

**తా.** సమాజమున కొన్ని తప్పుడు పనులను చేసినను, వానిని బైటకు చెప్పరు. అందు పరస్త్రీగమన మొకటి. పరస్త్రీలను పొందుటకు వారికి లంచమిచ్చుట సహజము. ఓ వేణుగోపాలా! ఈడిగకులమునకు చెందిన "ముత్తి" అనే స్త్రీని కవయుటకు ఆమెకు రెండు శాలువా లిచ్చితిని. కురుబకులానికి చెందిన గంగమ్మ ("గంగ"వ్యవహార నామము) కు జరీకోకలిచ్చితిని. గోసంగికులానికి చెందిన

"కనకమ్మ" అను స్త్రీకి (కాళ్ళకు) కడియాలు కొనియిచ్చితిని. కోణంగి "పోలి"కి చెవిపోగులు చేయించి యిచ్చితిని. మురుగులు చాకలికులమునకు చెందిన "పుల్లి" చేతులకు తొడిగితిని. దాని యమ్మకు నూరురూకలు ధారపోసితిని. (పూర్వము దానమిచ్చునపుడు ఉదక పూర్వకముగా ఇచ్చెడివారు. చేతినుండి ధారగా నీటిని యాచకునిచేతిలో పోయువారు. అందువలన "ధారపోయు" అనునది దానమునకు మారుగా నుపయోగింపబడుచున్నది. అది అర్థవిపరిణామము చెంది ఎవ్వరికైనను వ్యర్థముగనో, అయిష్టముగనో ఇచ్చినచో "వాని మొగమున ధారపోసితి"ననుట వ్యవహారమైనది). దాసరి కులానికి చెందిన అచ్చెమ్మ ("అచ్చి" వ్యవహారనామము)కు నా దేవతార్చనలను విక్రయించి ఆ ధనమిచ్చితిని. ఉప్పర కులమునకు చెందిన "కొండి"కి గుబ్బము నిచ్చితిని-అని మూర్ఖులు ఇవి ఉచితమా? లేక అనుచితమా? అని చింతింపక, పదిమందిలో తామేదో రసికవరులైనట్లు-ఏవో ఘనకార్యము లాచరించినట్లు సిగ్గువిడిచి చెప్పుకొనుచుందురు.

"ఇస్తి (ఇచ్చితిని) - కనకంకు (కనకమునకు)" వంటి ప్రయోగాలు వ్యావహారికములు. మూర్ఖులు మాటాడు విధముగనే పద్యమును కవికూర్చుట విశేషము.

శ్రీనాథుడే యీ వ్యావహారిక ప్రయోగాలు పద్యములలో ప్రవేశపెట్టినవారిలో ఆద్యుడు. ఒక చాటువులో, "వస్తూ చూస్తిమి రోస్తిమిన్ పడమట వ్యాపారులన్ గ్రూరులన్" అని ప్రయోగించెను.

ధూర్జటి "అంతా మిథ్య తలంచిచూచిన" అను పద్యమున వ్యావహారిక పదప్రయోగమాచరించెను.

**సం.వ్యా.** పోఁచీలు = స్త్రీ హస్తాభరణ విశేషము; "కడియాలు గోసంగి కనకంకుఁదీసిస్తి" = కడియాలు కుమ్మర కనికికి దర్శిస్తి" (శతకమంజరి), "కడియాలు కుమ్మక కనకంకుఁ దీసిస్తి" (అకాడెమీప్రతి); "పోఁగులు కోణంగి పోలికిస్తి" = "పోఁగులు గోసంగిపోలికిస్తి" (శతకమంజరి, అకాడెమీప్రతి); "పాత్రమ పాత్రములనక" = "పాత్రమపాత్రముననక" (శతకమంజరి, అకాడెమీ ప్రతి); "సిగ్గుమాలి" = "సిగ్గులేక" (శతకమంజరి, అకాడెమీప్రతి).

**సీ॥ ఈనెగాండ్లంటరో యీండ్ల బగిసారను**
**సెన్నంగి సుద్దులు సెప్పలేరు!**
**ఏదగాండ్లంటరో యీండింట్ల పొగలెల్ల**
**గొర్లాల బిగ్గెర గొనుగుతారు!**
**కయితగాండ్లంటరో కాల్పంగటించుక**
**చిన్నచ్చరము పేరుఁ జెప్పలేరు!**
**వాసివేలంట తమాసగా తొమ్మునఁ**
**దప్పెట యేసుక తట్టలేరు!**
**తే॥గీ॥ అనుచు విప్రోత్తములఁ గన్నయట్టివేళ**
**మోటు మనుజులు సెప్పెడి మాటలిట్లు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 22**

**తా.** ఈ పద్య భావమును స్పష్టముగా చెప్పుట కెన్ని విధాల ఆలోచించినను సాధ్యము కాకున్నది. ఇది ఆనాటి పామరజన వ్యావహారిక భాష. కొంతవఱకు ఊహించి వ్రాయుట తప్ప అన్యమార్గము కనరాదు.

ఓ వేణుగోపాలా! మోటుప్రజలు బ్రాహ్మణోత్తములను జూచి ఈ విధముగా ఒకరితోనొకరు చెప్పుకొనుమాటలివ్వి.

విప్రులలో వీణావాదన నిపుణులుందురు. వారిని గురించి వీణ గాండ్లంటారు. కాని, వారు "సారంగి" అనే వాద్యం మ్రోగుచుండగా శ్రుతిచేసికొని చెన్నంగి సుద్దులు చెప్పలేరు.

"చెన్నంగిసుద్దులు" అనే కథలు చెప్పేవారు ప్రక్క సారంగి అనే వాద్యముతో పల్లెలలో చరించేవారు.

వేదాలను బాగా చదివినవారంట. ఈడిగ మాదిరిగా పగలంతయు బిగ్గఱగా చెప్పలేక గొఱ్ఱెలవలె గొణుగుదురు.

కవిత్వము చెప్పు కవులందరు. కాళ్ళు పంగటించుకొని నడచుచూ, ఒక చిన్న అక్షరము పేరుకూడ చెప్పలేరు.

వాద్య కారులందుఱు. కాని ఊొమ్ముపై తప్పెట నుంచుకొని తమాషాగా తట్టలేరు. ఊొమ్ము తప్పెటలు కొట్టువారు పూర్వముండెడివారు.

ఇవి పండిత ప్రకాండులను చూచి మోటువారు అనుకొనే మాటలు.

**సం.వ్యా.** "యిాండ్ల బగిసారను" = యిాండ్ల బైశారను" (శతకమంజరి), "యిాండ్లను బగిసార" (అకాడెమీప్రతి); "పొగలెల్ల" = "పొగవెల్ల" (అకాడెమీప్రతి); "బిగ్గెర" = "బిగ్గెన" (రెండు ప్రతులలోను); "వాసివేలంట" = "వాసిపేలంట" (శతకమంజరి) ఇదియే సరియైన పాఠము. "వాజపేయాజులంట"కు జానపదోచ్చారణ.); మోటుమనుజులు సెప్పెడి మాటలిట్లు" = "మోటు మానవులనియెడి మాటలిట్లు" (శతకమంజరి), "మోటుమనుజులనియెడి మాటలిట్లు" (అకాడెమీప్రతి)

**సీ॥ ఉండి యియ్యని లోభిరండ కొంపను శ్రాద్ధ**
**మాయెనేమి? శుభంబు లాయెనేమి?**
**చండాలువాకిట వండుకొన్నది యంబ**
**లాయెనే మతిరసాలాయెనేమి?**
**మాచకమ్మ సమర్త మఖ పుబ్బ హస్త చి**
**త్తాయెనేమి? పునర్వసాయెనేమి?**
**కులనాశకుండైన కొడుకు దీర్ఘాయువై**
**యుండెనే మంతట మండెనేమి?**
**తే॥గీ॥ బవరమునఁజొచ్చి పొడువని బంటుచేతి**
**దాయుధంబాయె నేమి? తెడ్డాయె నేమి?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **23**

**తా.** ఓ వేణుగోపాలా! సంపన్నుడైయుండియు యాచకులకు దానము చేయని పిసినిగొట్టునింటిలో శ్రాద్ధమైనను ఒకటే – పెండ్లి మొదలగు శుభకార్యములైనను ఒక్కటే.

(పెండ్లిండ్లు మొదలైన శుభకార్యములలో సంపన్నులు బ్రాహ్మణులను పిల్చి సంభావనలిచ్చువారు. శుభాశుభకార్యములందు పదిమందినీ పిలుచుకొని, మృష్టాన్న

భోజనములు పెట్టు ఆచారమున్నది. వాడసలే పిసినిగొట్టు. వానింట్లో శ్రాద్ధమైనను పెండ్లి యైనను, ఎవ్వరికీ పెట్టడు. దమ్మిడీ యీయడని భావము)

అంటరానివాని యింటి ముందు వాకిటిలో వండుకొన్నది అంబలియైనను, లేదా అరిసెలైనను ఒక్కటే. అనగా, వానియింటి ముందువండిన పదార్థములు, ముట్టరాదనిభావము. అది అంబలికావచ్చు - అరిసెలే కావచ్చు. ఏవైనను అంటరానివే అని భావము.

ఎంతవయస్సు వచ్చినను రజస్వలకాని స్త్రీని "మాచకమ్మ" యందురు. ఆమె నిరుపయోగజీవన. అటువంటి స్త్రీ మఖా-పుబ్బ-చిత్తా- హస్తా నక్షత్రములలో సమర్తాడినను, పునర్వసూ నక్షత్రమున రజస్వలయైనను ఒక్కటియే.

స్త్రీ ప్రథమరజస్వలయైన కాలము (నక్షత్రాదులు) చూచి, అది దోషకాలమైనచో తప్పక దేవాలయములలో శాంతికార్యక్రమ పూజలు నిర్వర్తింతురు. మాచకమ్మ రజస్వల కావటమే చాలు. దానికి కాలము - నక్షత్రాదులు చూడవలసిన పనియేమున్నది? ఆమె సమర్తాడిన చాలునని భావము.

కులమునకు చెడ్డపేరు తీసికొనివచ్చు కొడుకు దీర్ఘాయువుగా జీవించిననేమి? వెంటనే మరణించిననేమి? ఎక్కువ కాలము జీవించినచో కులయశస్సు నెక్కువగా నాశమొనర్చునని భావము.

యుద్ధరంగమున ప్రవేశించి శత్రువులను సంహరింపలేని వీరుని చేతిలోనిది- ఆయుధమైననేమి? అది తెడ్డాయెనేమి? ఆయుధము శత్రువులను పొడుచుట కుపయుక్తము. తెడ్డు వంటవిషయమున పనికివచ్చును. యుద్ధమున శత్రువుల వధించలేని వీరుని చేతిలో ఆయుధమున్నను - అది తెడ్డువంటిదే! అది నిష్ప్రయోజనమని భావము. అట్టి పిఱికివాడు వంటవానిగా పనికివచ్చునని వ్యంగ్యము.

**సం.వ్యా.** పై పద్యములో పాదముల చివర "ఆయనేమి?" అను పదమునకు బదులుగా నాకు లభించిన రెండు ప్రతులలోను "ఐననేమి?" అని కలదు. సీస పద్యము నాల్గవ పాదము రెండవ దళములో "ఉండెనే మంతట మండెనేమి?" అను దానికి బదులుగా రెండు ప్రతులలోను "ఉండిననేమి? లేకున్ననేమి?" అని యున్నది.

**సీ॥ ఎనుబోఁతు వానకుఁ జెనకునా యెంతైన?**
**వెల హెచ్చుగల తేజి వెఱచుఁగాక!**
**గుణహీనుఁడెంతైనఁ గులముకు వెఱచునా?**
**గుణవంతుఁడెప్పుడు వెఱచుఁగాక!**
**గడుసైన పెనుమొద్దు గాలికి వెఱచునా?**
**విరుగఁగాఁచిన మ్రాను వెఱచుఁగాక!**
**అంకుముండ బజారురచ్చకు వెఱచునా?**
**వీరపతివ్రత వెఱచుఁగాక!**
**తే॥గీ॥ మానుషముగల దొరబిడ్డగాని, సుకవి**
**నోటి తిట్లకు వెఱచునా మోటువాఁడు?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 24**

**తా.** ఓ వేణుగోపాలా! దున్నపోతు వానకు కొంచెమైనను జంకునా? జంకదు. ఖరీదైన శ్రేష్ఠమైన గుఱ్ఱము వానకు జడియును. మంచిగుణము లేనివాడు ఏమైనను కులమువారి మాటలకు భయపడునా? (భయపడదు). గుణవంతుడైనవాడు కులమువారి ఆజ్ఞలకు భయపడును. పెద్దదియై గుండ్రముగానున్న పెద్దమొద్దు గాలికి భయపడదు. కాని బాగా విరుగకాచిన వృక్షము గాలికి భయపడును. వ్యభిచరించే కులట బజారులో పోట్లాడుట కొట్లాడుట మొదలగు రచ్చలకు భయపడదు. మహాపతివ్రత బజారునకేరాదు. ఆమె రచ్చలకు ఎంతో భయపడును. పౌరుషముగల దొరకొడుకు సుకవి తిట్టిన తిట్లకు భయపడును. మోటువాడు కవి శాపములకు భయపడదు. ఇది తన శతకమును తీసికొనబోవు రాజు నడ్డగించిన మంత్రిని గురించి చెప్పిన పాదము.

పై పద్యము రెండవపాదమున, "గుణవంతుఁడెప్పుడు వెఱచుఁ గాక" అని ఉన్నది. యతిస్థానము తప్పినది. కావున, "గుణవంతుఁ డెప్పుడుఁ గుందుఁగాక" అన్నచో ఆ దొసంగు తొలగిపోవును.

**సం.వ్యా.** పై సీసములోని రెండవపాదము శతకమంజరిలో పూర్తిగా భిన్నముగా

నిట్లున్నది:-

"జెట్టి మల్లుండు గుంజిళ్ళకు వెఱచునా?
పిన్నబాలుఁడు మతి వెఱచుఁగాక!"

ఎత్తుగీతి మొదటిపాదములోని "మానుషముగల దొరబిడ్డగాని" అనుదానికి బదులుగా రెండు ప్రతులలోను (అనగా శతకమంజరిలోను, అకాడెమీప్రతిలోను) "ఘనతఁగల్గిన దొరబిడ్డగాక" అని యున్నది. శతకవాఙ్మయ సర్వస్వములో "చినిగిన దొండి బల్చెణకుల కళుకునా?/ వెసనూత్నబాలిక వెఱచుఁగాక" అను నొక పాదమున్నది. ఇది పై సీసములోని నాల్గవ పాదమునకు మూలమగు పాదమో, లేక యిది ఐదవపాదముగానున్నదో సరిగా తెలియుటలేదు.

**సీ॥ ఏదంబులకు మంగలెంకఁడే తగునేటు,**
**ప్రశ్నఁజెప్పను మాల పాపిగాఁడు;**
**కయితములెప్ప బోగము సినెంకఁడె సరి,**
**సంగీత యిద్దెకుఁ జాకలెల్లి;**
**శాత్రపురండాల సాయిలనంతమ్మ,**
**చిందులు ద్రొక్క దాసరి పెదక్క;**
**యీణెఁగొట్టను కోమటీరేశమే సరి,**
**మతిరతాలకు మాఱుమనుము లచ్చి;**
**తే॥గీ॥ యనుచు మూర్ఖాళి యీరీతి ననుదినంబు**
**భూతలమునందు వచియింత్రు నీతిలేక;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 25**

**తా.** ఓ వేణుగోపాలా! లోకములో పామర జనులు కొన్ని విశేషములకు కొందరిని గొప్పవారుగా తలంతురు. ఎవడో వచ్చి ఏదో చదివి ఇది వేదమని అంటే నిజమేనని భావింతురు. అది నిజముగా వేదము కాదని పండితులకు తెలియునుగాని, పామరులకు వారు చదివినదే గొప్పగా నుండును గనుక వారిట్లు తలంతురు.

వేదములు చదువవలయునన్న మంగలికులస్థుడైన వెంకడే తగినవాడు. ప్రశ్న చెప్పుటకు మాలకులస్థుడైన పాపిగాడు. (ఇప్పటికిని పల్లెలలో ప్రశ్న అడుగు నాచారమున్నది. ఎవ్వరివో గేదెలు పోయినవనో, ఎవ్వరో ఇంటిలో డబ్బు దొంగిలించిరనియో ప్రశ్నచెప్పువాని దగ్గఱకు పోయెదరు. వాడు ఏవో గవ్వలు గులకరించి వేసి, ఒకటి రెండు ప్రశ్నలు వేసి, తరువాత మీ గేదెలు ఆగ్నేయ దిశగా పోయినవి. మీ డబ్బు మీకు బాగా తెలిసినవాడు మీకు చాల దగ్గఱివాడే తీసెనన్నట్లుగా సమాధానము చెప్పును. వీరంతకు ముందెవ్వడినో అనుమానించి యుందురు. అదిగో సరిపోయిందిరా! అనుకొంటూ తిరిగివత్తురు.)

కవిత్వమును చెప్పుటకు బోగముకులస్థుడైన చిన్నవెంకటడే సమర్థుడు. సంగీత విషయములు, తద్విద్యలో చాకలి ఎల్లి చాల సమర్థురాలు.

శాస్త్రములు పురాణములు చెప్పవలయునన్న సాయిల అనంతమ్మయే శ్రేష్ఠురాలు. చిందుభాగవతులలో చిందు చక్కగా త్రొక్క వలయునన్న దాసరి కులస్థురాలు పెద్దక్క. వీణ వాయించుటకు, కోమటి కులస్థుడగు వీరేశమే నేర్పరి. మతిలోని కోరికలు చెప్పటానికి మాఱుమనుము లచ్చియే సరి. (లేదా రతి = సురతము – మతిరతాలకు = మనస్సులోని కోరికలు తీర్చుటకు మాఱుమనుము లచ్చియే సరి. అనగా చేటిగా స్త్రీపురుషులను జేర్చుటకనియైనను కావచ్చును) మూర్ఖులైన పామరజనులు ప్రతిదినము, నీతిలేక ఈ రీతిగా చెప్పుకొనుచుందురు.

ఈ పద్యము పూర్తిగా వ్యావహారిక పదసంయుతమైనది. మంగలి + వెంకడు. లోకములో 'వెంకన్న' అను పేరున్నచో వాడు సామాన్యుడైనచో ప్రజలు 'వెంకడు' అందురు. పామరులాతనిని 'ఎంకడు' అని అజాదిగా ఉచ్చరింతురు. దానినే సంధికి కవితీసికొనినాడు. మంగలి + ఎంకడు = ఏమ్యాదుల ఇత్తునకు సంధి వైకల్పికముగాన ఈ పదాలను ఏమ్యాదులలో చేర్చవలెను. "మంగలియెంకడు"; "మంగలెంకడు" అని రూపము లేర్పడును. ప్రజావ్యవహారమున 'మంగలెంకడు' అనియే యందురుగాన ఆ రూపమునే కవి ప్రయోగించినాడు.

అట్లే చిన + ఎంకడు = చినెంకడు – చాకలి + ఎల్లి, కోమటి + వీరేశము = వీరేశమును సామాన్యులు. 'ఈరేశము"గా నుచ్చరింతురు గాన నట్లే స్వీకరించినాడు.

**సం.వ్యా.** "తగునేటు" = "బగునేటు" (శతకమంజరి); "సాయిలనంతమ్మ" = "సాతాననంతమ్మ" (రెండు ప్రతులలోను. ఇదియే సాధుపాఠము); "దాసరి పెదక్క" = "దాసిరి పెదక్కి" (శతకమంజరి); "వచియింత్రు" = "వచింపరే" (శతకమంజరి).

**సీ॥ ఒంటి జందెము, ద్వాశశోర్ధ్వపుండ్రంబులు,**
**నమరిన పసుపు కృష్ణాజినంబు;**
**దండంబు, గోఁచి, కమండలు, వక్షమా**
**లిక, పుస్తకంబు, పాదుకలు, గొడుగు;**
**దర్భమౌంజీ, పవిత్రము, గోముఖము కొన,**
**చెవిలోనఁ దగు తులసీదళంబు;**
**వేదమంత్రములు, వినోదమౌ నపరంజి**
**పడగ కుండలములు, పంచశిఖల-**
**తే॥గీ॥ తో నరుగుదెంచి, బలిని భూదానమడిగి,**
**తెచ్చి యిచ్చితి సురపతి కిచ్చతోడ;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 26**

**తా.** ఈ పద్యమునందు బలిచక్రవర్తిని మూడడుగులు దానమడిగిన వామనుని స్వరూపమును వర్ణించుచున్నాడు. (వామనావతార వర్ణన).

బ్రహ్మచారికి ఒక్కటే జందెము. కనుక ఒంటి జందెముతో; వైష్ణవులు తమ శరీరములయందు పదిరెండు చోట్ల నామములను ధరింతురు. వానినే ద్వాదశోర్ధ్వ పుండ్రము లందురు. నిలువుగా పెట్టిన బొట్టు కావున ఊర్ధ్వపుండ్రము. శైవులు అడ్డముగా నామములు ధరింతురు. వానిని తిర్యక్పుండ్రములందురు. ఈయన విష్ణ్వవతారము గనుక ఊర్ధ్వ పుండ్రములను ధరించి, పసుపు పచ్చని లేడిచర్మమును దాల్చి, పలాశదండమును పట్టుకొని, గోచిగుడ్డను ధరించి, చేతులలో కమండలువును – అక్షమాలయు – పుస్తకమును ధరించి, కాళ్ళకు పావుకోళ్ళు వేసికొని, దర్భలతో చేసిన మొలత్రాడు కట్టుకొని, చేతివ్రేళ్ళ యందు పవిత్రమును ధరించి, జపమాలతో

చేతిని లోపల దూర్చి జపము చేసికొను సంచి చివరను పట్టుకొని (ఈ సంచి గోముఖ ఆకారములో నుండును. అందువల్ల దీనికి "గోముఖము" అని పేరు). గొడుగును వేసికొని, చెవుల సందులందు తులసీదళములు పెట్టుకొని, వేద మంత్రములతో వినోదింపజేయుచు, బంగారు పడగ గల కుండలములు (పోగులు) చెవులకు వ్రేలాడ, తలపైని పంచశిఖలను ధరించి, యజ్ఞవాటికకు వచ్చి, బలిచక్రవర్తిని మూడడుగులు దానమడిగి దేవేంద్రునకు తెచ్చియిచ్చితివి కదా!

ఇక్కడ సురపతికి ఏమి తెచ్చియిచ్చెను? అది పద్యమున స్పష్టముగాలేదు. బలిచక్రవర్తిచే పోగొట్టుకొన్న స్వర్గాధిపత్యమును తెచ్చియిచ్చితివి కదా! అని యుండవలయును. అది కవి చెప్పకుండుట ప్రమాదము.

**సం.వ్యా.** సీసపద్యములో మూడవ పాదము మొదటిదళము: "దర్భమౌంజీ పవిత్రము గోముఖముకొన" శతకమంజరిలో యథాతథముగానున్నది. కాని అకాడెమీ ప్రతిలో "దర్భమౌంజీపవిత్రములు, కటి కరాన" అని యున్నది. ఎత్తుగీతిలో రెండవ పాదము: "తెచ్చియిచ్చితి సురపతికిచ్చతోడ" అనునది రెండు ప్రతులలోను తెచ్చి "సురపతికిచ్చితి విచ్చతోడ" అని యున్నది.

**సీ॥ కనుముక్కు తీరుఁ, జక్కని కాంతిఁ బొందిన**
**శుభలక్షణంబును, సూక్ష్మబుద్ధి;**
**ఘనత, వివేక విక్రమము, బాంధవ్య వి**
**మర్శ, విలాసంబు, మానుషంబు;**
**సరసవాచాలత, సాహసం, బొకవేళ**
**విద్యావిచక్షణ, విప్రపూజ;**
**వితరణగుణము, భూపతియందు భయభక్తి**
**నీతియు, సర్వంబు నేర్చునోర్పు;**
**స్నానసంధ్యాద్యనుష్ఠాన సంపన్నత,**
**గాంభీర్యముఁ, బరోపకారచింత;**
**తే॥గీ॥ యిట్టి మంత్రినిఁ జేర్చుకొన్నట్టి దొరకుఁ**
**గీర్తి, సౌఖ్యంబు, సకల దిగ్విజయము, సిరి**

**కలిగియుండును, దోషము ల్దొలఁగిపోవు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **27**

**తా.** రాజులు ఎటువంటి లక్షణములుగలవానిని మంత్రిని చేసికొనవలయునో, అటువంటి మంత్రిలక్షణముల నీ పద్యమున కవి సూచించుచున్నాడు.

కన్నుతీరు–ముక్కుతీరు చక్కగా నుండవలెను. చక్కని కాంతి కలిగి అన్నియు శుభమైన సాముద్రిక లక్షణములను మంత్రి కలిగియుండవలెను. అనగా మంత్రి మంచి స్ఫురద్రూపి కావలయును. చూడగనే ప్రజలకాయనయందు గౌరవము కలుగవలయునన్న స్ఫురద్రూపమావశ్యకము.

మంత్రి చాల సూక్ష్మబుద్ధి కలిగియుండవలయును. గొప్పతనము, మంచిచెడులను వేర్పరచి చెప్పగల వివేకము (తెలివి), శౌర్యము (అవసరమగుచో రణరంగమును ప్రవేశించి, యుద్ధముచేయగల పరాక్రమము), చక్కని బంధుత్వము, మంచి చెడులను విమర్శించి చూపగల నైపుణ్యమును, విలాసముగా నుండుటయు, (విలాసమునగా ప్రత్యేకమైన గుర్తింపు అని భావము), ఆత్మాభిమానము, మానవత్వము, సరసముగా మాటాడగల వాచాలత్వమును, సాహసమును (తెగింపు), విద్యావిచక్షణ (అనగా ఈ పండితునిలో ఏమాత్రము శక్తియున్నది అని తెలిసికొనగలిగిన సమర్థత), బ్రాహ్మణులను పూజించుట, దానగుణము, తన రాజునందు భయభక్తులు, నీతిభరితచరిత్రమును, సకలవిద్యలను నేర్చుకొనుటయందు ఓర్పును, స్నానము, సంధ్యావందనము మొదలైన అనుష్ఠానములును, గంభీరతయు, ఎల్లప్పుడును ఇతరులకు ఉపకారము చేయవలయునను ఆలోచనయు – ఇట్టి గుణములు కలిగిన మంత్రిని చేర్చుకొనిన యట్టి దొరకు (రాజునకు) లోకమున కీర్తియు, సౌఖ్యమును దిక్కులను జయించు ప్రజ్ఞయు, సంపదలును, తప్పక కలుగును. ఏవైనను దోసములున్నచో నవి తొలగిపోవును.

ఈ పద్యములో సీసపాదములను పంచపాదిగా, తేటగీతిని కూడ పంచపాదిగా రచించుట గమనింపదగును. సీసమునకు 4 పాదములు, తేటగీతికి 4 పాదములు

ఉండును. కాని వీనిని సమముగా పంచపాదులుగా రచించెను. చెప్పవలసిన భావము ఎక్కువగా నుండుటచే నిట్లు చేసియుండును.

తన గ్రంథమును రాజు స్వీకరింపకుండ మంత్రి అడ్డుపడినాడని, కవి యీ శతకమును, బూతులతో కూడ వ్రాసెనని విమర్శకాగ్రేసురుల భావన. తన రాజుకడ గల మంత్రి కీ లక్షణములు లేవని వ్యంగ్యపూర్వకాధిక్షేపణ మిది.

**సం.వ్యా.** ఎత్తుగీతిలోని మొదటిపాదము, మూడవపాదము శతకమంజరిలో కొంచెము భిన్నముగా నున్నవి; "ఇట్టి మంత్రినిఁజేర్చుకొన్నట్టి దొరకు" = "కలుగు మంత్రిని జేర్చుకోఁగలుగు దొరకు"; "కలిగియుండును దోషముల్దొలగిపోవు" = "కలుగుచుండును దోషముల్దొలగుచుండు". అకాడెమీప్రతిలోకూడ "ఇట్టి మంత్రిని"కి బదులుగా "కలుగుమంత్రిని" అనియు, "కలిగియుండును"కు బదులుగా "కలుగుచుండును" అనియు నున్నది – శతకవాఙ్మయ సర్వస్వములో – "వితరణగుణము భూపతియందు భయభక్తి" = "వితరణ, మేలు భూపతియందు భయభక్తి" (వితరణము + ఏలు భూపతియందు).

**సీ॥ కన్నెనిచ్చినవానిఁ, గబ్బమిచ్చినవాని,**
**సొంపుగా నింపుగాఁ జూడవలయు;**
**నన్నమిచ్చినవాని, నాదరించినవాని,**
**దాతగాఁ దండ్రిగాఁ దలఁపవలయు;**
**విద్య నేర్పినవాని వెఱపుఁ దీర్చినవాని**
**గురునిగా హరునిగా నెఱుఁగవలయుఁ;**
**గొల్వుఁ గాచినవానిఁ, గూర్మిఁ జూపినవాని**
**సుతునిగా హితునిగాఁ జూడవలయు;**
**తే॥గీ॥ నిట్టివారలపైఁ బ్రేమఁ బెట్టుకొనక**
**కసరు వెట్టిన మనుజుఁడు గనఁడు కీర్తి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 28**

**తా.** వేణుగోపాలా! కన్యనిచ్చి కల్యాణము చేసిన మామను, కావ్యకన్యను కృతి ఇచ్చిన కవిని ఇష్టముతో – సమృద్ధిగా నిచ్చి గౌరవింపవలయును. కన్యనిచ్చిన మామను ఇష్టముతో గౌరవించవలెను. కావ్యకన్యనిచ్చిన మామయగు కవికి సమృద్ధిగా ఇచ్చి గౌరవింపవలెను. ఇది క్రమాలంకారము. అన్ని పాదములను అట్లే అన్వయించుకొనదగును. అన్నము పెట్టిన వానిని, దగ్గఱకు తీసి ఆదరించిన వానిని, దాతగా – తండ్రిగా భావింపవలయును. విద్యనేర్పిన గురువును – భయము తీర్చిన వానిని, గురువుగా, భగవంతుడైన శివునిగా తలపవలయును. కొలువు కూటమును రక్షించినవానిని, లేదా ఉద్యోగమును కాపాడువానిని – ప్రేమను ప్రదర్శించినవానిని కుమారునిగా, మేలుకోరెడు స్నేహితునిగా భావింపవలయును, ఇటువంటివారియందు ప్రేమను నిలుపుకొనక, వారిని బాధపెట్టిన మనుష్యుడు కీర్తిని పొందదు.

**సీ॥ కలకొద్దిలోపల కడఁదెచ్చి మన్నించి**
**యిచ్చినవాని దీవించవలయు;**
**సిరిచేత మత్తుఁడై పరువెఱుంగని లోభి**
**దేబెను ఫెళ్ళునఁ దిట్టవలయుఁ;**
**దిట్టినయప్పుడే తెలిసి ఖేదమునొంది**
**యింద్రుఁడైనను బిచ్చమెత్తవలయు;**
**దీవించినను జాల దీర్ఘాయువును బొంది**
**పేదైన నందలం బెక్కవలయు;**
**తే॥గీ॥ నట్టియాతఁడు సుకవి, కానట్టి యతనిఁ**
**గవి యనఁగ నేల? కవి మాలకాకి గాఁడె?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 29**

తా. ఓ వేణుగోపాలా! ఆతడు కొద్ది సంపద కలవాడు. ఆ ఉన్నంతలో ఎవరినైన అప్పుగా నడిగి తెచ్చి యాచకుల కిచ్చు దాతను దీవింపవలెను. సంపదచేత

మదమత్తుడై వచ్చినవానియందు గౌరవమును గాని, తన గౌరవమును గాని భావింపక చరించు పిసినారివానిని ఫెళ్లున తిట్టవలెను. అనగా శపింపవలయును. తిట్టిన వెంటనే (శపించిన వెంటనే) ఆతడు ఇంద్రసమానుడైనను దుఃఖముతో బిచ్చమెత్తుకొను బిచ్చగాడు కావలెను. దీవించినపుడు, దీవనలు పొందినవాడు ఆ దీవనల శక్తిచేత దీర్ఘాయువును పొందవలయును. వాడు బీదవాడైనను పల్లకీలపై నెక్కి తిరుగునంతటి ధనవంతుడు కావలయును. అటువంటి శాపానుగ్రహ సమర్థుడైనవానినే సుకవి అని పిలువవలయును. అంతటిశక్తి లేనివానిని కవి యనవలెనా? అనరాదు. "కవి"యను శబ్దమునకు "మాలకాకి" యను నర్థముకూడ కలదు కదా! వశ్యవాక్కు కాని కవిని మాలకాకి వంటివాడనవలయును. అనగా కవి తపశ్శక్తి కలిగి, శాపానుగ్రహసమర్థుడు కావలెనని, యీ కవి ఆశయము.

ఈ పద్యమున మొదటి పాదము రెండవ భాగమున "ఇచ్చిన వాని దీవింపవలయును" ననియున్నది. 'ఇ' కి – దీవించులోని ఇంచుకాగమ 'ఇ' కారమునకు యతిచెల్లదని మన లాక్షణికుల మతము. పూర్వకవులెవ్వరును ప్రయోగించలేదు. ఆధునిక కవులు యథేచ్ఛగా వాడుచున్నారు.

చివరి పాదము రెండవ భాగమున 'పేద+ఐన=పేదైన' అని ప్రయోగింప బడినది. అత్తునకు సంధి బహుళమైనను, ఇక్కడ నిత్య సంధి సముచితము కాదు. "పేదయైన" అనియుండిననే సమర్థార్థదాయికాగలదు.

పైగా 'పేదైన' అన్న పదములోని 'పే' కును, "అందలంబు + ఎక్కవలయు = అందలంబెక్కవలయు" లోని 'బె'కు యతి చెల్లించుట జరిగినది. (అఖండయతి). ఇది చెల్లదు. అందలంబు + ఎక్కు = "బెక్కు" శబ్దము కాదు. అది అజాదియగు 'ఎక్కు'. అచ్చు 'ఎ' కును, 'పే'కును యతి చెల్లదు. కొందరాధునికులు ఇది 'అఖండయతి'గా పేర్కొనిరి గాని, ఇచట స్పష్టముగా 'ఎక్కు' పదము కన్పించుటచే ఇది దుష్టము. ఈ పాదము సవరింపవలెనన్న "దీవించినను జాలదీర్ఘాయువునఁ బేదయైన నందలమెక్కి యలరవలయు" అని సవరించిన దొసగు తొలగును.

దానగుణము కలవాడు లేనివాడైనను, తనకున్నదానిలో కొంత అర్థులకిచ్చు ననియు, ఎంత సంపన్నుడైనను, లోభగుణమున్నవాడు ఇతరులకీయలేడను మానవ మనస్తత్వమును వివరించినాడు కవి.

**సం.వ్యా.** "కడఁదెచ్చి మన్నించి" = "కరుణతో మన్నించి" (శతకమంజరి); "పరువెఱుంగని లోభి" = "పరునెఱుంగని లోభి" (అకాడెమీప్రతి, ఇదియే సాధుపాఠము); "పేదైన" = "బీదైన" (అకాడెమీప్రతి), "బీదేని" (శతకమంజరి); శతకవాఙ్మయ సర్వస్వములో కొన్ని పాఠములు భిన్నముగా నున్నవి: "కలకొద్దిలోపల కడఁదెచ్చి మన్నించి" = "కలకొద్దిలో వరములుదెల్పి మన్నించి"; "దీవించినను" = దీవించెనా"; "కానట్టి యాతని" = "లేనట్టి యతని".

కవి అను శబ్దమునకు "మాలకాకి" అని అర్థము కూడ కలదని చెప్పెడి తెనాలి రామకృష్ణుని ప్రసిద్ధమైన చాటుపద్యమొకటి కలదు:–

**క. "కవి యల్లసాని పెద్దన**
**కవి తిక్కన సోమయాజి గణుతింపంగాఁ**
**గవి నేను రామకృష్ణుఁడఁ**
**గవియను నామంబు నీరుకాకికి లేదే?"**

ఇచ్చట "నీరుకాకి" అనగా "మాలకాకి" (జలపక్షి)

**సీ॥ కొండెసిగల్, తలగుడ్డలుఁ, బాకోళ్లు,**
**చలువ వస్త్రములు, బొజ్జలుఁ, గటార్లుఁ;**
**గాసెకోఁకలు, గంపెడేసి జందెములును,**
**తలవార్లు, జలతారు డాలువార్లు;**
**సన్నపుఁ దిరుచూర్ణ చిన్నెలు, కట్నాలుఁ,**
**జొల్లు వీడెంబులు, వల్లెవాట్లు;**
**దాడీలు, వెదురాకు తరహా సొగసుకొర్లు,**
**నంతకు దొరగార్లటంచుఁ బేర్లు;**
**తే॥గీ॥ సమరమునఁ జొచ్చి, ఱొమ్ము గాయముల కోర్చి,**
**శాత్రవులఁ ద్రుంచనేరని క్షత్రియులకు**
**నేలఁ? గాల్పనె? యీ వట్టి యెమ్మెలెల్ల?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **30**

**తా.** తలపై ముందరి భాగములో వెంద్రుకల ముడులు – తలపాగలు – కాళ్లకు అందమైన పావుకోళ్లు – చలువ జేసిన తెల్లని వస్త్రములు – పెంచుకొన్న పెద్ద బొజ్జలు, ఆ బొజ్జలపై వస్త్రములందు చెక్కిన పిడిబాకులు – కాసెవోసి కట్టిన పెద్దవస్త్రములును (దట్టీలు అందురు. యుద్ధమునకు పోవునపుడు – కాసెమీద కాసె– కోకమీద కోక హనుమంతుకోక కడతారట. ఈ విషయము పలనాటియుద్ధ ద్విపద కావ్యమున గలదు) – గుప్పెడు లావు గలిగిన తెల్లని జందెములును – తలచుట్టును అలంకారముగా చుట్టిన వస్త్రములును, జలతారుతో నేసిన యెఱ్ఱనైన తలచుట్టును చుట్టుకొను జాలరులును – సన్నని తిరుచూర్ణ తిలకమును మోమున పెట్టుటయు – చొల్లుకారెడు తాంబూల సేవనమును – పెద్దవల్లెవాట్లు–గడ్డములును – వెదురు ఆకులవలె పొడవైన ప్రకాశించు శూలములును – "దొరగారు" అని అందఱు పిలుచుచుండ వర్తించువారు నిజముగా క్షత్రియులా? కాదు. ఎవరు క్షత్రియులు? యుద్ధరంగమును ప్రవేశించి, శత్రుఘాతములచే తొమ్ముగాయపడినను లెక్కసేయక, శత్రువులను చంపగలిగినవారే క్షత్రియులు. అలా చేయలేక వేషములు వేసి యీ సంస్థానములను పాలించు పాలకులకు, ఈ విధమైన వైభవమేల? ఈ పటాటోపమేల? ఈ వేషములేల?

ఆనాడు యుద్ధములు చేయలేక, ఆస్థానపతులుగా ఉండి, మహావీరుల వేషములతో నుండు వారిని కవి హేళన చేయుచున్నాడు.

2వ పాదము 2వ భాగమున "తలవార్లు జలతారు డాలువార్లు" అని ప్రాసయతి చెల్లింపబడినదిగాని హ్రస్వముపై 'ల'కారమునకు దీర్ఘముపై 'ల'కారమునకు ప్రాసయతి చెల్లదు.

ఇందు, "తలవార్లు–కొర్లు" – మొదలగునవి ఆనాడు ప్రభువుల అలంకార వస్తువుల నామములు.

**సం.వ్యా.** (కొండె సిగల్=జుట్టు బాగా పెంచుకొని, తలపైన ముందు భాగములో ఎత్తుగా వేసికొనిన సిగముడి. నేటి శిక్కులు ఈ విధముగా జుట్టు ముడివైచుకొని, దానిపైన పెద్ద తలపాగ చుట్టుకొందురు. మొదటిపాదములో చేసిన వర్ణన ఇట్టిదే! "తలవార్లు" అను పదము "తల్‌వార్" అను ఉర్దూ పదమునుండి వచ్చియుండవచ్చును, తల్‌వార్ – పొడవైన కత్తి. "డాలువార్లు" = "డాలులు"

కావచ్చును. "కొఱ్ఱు"=శూలము, కొఱ్ఱు+లు = కొఱ్ఱులు > "కొర్లు" = శూలములు. "కట్నాలు" = "కుట్టాలు" (అకాడెమీప్రతి); శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠభేదములు:– "గంపెడేసి జందెములును" = "గంపెడేసి జన్నిదములు"; "తలవార్లు, జలతారు, డాలు వార్లు" = "జాళువా జలతారు డాలువార్లు"; "సన్నపుఁ దిరుచూర్ణ చిన్నెలు, కట్నాలు" = "సన్నంపు తిరుచూర్ణపున్నీటు నామాలు"; "సొగసుకొర్లు" = "సొగసుకోర్లు".

**సీ॥ కోమటి యత్యంత క్షామముఁ గోరును,**
**ధారుణి క్షితిపతి ధనముఁ గోరు;**
**ధరఁ గరణము గ్రామదండుగఁ గోరును,**
**జంబుకం బేవేళ శవముఁ గోరుఁ;**
**గుజనుఁడౌ వైద్యుండు ప్రజల రోగముఁ గోరు,**
**సామాన్య విప్రుండు చావుఁ గోరు;**
**నతిశూరులగువారు ధృతినిఁ గోరుచునుందు,**
**రాఁబోతు పేదల యశముఁ గోరు;**
**తే॥గీ॥ కాఁపువానికి గ్రామాధికారమైన**
**దేవభూసుర వృత్తులు దియ్యఁ గోరు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 31**

**తా.** కోమటి ఎల్లప్పుడును మిక్కిలిగా కఱవు కాటకములు రావలయునని కోరుకొనును. కఱవు కాటకములలో ప్రజలకవసరమైన నిత్యావసర వస్తువులను దాచివేసి, తాత్కాలికమైన లోపమును కల్గించి, అధికలాభములకు వానినమ్మి ధనము గడింపవచ్చును.

రాజు అధికమైన ధనమును కోరును. కాసులు కలవాడే రాజుగదా! యని సామెత – రాజునకు ధనాగార మెంత బలముగానుండునో అంతటి విజయములు సంప్రాప్తించును.

కరణము గ్రామంలోని ప్రజలకు నష్టములు కోరును. నక్క లెప్పుడును శవములనే కోరును. చెడ్డవాడైన వైద్యుడు ప్రజలెప్పుడును రోగములతో బాధపడవలెనని కోరుచుండును. వారందఱికిని వైద్యచికిత్సలు చేసి ధనము గడింపవచ్చునని ఆశ. ఇక బ్రాహ్మణులలో సామాన్యులు (పురోహితులు) ప్రజల చావులు కోరుకొందురు. ప్రజలు మరణించినపుడు కర్మకాండలకు పురోహితులు అధికముగా ధనమును దోచుకొనుచుందురు. మహాశూరులైన వారు ధైర్యముతో నుండవలయునని కోరుచుందురు. ఆబోతు పేదవారి కీర్తిని కోరుకొనును. (ఇది యెట్లో అవగతము కాలేదు. ఇది అసంబద్ధము) పూర్వము 'ఆఁబోతు యెదయైన ఆవుఁ గోరు' అని పాఠాంతరమున్నది. ఇదియే సరియైనది. ఎదయైన ఆవు అనగా గర్భమును దాల్చుటకు సిద్ధమైన ఆవు. దానిని ఆఁబోతు వద్దకు తోలుకొని రాగా అది దానిని దాటును. అప్పుడు గోవు గర్భమును దాల్చును. కాపువానిని గ్రామాధికార పీఠముపై కూర్చుండ బెట్టినచో, దేవతామాన్యములను బ్రాహ్మణుల అగ్రహారాదులను గైకొనుటకు ప్రయత్నించును.

ఇందు ప్రథమ పాదమున "అత్యంత క్షామము" అని ప్రయోగింపబడినది. 'క్ష' – సంయుక్తాక్షరము. ఏకసమాసమున తత్పూర్వాక్షరము గురువగును గనుక ఛందస్సు పోవును. "ఆతులిత క్షామముఁగోరును" అనిన సరిపోవును. గ్రామదండుగ అనునది వైరిసమాసము. 'ఊరిదండుగ' అన్నచో సరిపోయెడిది. "ధర కరణం బూరిదండుగఁ గోరును"

**సం.వ్యా.** సీసపద్యపాదములలో నాల్గవదాని మొదటి దళము శతకమంజరిలో పూర్తిగా భిన్నముగా నున్నది: "అతిశూరులగువారు ధృతినిఁగోరుచు నుందురు" = "అతి జారులగువార లమవసఁ గోరుదురు"

**సీ॥ కందచెక్కెర పానకముఁ బోసి పెంచిన-**
**ముష్టిచెట్టుకుఁ దీపి పుట్టఁబోదు;**
**పాలమున్నీటి లోపల ముంచి కడిగినఁ -**
**గాకిఱెక్కకుఁ దెల్పు కలుగఁబోదు;**
**పన్నీరు గంధంబుఁ బట్టించి విసరినఁ -**
**దేలుకొండి విషంబుఁ దియ్యఁబోదు;**

**వెదురుబద్దలు చుట్టువేసి బిగించినఁ -**
**గుక్కతోఁకకు వంక కుదురఁబోదు;**
**తే॥గీ॥ మంచిమాటల నెంత బోధించి చెప్ప-**
**మడియరండకు విగుణంబు విడువఁబోదు;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 32**

**తా.** ఓ వేణుగోపాలా! పటికబెల్లపు పానకమును పోసి పెంచినప్పటికిని, ముష్టిచెట్టు ఆకులు రెమ్మలు చేదుగానే ఉండును గాని, అవి తీయగా మారబోవు. పాల సముద్రములోపల ముంచి, ఆపాలతో శుభ్రముగా కడిగినప్పటికిని, కాకిఱెక్కకు తెలుపు రానేరాదు. పన్నీరును, గంధమును బాగా పట్టించి, వింజామరలతో విసరినను, తేలుకొండెయందలి విషము లేకుండపోదు. కుక్క తోకను, వెదురు బద్దలతో సాపుచేసి బిగించి కట్టినను దాని తోకవంకర పోదు. మంచిమాటలతో ఎన్ని విధాలుగా చెప్పి బ్రతిమాలినను, మూఢురాలైన రండ దాని దుర్గుణమును మానదు. దానిని భయపెట్టి అదుపులో పెట్టుటకు ప్రయత్నింపవలయునేకాని మాటలతో వినదు. అనగా ఎన్ని విధముల ప్రయత్నించినను స్వభావములను మార్చుట సాధ్యము కాదని పిండితార్థము.

'మడియరండకు విగుణంబు విడువఁబోదు' అన్నచోట కారకదోషము. ప్రథమాంతమునకు షష్ఠి సరిగా అన్వయము కాదు. "మడియరండ తా విగుణంబు విడువఁబోదు" అని యుండుట లెస్స (మడియ = మూఢురాలైన; రండ = ఱంకుటాలు; విగుణము = మంచిగుణము లేకుండుట, అనగా - దుర్గుణము.)

**సీ॥ ఖేదమోదంబుల భేదంబు తెలియక**
**గోలనై గడిపితిఁ గొన్నినాళ్లు,**
**పరకామినుల కాసపడి పాపమెఱుఁగక**
**కొమరు ప్రాయంబునఁ గొన్నినాళ్లు,**
**ఉదరపోషణమున కుర్వీశులను వేడి**
**కొదువచేఁ గుందితిఁ గొన్నినాళ్లు,**

ఘోరమైనట్టి సంసారసాగర మీఁదు
కొనుచుఁ బామరముచేఁ గొన్నినాళ్లు,
తే॥గీ॥ జననమెత్తుట మొదలు నీ సరణిఁ గడచె,
నెటులఁ గృపఁజూచెదో గతం బెన్నఁబోక;
మదరిపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 33

**తా.** ఈ పద్యమున కవి స్వీయ నైచ్యానుసంధానము చేయుచున్నాడు. ఓ వేణుగోపాలా! నేను చేయుచున్న పని దుఃఖమునే కల్పించునో, ఆనందమునే కల్పించునో తెలియక అజ్ఞానినై కొన్ని రోజులు గడిపివేసితిని. పరస్త్రీల పొందున కాశపడి, పరస్త్రీ గమనము మహాపాపమని తెలియక యౌవనకాలము నంతయు గడిపివేసితిని, పొట్టపోసుకొనుటకు భూమిపతుల దగ్గఱకు పోయి వారిని చేసాచి యాచించి వారేమియు ఈయక ధనలోపముచే కొన్నినాళ్లు బాధపడుచు గడిపితిని. మహాభయంకరమైన సంసారసముద్రమును ఈదుకొనుచు, పామరత్వముతో కొన్నినాళ్లు గడిపితిని. జన్మమెత్తినది మొదలు నా జీవిత మిదే పద్ధతిలో గడచిపోయినది. ఓ కృష్ణా! వేణుగోపాలా! నా గత జీవిత దోషములను గణింపబోక ఏ విధముగా దయతోచూచెదవో కదా!

"పామరముచే" అనుట దోషము పామర ధర్మము పామరత్వము. కనుక "పామరతచే కొన్నినాళ్లు" అని యుండవలెను.

**సం.వ్యా.** "గతంబెన్నఁబోక" = "గతంబెంచబోకు" (రెండుప్రతులలోను).

సీ॥ గజముపైఁ జౌడోలు గాడిద కెత్తిన –
మోయునా? పడవేసి కూయుఁగాక!
చిలుక పంజరము లోపలఁ గూబనుంచినఁ –
బలుకునా? భయపడి యుఱుకుఁగాక!
కుక్క నందలములోఁ గూర్చుండఁ బెట్టినఁ –
గూర్చుండునా? తోళ్లు కొఱుకుఁగాక!

**ధర్మకార్యములలో దరిబేసి నుంచిన -**
**నిచ్చునా? తన్నుక చచ్చుఁగాక!**
**తే॥గీ॥ చెడి బ్రతికినట్టి శుంఠను జేర్చుకొన్న -**
**వాఁడు చెడు, నుంచుకొన్నట్టి వాఁడుఁ జెడును;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 34

**తా.** ఏనుగుపై అంబారీ వేయుదురు. దానిలో చక్రవర్తులు కూర్చుండి పయనింతురు. అది చాల భారమైనది. ఆ అంబారీని గాడిదపై నుంచిన అది మోయగలదా? లేదు. దానిని క్రింద పడవేసి ఓండ్రపెట్టును. (చౌడోలు=ఏనుగు వీపుమీద కూర్చుడుటకు అమర్చిన తొట్టి)

చిలుకను ఉంచవలసిన పంజరంలో గుడ్లగూబ నుంచిన అది చిలుకవలె పలుకునా? భయపడి పారిపోవును.

కుక్కను పల్లకీలో కూర్చుండబెట్టినచో నదిదానియందు స్థిరముగా కూర్చుండ గలదా? తోళ్ళను కొఱుకుటకు చూచును.

ధర్మకార్యములు చేయుటయందు లుబ్ధుని (పిసినిగొట్టువానిని) ఉంచినచో ఆతడు ఇతరులకు ఇవ్వగలడా? ఇచ్చుటను జూచి తన్నుకొని చచ్చును. ("దరిబేసి" = లుబ్ధుడు లేక పిసినిగొట్టు)

చెడిపోయి, తరువాత ఎట్లో సంపాదించి బ్రతుకుచున్న శుంఠను చేర్చుకొనినచో వాడు చెడిపోవును. ఉంచుకొన్నవానిని కూడ చెడగొట్టును. చెడిబ్రతికినవాని మైత్రి తగదని సామెత. (శుంఠ = మూఢుడు)

"చెడి బ్రతినట్టి ముండను జేర్చుకొనిన" - అను పాఠము గలదు. ఇదియే సరియైనది. "ఉంచుకొన్నట్టి వాడు చెడును." అనువాక్యములో "ఉంచుకొనుట" యనునది తెలుగులో స్త్రీలను ఉంపుడుగత్తెలను చేసికొనుటయందే రూఢియైనది. సరిగా ఆ పాఠమే సరిపోవును.

ఈ పద్యము రెండవ పాదమున, రెండవ దళములో 'పలుకునా? భయపడి యుఱుకుఁగాక' అన్నప్పుడు యతిస్థానము తప్పిపోయినది.

'పలుకునా? భయపడి పఱచుఁగాక' అన్నచో సరిపోవును. "పఱచు" అన్నను "ఉఱుకు" అను అర్థమే వచ్చును.

**సం.వ్యా.** సీసపద్యపాదములలో మొదటి దళముల చివరనున్న "ఎత్తిన" – "ఉంచిన" – "పెట్టిన". "ఉంచిన" అను పదములు మిగిలిన రెండు ప్రతులలోను "ఎత్తితే"–"ఉంచితే"–"పెట్టితే"–"ఉంచితే" అని వ్యావహారిక రూపములతో నున్నవి. రెండవ పాదములో రెండవదళము "పలుకునా? భయపడి యుఱుకుఁ గాక!" = "పలుకునా? భయపడి యులుకుఁగాక!" (రెండు ప్రతులలోను). ఉలుకు = భయపడు, పొర్లు, మిఱుమిట్లుకొను. ఇచ్చట రెండు, మూడు అర్థములను గ్రహించవచ్చును. ఈ పాఠము స్వీకరించినచో యతిభంగము తప్పిపోవును.

**సీ॥ గోవుల నఱకంగఁ గోసి వండుక తిను**
**మాలమాదిగలు భూపాలురైరి,**
**మానాభిమానముల్ మాని ప్రవర్తించు**
**మంకు గులాములు మంత్రులైరి,**
**అక్షరం బెఱుఁగక యాకార పుష్టిచే**
**వర్ణసంకరులు విద్వాంసులైరి,**
**బాజారి ఱంకుకై పంచాయతీ చెప్పు**
**ప్రాఁత లంజెలు వీరమాతలైరి,**
**తే॥గీ॥ అహహా! కలియుగధర్మ మేమనఁగవచ్చు!**
**నిన్నిఁటికి నోర్చి యూరక యుండఁదగునె?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 35**

**తా.** ఈ పద్యభావము ఈనాటి ప్రజాప్రభుత్వమునందు చెప్పుటకు తగినది కాదు. చాతుర్వర్ణ్య వ్యవస్థను రాజులు పాటించి రక్షించిన సమయమున సామ్రాజ్య తత్త్వమునకు తగినది. ఓ వేణుగోపాలస్వామీ! గోవులను నఱకగా వాని మాంసమును కోసి వండుకొని భక్షించు, మాలలు – మాదిగలు – నేడు భూపాలపదవు లలంకరించిరి.

ఆత్మాభిమానము గౌరవము వదలి, సిగ్గులేకుండ ప్రవర్తించుచు, మంకుపట్టుతో సేవలుచేయు సేవకులే మంత్రులైరి.

నిరక్షరకుక్షులై అక్షరముముక్క నేర్వక బాగా బలిసిన ఆకారముతో కులకాంతలను విడిచి పరకుల కాంతలతో సంచరించుచు సంతానమును పొందు వర్ణసంకరులు పండితులుగా చెలామణియగుచున్నారు.

బజారులో ఒక రంకు విషయమై స్త్రీపురుషుల మధ్య పంచాయతీ చేసి, వారిని ఏకమొనర్చెడు పాంతలంజెలు (అనగా ఇపుడు వృద్ధలైన కారణమున వ్యభిచారమును విడిచినవారు – "వృద్ధనారీ పతివ్రతా" అని గదా సుభాషితము) వీరమాతలుగా చెలామణి యగుచున్నారు.

ఆహా! ఈ కలియుగధర్మాన్ని గురించి ఏమి చెప్పవలె? వీనినన్నింటిని దర్శించుచు, మెదలక నోరువిప్పక కూర్చుండవచ్చునా? కూర్చుండ తగదని భావము.

"దక్షు లెవ్వార లుపేక్షచేసి రది వారల చేటగు" నని శ్రీకృష్ణుడు కౌరవసభలో హెచ్చరించినట్లుగా, ఈ కవి సమర్థులను హెచ్చరించుచున్నాడు.

"ఇన్నిటికినోర్చి యూరక యుండఁదగునె?" అన్న పాదమునయతి భంగమైనది. "ఇన్నిటికినోర్చి యూరక యేల యుండ?" అని దిద్దుకొన్నచో యతిభంగదోషము తప్పును.

**సం.వ్యా.** "మాలమాదిగలు భూపాలురైరి = "వారలు నైశ్వర్యవంతులైరి" (శతకమంజరి. ఇది కులదూషణను నివారించుటకై కల్పించిన పాదమువలె నున్నది.); "మాని ప్రవర్తించు మంకు గులాములు మంత్రులైరి" = "మాని వర్తించు గులాములు గౌరవధాములైరి" (శతకమంజరి); "ఇన్నిఁటికి నోర్చి యూరక యుండఁదగునె?" = "అన్నిఁటికి నోర్చి యూరక యుండవలయు" (శతకమంజరి), "అన్నిఁటికి నోర్చి యూరక యుండదగునె?" (అకాడెమీ ప్రతి). శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠభేదములు: పై సీసపద్యములోని నాలుగు పాదముల వరుస క్రమము శతకవాఙ్మయ సర్వస్వములో భిన్నముగా నున్నది: ఇందలి 1,2, పాదములు – అందులో 3,4 పాదములైనవి. ఇందలి 3,4 పాదములు – అందులో 1,2 పాదములైనవి. పై పద్యములో "భూపాలురు– మంత్రులు – విద్వాంసులు – వీరమాతలు" అను క్రమము రాగా, శతకవాఙ్మయ సర్వస్వములో

"విద్వాంసులు – వీరమాతలు – భూపాలురు – మంత్రులు" అను క్రమము వచ్చినది. "గోవుల నఱకంగ" = గోమాత లఱువఁగ"; "అక్షరంబెఱుఁగక" = "అక్షరంబెఱుఁగని"; "బాజారి అంకుకై" = "బాజారి అంకుకు"; "ఊరక యుండఁదగునె?" = "ఊరక యుండఁదరమె?"

**సీ॥ దూదేకుల హుసేను, దొమ్మరి గోపాలు,**
**పాత్ర మంగఁడు, గాండ్ల బాలిగాఁడు;**
**బైనేని నాగఁడుఁ, బటుసాలె నారాయ**
**ణ, గముడి లచ్చి, గాడా ముకుందుఁ;**
**జాఁకలి మల్లఁడు, సాతాని తిరుమలు,**
**గొల్ల కాటఁడు, బెస్త గురివిగాఁడుఁ;**
**గోమటి శంభుఁడుఁ, గుమ్మరి చెన్నఁడు,**
**మంగ లెల్లఁడు, బోయ సింగఁడొకఁడు;**
**తే॥గీ॥ కన్న నా లంజకొడుకులు కవులుఁ గాఁగ**
**వేదశాస్త్రంబు లేదను? విప్రులేద?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 36**

**తా.** పూర్వము బ్రాహ్మణ కులస్థులు తప్ప అన్యులు వేదాది కవితావిద్యలు నేర్వరాదని ఒక నియమముండెడిది. దానికి కారణము బ్రాహ్మణేతరులలో నియమ నిష్ఠలుండవను భావము కావచ్చు. వారందఱు మాంసభక్షకులై మద్య పానరతు లగుదురని కావచ్చు. లేదా పరబ్రహ్మ తత్త్వాభిజ్ఞులు బ్రాహ్మణులే కనుక వారే చదువవలెనని నియమము. (ఈ పద్యము కూడ నేటి ప్రజాస్వామ్య యుగమునకు వర్తించునది కాదు. పూర్వపు రాజరిక వ్యవస్థకును, వర్ణాశ్రమ ధర్మములు పాటించు వెనుకటి సమాజమునకును సంబంధించినది. "పాత్ర" < పాటరి = కూలిపని చేయువాడు, పాటుపడి జీవించువాడు; "గాండ్ల" = నూనె అమ్మి జీవించెడి జాతి; "బైనేని" < బవనీలు = పరశురామునికథలు లేక ఎల్లమ్మ కథలు పాడు మాదిగవారు;

"పటుసాలె" <పట్టుసాలె = ఒక చేనేత కులము; "గముడి లచ్చి" అనుచోట – "గౌడు >గవుడు >గముడు" గా మారియుండవచ్చును. గవుండ్లవాడు = కల్లుగీచి అమ్ముకొను కులము – సంపాదకుడు.)

ఓ వేణుగోపాలా! దూదేకుల కులస్థుడైన హుస్సేన్ అను వ్యక్తియు, దొమ్మరి కులమునకు చెందిన గోపాలును, పాత్రవంశమునకు చెందిన మంగడను వ్యక్తియు, గాండ్ల కులమునకు చెందిన బాలిగాగడను వ్యక్తియు, బైనేని వంశస్థుడైన నాగడను వ్యక్తియు, సాలె కులమునకు చెందిన నారాయణయును, గమిడి లచ్చియను స్త్రీ, గాడా ముకుందయను వ్యక్తియు, చాకలికులమున జనించిన మల్లడను వ్యక్తియు, సాతాని అన్వయసంజాతుడైన తిరుమలయను వ్యక్తియు, గొల్లకులస్థుడగు కోటడను వ్యక్తియు, బెస్త (మత్స్యకారులు) కులమున పుట్టిన గురివిగాడను వ్యక్తియు, కోమటి కులమున పుట్టిన శంభుడను వ్యక్తియు, కుమ్మరి కులస్థుడైన చెన్నడను వ్యక్తియు, మంగలి కులస్థుడైన ఎల్లడు అను వ్యక్తియు, బోయకులానికి చెందిన సింగడను వ్యక్తియు, కనిపించెడి నా లంజెకొడుకు లందఱును కవులుగా లోకమున వెలుగుచుండగా, ఇంకను వేదములెక్కడ? వేదవిదులైన విప్రులెక్కడ? అనగా వాని పవిత్రత నాశనమైనదని కవి నిర్ణయము.

ఇది ఆకులాచారానుగుణభావము. స్త్రీలు కావ్యాదులు చదువరాదని, "కావ్యాలాపాంశ్చ వర్జయేత్" అను ఆర్యోక్తి కలదు. కావున ఆ నియమములను బట్టి కవి గముడిలచ్చి కవయిత్రిగా నున్నదని కవి వేదన.

"దేవు నాన మున్ను దేశాన కొక కవి" ఇప్పుడు వీథివీథిని పదుగురు కవులున్నారని యొక చాటుకవి వగచినాడు.

'కన్న నా లంజెకొడుకు' అన్నదానిలో బూతు కన్పించినను ఒక చమత్కారమున్నది. కంటికి కనుపించిన ప్రతివ్యక్తియు కవిత్వము చెప్పువాడే యను ఎత్తిపొడుపున్నది.

ఒకసారి కట్టమంచి రామలింగారెడ్డిగారు వేయిమందికిపైగా కలిగిన ఒక పెద్ద సభలో ఉపన్యసించుచు ఒక చిన్నరాయి తీసికొని, "ఇది నేను విసరితే ఎవని నెత్తిన పడునో? ఎవరైన చెప్పగలరా?" అని ప్రశ్నించెనట. ఎవ్వరును సమాధానమీయలేదు. ఆయనయే –"ఇది యొక కవిగాని నెత్తిని పడును" అని

చెప్పిరట. అనగా సభలో ఉన్నవారందఱు కవిపుంగవులే! అని వ్యంగ్యము. అనగా కవిత్వమున కంత విలువలేకుండ పోయినదని భావము. కవిత్వము వ్రాయుటకు ఛందశ్శాస్త్ర, అలంకారశాస్త్ర, వ్యాకరణశాస్త్ర, లౌకిక జ్ఞానాదులు కావలయునని పూర్వ లాక్షణికుల ప్రత్యయము.

ఇది నేటి సమాజమునకు పట్టునది కాదు. ఐనను ఆనాటి కవి వ్రాసిన శతకపద్యముగనుక ప్రచురింపవలసివచ్చినది.

"(య)ణ గముడి లచ్చి గాడాముకుందు" అనుచోట యతి తప్పినది. 'గాణా ముకుందు' అన్నచో సరిపోవును.

**సం.వ్యా.** పై సీసములో రెండవ పాదము శతకమంజరిలోను, అకాడెమీ ప్రతిలోను భిన్నముగా నున్నది:

**"బయశేని నాగఁడు, పటసాలె నారాయఁ,**

**దగముడి లచ్చిగాఁ డా ముకుందు"**

ఈ పాఠమును స్వీకరించినచో రెండవ దళమున యతి సమస్యరాదు. "గముడి లచ్చి" అను స్త్రీకి బదులుగా "అగముడి లచ్చిగాడు" అను పురుషుడు వచ్చును. "ముకుందు" కు ఇంటిపేరు లేదు; "ఆ ముకుందు" మాత్రమే, లేదా ఇతని యింటి పేరు కూడా "అగముడి" యే కావడంతో "ఆ" అన్నాడేమో కవి. అందరినీ కలిపి "లంజకొడుకులు" అని పుంలింగంలో తిడుతున్నాడు కాబట్టి వారి మధ్యలో "గముడి లచ్చి" అను స్త్రీ ఉన్నదనడం అంత సమంజసంగా కనపడదు. పైగా జానపదులు "నారాయణ" అనే వ్యక్తినామాన్ని "నారాయడు" అనే ఉచ్చరిస్తారు.

"పాత్రమంగఁడు" = "పత్రమంగఁడు (రెండు ప్రతులలోను); "కుమ్మరి చెన్నఁడు" = "కుమ్మరి చెంగడు" (రెండు ప్రతులలోను); "కన్ననా లంజకొడుకులు కవులుఁ గాఁగ" = "కన్నవారెల్లఁ బండితుల్ కవులుఁగాఁగ (రెండు ప్రతులలోను) కాని ఈ "రంగయ్య–రంగాచార్య" ప్రతిలోని పాఠమే సాధుపాఠము. కనబడిన ప్రతివాడును కవియే! అని హేళనతోను కోపముతోను కవి తిట్టుచున్నాడు. కాబట్టి తిట్టుతో కూడిన పాదమే సరియైనది.

సీ॥ చదువు చుండెడివేళ సభలోనఁ గూర్చుండి
దున్నపోఁతులకొడు కెన్నుఁ దప్పు,
విద్యాధికుల కిచ్చు వేళడ్డుపడి మాల
ధగిడీల కొడుకు వద్దనుచుఁ జెప్పు,
ధన మెక్కువగఁ గూర్చి తినలేక యేడ్చెడి
పెనులుబ్ధుఁ దర్థులఁ గనిన తొప్పు,
బిరుదుగల్గిన యింటఁ బెఱిగినఁ గౌణతంబు
విప్పినంతనె కుక్క వెదకుఁ జెప్పు,
తే.గీ. రాజసభలందుఁ బండితరత్నములకుఁ
బనులు చెఱచును నొక్కొక్క ప్రల్లదుండు;
మదరిపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 37

**అర్థములు:** ధగిడీ = నీచస్త్రీ; కౌణతము = కుక్కను కట్టెడి కొయ్య; ప్రల్లదుఁడు = దుష్టుడు.

తా. ఓ వేణుగోపాలా! రాజసభలో కవులు పద్యములు చదువుచున్న సమయమున సభలో కూర్చుండి ఒక దున్నపోతుల కొడుకు, ఆ కవిత్వమునందు తప్పులు పట్టుచుండును. విద్యాధికులైన పండితులకు రాజులు దానమిచ్చు సమయమున, ఒక నీచురాలైన స్త్రీకి పుట్టిన కొడుకు (పరమ నీచుడని భావము – భయంకరమైన తిట్టు), ఆదానమున కడ్డుపడి యీయవద్దని చెప్పును. ధనము నధికముగా ఆర్జించి, దానిననుభవింపలేక యేడ్చెడి లోభి (పిసినారి) యాచకులను చూచినచో ఎంతయో బాధతో రొప్పుచుండును. కుక్క మంచి పేరు ప్రతిష్ఠగల కుటుంబమునందు పెరిగినను దానిని కట్టుకొయ్యనుండి విడిచిన మరుక్షణము చెప్పులకోసము వెదకును. రాజసభలందు పండితశ్రేష్ఠులయొక్క కార్యములను ఒక దుష్టుడు చెఱచుచుండును. అనగా, నీచుడైనవా డెట్టివేళయందైన తన నీచస్వభావము వదలబోడని తాత్పర్యము. ఇది తన గ్రంథమును రాజు అంకితము తీసికొనకుండ చేసిన మంత్రిని గురించి చెప్పిన నిందాపూర్వక పద్యమే. ‘ధగిడీలకొడుకు వద్దనుచు చెప్పు’ ఇది అఖండ

యతియే.

సం.వ్యా. "ఒక్కొక్క ప్రల్లదుండు" = "ఒక్కొక్క పాపినరుఁడు" (శతకమంజరి)

**సీ॥ జన్నిరోగికి బత్తెజున్ను వేసినయట్లుఁ,**
**బిల్లినెత్తిని వెన్నఁ బెట్టినట్లు;**
**కుక్కపోఁతుకు నెయ్యికూడు వేసినయట్లుఁ,**
**జెడ్డజాతికి విద్యఁ జెప్పినట్లు;**
**సాతాని నొసట విభూతి రాసినయట్లు,**
**గూబదృష్టికి దివ్వె గూడినట్లు;**
**ధనపిశాచికి సుదర్శనము గన్పడినట్లు,**
**చలిచీమలకు ముగ్గుఁ జల్లినట్లు;**
**తే॥గీ॥ సురభి బదనికఁ బాముకుఁ జూపినట్లు,**
**దుష్టునకు నీతి వెగటుగాఁ దోచునయ్య!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 38**

**తా.** ఓ వేణుగోపాలా! సన్నిపాత జ్వరముతో బాధపడువానికి గేదెజున్ను పెట్టినట్లు– అది మఱియు రోగమును పెంచును. పిల్లి నెత్తిమీద వెన్నముద్ద పెట్టినట్లు – (వెన్నను పిల్లి భక్షించును. దాని నెత్తిపై వెన్ననుంచినచో దానికొఱకు గంతులు వేయును గాని దాని కది లభ్యము కాదు). కుక్కపోతునకు నేతితో కలిపిన అన్నమును వేసినట్లుగా; చెడ్డ జాతివారికి విద్యను నేర్పినట్లుగను – (వారికి సరిగా రాదనియు, చదువు చెప్పినవారిని గౌరవించరనియు భావము); సాతానికులమునకు చెందినవాని నొసట విభూతిని పూసినట్లుగా (సాతానులు వైష్ణవులు. వారు పొరపాటున గూడ శివునంగీకరింపరు. అందుకే లోకమున "సాతాని లింగడు – జంగమ రంగడు ఉండ"రని సామెత. వాడు దానిని వెంటనే చెఱిపివేయును); గ్రుడ్లగూబకు దివ్వెను చూపించినట్లు– (గూబ సూర్యకాంతిని భరించలేదు. దివ్వె కాంతినెట్లు భరించును? అది దాని దృష్టికి వ్యతిరేకము). ధనపిశాచమునకు సుదర్శనము కనిపించినట్లు; చలిచీమల మీద ముగ్గుచల్లినట్లుగా; "సురభి బదనిక"

అనగా "తెల్ల ఈశ్వరివేరు" పామునకు చూపించినట్లు, (పాము తల యెత్తలేదు.); దుర్జనుడైనవానికి నీతిని బోధించినచో వెగటుగా దోచును. పైన చెప్పిన వన్నియు క్రింద చెప్పిన విషయమునకు సమర్థనములు.

**సీ॥ దొరయొద్ద నెంత చౌదరియైనఁ దనమన్విఁ**
**దాఁ జెప్పఁ గార్యసాధనము లేదు,**
**రంభైనఁ దన కుచకుంభముల్ దనచేతఁ**
**దాఁబట్టు కొనిన సుఖతరము లేదు,**
**తగవులో నాపురందరుఁడైనఁ దన ప్రజ్ఞఁ**
**దాఁజెప్పుకొనినఁ బెత్తనము లేదు,**
**తనుజేయు పుణ్యమింతని యొరులకుఁ జెప్ప**
**బ్రహ్మదేవునకైన ఫలములేదు,**
**తే॥గీ॥ కనుక నివియెల్ల నొరులచేఁగాని భువినిఁ**
**దనదు శక్తికి మంత్రతంత్రములు లేవు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 39**

**తా.** ఓ వేణుగోపాలా! లోకమునందు, ఎంత పేరున్న మోతుబరి చౌదరియైనను ప్రభునికడ తన విషయమును తానే చెప్పుకొనినచో కార్యసిద్ధి కలుగదు. ఆయన గొప్పతనమునుగూర్చియు, ఆయన కార్యమునుగూర్చియు పరులు ప్రభువునకు చెప్పినచో ఆ కార్యము నెఱవేరును.

మహా సౌందర్యవతి, దేవవేశ్య రంభయేయైనను తన స్తనములను తానే పట్టుకొనిన సుఖము కలుగదు. పరులచే సౌఖ్యము కలుగును. న్యాయనిర్ణయము చేయుటయందు తాను దేవేంద్రుడైనను తన ప్రజ్ఞను తానే చెప్పుకొన్నచో పెద్ద తనము నిలువదు. ఆయన ప్రజ్ఞనుగురించి ఇతరులు చెప్పవలెను. ఇక్కడ "తగవు" అనగా "న్యాయము". తగవు అనగా కలహమను నర్థము కూడ కలదు. యుద్ధములలో పురందరుడైనను తన ప్రజ్ఞను గురించి తానే చెప్పుకొన్నచో ప్రఖ్యాతి రాదు. తాను ఇంతటి పుణ్యము చేయుచున్నానని ఇతరులతో చెప్పుకొన్నచో బ్రహ్మ

దేవునికైనను ఆ పుణ్యఫలము లభింపదు. ఇతరు లాయన చేయు పుణ్యకర్మలను ప్రశంసింపవలయును. లోకమున ఎవ్వనికైనను తన శక్తిననుసరించిన మంత్ర తంత్రములుండవు.

రంభయైనను తన చన్నుగవ తాను పట్టుకొన్నచో సుఖతరము కాదనుట దుర్బలప్రయోగము. తర–తమములు – ఆధిక్యమును తెలుపునని – వీనిని ఆంగ్లమున Degrees of Comparison అందురు. సుఖము – సుఖతరము – సుఖతమము – ఇవి ఉత్తరోత్తర బలీయములు. అసలు సుఖమే లేకపోగా సుఖతర మెట్లు కాగలదు? యతికొఱకు కవి ప్రయోగించినట్లు భావించవలయును.

రంభ + ఐన = రంభయైన అని రూపముండవలయునేగాని 'రంభైన' రూపము కాదు. "రంభైనఁ దనకుచకుంభముల్ దనచేత తను బట్టికొన సుఖం బెనయబోదు" అన్నచో దోషము తొలగిపోవును.

**సం.వ్యా.** "దొరయొద్ద" = "దొరవద్ద" (రెండు ప్రతులలోను) – "తనచేతఁ దాఁబట్టుకొనిన సుఖతరము లేదు = "తన చేతఁ దా బిగించిన సుఖతరములేదు" (అకాడెమీ ప్రతి). "తనచేత దాఁబట్టుకొనిన సుఖతరములేదు"లో గణభంగమైనది; ఒక అక్షరము ఎక్కువైనది. దీనిని "తనచేతఁ దాఁ బట్టుకొన సుఖతరము లేదు" అని మార్చుకొన్నచో దోషము పరిహరింపబడును. అకాడెమీప్రతిలోని పాదము గణానుగుణముగా నున్నది.

**సీ॥ దొరసొమ్ముఁ దిని, కార్యసరణి వచ్చినవేళఁ**
**బాఱిపోఁజూచిన బంటువాని,**
**నగ్నిసాక్షిగను బెండ్లాడిన తనయింతి**
**నేలక పరకాంత నెనయువానిఁ,**
**గబ్బముల్ సేయు సత్కవిజనాళికిఁ గల్గి**
**నంతలో నేమియ్యనట్టివాని,**
**నిచ్చిన దీవెన లియ్యక యత్యాశ**
**తోఁ బోవు యాచకుండైనవానిఁ,**

**తే॥గీ॥ గట్టి ముచ్చెలతోఁ బడఁగొట్టి, విఱుగఁ**
**గట్టి, పంపింపవలయును గాలుపురికి;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 40**

**తా.** ఓ వేణుగోపాలా! ప్రభువొసంగిన ధనమును సత్తుగా అనుభవించి, రాజుగారికి పనిబడినపుడు తప్పించుకొని పారిపోవచూచిన భటుని; అగ్నిసాక్షిగా పెండ్లిచేసిన కొన్న భార్య నేలక పరస్త్రీతో నుండువానిని; కావ్యములు వ్రాయు సత్కవులకు, తనకు కలిగినదానిలో దానము చేయని వానిని; ఏదో తోచినంత యిచ్చిన సంతృప్తితో దీవించక, ఎక్కువ యీయలేదని ఆశీర్వదింపకుండపోవు యాచకుని; కొయ్యకు కట్టి, చెప్పులతో కొట్టి, చేతులు విఱుగగట్టి, వారిని యమధర్మరాజు నగరమైన సంయమినీ పురమునకు పంపించవలయును.

**సీ॥ నత్తు లేకుండిన ముత్తైదు ముక్కందు,**
**మూలలందును, ఋతుస్త్రీలయందు;**
**మధ్యపక్వస్థలమందుఁ, గిన్నెర మీఁటు**
**నతని చేఁ, గుమ్మరియావమందుఁ;**
**గాటుక పొగయందుఁ, గాళ్ళ చప్పుడులందు**
**దొమ్మరి వాయించు డోలునందు;**
**దీపము లేనట్టి దివ్వెకంబమునందు,**
**మార్జాలముఖమందు, మాంసమందు;**
**తే॥గీ॥ ముదముతో సంతతము నీదు వదినెగారు**
**విడిదిఁ జేసియు వీరిని విడువకుండు;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 41**

**తా.** ఈ పద్యమునకు అన్వయము కానరాదు. అతిక్లిష్టము. "వదినె" అను శబ్దమునకు, "అన్నభార్య" – "భార్య అక్క" అని మాత్రమే నైఘంటికార్థములు

గలవు. కాని లోకంలో "పెద్దక్క", "వదిన" వంటి శబ్దాలను "దరిద్రదేవత" - "జ్యేష్ఠాదేవి" యను నర్థమున వాడుచుండుట కద్దు. ("నీదు వదినెగారు" = నీ భార్యయైన లక్ష్మీదేవికి అక్కగారు, అనగా "దరిద్రదేవత".) ఆ భావముతోనే ఈ పద్దియమునకు భావమును చెప్పుచుంటిని.

ముక్కుపోగులేక యుండిన పుణ్యస్త్రీ ముక్కునందును (పుణ్యస్త్రీకి తప్పక ముక్కుపోగుండవలెనని పూర్వుల భావము), మూలల యందును, రజస్వలలైన స్త్రీలయందును, మధ్యము - పక్వస్థలములందును, కిన్నెర మీటువాని చేతను, కుమ్మరి కుండలను కాల్చుటకు వేసిన ఆవమందును, నల్లని కాటుకవంటి పొగయందును, కాళ్ల చప్పుడులందును, దొమ్మరివాడు వాయించు డోలునందును, దీపము లేకుండిన దీపస్తంభమునందును, పిల్లి ముఖమునందును, మాంసమందును, దరిద్రదేవత (వదినెగారు) సంతోషముతో ఎల్లప్పుడును వీరియందే విడిదిచేసి, వీరిని విడిచిపెట్టక యుండును. అనగా వీరి యొద్దనే ఆమె బస. వీరి నామె ఎప్పుడును విడిచియుండదు. (మధ్యము = నడుము; పక్వస్థలము = ?)-నడుమున దారిద్ర్యమనగా నడుము సన్నగా నున్నదని అర్థము. పక్వస్థలములనగా వంట గృహములు - జ్యేష్ఠాదేవి యున్నచోట పదార్థములుండవుకదా! అదియు దరిద్రచిహ్నమే. దీపస్తంభమునకు దివ్వెయే అలంకారము. దివ్వెలేని దీపస్తంభము దరిద్రదేవతకు నివాసస్థానమని భావింపవచ్చును.

'మధ్యపక్వస్థలమందు' అన్నచోట యతిలేదు. కాని దానిని అఖండయతిగా సరిపెట్టుకొనవచ్చును.

'దొమ్మరి వాయించు డోలు' అనుచోట 'ద'కును - 'డ'కును యతి చెల్లదు.

ఈ పద్యమున కింత కన్న సరియైన అన్వయము చెప్పినచో దానిని హర్షముతో స్వీకరించెదను.

**సీ॥ పంచాంగములు మోసి, బడవాతనముఁ జేసి,**
**పల్లెకూటముఁ జెప్పి, పసులఁ గాచి;**
**హీనవృత్తిని బిచ్చమెత్తి, గోడలు దాఁటి,**
**ముష్టికూళ్ళకుఁ బోయి, మొత్తులుఁ బడి;**

**విస్తళ్లు గుట్టి, కోవెలనంబి వాఁకిటఁ**
**గసవూడ్చి, లంజెల కాళ్ళు పిసికి;**
**కన్నతొత్తుల తమ్మకళ్ళెత్తి, గతిచెడి,**
**యాలుబిడ్డలఁ బరులంటఁ జేసి;**
**తే॥గీ॥ నట్టి దేబెకు సిరిగల్గెనేని వాఁడు**
**కవివరుల దూఱు, బంధువర్గముల గేరుఁ,**
**బరుని పని మీఱు, నొకతినిఁ జెఱుపఁగోరు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 42**

**తా.** పంచాంగములు పండితుల వెంట మోసికొని వెళ్ళి – పరస్త్రీలను పరపురుషలకడ తార్చి – పల్లెలలో ఉండు బడులలో పంతులు అవతారమెత్తి పిల్లలకు పాఠములు చెప్పి (తనకు రాకపోయినను, ఇష్టము వచ్చిన రీతి పాఠములు చెప్పి) – పశు వులను కాచి – హీనమైన భిక్షావృత్తితో బిచ్చములడుగుకొని – గోడలు దూకి (దొంగతనములు చేసి యనుట) – బిచ్చపుకూడు తినుటకు పోయి, దెబ్బలుతిని (లేదా నెత్తి మొత్తుకొని) – విస్తరాకులను కుట్టి – దేవాలయమున పూజలు సేయు పూజారి యింటిముందు కసవు ఊడ్చి – వేశ్యలయొక్క కాళ్లు పిసికి – సేవకురాండ్రైనవారు తాంబూలము వేసికొని యుమిసిన వానిని ఎత్తి (ఉమ్మివేసినపుడు కళ్ళెపడుటయు కలదు) – గతిలేక, భార్యను బిడ్డలను ఇతరులు అంటుకొనునట్లు చేసి, (భార్యాతనయలను పరులకప్పగించి యని యర్థము) – నట్టి దేవిరిగొట్టు (దీనుడు) ఒక వేళ సంపన్నుడైనచో వాడు కవిశ్రేష్ఠులను నిందించును. బంధుసమూహములను తిరస్కరించును. ఇతురులపనిని చెడగొట్టి తనపనులను కావించుకొనును. ఎప్పుడునూ, ఎవరినో ఒకరిని చెడగొట్టుటకు చూచుచుండును.

"గోడలు దాటు" అనునది, "గోడలు దూకి" అను పదబంధముగా "వ్యభిచరించు" అను నర్థమున గూడ వాడబడుచున్నది.

డబ్బు తీసికొని దేవళములలో పూజచేయువారిని నంబివారు అందుఱు. నిష్ఠాగరిష్ఠులైనవారు వారింట భుజింపరు.

వేశ్యలు మేళములకుపోయి పండుకొనగా, ఇతరులు వారి కాళ్లు పిసుకు నాచారము కాళ్ళకూరి కవీంద్రులు చింతామణి నాటకమున వెల్లడించిరి.

**సం.వ్యా.** "తమ్మకళ్ళెత్తి" = "తమ్మకళ్ళ + ఎత్తి" లేదా "తమ్మకళ్ళె+ఎత్తి". "కళ్ళ, కళ్ళె" = శైత్యముచేత గట్టిపడిన యుమ్మి. ఇందుగల తేటగీతిలోని మూడవ పాదము "పరుని పని మీఱు, నౌకరినిఁ జెఱుపఁగోరు" అనునది మిగిలిన రెండు ప్రతులలోను లేదు. (పల్లెకూటము = పాఠశాల)

**సీ॥ పతికి మోహములేని సతిజవ్వనం బేల?**
**పరిమళింపని సుమప్రచయ మేల?**
**పండిత కవివర్యులుండని సభ యేల?**
**శశిలేని నక్షత్రసమితి యేల?**
**పుత్రసంతతి లేని పురుషుని కలిమేల?**
**కలహంసములు లేని కొలనదేల?**
**శుకపికరవ మొకించుక లేని వనమేల?**
**రాజు పాలింపని రాజ్యమేల?**
**తే॥గీ॥ రవి వికసనంబు లేనట్టి దివసమేల?**
**ధైర్యమొదవని వస్తాదుతన మదేల?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 43

**తా.** ఓ వేణుగోపాలా! భర్తకు ప్రేమ కలిగింపలేని భార్యయొక్క యౌవనమెందులకు? సువాసన లీనని పూవులగుంపు లెందుకు? పండితులు కవిశ్రేష్ఠులు లేని సభ యెందులకు? చంద్రుడు లేని నక్షత్రసమూహ మెందులకు? పుత్రులు లేని పురుషుని సంపద యెందులకు? కలహంసలు సంచరింపని కొలను ఎందులకు? చిలుకలు – కోకిలలు కూయని ఉద్యానవనము లెందుకు? రాజు పాలింపని రాజ్యమేల? (అది అల్లకల్లోలమైపోవునని ధ్వని). సూర్యుడు ప్రకాశింపని దినమెందులకు? ధైర్యము లేని మల్లయుద్ధవీరుని వస్తాదుతన మెందులకు? ఇవన్నియును లోకమున వ్యర్థములని భావము. సూర్యుడు కన్పింపని రోజును దుర్దినమందురు. 'మేఘచ్ఛన్నేతి

దుర్దినం” అనిగదా నిఘంటువు.

కలిమి + ఏల = 'కలిమియేల' అనుట సరియైన రూపము. “కలిమేల” కాదు – ఏమ్యాదుల ఇత్తునకు మాత్రమే సంధి వైకల్పికము. కలిమి ఏమ్యాదులలోనిది కాదు.

**సం.వ్యా.** “పుత్రసంతతి” = “పుత్రసంపద” (రెండు ప్రతులలోను. కాని “పుత్రసంతతి” అనుటయే వాడుక.); “రవివికసనంబు” = “రవివికాసంబు” (అకాడెమీ ప్రతి).

**సీ॥ పరకాంతపయి నాసపడెడి మానవులకు**
**నగుబాటు, మనమునఁ దగని దిగులు;**
**నగడు, విరుద్ధంబు, నాచార హీనత,**
**చేసొమ్ము పోవుట, సిగ్గు చెడుట;**
**అపకీర్తి, బంధుజనాళి దూషించుట,**
**నీతియుఁ దొలఁగుట, నిద్రచెడుట;**
**పరలోక హాని, లంపట నొంది మూల్గుట,**
**పరువు దప్పుట, దేహబలము చెడుట;**
**తన యాలిచేతఁ బోటునఁ గృశించుట, దాని**
**వరుఁడు గన్గొనిన జీవంబు విడుట;**
**తే॥గీ॥ ముజ్జగములేలు నా విరాణ్మూర్తికైనఁ**
**గాని, దుర్వృత్తి తగదెంత వానికైన;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 44**

**తా.** ఓ వేణుగోపాలా! పరస్త్రీని ఆశించు మానవులకు, లోకమున నగుబాటు కలుగును. మనస్సులో ఎల్లప్పుడును తగని దిగులు బాధించును. నింద కలుగును. వ్యతిరేకత యేర్పడును. మంచి ఆచారమునకు హీనత్వము కలుగును. చేతిలోని సొమ్ము పోవును. సిగ్గు చెడును. అపకీర్తి కలుగును. బంధుజనులందఱును నిందింతురు. నీతిలేనివాడని భావింపబడును. నిద్రపట్టదు. పరలోకమునకు కీడు. అనగా స్వర్గాది సుఖలోకములు లభింపక నరకాదులకు పోవును. ఆపద పొంది

మూల్గుట సంభవించును. పరువుప్రతిష్ఠలు నశించును. శారీరక బలము తగ్గిపోవును. ఆ పరస్త్రీ భర్త చూచినచో ప్రాణములే పోవును – ఇన్ని దుర్లక్షణములు గల పరస్త్రీవ్యామోహము మూడు లోకములు పాలించు విరాణ్మూర్తికి కూడ తగదు. ఇటువంటి తగని దుష్టప్రవృత్తి ఎంతవానికేనియును తగినది కాదు.

ఈ పద్యము పంచపాది. 'అగడు విరుద్ధంబు' అనుచోట నిందా వ్యతిరేకతయను నర్థము వచ్చును. కావున వానిని వేఱుపదములుగా అర్థము స్వీకరింపవలెను.

**సం.వ్యా.** "తనయాలిచేతఁ బోటున" = "తనయాలి చేతిపోటును" (మూడు ప్రతులలోను); "జీవంబు విడుట" = "జీవంబు తెగుట" (శతకమంజరి), "జీవంబుఁ గొనుట" (శతకవాఙ్మయ సర్వస్వము). 'అగడు' = నింద, 'విరుద్ధంబు' = వ్యతిరేకత, 'లంపట'=ఆపద, 'పోటున' = బాధతో, 'దుర్వృత్తి' = చెడ్డనడవడిక.

**సీ॥ పరదళంబులఁ గాంచి భయముచే నుఱికిన–**
**రాజుఁగాఁ దతఁడు గోరాజుగాని;**
**ధర్మంబులకు విఘాతము సేయ – మంత్రి శే**
**ఖరుఁడుగాఁ దతఁడు సంకరుఁడుగాని;**
**విద్యాప్రసంగముల్ విన రసజ్ఞత లేని–**
**ప్రాజ్ఞుల సభగాదు రచ్చగాని;**
**పతితోడఁ గలహించి పడుకొని యేడ్చెడి–**
**దాలుగాదది యెల్లతేలుగాని;**
**తే॥గీ॥ శాస్త్రముల మించినట్టి యాచారమైన–**
**నిష్ఠగాదతనికిఁ బెనుచేష్టగాని;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 45

ఈ పద్యమున "రాజుగాఁ దతఁడు గోరాజుగాని" అన్న దానికి "రాజుగాఁ దతఁడు తరాజుగాని" అనునది పాఠాంతరము – అదియే సరియైన పాఠమని నా భావము. గోరాజనగా ఆబోతు. ఆబోతు మరియొక ఆబోతుతో పోరాడునే గాని

వెనుకకు తగ్గదు; పారిపోదు. (తరాజు = త్రాసు)

మూడవ పాదమున "రసజ్ఞత లేనిది – ప్రాజ్ఞులసభ కాదు" అనవలె. ఏవస్తువును చెప్పుచున్నాడో ఆ విశేష్యము పూర్తికాలేదు.

"నిష్ఠగాదతనికిఁ బెనుజెష్ఠగాని," అని యొక పాఠము. చేతివ్రేళ్ళకు గోరుచుట్టు వలె జెష్ఠలను వ్యాధి కలుగును. అది మిక్కిలిగా బాధించు స్వభావముకలది. అందుకే తిట్టుకొనేటప్పుడు ముఖ్యముగా స్త్రీలు "నీచేతిలో 'జెష్ఠ' పుట్ట" అని తిట్టుచుందురు. నిష్ఠ–జెష్ఠ ప్రాసయతికి సరిపోయినది కాన నిదియే సరియగు పాఠమని నా తలంపు. తేళ్ళలో 'ఎఱ్ఱతేలు' కుట్టిన ఎక్కువ బాధించునుగాన 'ఎఱ్ఱతేలు' అని ప్రత్యేకముగా కవి ప్రయోగించియుండును.

**తా॥** శ్రీవేణుగోపాలదేవా! శత్రుసైన్యములను జూచి, భయముతో పారిపోయినవాడు రాజుగాడు, కేవల మాబోతు మాత్రమే. ప్రభువు దానమిచ్చు సమయమున మంత్రి వచ్చి ఆ దానమునకు ఆటంకమును కలిగించినచో ఆతడు మంత్రిశేఖరుడు కాడు, ఆతడు సంకరజాతివాడు (అనగా రెండు కులముల స్త్రీ పురుషులకు పుట్టినవాడు). విద్యాప్రసంగములు చేయువేళ వినుటకు రసజ్ఞత లేనిది ప్రాజ్ఞులసభ కాదు, అది కేవలము రచ్చబండయే. భర్తతో పోట్లాడి పండుకొని దుఃఖించునది భార్యకాదు, అదియొక యెఱ్ఱని తేలు. శాస్త్రములలో చెప్పిన దానికన్న అతిగా ఆచరించెడి ఆచారము, అది నిష్ఠకాదు, అది పెనుచేష్ట సుమా!

**సం.వ్యా.** "విన రసజ్ఞతలేని" = విను రసజ్ఞులు లేక" (శతకమంజరి);

**సీ॥ పానంబు, జూదంబుఁ, బరసతిపయి బాళి,**
**ధనకాంక్ష, మోహంబు, తగనియాశ;**
**అనుదినంబును వేట, యధికనిద్దురఁ గొంట,**
**పేదతికంబును, బితికితనము;**
**నతిలోభమును, మందగతి, హెచ్చుకోపము,**
**నమితవాచాలత, యనృతములును;**
**ఖండితంబాడుట, గర్వంబు, సంధ్యల**
**వేళలఁ బయనంబు, విప్రనింద;**

**తే॥గీ॥ ఆప్తజనుల దూఱుట, యమితతిండి,**
**మానవేంద్రుల పదవికి హానులివ్వి;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 46**

**అర్థములు:** బాళి = కాంక్ష, ఆసక్తి, మోహము; ఖండితము + ఆడుట = ఖండించుచు మాటలాడుట, నిరాకరించుచు మాటలాడుట.

**తా.** ఓ వేణుగోపాలస్వామీ! నిరంతరము మద్యమును సేవించుట; ద్యూతవ్యసనిగా మారుట; పరునిభార్యను పొందుట యందాసక్తి; ధనమునందతిమోహము – అతికాంక్ష; తగని ఆశను పొందుట; ప్రతిదినమును వేటకు పోవుట; అధికమైన నిద్రపోవుట; పేదతనమును భయము (యుద్ధాలయందు భయము చెందుట); అత్యధికమైన లోభత్వము (అనగా మితిమీరిన పిసినారితనము); మందగతి – అనగా ఏవిషయము నాలోచించుటయందుగాని దానిని ప్రయోగించుట యందుగాని చాల నిదానము; మితిమీఱిన కోపము; నిరంతరము నేదో విషయమును మంచిచెడులనుమాని వాగుట; అబద్ధములు చెప్పుట; ఏ విషయమైనను కఠినముగా మాటాడుట; గర్వమునందియుండుట; అసురసంధ్యల యందు ప్రయాణము చేయుట; వేదవిదులైన విప్రులను నిందించుట; ఆప్తులైన బంధువులను, స్నేహితులను, హితులను నిందించుట; ఎల్లపుడును మితములేక విరివిగా తినుట (తిండిపోతుగా నుండుట)– అను లక్షణములు జగతిని పాలించు రాజశ్రేష్ఠులకు కీడును కలిగించును.

ఈ పద్యమున 'అధిక నిద్దుర' – 'అమిత తిండి' – అనునవి రెండును వైరి సమాసములు. ప్రయోగయోగ్యత లేనివి. 'అధిక నిద్రయు', 'అమిత భుక్తి' అనుచో దోషము తొలగిపోవును.

**సం.వ్యా.** "అమితతిండి"= "అసురు తిండి" (మూడు ప్రతులలోను, "రాక్షసతిండి" అని అర్థము); "హానులివ్వి" = హానులివియ" (రెండు ప్రతులలోను) శతకవాఙ్మయ సర్వస్వములో: "అతిలోభమును"="అతిక్రౌర్యమును"; "సంధ్యలవేళలఁ బయనంబు" = "ప్రజ్ఞలు, విడువనివైరంబు", (ప్రజ్ఞలు=బడాయి మాటలు, ఉదా॥ ఉత్తరకుమార ప్రజ్ఞలు)

**సీ॥ పాలనలేని భూపతియైన, నతని ద**
**గ్గఱనుండు మంత్రి దగ్ధీయుఁడైనఁ;**
**జెవిటి రాయసమైన, సేవకుఁ డవుఁడైన,**
**వారసగాఁడు దివానునైన;**
**వరుసబక్షీ చిత్తవైకలుండయినను,**
**గడుదీరసత్తి వకాలతైనఁ;**
**గోశపాలునకును గుందేటివ్యాధైన,**
**నుగ్రాణగాని కత్యుగ్రమయిన;**
**తే॥గీ॥ దాతలకు మోస, మచటి విద్వాంసులకును**
**బ్రాణకంటక, మాభూమి ప్రజకుఁ గీడు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 47**

**అర్థములు:** దగ్ధీయుడు = పనికిమాలినవాడు, అన్ని పనులను నాశనము చేయువాడు (?); రాయసము = వ్రాతపని (ఇచ్చట "రాయసకాడు" – "జాబులు వ్రాయు నుద్యోగి" అను నర్థములో ప్రయోగింపబడినది.); అవుడు = అవిటి, అంగహీనుడు, అంధుడు; వరుసబక్షీ = సేనాధిపతి; "దీరసత్తి" అనగా "దీర్ఘవృత్తి" కావచ్చును. దీనికి "మిక్కిలి ఆలోచించుచు ఆలస్యముగా పనులుచేయువాడు" అను అర్థమును చెప్పవచ్చును. (?); వకాలతు = (హిందీ పదము) న్యాయవాది; కుందేటి వ్యాధి = ఒకరకమైన వ్యాధి (?); ఉగ్రాణము = బొక్కసము, ఖజానా, కోశము; ఉగ్రాణకాడు = కోశాధికారి.

**తా.** ఓ వేణుగోపాలా! పరిపాలనలేని భూపతియైనను; అతని దగ్గఱనుండు మంత్రి పనికిమాలిన ప్రజ్ఞకలవాడైనను; వ్రాయసగాడు చెవిటివాడైనను (ఒకటి చెప్పినచో వినపడక మఱియొకటి వ్రాయుననుట); సేవచేసెడు పరిచారకు డవిటివాడైనను; ధనమునకు కర్తయైనవాడు అనగా ఔరసుడు దివానుగా నున్నను; సైన్యాధిపతి చిత్తచాంచల్యము కలవాడైనను; ఆలస్యముగా పనులు చేయువాడు న్యాయవాది యైనను; ధనాగార రక్షకునకు కుందేటి వ్యాధియైనను (కుందేలు ఆకలియైనపుడు

తన అంగమును తానే కుడుచుకొను ననుట); అనగా అందలి ధనమును అతడే హరించునని భావము. వస్తుసామగ్రినుంచు కొట్టున కధికారియైనవాడు మిక్కిలి కోపస్వభావుడైనను; దాతలకు మొదలికి మోసము వచ్చును. విద్వాంసులకు ప్రాణసంకటమగును. ఆ భూమియందు వసియించు ప్రజలకు కీడు జరుగును.

'దగ్ధీయ' శబ్దము విచారణీయము. 'దగ్ధుడు' అనగా దహింపబడినవాడు. వానికి సంబంధించినదను అర్థము అపుష్టమగును.

'చిత్తవైకలుండు' – వికల శబ్దమునకు భావార్థక తద్ధితమున వైకల్యమగును. చిత్తవైకల్యము – లేక చిత్తవికలుడగును.

వ్యాధి + ఐన = వ్యాధియైన అగునుగాని 'వ్యాధైన' కాదు. 'అత్యుగ్రమయిన' "ఉగ్రాణగాని కత్యుగ్రత యైనను", అని యుండవలె.

**సం.వ్యా.** "చిత్తవైకలుండయినను" = "చిత్తవైకల్యుఁడయినను" (రెండు ప్రతులలోను); "కడుదీరసత్తి" = "కడు దీర్ఘవృత్తి" (శతకమంజరి); కుందేటి వ్యాధైన = "కుందేటి తెవులైన" (రెండు ప్రతులలోను. ఇదియే సాధుపాఠము.)

**సీ॥ పీనుఁగందపుమోముఁ, బిల్లిమీసంబులుఁ,**
**గట్టెశరీరంబుఁ, గాకినలుపు;**
**ఆర్చుకన్నులు, వెన్నునంటిన యుదరంబుఁ,**
**జొళ్లు కాఱెడి నోరు, ఒళ్లుకంపుఁ;**
**జేచెయ్యిఁ దిగరాచి చెక్కిళ్లు రుద్దుట,**
**దవుడలు సొట్ట, పాదములు మిట్ట;**
**యొకరినిఁ జూచి మేలోర్వక యేడ్చుట,**
**దౌర్భాగ్య గుణములుఁ, దగని యాశ;**
**తే॥గీ॥ యిట్టి యవలక్షణపు మంత్రి నేర్పరింప,**
**దొరకు నపకీర్తిఁ దెచ్చు నా దుర్జనుండు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 48**

**తా.** ఓ వేణుగోపాలా! పీనుగుముఖమువలె కళయు కాంతియు లేని వికారమైన

ముఖము; పిల్లి మీసములవంటి మీసములు; కట్టెవలె అటునిటు వంగని శరీరము; కాకినలుపువంటి నల్లని శరీరచ్ఛాయ; ఎప్పుడు మూయుచు తెఱచుచు నుండు ఆర్పుడు కన్నులు; వెన్నునంటుకొనియున్న పొట్ట; రెండు చేతులను ఎప్పుడును రుద్దుకొనుచు, ఆ చేతులతో రుద్దుకొన్న చెక్కిళ్లు; చొల్లు కారుచున్న నోరు; శరీరమునందు చెడ్డకంపు; చొట్టలు పడిన దవడలు, ఎత్తైన పాదముల పైభాగములు; ఇతరుల మేలోర్చుకొనలేక ఈర్ష్యతో నేడ్చుట; అత్యధికమైన ఆశ – ఇటువంటి దుర్గుణములు గల వ్యక్తిని మంత్రిగా నేర్పరచుకొన్నచో, ఆతడు ప్రభువునకు అపకీర్తిని తెచ్చును. అటువంటి దుర్జనుడు మంత్రి పదవికి తగడు.

తనను ప్రభువు సన్మానింపనుండగా, దానిని చెడగొట్టిన మంత్రినిగూర్చి యీ నిందాశతకమును వ్రాసెను కదా! ఆ మంత్రినిగురించి చెప్పినదే యీ పద్యము. ఆ మంత్రికి సంబంధించిన లక్షణములిందులో ఒకటి రెండైనను ఉండవచ్చును.

**సం.వ్యా.** "చొళ్ళు కాఱెడి నోరు, ఒళ్ళు కంపు" = "నురుఁగు కాఱుచునుండు నోరు కంపు" (శతకమంజరి); "నురుఁగు చారల ముంపు నోటికంపు" (శతకవాఙ్మయ సర్వస్వము). శతకవాఙ్మయ సర్వస్వములోని మరిరెండు పాఠములు = "మేలోర్వక యేడ్చుట" = "మేలోర్వలేకేడ్చుట"; "దొరకు నపకీర్తిఁ దెచ్చు" = "దొరలకపకీర్తిఁ దెచ్చు".

**సీ॥ పూపొదలో డాఁగి పులియున్న రీతిని,**
**మొగలిరేకున ముండ్లు మొలచినట్లు;**
**నందనవనములో నాగుఁబామున్నట్లుఁ,**
**జందురునకు నల్పు చెందినట్లు;**
**సొగసైన లేమకు సెగరోగమున్నట్లు,**
**మృగనాభిలోఁ బిప్పి తగిలినట్లు;**
**జలధిలోన విషంబు సంభవంబయినట్లుఁ,**
**గమలాప్తునకు శని గలిగినట్లు;**
**పద్మరాగమునకుఁ బటల మేర్పడినట్లు,**
**బుగ్గవాఁకిట చుట్టు పుట్టినట్లు;**

**తే॥గీ॥ ధర్మవిదులైన రాజసంస్థానములను**
**జేరు నొక్కొక్క చీవాట్లమారి శుంఠ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 49**

**తా.** ఓ వేణుగోపాలా! పూపొదరింటిలో పులి దాగుకొని యున్నట్లుగా (పూలు కోయబోవువారిని గబుక్కున బయటకువచ్చి చంపునని భావము); మొగలి పూరేకునకు ముళ్లు కలిగినట్లుగా (అంటుకొన్నచో గ్రుచ్చుకొనునని భావము); దేవతోద్యాన నందన వనమునందు త్రాచుపామున్నట్లుగా (అందు విహరించువారిని అదను చూచి కాటువేయును); తెల్లని చందమామలో నల్లదనము చేరినట్లుగా; చాల సౌందర్యవతియైన స్త్రీకి సెగరోగము (లైంగిక సంబంధవ్యాధి) ఉన్నట్లు (అనగా ఆమె అందమును చూచి ఎవ్వడైన ఆమెను రమించిన సెగరోగము తగులుకొనునని భావము); కస్తూరియందు పిప్పి కన్పించినట్లు (అంటే అది స్వచ్ఛమైనది కాదు. ఏదో కల్తీ కలిసినదని భావము); సముద్రమున విషము పుట్టినట్లుగా; సూర్యుని శని ఆవహించినట్లు (అనగా సూర్యునకు కాంతి తగ్గినట్లుగా అని, అట్లుకాక శనైశ్చరుడు సూర్యుని కుమారుడే 'సూర్యునకు శని జనించినట్లు' అని మఱియొక అర్థము); పద్మరాగమను రత్నమునకు పటల మేర్పడినట్లు (ఆ రత్నమునకు చుట్టును మలిన మొక వలయముగా ఏర్పడి దాని కాంతిని మూసివేయును. అది త్వరగా పోక ఎన్నో రీతుల దానికి విలువను తగ్గించును); బుగ్గలమీద గుండ్రముగా ఒక వలయము పొక్కులతో నేర్పడినట్లుగా (ఒక పట్టాన తగ్గదు) – ఈ విధముగా ధర్మాత్ములైన రాజసంస్థానములందు, చీవాట్లమారి వెధవ ఒకడు చేరుచుండును.

ఈ పద్యము పంచపాది. "చందురున నల్పు చెందినట్లు" అను పాదమున గణభంగము జరిగినది. "చందురందున నల్పు చెందినట్లు" అని గాని "చందురునను నల్పు చెందినట్లు" అని గాని ఉన్నచో సకల విధ దోషరహితమగును.

ఈ పద్యము కూడ ఆ మంత్రిని గురించి చెప్పినదియే.

**సం.వ్యా.** "సొగసైన లేమకు సెగరోగమున్నట్లు" = "సొగసుకత్తెకు జడ్డతెగులు కల్గిన యట్లు" (శతకమంజరి). అకాడెమీ ప్రతిలో మాత్రము ఈ "రంగయ్య–

రంగాచార్యప్రతి"లో నున్నట్లే కలదు. ఇదియే సాధుపాఠము. "జలధిలోన విషంబు" = "జలధిలో పెద్దక్క" (శతకమంజరి). "బుగ్గవాఁకిట చుట్టు పుట్టినట్లు" = "బుగ్గవాకిట చెట్టు పుట్టినట్లు" (శతకమంజరి.) ఇక్కడ "బుగ్గ" అనగా "నీటిబుడ్డ" – "పర్వతాదుల యందుండి సంతతధారగా పైకుబికి వచ్చెడు నీరు" అనునర్థము చెప్పికొనవలెను.

**సీ॥ పయిమాట లొకలక్ష పలికిననే సరా!**
**హంకారవర్తన నడఁపవలయు;**
**నడఁపఁజాలక కానలందుఁ బోయిన సరా!**
**యెఱుకఁ దెల్పెడు మూర్తి దొరకవలయు;**
**దొరకినాడని వేడ్క నరసిననే సరా!**
**గురుపదంబుల భక్తి కుదురవలయుఁ;**
**గుదిరెనంచని యూరకుండిననే సరా!**
**పాయకాత్మను బాటిసేయవలయుఁ;**
**తే॥గీ॥ జేసిననుగాదు, పాఁచినిఁద్రోసి శుద్ధ**
**గంగయెత్తినయటు ముక్తిఁగాంచవలయు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **50**

**తా.** ఓ వేణుగోపాలా! అవధరింపుము. ముక్తిని పొందుటకు వలసిన విషయ మీ పద్యమున ప్రస్తావింపబడినది. వేదాంతమునుగుఱించి లక్షమాటలు మాటాడినంతనే సరిపోవునా? తనయందలి అహంకారమును (నేను అనునది) పూర్తిగా అణచివేయ వలయును. అహంకారమును అణపలేక అరణ్యములకు పోయి తపస్సు చేసికొన దలంచిన సరియా? దైవదర్శనభాగ్యమునందిన సద్గురుడు లభింప వలయును. అటువంటి జ్ఞాని గురువుగా లభించినాడని భావించినచో సరిపోవునా? సరిపోదు. గురువుగారి పాదములయందు స్థిరమైన భక్తి కుదరవలయును. ఆ విధముగా గురుపాదయుగళియందు భక్తి కుదిరినదని యూరకుండిన సరిపోవునా? ఆత్మను తెలిసికొని ఆత్మయందు తాను లయించి పోవలయును. అనగా "ఈ దేహము

నేను కాదు. నేను ఆత్మస్వరూపమును" అను జ్ఞాన మనుభవమునకు రావలయును. అట్లు పొందినను చాలదు. నీటిలో పేరుకొన్న పాచిని చేతులతో ప్రక్కకు తొలగించి, మంచినీటిని దోసిలితో పైకి ఎత్తి త్రాగినట్లుగా, మనస్సు నావరించిన అజ్ఞానమును తొలగించి, శుద్ధ ఆత్మతత్త్వ విజ్ఞానగంగను పొందిననేగాని ముక్తి లభింపదు.

"కుదిరెనంచని యూరకుండిననే సరా" అను చోట అఖండయతి దీనిని లాక్షణికులంగీకరింపరు. 'కుదిరెనంచూరక కులికిననేసరా?' అని దిద్దుకొన్న ఆ దోసంగు తొలగిపోవును.

**సం.వ్యా.:** "పయిమాట లొక లక్ష పలికిననేసరా! హంకారవర్తన నడcపవలయు" = "పైమాట లొక లక్ష పలుకంగను సరా, యహంకారవర్తన మణcగ వలయు" (శతకమంజరి); "వేద్కనరసిననే సరా!" = వేద్కనరయంగనే సరా!" (శతకమంజరి).

**సీ॥ మంగలకత్తిపై నంగవేసినయట్లుc,**
**గోదెత్రాచును ముద్దులాడినట్లుc;**
**గొఱవితో నడినెత్తి గోcకిన, ట్రీనిన**
**పులితోడ సాముకుc బూనినట్లుc;**
**బెదసింగమును జూల నదలించుకొనినట్లు,**
**మినుకు వజ్రపురవ మ్రింగినట్లుc;**
**గొర్తిమీcదను గొంతుకూర్చుండుకొనినట్లు,**
**నూcతిపైc బసిబిడ్డ నునిచినట్లు;**
**తే॥గీ॥ క్ష్మాతలేంద్రుని సేవ కష్టంబు, వార**
**లిచ్చిరని గర్వమున నిక్కి తిరుగరాదు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 51**

**తా.** ఓ వేణుగోపాలదేవా! మంగలికత్తి చాల పదనుగా నుండును. దానిపై కాలుచాచి అడుగుపెట్టినచో, ఆతని కాళ్లు తెగిపోవును. కోడెత్రాచును ముద్దుగొనినట్లు – అనగా అది కాటువేసిన ముద్దులాడినవాడు మరణించును.. నిప్పుకొఱవిని గైకొని నడినెత్తి మీద గోకికొనినట్లు – అనగా తలపైని కాలి చర్మము మాడిపోవును.

అప్పుడే ఈనిని పెద్దపులితో పోరాటినట్లు (సాము అనగా కఱ్ఱతో గాని కత్తితో గాని చేయు సాము. అది ఒక విధముగా యుద్ధమే) – అనగా పులి ఆతనిని చంపివేయును. ఈనిన పులి మిక్కిలి ఆకలితోను క్రోధముతోను నుండును. భయంకర సింహమును రాళ్ళతో కొట్టినట్లు – అది వానిని హతమార్చును. వజ్రపు రవ్వను మ్రింగినట్లుగా – (దానిని మ్రింగినవాడు జీవింపడు. దానిని పొడిచేసి మ్రింగినచో మరణింతురుగాని, దానిని నేరుగా మ్రింగినచో అది మలవిసర్జనవేళ క్రింద పడిపోవును). "కొఱ్ఱు" శబ్దమునుండి "కొర్తి" వచ్చినది. "కొఱ్ఱు" అనగా "శూలము, వధసాధన విశేషము" – దీనినుండి "కొఱుతవేయుట" వచ్చినది. ఇది పూర్వకాలమున నుండెడి ఒక భయంకరమైన శిక్ష. ఘోరమైన తప్పులు (హత్యలు, దారిదోపిడులు మొ॥వి) చేసిన బందిపోటు దొంగలకు రాజులు ఈ శిక్షను విధించెడివారు. దోషికి పదనైన శూలముపై కూర్చుండబెట్టి, చిత్రహింసలతో చంపుదురు. (కొఱుత వేసిన వానిని కొఱ్ఱు (శూలము) పైని కూర్చుండ బెట్టి గిఱ్ఱున త్రిప్పుదురు. ఈ కొఱ్ఱు బరమావలె మెలికలు తిరిగి యుండును. పైని మొన చాల వాడిగా నుండును. అది ముద్దాయి గుదము గుండా లోనికి చొచ్చుకొని పోవును. అక్కడనుండి ఆ దొంగ గుండ్రముగా తిరుగుచుండగా అతని ప్రేవులు తెగి బైటకు వచ్చును. మిక్కిలి బాధతో ఆతడు చచ్చును. రాజులు పెద్ద నేరము చేసినవారిని కొఱుత వేయుదురు. దీనినే "శూలప్రోతుని చేయుట" యందురు.) అట్టి పదనైన కొఱ్ఱుపై గొంతుకూర్చుండినట్లు – అనగా ఆ శూలము వాని శరీరమందు క్రమముగా దూరి ఆతనిని చంపివేయును. నూతిగోడ మీద పసిబిడ్డను పండుకొన బెట్టినట్లు – అనగా ఆతడు దొర్లి బావిలోపడి మరణించును. పైని చెప్పిన వెంత భయంకర కార్యములో రాజుసేవకూడ అంత భయంకరమైనది. రాజులు మెచ్చి యిచ్చిరని ఎవ్వడును గర్వముతో చరింపరాదు. రాజుల చిత్తములు క్షణికములు. ఎప్పుడు కోపము వచ్చునో ఎప్పుడానందము కలుగునో తెలియదు. కోపము వచ్చిన పైని చెప్పిన శిక్షలవంటివి తప్పవు.

"ఇచ్చిరని గర్వమున నిక్కి తిరుగురాదు" అనుటలో యతిపోయినది. 'ఇ' కిని – 'తి'కిని యతి చెల్లదు. "ఇచ్చిరని గర్వమునఁ జరియింపరాదు" అనినచో సరిపోవును. 'అదలించు' అను దానిపై స్వార్థప్రత్యయమైన "కొను" చేరినచో "తనను తా నదలించుకొనిన" అర్థము వచ్చును.

**సం.వ్యా.** శతకమంజరిలో “ఇచ్చిరని గర్వమున నిక్కి యెగురరాదు” అని యున్నది. ఇందు యతిదోషము లేదు. ఇదియే సరియైన పాఠమని నా భావన. అకాడెమీ ప్రతిలో కూడ “ఇచ్చిరని గర్వమున నిక్కి మెచ్చరాదు” అనియున్నది. ఇందుకూడ యతిభంగము రాదు.

**సీ॥ మకరందపానంబు మధుకరాళికిఁగాక,**
**జోరీఁగ చవిగని జుఱ్ఱగలదె?**
**హరిపదాబ్జధ్యాన మమనస్కులకుఁగాక,**
**చెనఁటి సద్భక్తితోఁ జేయఁగలఁడె?**
**కవితారసజ్ఞత సువివేకులకుఁగాక,**
**యవివేకి చెవియొగ్గి యానఁగలఁడె?**
**పద్మినీరతివేడఁ బాంచాలునకుఁగాక,**
**దేబైన షండుండు తెలియఁగలఁడె?**
**తే॥గీ॥ రాజసభలఁ బరోపకారములు దెలుప**
**శ్రేష్ఠులేగాక, దుష్టులు చెప్పఁగలరె?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 52**

**తా.** శ్రీ వేణుగోపాలా! పూవునందలి తేనెను తేనెటీగలు (తుమ్మెదలు) పానము చేయగలవుగాని, జోరీగలు ఆ మకరందపు రుచిని జుఱ్ఱుకోగలవా? లేదు. మహావిష్ణువుయొక్క పదపద్మముల ధ్యానము, అమనస్కయోగులు (అచల పరిపూర్ణ సిద్ధాంతములో అమనస్కయోగము ప్రధానమైనది) చేయగలరు కాని మూర్ఖుడు సద్భక్తితో ధ్యానింపగలడా? లేదు. కవితారసము నాస్వాదించుట వివేకముగల సహృదయులకేగాని అవివేకియయినవాడు కవితాగానమును చెవియొగ్గి వినగలడా? పద్మినీజాతి స్త్రీ నాయికలలో శ్రేష్ఠురాలు. నాయకులలో పాంచాలుడు శ్రేష్ఠుడు. పద్మినీ స్త్రీ సంగమమును పాంచాలుడు వేడుకొనగలడుగాని, అసమర్థుడైన నపుంసకునకు తెలియునా? తెలియదు. రాజసభలలో పరులకు చేయు

ఉపకారములనుగురించి శ్రేష్ఠులైనవారు చెప్పగలరుగాని దుష్టులు చెప్పగలరా? చెప్పలేరని భావము.

ఈ పద్యమంతయు అపుష్టార్థ సంవలితము. 'మకరందపానము' అనునది ఒకే సమాసపదము. దానిని చేయుటకు తుమ్మెదలకే సాధ్యము. జోరీగ దానిరుచి తెలిసి జుఱ్ఱగలదె? అనుట ప్రమాదము. మకరందమును 'జుఱ్ఱుట' అనవలెను గాని – మకరందపానమును జుఱ్ఱుటెట్లు?

'కవితారసజ్ఞత' అనగా కవితారసాస్వాదనము. అది సువివేకులకే సాధ్యము. "అవివేకి చెవియొగ్గి ఆనగలడె?" కవితారసజ్ఞతను ఎలా ఆలకింపగలడు? "కవిత్వగానమును చెవియొగ్గి ఆలకింపగలడె" అనవలెను.

పద్మినీరతిసుఖమును పాంచాలు డెఱుగునుగాని, షండుడెట్లు తెలియగలడు? అనవలె. పద్మినీరతిని వేడుట పాంచాలునకును తగును.

ముందు పద్యములో కూడ నూతిపైనుంచిన పసిబిడ్డడు – నూతిపై ఎలా ఉంచెదరు? సమీపార్థములో "నూతిగట్టుమీద"యని అర్థమును గ్రహింపవలెను. **సం.వ్యా.** "పద్మినీరతి వేడ" = "పద్మినీసతి పొందు" (శతకమంజరి), 'పద్మినీరతి వేడ్క" (అకాడెమీప్రతి). "పద్మినీరతి వేడ" అనునది సరియైన పాఠము కాదు.

**సీ॥ మద్యపాయీలతో మచ్చిక కారాదు,**
**బడవాల గొప్పగాఁ బట్టరాదు;**
**శాత్రవునింట భోజనము సేయఁగరాదు,**
**సన్న్యాసులను గేలిసలుపరాదు;**
**దేవభూసురవృత్తి తెరువుఁ బోవఁగరాదు,**
**పరునాలిపై నాసపడఁగరాదు;**
**కంకోష్టునకు నధికార మియ్యఁగరాదు,**
**చెలఁగి లోభినిఁ జేరఁ బిలువరాదు;**
**తే॥గీ॥ లంచగొండ్లను దగవులకుంచరాదు,**
**మాతృపితురులయెడ భక్తి మఱవరాదు;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **53**

**తా.** ఓ వేణుగోపాలా! త్రాగుబోతులతో స్నేహము చేయరాదు. తార్పుడుగత్తెలను గట్టిగా పట్టుకొనరాదు. శత్రువునింటిలో భోజనము చేయకూడదు. సన్న్యాసులైన వారిని ఎగతాళి చేయకూడదు. దేవతాభూములు–బ్రాహ్మణాగ్రహారముల జోలికి పోరాదు. ఇతరుని భార్యయందు ఆశపడకూడదు. "కంకోష్ఠునకు" ("మొండివానికి") అధికారమును కట్టబెట్టరాదు. పిసినారివానిని పేరుపెట్టి పిలువరాదు. లంచ గొండులను తగవులు తీర్చెడి న్యాయస్థానమునందుంచరాదు. వాడు ఒకరియొద్ద నుండి లంచమును తీసికొని వారివైపు న్యాయనిర్ణయమొనర్చును. తల్లిదండ్రులయందు భక్తిని మఱచిపోరాదు.

ఇందు 'బడవాలు' పదము పడవాలు కావచ్చును. పడవాలనగా సైన్యాధిపతి. ఆతనిని గట్టిగా బట్టరాదనినాడు. పడవాలులో ప్రథమ పరుషాక్షరము సరళాక్షరము ఎలా అయినదో తెలియక బడవాలుగా వ్రాసినాడు. బడవా + ఆలు = అని తార్పుడు గత్తెయంటిని. పడవాలునకు కొంతస్వేచ్ఛనీయవలెను. కాని గట్టిగా గిరిగీసి అందులోనే ఉండునట్లు పట్టుపట్టరాదు. పద్యమున 'బడవాల' అని యున్నది.

'కంకోష్ఠ'దను పదము నిఘంటువులలో నగోచరము. కంకోష్ఠదనగా మూర్ఖుడు కావచ్చును. మూర్ఖున కధికార మీయరాదని కవి ఉటంకించినాడని భావింపవచ్చును. ఇలాంటి పదాలు ఆనాటి మాండలికములు కావచ్చును. ఇట్టి పదము లెన్నింటినో కవి వాడియున్నాడు.

"దేవభూసురవృత్తి తెరువుఁ బోవగరాదు." – అనుటకంటె "దేవభూసురవృత్తి తెరువునఁ బోరాదు" అనినచో స్పష్టముగా నుండును.

'పితరులు' అనగా తల్లిదండ్రు లిరువురును వత్తురు. 'జగతః పితరౌ వందే' అని కాళిదాసు ప్రయోగము. 'మాతృపితల' అనుటతోనే సరిపోవును కదా!

"శాత్రవు నింట భోజనము సేయఁగరాదు" అనునది భారతనీతి. శ్రీకృష్ణుడు పాండవదూతగా కౌరవుల యొద్దకు వచ్చినపుడు దుర్యోధనుడు కూరల రుచుల నతిగా ఉగ్గడించును. అపుడు శ్రీకృష్ణుడు "నీవెన్ని చెప్పినను నీయింట నేను భోజనము చేయనుగదా! శత్రువునింట భోజనము చేసినచో ఆతడు అమృతమునే పెట్టనిమ్ము

తిన్నవానికేదైన శారీరకారోగ్యమున భిన్నత్వమేర్పడిన ఆతడేదియో విషపదార్థమును వడ్డించి చంపప్రయత్నించెనని లోకము భావించును" అని చెప్పును.

**సం.వ్యా.** "కంకోష్టము" అను శబ్దము ప్రొ॥ రవ్వా శ్రీహరిగారి "శ్రీహరి నిఘంటువు"లో కరీంనగర్ జిల్లా మాండలిక పదముగా నీయబడినది. "కంకోష్టము" = కొఱుకరాని కొయ్య. కాబట్టి "కంకోష్టుదు" అనగా "మొండివాడు" అను అర్థమును గ్రహింపవచ్చును. బడవా = 1. తార్చునది, 2. తార్చువాడు. ఒక తిట్టుగా వాడబడును (శబ్దరత్నాకరము); బడవాలు=బహువచనము. బడవాల=బడవాలన్. "శతకమంజరి" లో మొదటి పాదము "మద్యపాయులతోడ మచ్చిక కారాదు, భడవాల గొప్పగాఁ బట్టరాదు" అని యున్నది. "లంచగొండ్లను దగవుల కుంచరాదు" = "లంచగాండ్లను దగవుల నుంచరాదు" (శతకమంజరి), "లంచగొండ్లను దగవుల నుంచరాదు" (అకాడెమీ ప్రతి), శతకవాఙ్మయసర్వస్వము: "మద్యపాయీలతో" = "మద్యపాయులతోడ". ఇదియే సరియైన రూపము. మద్యపాయి+లు = మద్యపాయులు; "తెరువుఁ బోవఁగ రాదు" = తెరువునఁ బోరాదు" (ఇదియే సాధుపాఠము); "పరునాలిపై" = "పరులాంగ్రగని"; "లోభినిఁజేరఁ బిలువ రాదు" = "లోభినిఁజెంతజేర్పరాదు"; "లంచగొండ్లను" = "లంచగాంఁడ్రను"

**సీ॥ మన్ననలేని భూమండలేంద్రుని కొల్వు,**
**లాలింపనేరని లంజె పొందు;**
**వచ్చిపోవనియట్టివాని చుట్టతికమ్ము,**
**బుద్ధితక్కువవానియొద్ద ఋణము;**
**సరిగానివానితో సరసోక్తులాడుట,**
**బలవంతునింటను పడుచుఁగొనుట;**
**సామాన్యజాతితో జగడంబుఁ బూనుట,**
**మూర్ఖుని మైత్రికి మోహపడుట;**
**తే॥గీ॥ అధమమిది నరులకు భువి నజునకైన,**
**మఱచి యప్పని చేసిన మానహాని;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **54**

**తా.** ఓ వేణుగోపాలదేవా! మన్నించలేని భూపతికొల్వు సేయుట – గౌరవించలేని లంజెను పొందుట – రాకపోకలు లేనివాని బంధుత్వము – బుద్ధిలేనివాని యొద్ద అప్పుతీసికొనుట – సమానస్థాయి లేనివానితో సరస సల్లాపములాడుట – తనకన్న బలవంతులైన వారింటి పిల్లను వివాహమాడుట "కయ్యమునకు వియ్యమునకు నీడు జోడు కావలె"నని శతకకర్త వక్కణ. పామరజాతివారితో కలహించుట – మూర్ఖుడైనవాని స్నేహమునకు ఆరాటపడుట – మానవులకు అధమమైన కార్యములు. భూమిపై బ్రహ్మదేవునికైనను ఈ పనులు తగవు. ఈ విషయమును విస్మరించి, వానిని చేసినవానికి గౌరవమర్యాదలు మంటగలిసి పోవును.

**సం.వ్యా.** "వచ్చిపోవనియట్టివాని చుట్టఱికమ్ము" = "వస్తుపోతుండనివాని చుట్టఱికంబు" (శతకమంజరి); "అధమమిది నరులకు భువి నజునకైన" = "అధమమిది భువి నరులకు నజునికైన" (శతకమంజరి).

**సీ॥ మన్నించు నరపతి మమతఁ దప్పినవెన్క**
**నుత్తముం డాభూమి నుండరాదు;**
**పైవిటుం డొక్క దేర్పడినట్టి కాంతపై**
**నెంతవాఁడైన నాసింపరాదు;**
**అన్నదమ్ములతోఁ గొట్లాడి మానసము ని**
**ర్జింపక మును తామసింపరాదు;**
**పగతుఁడు నెనరుగా భాషించినను వాని**
**నెయ్యంబుఁ గొని చనవియ్యరాదు;**
**తే॥గీ॥ చెలులతో రాచకార్యముల్ చెప్పరాదు,**
**పలువ మంత్రైన దొరలకు పరువులేదు;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **55**

**తా.** శ్రీ వేణుగోపాలా! ఎంతో గౌరవించినరాజు ఆ అధికారియందు ప్రేమను విడిచిపెట్టిన తరువాత ఆ అధికారి ఆ అధికారపదవియందుండకూడదు. ఒక స్త్రీని వేరొక విటుడు ఆక్రమించుకొనిన తరువాత, ఎంతవాడైనను ఆ స్త్రీని ఆసింపరాదు. అన్నదమ్ములతో కలహించి మనస్సును నిర్జించుకొనక (బాధించుకొనక) తమో గుణముతో విజృంభింపరాదు. శత్రువైనవాడు ప్రేమగా ప్రవర్తించినను – చక్కగా మాటలాడినను స్నేహముచేసి ఆతనికి చనవియ్యకూడదు. స్త్రీలతో (ప్రేయసీమణులైనను) రాజకార్యములను గురించి చెప్పరాదు. (చెప్పిన నవి వెంటనే బహిర్గతములగును.) నీచుడైన మంత్రి రాజుల పరువును తీయును. (నిర్జించు = జయించు, బాధించు) "ఆడువారి నోటిలో ఆవగింజనానదని సామెత". దానికి కారణము ధర్మరాజు శాపమని భారత నిరూపణము.

"అన్నదమ్ములతొ" ఇక్కడ హ్రస్వమైన 'తొ' నిలువదు. ఆపాదమున అర్థమును స్పష్టము కాదు. ఈ కవికి అడ్డుతగిలిన మంత్రి ఎవ్వడో వానిని అవకాశము వచ్చినప్పుడెల్ల నిందించుచున్నాడు. "మంత్రైన" దోషము. "మంత్రియైన" అనవలె. 'కాంతపై' అనిగాక 'కాంతను' అనవలె. "ఎంతవాఁడైన నాసింపరాదు" అనుచోట ఇంచుకాగమ యతి తగదు.

**సం.వ్యా.** ఈ పద్యములోని కొన్ని పదములు పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "కాంతపై" = "వేశ్యపై"; "అన్నదమ్ములతొ = "అన్నదమ్ములను"; "భాషించినను" = భాషించెనని"; "నెయ్యంబుఁగొని చనవియ్యరాదు"="నెయ్యంబు గనక చన్వియ్యరాదు". అకాడెమీప్రతిలో కూడ కొన్ని భిన్నముగనే యున్నవి: "కాంతపై" = "వేశ్యపై"; "నిర్జింపక మును తామసింపరాదు" = "నిర్జింపక తా తామసింపరాదు".

**సీ॥ రణభేరి, తగవైన రాజు, శ్వేతచ్ఛత్ర,**
**మేనుఁగు, నివి నాలు గేకరాశి;**
**మారుండు, కీరంబు, మందసమీరుండు,**
**రాకాసుధాకరుం, డేకరాశి;**
**వేదముల్, గోవులు, విప్రోత్తములు, దర్భ,**
**లేర్పరింపఁగ నాలు గేకరాశి;**

**మూఢాత్ముఁ, డత్యంత మూర్ఖుండు, గాడిద,**
**కాకి, వీరలు నాలు గేకరాశి;**
**తే॥గీ॥ ద్విపద కావ్యంబు, ముదిలంజె, దిడ్డికంత,**
**యియ్యనేరని రండ, నాల్గేకరాశి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 56**

**తా.** ఓ వేణుగోపాలదేవా! 1. రణభేరి (రాజులు యుద్ధమునకు పోవుటకు గుర్తుగా మ్రోగించు వాద్యము) 2. న్యాయముగా పరిపాలించు రాజు. 3. రాజు సింహాసనముపైని విరాజిల్లు వెల్లగొడుగు. 4. రాజుగారి పట్టపుటేనుగు – ఇవి నాలుగును ఒకే రాశికి చెందును.

1. మన్మథుడు, 2. రామచిలుక (మన్మథుని రథము లేక వాహనము), 3. మెల్లమెల్లగా చల్లగా వీచెడు పైరగాలి, 4. పుర్ణిమానిశీథినిలో షోడశకళలతో విరాజిల్లు చంద్రుడును – ఈ నాలుగును ఒకేరాశి. ఇవి యన్నియు శృంగార రసపోషకములు – మన్మథునకు నెచ్చెలులు.

1. వేదములు, 2. గోవులు (ధర్మప్రతీకలు), 3. వేదవిదులైన బ్రాహ్మణ శ్రేష్ఠులు, 4. పవిత్రకార్యావసరమగు దర్భలును – ఈ నాలుగు ఒకేరాశి. ఆధ్యాత్మిక జీవనమునకివి సహకారులు.

1. మూఢ చిత్తుడు, 2. మిక్కిలి మూర్ఖుడు, 3. గాడిద, 4. కాకి – ఇవి నాలుగును ఒకే రాశి.

2. ద్విపద కావ్యము, 2. ముదుసలియైన వేశ్య, 3. పట్టీపట్టని చిన్న వాకిలి కంత, 4. ఉండియు దానము చేయనేరని రండ – యీ నాలుగు నొకరాశి. ఇవి ఎవ్వరికిని పనికిరానివని. ఈ పై 'ద్విపకావ్యముముదిలంజె, దిడ్డికంత'లను పనికిమాలినవిగా తొలుత చెప్పినవాడు శ్రీనాథమహాకవి.

ఈ పద్యమున నొక వరుస పాటింపబడినది. మొదట రాజు రాజ్యమును సక్రమముగా పాలించినచో ప్రజలు శృంగార రసభరితమగు ఆనందమయ జీవితమును గడుప గలరనియు, ఆనందమయ జీవితముతోపాటు ఆధ్యాత్మిక తత్త్వమును పాటింతురనియు – ఎంత గొప్పగా సమాజమున్నను, గాడిదలవంటి

మూఢులు, కాకులవంటి మూర్ఖులు సమాజములో భాగముగా నుందురనియు, లోభులు ఉందురనియు భావము.

ద్విపదకావ్యములలో ఉత్తమోత్తమ కావ్యము లెన్నో యున్నవి. ప్రజలలో మతవ్యాప్తికి సులభముగా నర్థమగు ద్విపద కావ్యములను సాధనముగా శివకవులు చేకొనిరి. శ్రీనాథు డేస్థితిలో అనినను, అది సత్యబద్ధము కాదు. (అతడే "పలనాటి వీరచరిత్ర" యను ద్విపద కావ్యమును రచించెను కదా! – సంపాదకుడు)

**సం.వ్యా.** ఈ పద్యములోని రెండు పదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి. "తగవైన రాజు" = "తెగువైన రాజు" (ధైర్యవంతుఁడైన రాజు); "ముదిలంజె" = "ముదిలంజ" (లంజ–లంజియ–లంజె సమానార్థకములు) అకాడెమీప్రతిలో "ముదిలంజె" = "ముదికాంత"గా మారినది.

**సీ॥ రతికిఁ దార్కొని సిగ్గు, రణమున భీతి, భో**
**జనకాలమందున సంశయంబు;**
**నిచ్చెడిదే చింత, నొచ్చిన యెడ లేమి,**
**వచ్చిన వానిపై హంకరింపుఁ;**
**దగవున మొగమోట, దానమిచ్చుకులకుఁ,**
**దపమొనర్చెడు వేళఁ దామసంబుఁ;**
**గూర్మి చేసినచోట కూహకం, బద్భుత**
**ద్రోహవర్తనులపై మోహదృష్టి;**
**తే॥గీ॥ అవని సత్కీర్తి కోసమై యాశనొందు**
**రాజవరులకు నివియ కారాని పనులు;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 57**

**అర్థములు:** హంకరించు = అహంకరించు; కూహకము = మోసము.

**తా.** ఓ వేణుగోపాలా! లోకమున సత్కీర్తి పొందవలెనని ఆశచెందు రాజశ్రేష్ఠులకు ఈ క్రింది చెప్పబోవు కార్యములు నిషిద్ధములు:–

స్త్రీతో సంభోగించుటకు సిద్ధపడి సిగ్గును చెందుట; శత్రువు యుద్ధమునకు తారసిల్లినపుడు భయముతో పారిపోవుట; భోజనముచేయు సమయమున ఎవరేమనుకొందురోయను సంశయముతో సగమాకలితో లేచిపోవుట; దానమిచ్చుటకు చింతించుట; అవమానమును పొందినపుడు బాధపడకుండుట; దానము పట్టుటకు వచ్చిన అర్థిపై హుంకారము చేయుట (భయపెట్టుట – అదలించుట); న్యాయమును చెప్పుపట్టుల మొగమాటముతో న్యాయమును తారుమారొనరించుట; మొగమిచ్చకములతో పొగడువారికే దానము సేయుట; తపస్సుచేయు సమయమున కోపమును ప్రదర్శించుట; ప్రేమతో మేలుచేసిన వారిని మోసగించుట; ద్రోహముచేయు దురితులయందు వ్యామోహపడుట – అను లక్షణములు కీర్తిని కోరెడు రాజు చేయకూడదు. రాజులకే కాదు మానవులందఱకు ఇవి వర్తించును.

"వచ్చిన వారిపై హంకరింపు" అను పాదమున యతి తప్పిపోయినది. "వచ్చిన వారిపై హెచ్చుకినుక" అన్నచో ఆ దొసగు తొలగిపోవును.

**సం.వ్యా.** ఈ పద్యములోని కొన్ని పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి. "ఇచ్చెడిదే చింత" = "ఇచ్చెడిచో చింత"; "నొచ్చినయెడ లేమి" = "మెచ్చినయెడ లేని"; "వచ్చినవానిపై హంకరింపు" = "అచ్చిన వానిపై హంకరింపు" (అచ్చు = అప్పుపడు, బాకీయుండు. కాబట్టి "అచ్చినవాడు" = అప్పుపడినవాడు, బాకీపడినవాడు–అని అర్థము); "రాజవరులకు నివియ కారాని పనులు" = "రాజవర్యుల కివియుఁ గారాని పనులు". "మెచ్చినయెడ లేని" అనుమాటలకు నాకు అర్థము తెలియుటలేదు. ఇచ్చట "మెచ్చిన యెడ, లేమి" అని మార్చుకొనినచో సరిపోవును. "ఎవరైనను మెచ్చుకొనినచో గర్వింపకుండుట" అను అర్థము చెప్పుకొనవచ్చును. అకాడెమీ ప్రతిలోని పాఠములు: "ఇచ్చిన యెడ లేమి" – "హుంకరింపు" – "ద్రోహవర్తనులపై నీహదృష్టి".

**సీ॥ రాజులమంచు బొజ్జలు పెంచఁగా రాదు–**
**అనిమొనలో నఱుకాడవలయు;**
**మంత్రులమని బొంకుమాటలాడినఁ గాదు –**
**ఇప్పింప నేర్చి తామియ్యవలయుఁ;**

**గవుల మంచని వింతగా నల్లినను గాదు-**
**చిత్రప్రబంధముల్ సేయవలయుఁ;**
**దపసులమని నిక్కి తలలు పెంచినఁ గాదు-**
**నిర్వికల్పసమాధి నెఱుఁగ వలయు;**
**తే॥గీ॥ నిచ్చినను నేమి - వినయోక్తు లెఱుఁగవలయు;**
**గడుసు కూఁతల సత్కీర్తి కలుగఁబోదు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 58**

**తా.** భక్తరక్షణశీలా! ఓ వేణుగోపాలా! మేము పాలించెడి రాజులమని గర్వపడుచు బొజ్జలను పెంచుకొనరాదు; యుద్ధరంగమున నిలిచి శత్రువులను తెగనరుక వలయును. మేము మంత్రులమని భావించి అబద్ధములు చెప్పరాదు - (వారేది చెప్పినను చెల్లును గదా!); అర్థులకు ప్రభువులచే సంపద లిప్పింపవలయును. తాముగా దానధర్మములు చేయవలయును. కవులమని క్రొత్తగా అల్లిబిల్లిగా కవితలు అల్లరాదు; చిత్ర ప్రబంధములను చెప్పవలెను. మేము తాపసులమను గర్వముతో జటలుపెంచిన చాలదు; నిర్వికల్ప సమాధిని నేర్వవలయును. (అన్యమెఱుగక మనస్సు నేకాగ్రమొనర్చి దైవమునందు చేర్చి ఐహికవిషయము లెఱుగకుండ ధ్యానముద్రలో మునిగియుండుటను నిర్వికల్ప సమాధి యందురు. అనగా ఏ వికల్పములును ఉండరాదు). కేవలము దానమొనర్చుటయే కాదు; వినయముతో దానముచేయుట నెఱుగవలయును. కఠినముగా మాటాడినచో సత్కీర్తి రాదు.

"రాజులమంచు బొజ్జలు పెంచఁగారాదు" - ఈ పాదమున యతి లోపించినది. 'రాజుల మంచు బొట్టలు పెంచఁగా రాదు' అన్నచో యతి కుదురును.

"నిర్వికల్ప సమాధి నెఱుఁగ వలయు" ఇక్కడ కూడ యతిస్థానము తప్పిన పోయినది. "నిర్వికల్పమాధి నేర్వవలయు" నన్నచో దోషము పరిహృతమగును.

'కవులమంచని వింతగా అల్లినను గాదు' అనుచోట ఏమియల్లుట? కావ్యము లల్లగారాదని చెప్పవలయును.

**సం.వ్యా.** శతకమంజరిలోని పాఠములు: "బొజ్జలు పెంచగారాదు" = "బొజ్జలు తివురంగఁగాదు"; "నిర్వికల్పసమాధి నెఱుఁగవలయు" = నిర్వకల్పసమాధి

నెగడవలయు" (నెగడు=ప్రసిద్ధికెక్కు, యత్నించు).

**సీ॥ "రామాండకతలెల్ల మేమెఱుంగనియవే?**
**కాటమరాజుకుఁ గర్ణుఁడోడె!**
**బోగోతకతలంతఁ బోల నెఱుంగమే?**
**యిగనేశుఁ డర్జును నిరగఁబొడిచె!**
**బారతకతలోన బాలరాజొక్కఁడు**
**కుంబకర్ణునిఁబట్టి కూలదన్నెఁ!**
**గందపురాణాలకతఁ బిల్లకాటేరి**
**యీరబద్రుని నలయించి చంపె!"**
**తే॥గీ॥ ననుచు మూర్ఖులు పలుకుదు రవనియందుఁ**
**గవివరులు వేడఁబోయిన కాలమందు!**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 59**

**తా.** మదించిన శత్రువులను నశింపజేయువాడా! ఓ వేణుగోపాలా! కవిపండితులు పోయి పామరజనుల కడ మేము రామాయణ-భారత-భాగవత- స్కంద పురాణాదులు చెప్పుదుమనగా, వారు అవియన్నియు తమకు తెలియునని, ఆ కథలలోని సారాంశమునిట్లు చెప్పుచున్నారు. రామాయణ కథ మాకు తెలియదా? కాటమరాజుకు కర్ణుడోడిపోయిన కథయే కదా! భాగవతకథను చక్కగా నెఱుగమా! విఘ్నేశ్వరుడు అర్జునుని విరగబొడిచిన కథయేకదా! భారతకథలో ఒక బాలరాజు కుంభకర్ణుని చావదన్నినాడుగదా! ఇక స్కందపురాణకథలో పిల్లకాటేరి వీరభద్రుని అలయజేసి చంపిన కథయేకదా! ఇవియన్నియు మాకు తెలిసినవే! అని మూర్ఖులు పలుకుచుందురు.

బూతుపద్యములలో నిది ప్రధానమైనది. పై పద్యము దీనిని బూతులేకుండ సవరించి వ్రాసిన పద్యము. అసలు పద్య రూపమిది:-

**"బోగోత కతలంత పోల నెఱుంగమే**
**యిజయుడు యిగనేశు నిరగ-ంగె**

**బారతకతలోన బాలరాజొక్కఁడు**
**కుంబకర్ణునిఁబట్టి గు-సించె**
**కందపురాణాలకత పిల్లకాటేరి**
**యీరబద్రుని యిసయించి చంపె"**

అనునది కవి వ్రాసిన పాఠము. ఇలాంటి అనేకములగు బూతులవలననే, ఈ శతకము ఆంగ్ల ప్రభుత్వకాలమున నిషేధింపబడినది. ఈ పద్యమంతయు పామరులు నిత్యమును మాటలాడుకొనుభాషలోనే వ్రాయబడినది. పామరులు పెద్దలకడ మాటాడునపుడు కూడ (స్త్రీలుకూడ) బూతుమాటలను యథేచ్ఛగా వాడుదురు. అవి దోషములని వారు భావింపరు. పైగా, కవి చౌడప్ప 'బూతు లేక దొరకు నవ్వు పుట్ట'దని కూడ వ్రాసినాడు. ఈ పద్యం అదే భాషలో వ్రాసినాడు. ఈ నాడు వెలువడిన రెండు నవలలలో ఆ పదాలనదేవిధంగా వాడినారు. వానికి పురస్కారాలు కూడ లభించినవి.

**సం.వ్యా.** శతకమంజరిలోని పాఠములు:– "బోగోతకతలంతఁ బోల నెఱుంగమే" = "బాగోతకతలంట పలుమాఱు యినలేదె"; "ఇరగఁబొడిచె" = ఇరగమొడిసె"; "కుంబకర్ణునిబట్టి కూలఁదన్నె" = "కుంబకర్ణుని బట్టి గుద్దిసంపె"; "యీరబద్రుని నలయించి చంపె" = యీరబద్రునిమెడ యిరఁగగొట్టె".

**సీ॥ లత్తుకరంగు చల్లడము, మిటారంపుఁ**
**జొకట్లు, తగిన మిర్జాకుళాయి;**
**మగఱాల పంచిక, మొగమందు జవ్వాది**
**తిలకము, జాతికెంపుల బులాకిఁ;**
**బులిగోరు తాళి, పచ్చల బాజుబందు, ని**
**ద్దామేల్కడాని జల్తారుపాగ;**
**కుడిపదంబునఁ గుజా, కుల్కు ఘంటలును ధు**
**ణిల్లని మ్రోయు మానికపుటందె;**
**తే॥గీ॥ నీటుగాఁ బిన్నవై పల్లెకూటమునకు**
**నరుగుచును, నట్టె ధేనుకాసురునిఁబట్టి,**

**కొట్టి, ధరఁ గూలఁద్రోయవా గుండెలవియ?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 60**

**అర్థములు:** చల్లడము = సగము తొడవఱకు బిగువగా కట్టెడు లంగోటా; మిటారము = నిక్కు; చౌకట్టులు = నాల్గు ముత్యములు చేర్చి కట్టిన పోగులు; కుళాయి = వస్త్రముతో నిర్మించిన గుండ్రముగానున్న కిరీటము; "మగఱాలు" అనగా వజ్రములు. "పంచిక" అనునది ఆభరణ విశేషము. మగఱాల పంచిక = వజ్రములతో చేసిన ఆభరణ విశేషము. బులాకు = ముంగఱ, ముక్కఱ. బాజుబందు = సందిట కట్టుకొను భూషణము. ఇందలి పదములన్నియు ఉరుదు పదములు. మహమ్మదీయరాజులు పాలించుకాలమున వారు ధరించిన అలంకారములపేర్లు

**తా.** ఓ వేణుగోపాలా! ఎఱ్ఱని లక్కరంగు లంగోటీ బిగించి, చక్కగా నిక్కిన నాల్గు ముత్తెముల పోగులు ప్రకాశింపగా, సొగసైన నలుచదరపు కిరీటమును ధరించి, వజ్రములతో చేసిన పంచికను (ఆభరణమును) ధరించి, మొగమునందు జవ్వాది (సుగంధ ద్రవ్యము) బొట్టును పెట్టుకొని, జాతికెంపులతో చేసిన (బులాకీని) ముంగఱను ముక్కు చివర అలంకరించుకొని, పులిగోరు పతకము వ్రేలాడుచుండగా, సందిట గరుడపచ్చలతో చేసిన బాజుబందులతో, బంగారు జలతారు తలపాగ చుట్టి, కుడికాలునందు కుజా ధరించి, మాణిక్యములు పొదిగిన అందెయొక్క విలాసముగా చలించు బంగారు గంటలు ఘల్లుఘల్లున మ్రోయుచుండగా, నీటుగా అలంకరించుకొని, చిన్నపిల్లవాడవై, పల్లెలలోని వీథులలో పోవుచు, ధేనుకాసురుని పట్టుకొని కొట్టి, వాని గుండెలు పగులగా నేలపై కూలద్రోచితివి.

ధేనుకాసురుని సంహరించినవాడు శ్రీకృష్ణుడుకాదు; బలరాముడు. ధేనుకాసురుడు గార్దభాకారమును దాల్చి మనుష్యులను చంపుచుండ, తాళవనమున బలరాముడు వానిని సంహరించెను; వీథులలో కాదు. పై అలంకారములు శ్రీకృష్ణుని ఒక మహమ్మదీయ యువరాజును చేసినట్లున్నవి.

**సం.వ్యా.** "తగిన మీర్జాకుళాయి" = "తగటు మిర్జాకుళాయి" (రెండు ప్రతులలోను. ఇదియే సాధుపాఠము. "తగటు" = సరిగ జలతారు, బంగరు రేకు); "మగఱాల పంచిక" = "మగవాల పంచిక" (రెండు ప్రతులలోను); మగవాఁడు = శూరుఁడు;

మగఱాలు = వజ్రాలు, మాణిక్యాలు; పంచిక = ఆభరణ విశేషము. "మగఱాల పంచిక" యే సరియైన పాఠముగా తోచుచున్నది. బులాకి = అడ్డబాస. "అట్టె ధేనుకాసురునిఁబట్టి" = "మధ్య ధేనుకాసురునిఁబట్టి" (శతకమంజరి).

**సీ॥ వంకర పాగాలు, వంపు ముచ్చెల జోళ్లుఁ,**
**జెవిసందుఁ గలములుఁ, జేరుమాళ్లు;**
**మీఁగాళ్ళపైఁ బింజె బాగైన దోవతుల్,**
**జిగితరంబుగను బార్సీమొహర్లుఁ;**
**జేఁపలవలెను బుస్తీ మీసముల్, క్కలం**
**దాన్పెట్టెలును, చేతదస్త్రములును;**
**సొగసుగా దొరవద్దఁ దగినట్లు కూర్చుండి,**
**రచ్చగాంఁద్రకు శిఫారసులు చేసి;**
**తే॥గీ॥ కవిభటుల గార్యమును విఘ్నములు సేయు**
**రాయసాల్ పిండములు తిను వాయసాలు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **61**

**తా.** ఓ వేణుగోపాలా! వంకర తిరిగిన తలపాగలను; పైభాగము ముందుకు వంగియున్న చెప్పుల జతలు (రాజులు ధరించు ముచ్చెలు ముందు భాగమున పైకి వంగియుండును); చెవుల సందులందు కలములు కలిగి; చేతిలో రుమాళ్లు (మన ఉత్తరీయముల కన్న చిన్నవైనవి. తువాళ్లు అని కొందరందురు. ఇంగ్లీషులో టవల్ అందురు – నేడు ప్రజలు వాడుకొను పెద్ద జేబుగుడ్డలవంటివి); పాదోపరిభాగము వఱకును పింజబోసి కట్టిన పంచెలును; జిగిజిగేలుమని ప్రకాశించు పార్సీదేశపు మొహరులును (ముద్రలు); చేపలను ఉపమింపదగిన పుస్తెమీసములును; కలములను పెట్టుకొను పెట్టెలును; చేత దస్త్రములును గలిగి; ప్రభువు వద్ద తగిన రీతిగా కూర్చుండి; తప్పుచేసినవారియెడల కొన్ని సిఫారసులు చేసి; కవిభట్టారకుల కార్యములను ఆటంకపరచువారు, రాయలు వేసిన ముష్టిపిండములను తిను కాకులతో సమానము.

"కవిభటుల కార్యమును విఘ్నములు సేయు" – గణభంగము. ఇది ముద్రా రాక్షసము. 'కవిభటుల కార్యములను విఘ్నము సేయు' అని ఉండి ఉండును.

ఈ పద్యమున కర్తృపదము స్పష్టముగాలేదు. 'అటువంటివారు రాయపిండములు తిను' అని ఉన్నచో స్పష్టముగా నుండెడిది. ఈ కవి మహమ్మదీయ రాజుల ఆస్థానములలో వాడుకొను పదములతో చాల సాన్నిహిత్యము కలవాడు. "రాజు" – "ప్రభువు" – అను పదాలకు ఎక్కువగా "దొర" అనియే వాడును. వెలమ ప్రభువుల కీపదము ప్రసిద్ధమైనది. కవిభటులనగా 'కవిభట్టారకు'లని కవి భావమై యుండవచ్చును.

**సం.వ్యా.** "కలందాన్ పెట్టెలును, చేతదస్త్రములును" = "కంఠఁ దావళములు, కడుపెద్ద వస్త్రములును" (అకాడెమీప్రతి); "కవిభటుల కార్యమును విఘ్నములు సేయు" = "కవిభటుల కార్యములకు విఘ్నములు చేయు" (రెండు ప్రతులలోను); "రచ్చగాండ్రకు శిఫారసులు చేసి" = "అంకులాండ్లకు శిఫారసులుచేసి" (శతకమంజరి). శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠములు:– "మీఁగాళ్ళపైఁ బింజె బాగైన ధోవతుల్" = "మీఁగాళ్ళపై పింజలూగెడు ధోవతుల్" (ఈ పాఠము బాగున్నది); "చేఁపలవలెను బుస్తీమీసముల్, కలందాన్పెట్టులును, చేత దస్త్రములును" = "చేఁపలవంటి పుస్తీమీసముల్, కలందాన్పెట్టె, లంగవస్త్రముల చుంగు"; "రచ్చగాండ్రకు శిఫారసులు జేసి" = "అంకులాండ్రకు సిఫారసులు చేసి"; "కార్యమును విఘ్నములు సేయు" = "కార్యములకు విఘ్నములు చేయు" (ఇదియే సరియైన పాఠము).

**సీ॥ వలపు రూపెఱుఁగదు వసుధ మర్త్యులకు, సూ**
**కరమైన మనిసిగాఁ గానిపించు;**
**నాఁకలిలో నాల్క యరుచి యెఱుంగదు,**
**అంబలైనను సుధయనుచుఁ గ్రోలుఁ;**
**గోపం బెదుటి గొప్ప కొద్ది యెఱుంగదు,**
**ప్రాణబంధువునైనఁ బగతుఁజేయు;**
**నిదుర సుఖం బెఱుంగదు, వచ్చినప్పుడు**
**కసవైన విరిశయ్య కానిపించుఁ;**

**గామంబు నిర్ణయకాలం బెఱుంగదు,**
**హెచ్చు చెందినవేళ నెనయఁగోరు;**
**తే॥గీ॥ హరునకైనను నివిగెల్వ నలవికాదు,**
**ఇతరులగు మానవులనంగ నెంతవారు!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 62**

**తా.** శ్రీ వేణుగోపాలదేవా! భూమిపై ప్రేమస్వరూపమే తెలియని మానవులకు పందియైనను మనష్యునిగా కన్పించును. (లోకమున ప్రేమ తెలియక, కామమే ప్రధానమైన వ్యక్తులు పందివంటి స్త్రీ నైనను మోహింతురని వ్యంగ్యము.) ఆకలితో ఉన్నవారి నాలుకకు అరుచి తెలియదు. కేవలము అంబలియైనను అమృతముగా త్రావుదురు. ఇతరులపై కోపమధికముగా నున్నప్పుడు గొప్పవారితోనైనను, అల్పులతోనైనను కలహింతురు. (పరస్పరము దూషించుకొందురని భావము). కోపము ప్రాణసమానుడైన బంధువునైనను శత్రువును చేయును. నిద్రకు సుఖము తెలియదు. బాగా నిద్రవచ్చినపుడు గడ్డిశయ్య యైనను విరిసెజ్జగా అనిపించును. కామవాంఛలు తీర్చుకొనుటకు, కామము ప్రకోపించినపుడు కాలనిర్ణయమును పాటింపక, ఎప్పుడు వాంఛ గలిగినచో అప్పుడే రతికార్యము నిర్వహింప పూనుదురు. (కామసుఖమునకు రాత్రివేళలు నిర్ణయింపబడినవి. ఒక వేళ పగలు కామవాంఛ కలిగినను అప్పుడే ఆ సుఖము నందుదురు. పగటిరతి శాస్త్రనిషిద్ధము. మనుధర్మశాస్త్రము, ఋషిప్రోక్త కామశాస్త్రములు కూడ భార్యాసంగమమునకు ప్రతిరాత్రియు పనికిరాదని నిషేధించినవి. ఆకార్యమునకు కొన్ని తిథులును, మంచిముహూర్తములను నిర్ణయించినవి. వానిని పాటించినచో సత్సంతానము కలుగునని చెప్పినవి). శివునంతటి వానికైనను ఈ లక్షణములు సామాన్యునకువలె దాటరానివే. అటువంటి సమయమున నిక సామాన్యమానవు లెంతవారు?

ఈ పద్యము పంచపాది. 'ఆఁకలి రుచి యెఱుఁగదు; నిద్ర సుఖమెఱుఁగదు' అను సామెతను రెండు పాదములలొనర్చి చక్కగా చెప్పినాడు.

**సం.వ్యా.** "గొప్ప కొద్ది యెఱుంగదు" = "గొప్ప కొద్దు లెఱుంగదు" (శతకమంజరి); "కసవైన విరిశయ్య కానుపించు" ఈ పాదమునకు అన్వయము కుదరదు. దీనిని

"కసవైన విరిశయ్యగఁగనుపించు" అని కాని, "కసవున విరిశయ్య కానిపించు" అని కాని మార్చుకొనవలెను. అకాడమీ ప్రతిలో నున్న "కసవైన విరిశయ్యగా గానుపించు"లో ఒక అక్షరమెక్కువైనది. దీనిని కూడ "కసవైన విరిశయ్యగఁ గనుపించు" అని సవరించినచో గణభంగ ముండదు. శతకమంజరిలో "కసవైన విరిశయ్యగాఁ గనపడు" అని యున్నది, "హెచ్చు చెందినవేళ నెనయఁ గోరు" = "ఇచ్చుచెందిన వేళ నెనయఁ గోరు" (శతకమంజరి).

**సీ॥ వాగ్భూషణంబు నీ వర్ణన సేయుట,**
**కర్ణభూషణము నీ కథలు వినుట;**
**హస్త భూషణము నీకర్చన సేయుట,**
**నేత్రభూషణము నీ నీటుఁ గనుట;**
**హృదయభూషణము నిన్మదిఁ బాయకుండుట,**
**మూర్ధభూషణము నిన్ మ్రొక్కుటరయ;**
**అంఘ్రిభూషణము నీయానందనిలయ ప్ర**
**దక్షిణం బేగుట ధర్మచరిత!**
**తే॥గీ॥ సతముగల భూషణము లెన్ని జన్మములకు**
**నెట్టివైనను వీని కెచ్చేమి కలదు?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 63**

**తా.** శ్రీ వేణుగోపాలా! నీదు మహిమను వర్ణించుటయే వాక్కునకు అలంకారము. నీ కథలను వినుటయే చెవులకు ఆభరణము. నీకు అర్చనసేయుటయే హస్తములకు భూషణము. నీ సౌందర్యమును చూచుటయే కన్నులకు నగ. నిన్ను మనస్సునందు ఉంచుకొని విడువక స్మరించుటయే హృదయమునకు అలంకృతి. నీదు పాదములకు తలవంచి మ్రొక్కుటయే శిరోభూషణము. నీ ఆనందనిలయమైన దేవాలయమునకు ప్రదక్షిణ మొనరించుటయే పాదములకు భూషణము. ఓధర్మచరితా! ఎల్లప్పుడును ఉండు ఈ అలంకారము లెన్ని జన్మములకు లభించును? మనమీనాడు ధరించు ఎంత విలువగల నగలైనను, పైని నేను చెప్పిన భూషణములను మిగిలిపోగలవా?

(వీనికన్న గొప్పవి కాగలవా?) లేదు.

"కమలాక్షు నర్చించు కరములు కరములు" అను పోతనగారి భాగవత పద్యము ఈ పద్యమునకు ప్రేరణ కావచ్చును.

లోకవృత్తములను నిందించుచు, ఎడనెడ నిట్లు దైవవర్ణనము చేయుట ఈ కవికి నైజము.

**సం.వ్యా.** "ఎట్టి వైనను వీనికెచ్చేమి కలదు?" = "ఇవియెకాఁ గనుటింత కెచ్చేమి గలదు?" (శతకమంజరి).

**సీ॥ వార్థక్యమున మంచి వయసుపెండ్లామైన,**
**దారిద్ర్యమునఁ బెక్కు తనయులైన;**
**ఆత్రుఁడౌ భూపతి కతిభాషి మంత్రైనఁ.**
**బొరుగున నత్తిల్లు పొసఁగకున్న;**
**సంగీతవరునకు జడదారితోడైన,**
**నెనుముతో నట్టేట యీఁదనైనఁ;**
**బెను వానకాలమందునఁ బైనమైనను,**
**జలికాలమున దీక్ష సలుపనైన;**
**తే॥గీ॥ మరణమిఁక వేఱు లేదు భూమండలమున,**
**లెక్కసేయంగ నగునె యీ దుఃఖమహిమ!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 64**

**తా.** ఓ వేణుగోపాలదేవా! ముసలితనమున మంచి కోడెవయస్సుననున్న స్త్రీ భార్యయైనను; మిక్కిలి పేదరికమందు ఎక్కువమంది కుమారులు కలిగినను; ఆత్రము (తొందర) కలిగిన భూపాలునకు నధికవాచాలుడైన మంత్రి యున్నను; పొరుగుననే అత్తగారియిల్లు లేకున్నను; మంచి సంగీతవిద్వాంసునకు జడదారి (సన్యాసి) తోడైనను; గేదెతోకను పట్టుకొని నడియేటిలో ఈదుటయైనను; నిండు వానకాలమున ప్రయాణము చేయవలసివచ్చినను; చలికాలమున ఏదైనను వ్రతదీక్ష

చేయవలసివచ్చినను; లోకమున మానవున కంతకన్న మరణము లేదు. ఆ బాధయొక్క ఆధిక్యమును లెక్కించుట కెవరి తరమగును?

ముసలితనమున పడుచుపెండ్లమైనచో ఆమె శరీరవాంఛల నతడు తీర్చలేడు. ఆమె పరులతో వ్యభిచరించుచున్నదని అతని కనుమానము. ఆమె ఎవరితో ఏమి మాటాడినను ఆతనికి వేదనయే! ఎవ్వరైన యువకు లింటికి వచ్చిన అనుమానము. ఆమె ఆతని మాట వినదు. అసలే పేదరికము. సంతానమెక్కువైనచో పోషించలేక అమితబాధ కలుగును. సంగీతము సన్న్యాసులకు వ్యతిరేకమైనది. సంగీత విద్వాంసుడు – సన్న్యాసి మూడు ఆరుగా నుందురు. మూడు ఇటు చూచుచుండ, ఆరు అటు చూచుచుండును. గేదెతోకను పట్టి నదిని ఈదదలచినచో గేదె హాయిగా నీటిలో పరుండును. తోకపట్టినవాడు నీటమునిగి మరణించును. అందుకే తత్త్వగీతములలో "కుక్కతోకాబట్టి గోదావరీదితే – కోటిపల్లేకాడ తేలేరయా!" అనగా చచ్చి అక్కడ తేలునని భావము. వానాకాలమున దారులు బురదతో నిండియుండును. మార్గములందలి జలప్రవాహము లధికముగా నుండి దాటుట కశక్యమగును. మార్గమున వర్షము వచ్చిన తడిసి చలికి వణుకుచు పయనింపజాలరు. చలికామున వ్రతదీక్షలన్నచో తెల్లవారుజామున నిద్రమేల్కొన వలయును. చన్నీళ్లు స్నానముచేయవలెను. ఏకభుక్తము. నేలమీద పరుండవలయును. భార్యాసంయోగము నిషిద్ధము. అందువల్ల ఒకకవి–

"శీతలజల స్నానంబును – భూతలశయనంబు నొంటిపూఁట యశనమున్ –నాతిగల బ్రహ్మచర్యము – నాతరమా? పూఁట గడుప నారయభూపా!" అన్నాడట.

"పెక్కు తనయులైన" – "పెక్కురు తనయులైన" అని యుండవలయును. "ఆత్రము" శబ్దమునకు "తొందర"యని అర్థము. తొందరగలవాడు 'ఆత్రగాడు' అని ప్రయోగములున్నవే తప్ప 'ఆత్రుడు' ప్రయోగము చింత్యము.

పద్యమంతయు అనుకూలపద్ధతిలో చెప్పి, ఒక్క పాదము మాత్రము నిషిద్ధరూపమున "పొరుగున నత్తిల్లు పొసఁగకున్న" అని చెప్పినాడు.

"మంత్రి + ఐన" = "మంత్రియైన" కావలెను. సంస్కృతమునకు తెలుగు సంధిని కలిపి ఈ కవి 'మంత్రైన' అని అనేక పర్యాయములు ప్రయోగించుట కన్పించును. "లెక్కసేయఁగ నగునె యీ దుఃఖమహిమ" అనుచోట యతిస్థానము

తప్పినది. "లెక్కసేయఁగ నగునె యీ వెక్కసమును" అని దిద్దుకొన్నచో ఆ దొసంగు తొలగిపోవును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పదములు, పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "మంచివయసు" = "పిన్నవయసు"; "ఆత్రుఁడౌ భూపతి కతిభాషి మంత్రైన" = "ఆత్రుఁడౌ విటకాని కతిభాషి లంజైన"; "పొసఁగకున్న" = "పొసఁగనైన"; "జడదారి" = "జలుపారి"(?) "ఈఁదనైన" = "ఈఁదుటైన"; "పైనమైనను" = "ప్రయాణంబైన"; "సలుపనైన" = "సలుపుటైన"; "వేఱు లేదు" = "లేదు వేఱ"; "లెక్కసేయంగ నగునె యీ దుఃఖమహిమ" = "గణనసేయంగ నగునె యీ కష్టమహిమ"; (అకాడమీప్రతిలో) "పొసఁగకున్న" = పొసఁగుటైన.

**సీ॥ వితరణశౌర్యప్రతిష్ఠునకే కాక-**
**మీసము పిసినారికోసకేల?**
**సిరిగల ఘనసువాసిని కొప్పునకుఁ గాక-**
**బొండుమల్లెలు బోడిముండకేల?**
**ప్రజ సుఖింపఁగఁజేయు పంటచెర్వుకుఁ గాక-**
**గండిగుంటకు ఱాతికట్ట యేల?**
**జాతైన బారాహజారి తేజికిఁ గాక-**
**కళుకుల కళ్ళెంబు ఖరముకేల?**
**తే॥గీ॥ నతులితంబైన యల పతివ్రతకుఁ గాక-**
**శుద్ధవేశ్యకు మంగళసూత్రమేల?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 65**

**తా.** ఓ వేణుగోపాలదేవా! దానశౌర్యముతో ప్రతిష్ఠ (గౌరవము) పొందిన పురుషునకు తగునుగాని, పిసినారి పనికిమాలినవానికి మీసమెందుకు? (మీస మాత్మ ప్రత్యయమునకు నిదర్శనము – అది పిసినారి కుండదు). చక్కని సిరిగల పుణ్యస్త్రీ కొప్పునకు బొండుమల్లె లలంకారమగును గాని, భర్తపోయిన విధవరాలు గుండుకొట్టించుకొను నామెకు బొండుమల్లె లెందులకు? ప్రజలు సుఖజీవనము

సేయుటకు వ్యవసాయమునకు నీటినందించు చెఱువునకు చుట్టును ఱాతికట్టడ మవసరమగును గాని, అసలు కట్టలు లేక, చుట్టును గండ్లుపడియున్న చిన్న నీటిగుంటకు, ఱాతికట్టడమెందులకు? జాతిగుఱ్ఱమైన ఆజానేయమునకేగాక, శ్రేష్ఠమైన కళ్ళెము గాడిదకు ఎందుకు? సాటిలేని వీరపతివ్రతకు మంగళసూత్ర ముండవలయునుగాని, వేశ్యాస్త్రీకి మంగళసూత్రమెందులకు? (వారికి ప్రత్యేకముగా ఒక భర్త ఉండదు కదా!). (ఆజానేయము = మేలుజాతి గుఱ్ఱము)

వేశ్యలకు విధవాత్వము లేదు. మంగళసూత్రమున్నను లేకున్నను వారు నిత్యసువాసినులే!

"జాతి + ఐన" = ఇది కూడ "మంత్రైన" వంటిదే! 'జాతియైన' అనవలెను. "ఖరముకేల? –నతులితంబైన" అనుట దోషము. "ఏల" యనునది నిత్యమైన కళ. ద్రుతప్రకృతికముకాదు. కనుక "ఖరముకేల? యతులితంబైన" అని యుండదగును. ఇదియు వ్రాయసగాని దోషము కావచ్చును. 'ఖరమునకేల' అని గదా! యుండవలె. శ్రీనాథుడే 'బచ్చునకు' అనుటకు 'బచ్చుకు' అని వాడియున్నాడు. ఆదే రీతిని కవులు అవసరమువచ్చినపుడెల్ల 'న' గాగమలోపము కావించుచున్నారు.

**సం.వ్యా.** "ఖరముకేల?" కు – "గాడ్దెకేల" అను పాఠాంతరము రెండు ప్రతులలోను కలదు.

**సీ॥ విద్యాధికుల రాజు వివరించి నిలిపెనా?**
**యిందఱేమిటికంచుఁ గుందుచుండు;**
**మోమీనుకుగ్రామునని చెప్ప, నొడ్లగిం**
**జలకు బరాతము ల్సరవి వ్రాయుఁ;**
**దిండికిఁ జేటుగాఁ బండితులేల? తె**
**ప్పున సెలవిమ్మని పోరుచుండు;**
**భారిశాల్వలు దెచ్చి బహుమతి నిమ్మన్నఁ,**
**దలఁపక సీమవస్త్రముల నిచ్చు;**
**తే॥గీ॥ నిట్టి యపకీర్తిమంత్రినిఁ బెట్టఁదగదు,**
**మంచిమాటల జరగఁబోయించవలయు;**

**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 66**

**అర్థములు:** బరాతము = (హిందీ పదము) లిఖితపూర్వకమైన ఆజ్ఞ; తెప్పున = శీఘ్రముగా.

**తా.** ఓ వేణుగోపాలదేవా! విద్వాంసులలో అధికులైనవారిని రాజు విచారించి కొలువు కూటమున నిల్పుకొన్నచో, మంత్రి ఇంతమంది విద్వాంసు లెందు కని బాధపడుచుండును. (రెండవ పాదము సరిగా అర్థమగుటలేదు) పండితులకు గ్రామమును ఈనాముగా - బహుమతిగా నిమ్మని చెప్పగా, వారికి ఈనాము లెందుకు? వడ్లగింజలు చాలునని, అవి మాత్రము ఇమ్మని ఆజ్ఞాపత్రములు వ్రాయును. (అనగా పండితులకు సన్మానాదు లెందుకు? కూలీలకువలె వడ్ల గింజల నిమ్మని ఆజ్ఞా పత్రము లిచ్చునని భావము కాబోలు). ఇంతమంది పండితులు తిండికి చేటు. త్వరగా వారికి సెలవిచ్చి పంపించవలసినదని రాజు చెవియొద్ద జేరి పోరుచుండును. శ్రేష్ఠమైన శాలువలు తెచ్చి పండితులకు బహుమతుల నిమ్మని చెప్పగా, విదేశములనుండి వచ్చిన సన్నని విలువతక్కువ వస్త్రములను తెచ్చును. ఇట్టి అపకీర్తిగల మంత్రిని ఆస్థానమున నియమింపదగదు. మంచి మాటలతో సాగనంపవలయును.

'ధాన్య'మను అర్థమున అజాదిగా 'ఒడ్లు' అను పదము లేదు. హలాదిగా 'వడ్లు' అనియే రూపము. ఇచ్చట 'ఒడ్లు' అనగా 'ఇతరు'లను అర్థమున తీసికొన్నచో ఇతరుల గింజలకు ఆజ్ఞాపత్రము వ్రాయునని భావము. 'ఇట్టి యపకీర్తి మంత్రిని పెట్టుకొన్న' అనుచోట 'నిట్టిమంత్రిని పెట్టుకొన్న రాజునకు అపకీర్తి వచ్చు'నని చెప్పుట లెస్స. ఈ పద్యమును కూడా కవి తనకు వ్యతిరేకముగా ప్రభువునొద్ద చెప్పిన మంత్రిని గురించియే వ్రాసినాడు.

**సం.వ్యా.** పై పద్యములో రెండవపాదము తప్పుగానున్నది. అందువలననే మిత్రులు శ్రీ వృషాద్రిపతిగారికి ఈ పాదము అర్థము కాలేదు. సరియైన పాఠము శతకమంజరిలో నిట్లున్నది:-

"మోయీను కుగ్రాణమును జెప్ప వడ్లగిం/జలకు బరాతము ల్సరవి వ్రాయు" "మోయీను" హిందీపదమనియు, దీనికి "బత్తెము" అని అర్థమనియు, దీని

రూపాంతరము" మోయిను" అనియు శబ్దరత్నాకరములోను, శబ్దార్థచంద్రికలోను నున్నది. "ఉగ్రాణము" అనగా "బొక్కసము" లేక "ధనాగారము". "ఒడ్లగింజలు" అపశబ్దమనియు, "వడ్లగింజలు" సరియైన శబ్దమనియు తమ తాత్పర్యములో శ్రీవృషాద్రిపతిగారు చెప్పినారు. ఈ పాఠములో సరియైన శబ్దమే ఉన్నది. బత్తెములు చెల్లించుటకు బొక్కసమునుండి అధికధనమును తీసి ఇమ్మని రాజు చెప్పగా, పిసినారి మంత్రి "ధనమెందులకు? బత్తెములకు వడ్లగింజలు చాలు"నని వేగముగా లిఖితపూర్వకమైన ఆజ్ఞనిచ్చును. అట్లే సీసములోని నాల్గవ పాదము కూడ శతకమంజరిలో భిన్నముగా నున్నది: "బారిశాల్వలు దెచ్చి బహుమాన మిమ్మన్న జౌకఖరీదు వస్త్రములనిచ్చు". "సీమవస్త్రములు" ఖరీదైనవి. "చౌక ఖరీదు వస్త్రములు" అనుటయే యుక్తము. "బారి" = "పెద్ద". శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠములు: "మోయీను కుగ్రాణమును జెప్పఁ గొట్లగింజలకు బరాతముల్ సరవి వ్రాయు"; "బారి సాల్వలుదెచ్చి బహుమతులిమ్మన్న చలువ కరీదు వస్త్రముల నిచ్చు"; "మంచి మాటల సాగనంపించవలయు" (ఇదియే సరియైన పాఠము).

**సీ॥ వండలేనమ్మకు వక్కణంబులు గొప్ప,**
**యారిపొయ్యెడి దివ్వె కధికదీప్తి;**
**కట్టనిల్వని చెర్వు గడియలోపల నిండు,**
**బ్రదుకనేరని బిడ్డ బారెడుండు;**
**వృద్ధినొందని చెట్టు వెఱ్ఱితీఁగిడు, జాడ్య,**
**మెచ్చు ముందటి కన్న నిచ్చు తళుకు;**
**మన్నించుటకు దొరల్ గని చనువిచ్చుట,**
**పొయి సాలకే పాలు పొంగుటెల్ల;**
**తే॥గీ॥ పెరుగుట విఱుగుట కనియు నెఱుఁగ లేక**
**యదరిపడుచుండు నొక్కొక్క యల్పజనుఁడు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **67**

**అర్థములు:** వక్కణము = వ్యాఖ్యానము; అదరిపడు = గర్వించు, త్రుళ్ళు.

**తా.** ఓ వేణుగోపాలా! వంట సరిగా చేయలేని స్త్రీ అది బాగులేదు – ఇది యిట్లా వండునది? అని విమర్శించుటకు పెద్ద. ఆరిపోబోవు దీపమునకు కాంతి యెక్కువ. బలహీనమైన కట్టలుకలిగిన చెఱువు ఒక్క గడియ కాలమునందు నిండిపోవును. బ్రదుకనిబిడ్డ పుట్టినప్పుడు బారెడుండును. వృద్ధినొందని చెట్టు వెఱ్ఱితీగలు వేయును. రోగమెక్కువయైన స్త్రీ (లైంగికవ్యాధి) ముందునకన్న (జబ్బు తగులుకొనకముందు కన్న) తళుకు బెళుకు లెక్కువగా ప్రకాశించును. గౌరవించుట వరకే దొరలు పరిమితముగా చనవిచ్చుట (దాన ధర్మములు చేయరనుట). పొయ్యి చాల యిరుకైనందు వలననే పాలు పొంగుట. ఎక్కువగా (సహజమున కన్న) పెరుగుట విరిగిపడిపోవుటకొఱకే. ఈ విషయము తెలియని, అల్పుడెప్పుడును గర్వించుచుండును. (అనగా తన అదరిపాటు త్వరగా అవమానమును పొందుటకే అని వ్యంగ్యము)

ఆరిపొయ్యెడి – రూపము చింత్యము. 'ఆరిపోయెడు' అన్నచో సరియగును. బ్రదకని బిడ్డ బారెడనునది సామెత.

'మన్నించుటకు దొరల్‌గని చనవిచ్చుట' యతి తప్పిపోయినది. 'మన్నించుటకు దొరల్ మఱి చనవిచ్చుట' అన్నచో ఆదొసంగు తొలగును. రెండవపాదములో "గట్టునిల్వని" – అనగా వెంటనేకట్టతెగిపోవునుగదా! మఱి అది గడియలో నిండుటెట్లు? నిండిన తరువాత కట్టతెగునని కవి భావమా? 'పోయిచాలకే పాలు పొంగుటెల్ల' అను పాదార్థము కూడ చింతనీయము. మంట పెద్దదియైనచో పాలు త్వరగా పొంగునుకదా!

**సం.వ్యా.** సీసపద్యములోని మొదటి పాదములోని మొదటి దళము "వండలేనమ్మకు వక్కణంబులు గొప్ప". దీనికి అకాడెమీ ప్రతిలో "అప్రయోజకునకు నారభటము గొప్ప" అను పాఠాంతర మీయబడినది. ఈ రెండును పండితులు మార్చివైచిన పాద దళములు. దీని మూలరూపము (అనగా కవి వ్రాసిన రూపము) శతక వాఙ్మయ సర్వస్వములో ఉదాహరింపబడినది. అది "స్ఖలిత శి–ము వికాసంబులు కడుగొప్ప" అనునది.

**సీ॥ హేమాచలము శృంగమెక్కి తెక్కార్చుచుఁ**
**గాకి కూయఁగనే పికంబుగాదు!**
**గంగాది నదులలోఁ గలయ ముంచంగనే**
**చీఁపురు పుల్లలు వేపగావు!**
**తెగఁదిని తలపిక్క లెగసి బలిసినఁగాని**
**దున్నపోఁ తేనుఁగు గున్నకాదు!**
**పొదుగు లావై యెంత పొడవుగాఁ బెటిఁగినఁ**
**గుక్కపోఁ తెన్నడు గోవుగాదు!**
**తే॥గీ॥ ఉన్నతస్థానమందుఁ గూర్చుండఁగానె**
**భ్రష్టు భ్రష్టుగుగాకను శిష్టుగాఁడు!**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 68**

**తా.** ఓ వేణుగోపాలస్వామీ! బంగారుపర్వతమైన మేరుపర్వతముయొక్క శిఖరము పైకెక్కి కాకి కూసినంతనే అది కోకిల కాదు. అనగా ఉన్నతస్థానమందున్నను అల్పుడు అల్పుడేగాని గొప్పవాడు కాలేడని భావము. గంగ మొదలైన నదులలో కలిపి ముంచినంతనే చీపురుపుల్లలు వేపపుల్లలు కావు. గంగ కలుషవిధ్వంసిని కదా! ఐనను చీపురుపుల్లను మార్చలేదని భావము. తెగతిని తలపిక్కలు తెగ బలిసినప్పటికిని, దున్నపోతు ఏనుగుగున్న కాలేదు. పొడవుగా పొదుగు ఎంత లావుగా పెరిగి వ్రేలాడినను కుక్కపోతు ఆవు కాలేదు. ఉన్నతస్థానమున కూర్చున్న యంతనే భ్రష్టుడైనవాడు భ్రష్టుడుగనే యుండునుగాని శిష్టుడు కాలేడు.

ఈ పద్యమున "చీఁపురు పుల్లలు వేప గావు", అనగా అల్పమైన వస్తువు గొప్పవస్తువు కాలేదని కవి చెప్పుచున్నాడు. చీపురు పుల్లలకన్న వేపపుల్ల లెలా అధికమైనవో నాకర్థము కాలేదు. చీపురు పుల్లలలోని అధమత్వము, వేపపుల్లలలోని ఆధిక్యము లేమి? చీపురపుల్లలు గంధపుచెట్టు పుల్లలు కావన్నచో కొంత అర్థవంతమగును.

పొదుగు విషయమున 'కుక్కపోఁతు' అనగా 'మగకుక్క'. మగకుక్కకు పొదుగెట్లు కలుగును?

"భ్రష్టుడు" పదమునకు 'భ్రష్టు' రూపాంతరము కలదు. కాని 'శిష్టుడు' అను దానికి 'శిష్టు' రూపములేదు. నీచాదులలో చేర్చి 'నీచుఁడు' > 'నీచు' అయినట్లు 'శిష్టుడు' > 'శిష్టు' అయినదని భావింపవలెను.

ఇదియును తనను వేధించిన మంత్రిని నిందించుటయే. పై లక్షణము లన్నియు ఆ మంత్రికి పట్టునని పిండితార్థము.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి. "చీపురుపుల్లలు వేపగావు" = "తలవెంద్రుకెన్నదు దర్భగాదు". "చీపురు పుల్లలు వేపగావు" అను వాక్యము అన్వయము కుదురని అసందర్భవాక్యమని శ్రీవృషాద్రిపతిగారు చక్కగా గుర్తించినారు. కాబట్టి "తలవెంద్రుకెన్నదు దర్భకాదు" అనునది సరిగా సరిపోవును. "ఎగసి బలిసినగాని" = "ఎగయఁగా బలిసిన". "భ్రష్టు భ్రష్టగుగాకను శిష్టుగాడు" = "భ్రష్టు భ్రష్టేయగుంగాని శిష్టుగాఁడు".

**సీ॥ పాలనలేని భూపతినిఁ గొల్చుట రోఁత,**
**యౌదార్యహీనుని నడుగ రోఁత;**
**కులహీనజనులతోఁ గలహింపఁగను రోఁత,**
**గుణహీన జనులతోఁ గూడ రోఁత;**
**పాషండ జనులపై భ్రాంతినొందుట రోఁత,**
**మద్యపాయిాలతో మైత్రి రోఁత;**
**తుచ్ఛపుఁ బనులకు నిచ్చనొందుట రోఁత,**
**చెలఁగి సద్గురు నిందసేయ రోత;**
**తే॥గీ॥ వేదబాహ్యుల విద్యలు వినఁగ రోఁత,**
**క్రూరుఁడైయున్న హరిభక్తుఁ గూడ రోఁత;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **69**

**తా.** పరిపాలన సరిగాలేని భూపతిని సేవించుట అసహ్యము. ఉదారస్వభావములేని వానిని అర్థించుట అసహ్యము. హీనకులజులైనవారితో పోట్లాడుట రోత. గుణ హీనులైనవారితో కలిసి చరించుట అసహ్యము. పాషండులనగా వేదబాహ్యులు. అనగా వైదికమతము నంగీకరింపనివారు– లోకాయతికులు – కాపాలికులు – చార్వాకులు – నాస్తికులైనవారిని పాషండులని పిలిచిరి. (అందుకే రామానుజుల వారు "పాషండద్రుమషండ దావదహను"లట – ఈ వాక్యము వైష్ణవులు చెప్పినది.) అటువంటి పాషండులైనవారియందు భ్రమకలిగియుండుట సహింపరానిది. త్రాగుబోతులతో స్నేహము చేయుట రోత. తుచ్ఛమైన పనులు సేయుటకు ఆసక్తి కలిగియుండుట రోత. సద్గురువులైన మహాపురుషులను నిందించుట రోత. వేద బాహ్యులైనవారి విద్యలాలకించుట అసహ్యము. హరిభక్తుడైనను, వాడు క్రూరస్వభావము కలవాడైయున్నచో వానితో కలిసియుండుట రోత.

**సం.వ్యా.** పై పద్యములో కొన్ని పదములు, పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "కలహింపగను" = "కలహించుటయు"; "గుణహీనజనులతోఁగూడ రోఁత" = "గుణహీనకామినిఁ గూడ రోఁత" (ఇదియే సాధుపాఠము). "మద్య పాయీలతో" = "మద్యపాయులతోడ".

**సీ॥ పసచెడి యత్తింట పడియెండుటయు రోఁత,**
**పరువు దప్పినయెడ బ్రతుక రోఁత;**
**ఋణపడి సౌఖ్యంబు లనుభవించుట రోఁత,**
**పరులకల్మికి దుఃఖపడుట రోఁత;**
**తన కులాచారంబుఁ దప్పి నడచుట రోఁత,**
**ధరణీశునకుఁ బిర్కి తనము రోఁత;**
**పిలువని పెత్తనంబులకుఁ బోవుట రోఁత,**
**యల్పుతో సరసంబులాడ రోఁత;**
**తే॥గీ॥ పరుల సంపదఁ గనుగొని భ్రమయ రోఁత,**
**బలములేనట్టి రాజుల బ్రతుకు రోఁత;**

**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **70**

**తా.** శ్రీ వేణుగోపాలదేవా! శక్తి నశించి అత్తవారియింటిలో తిండి లేక యెండుట రోత. గౌరవమర్యాదలు నశించిన పిదప బ్రదుకుట రోత. అప్పుచేసి సౌఖ్యములనుభవించుట రోత. "అప్పు చేసి పప్పు కూడు" అనునది సామెత. ఒకప్పుడు 'ఋణం కృత్వా ఘృతం పిబేత్' – అప్పు చేసియైనా నెయ్యిత్రాగు అని పెద్దలవాక్కు. ఇప్పుడు "ఋణం కృత్వా సురాం పిబేత్" – అప్పుచేసియైనను మద్యము సేవించు మనునది సామెత. కాని ఇవి తప్పు. ఇతరుల సంపదను చూచి ఓర్వలేక వగచుట రోత. తన వంశాచారమును తప్పించి సంచరించుట తగనిది. భూపాలకునకు పిఱికితనము అసహ్యము. పిలువని పెత్తనములకు వెళ్లుట రోత. ఇది "పిలువని పేరంటమునకు పోవుట రోత" అని సామెత. అల్లులైన వారితో సరసోక్తులాడుట రోత. సైన్య బలములేని రాజుల బ్రతుకు రోత. ఇతరుల సంపదను చూచి భ్రమనందుట రోత.

'పసచెడి యత్తింట పడియుండుట' అనేది సామెత. దీనిని 'పడియెండుటగా' కవి మలచినాడు.

**సం.వ్యా.** పై పద్యములో కొన్ని పదములు – పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "పడియెండుటయు" = "పడియుండుటది"; "ఋణపడి సౌఖ్యంబు లనుభవించుట రోఁత" = "ఋణపడి సుఖమున మునిగియుండుట రోఁత". తేటగీతిలోని మొదటి రెండు పాదములకు బదులుగా శతకమంజరిలో ఈ క్రింది రెండు పాదములున్నవి:–

"ఒకరి యాలిని గని వగనొంద రోఁత/సతికి జారపురుషుని బ్రతుకురోఁత" అకాడెమీ ప్రతిలో కూడ "పడియుండటది రోఁత" అనియే యున్నది.

**సీ॥ "నందిగణంబెక్కి నడివీథినే వచ్చు,**
**దైవమో? గంగయో? దమ్మరాజొ?**
**ఇసకాప్పసీనుఁడో? యూరుఁడో? యూస్పుడో?**
**ఈస్పుఁడైతే యెనకఁ దోఁక లేదే?**

**ఆళ్లరో? గణపతో? అమ్మ చీతమ్మరో?**
**చీతామ్మరైయుంటె సింగమేది?**
**మంచిది చూతాము! మారమ్మ కాఁబోలు!**
**మారమ్మ యైతేను మాలయేది?"**
**తే॥గీ॥ ప్రాకృతజనంబు లీరీతిఁ బలుకుచుంద్రు,**
**తెలివి యించుక లేకను దెలిసికొనక;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 71**

**తా.** ఓ వేణుగోపాలదేవా! (ఊరిలో ఉత్సవాలకు భగవంతుని ఊరేగింపు వచ్చుచుండును. అపుడు పామరజను లీవిధముగా అనుకొనుచున్నారని కవి యీ పద్యమును వ్రాసెను. ఇది పామర భాషలోనే వ్రాయబడినది) "శివుడు నంది వాహనారూఢుడై శివగణముతో నడివీథివెంట వచ్చుచున్నాడు. ఆయన దైవమా? గంగమ్మ దేవతా? లేక ధర్మరాజా? విష్వక్సేనుడా? వీరుడా? ఈశ్వరుడా? ఈశ్వరుడైతే వెనుక తోక ఉండవలెగదా! అది లేదే! ఆళ్వారులా? గణపతియా? అమ్మ సీతమ్మవారా? సీతమ్మవారైనచో వాహనము సింహం ఉండవలెగదా! మరి అదియేది? మంచిది. చూచుదము. మారెమ్మ కాబోలును మారెమ్మ ఐతే మెడలో పెద్ద మాల ఉండవలెగదా! ఆ మాలయేది?" – అని ప్రాకృతజనులు ఈ రీతిగా పలుకుచుందురు. వారికి కొంచెము కూడ తెలివిలేదు గనుక ఇట్లు పలుకుదురు. 'నంది గణంబెక్కి' – 'నంది వాహనమెక్కి' అనుటకు 'నందిగణంబెక్కి' అని భావించుటలోనే పామరత్వము గోచరించుచున్నది.

"ఈస్పృడైతే యెనక తోక లేదే?" గణభంగము – యతి స్థానము తప్పినది. "ఈస్పృడైతే యెన్క యేది తోక" అని వారి భాషలో పలికితే సరిపోవును. "లేకను" – "లేక" అనునది వ్యతిరేక క్త్వార్థకము – దీనిపై 'న' రాదు. 'లేకయే' అనవలెను.

**సం.వ్యా.:** పై పద్యములోని కొన్ని పదములు – పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "ఇసకాప్పసీనుఁడో" = "ఇసకాప్పశీనఁడో"; "ఈస్పృడైతే యెనకఁ దోఁక లేదే?" = "యీస్పృడైతే లేదె యెనకఁ దోఁక?" – ఈ పాదములో

గణభంగము, యతిభంగము రెండును లేవు. "మారమ్మ యైతేను" = మారమ్మరైతేను" – దీనికి "మారెమ్మొరయితేను" అని జానపదుల భావము. అకాడెమీ ప్రతిలోని పాఠములు "ఇసకాప్పసీనఁడో" – "యీసుఁడో" – "యీసుఁడైతే" – "ఆళ్ళరో".

**సీ॥ వేదశాస్త్రంబులు వినసొంపు లేదాయె,**
**సంగీతవిద్య బల్ చౌకనాయె;**
**కవితారసజ్ఞత కలలోను లేదాయె,**
**పారమార్థికబుద్ధి భస్మమాయె;**
**భూతలేంద్రులకు దుర్బుద్ధులు మెండాయె,**
**నీచమహత్త్వంబు నెగడిపోయె;**
**వర్ణాశ్రమాచారవర్తన లేదాయె,**
**హీనకులంబులు హెచ్చులాయె;**
**తే॥గీ॥ వావివరుసలు లేవాయె వసుధలోన,**
**నీదు కరుణయు రాదాయె నీరజాక్ష!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 72

**తా.** ఓ వేణుగోపాలదేవా! నేడు భూమిపై వేదములు – తర్క–వేదాంత – మీమాంసాది శాస్త్రములు వినుటకు సొంపులేనివయ్యెను. సంగీతవిద్య చాలచౌకయైనది. అనగా బజారులో ఏ పిచ్చిపాట పాడినను అది సంగీతముగా భావింపబడుచున్నది. దానికి లయ, తాళ– శ్రుతులు – సంగీత పరిజ్ఞాన మేమియు నవసరము లేదు.

కవితారసాస్వాదన కలలోకూడను లేనిదయ్యెను. పరమాత్మకు సంబంధించిన ఆధ్యాత్మికబుద్ధి కొంచెముకూడ మనుష్యులకు లేదు. భూమిని పాలించు రాజులకు దుర్బుద్ధులు అధికమగుచున్నవి. నీచుల గొప్పతనము పెరిగిపోవుచున్నది. బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్ర వర్ణవిభాగమునకు నిర్ణయింపబడిన ఆచారములు లేకుండపోయినవి. తక్కువకులములు హెచ్చుకులములుగా వ్యవహరింపబడు

చున్నవి. స్త్రీపురుషులలో వావివరుసలు నశించినవి. వీనిని సక్రమముగా తీర్చి దిద్దుటకు పద్మములవంటి నేత్రములుగల కృష్ణా! నీ దయరాకపోయెను గదా!

'చౌకన' అను పదము లేదు. 'చౌక' అనునదియే పదము. కనుక యడాగమము వచ్చి చౌకయయ్యె అని ఉండదగును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పదములు – పాదములు శతకమంజరిలో భిన్నముగా నున్నవి: "భూతలేంద్రులకు" = భూసురులకును"; "నీచమహత్వంబు నెగడిపోయె" = "అల్పుల వైభవ మధికమాయె"; తేటగీతి (ఎత్తుగీతి) లోని మొదటి రెండు పాదములు పూర్తిగా భిన్నముగా నున్నవి: "వావివరుసలు లేవాయె వసుధలోన / నీదు కరుణయు రాదాయె నీరజాక్ష!" = అవనిపై నింక నాఁడు పుట్టువు బ్రశస్త/మందు లంజగఁ బుట్టిన నధిక ఫలము" కాని ఈ పాదములు కవి వ్రాసిన నిజమైన పాదములు కావు. అసలు కవి వ్రాసిన పాదములు శతకవాఙ్మయ సర్వస్వములో నిట్లున్నవి:–

తే॥గీ॥ "అవని నిఁక మీఁద నొక్కదుడ్డంత తళుకు
యో–గల లంజముండగా నుండవలయు"

***సీ॥ మౌనంబుఁ దాల్చుట మనవిచ్చగింపమి,**
**గదిమివేయుట లోభకారణంబు;**
**దర్శనంబీయమి తప్పు సైపకయున్కి,**
**పెడమోముపెట్టుట ప్రియములేమి;**
**గర్వంబుఁ దెలుపుట కార్యాంతరాసక్తి,**
**సమయంబుఁగాదంట జరుపునేర్పు;**
**నరయుదమన్న రంధ్రాన్వేషణాసక్తి,**
**హత విషయంబు ధౌర్త్యంబు తెరువు;**
**తే॥గీ॥ ఇట్టిప్రభు దుర్ణయపుఁజేష్ట లెఱుఁగలేక**
**వెంబడించెడివాఁడెపో వెఱ్ఱివాఁడు,**
**దానికొడఁబడఁ డింగితజ్ఞానశాలి;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 73**

తా. దుర్ణయుడైన ప్రభులక్షణము లిందు వెల్లడించు చున్నాడు. ఓ వేణుగోపాలదేవా! ఎవ్వరైన వచ్చి ఏదో విన్నవించుకొనగా ప్రభువు మౌనము దాల్చి, ఔను – కాదు – అనక యుండుట–విన్నవించు కొన్న విషయమును ఇష్టపడకపోవుట – కాలమును గడిపివేయుట అనునవి రాజులోని లోభగుణములు.

అసలు దర్శనమే యీయకుండుట – ఏదైన చిన్న తప్పొనరించినను దానిని సహింపక శిక్షించుట – విషయమును చెప్పునపుడు పెడమోము పెట్టి వినకుండుట – అనునవి, ఆ వచ్చిన వానియందు ప్రేమలేకుండుటవలన.

గర్వమును ప్రదర్శించుట – చెప్పుకొనుచున్నపుడు దానినాలకింపక ఇతర కార్యాసక్తుడై వానిని గూర్చి పరులనడుగుచుండుట – ఇది నీ కార్యమును చేయుటకు సమయము కాదనుట – అనునవి దాటవేయు నేర్పు.

ఏదో తెలిసికొనవలెనన్న ఎప్పు డే తప్పు చేసెను? ఎప్పు డేమి భాషించెను? అను విషయములు తెలిసికొనవలయునను ఆసక్తి (రంధ్రాన్వేష తత్పరత), జరిగిన విషయ గ్రహణాలోచన ప్రభువుయొక్క ధూర్తలక్షణములు.

ఇటువంటి రాజుయొక్క దుర్ణయ దుశ్చేష్టలను ఎరుగకుండ ఆయనను వెంటబడి యాచించెడువాడు వెఱ్ఱివాడు (అనగా పిచ్చివాడు). పరేంగితజ్ఞానియైన వాడు ఈ లక్షణంబు లంగీకరింపడు. ఇందలి తేటగీతి పంచపాది.

**సం.వ్యా.** "మనవిచ్చగింపమి" = "మనసిచ్చగింపమి" (రామలింగేశశతకము); "గదిమివేయుట" = గడపివేయుట" (రామలింగేశశతకము); పై సీసపద్యములో నాల్గవపాదములోని ద్వితీయదళములో "హతవిషయంబు" అనునది ముద్రణ దోషముగా నేను భావించుచున్నాను. సరియైన పదము "అతివినయంబు". రెండు ప్రతులలోను, రామలింగేశ శతకములోను ఇట్లే ఉన్నది. ఇదియే సరియైన పాఠము. రాజు అతివినయము చూపినచో, అది ధూర్తలక్షణముగా గ్రహింపవలెను. "ధౌర్త్యంబు తెరువు" = "ధౌర్త్యంబుఁ దెలుపు" (రామలింగేశ శతకము)

*ఈ 73వ పద్యమునుండి 92వ పద్యమువరకుగల 20 పద్యములు, తరువాత

96వ పద్యమునుండి 99వ పద్యము వరకుగల నాలుగు పద్యములు, మొత్తము 24 పద్యములు అడిదము సూరకవి రచించిన "రామలింగేశ శతకము"లోనివి. ఇవి పోలిపెద్ది వేంకటరాయకవి రచించిన పద్యములు కావు. వీనికి పూలగుర్తు(*) ఉంచితిని. ఈ 24 పద్యములను రామలింగేశ శతకములోని పద్యములతో పోల్చి పరిశీలించాను. "రామలింగేశ! రామచంద్రపురవాస!" అనునది అడిదము సూరకవి మకుటము. దీనిని వేణుగోపాల శతక మకుటముగా మార్చివేసినారు లేఖకులు.

***సీ॥ తనతల్లి చోటనే తప్పు నటించిన**
**దురితాత్మునకు గురుద్రోహమెంత?**
**కొంకింతయును లేక గురునకెగ్గొనరించు**
**కఠినాత్మునకుఁ గృతఘ్నత్వమెంత?**
**కృతమెఱుంగని మహాకిల్బిషాయత్తచి**
**త్తునకు మిత్త్రద్రోహమనగనెంత?**
**పరమమిత్త్రుల బాధపఱచు దుర్ణయునకుఁ**
**బ్రజలనందఱఁ గష్టపఱచుటెంత?**
**తే॥గీ॥ యనుచుఁ దన చరిత్రంబుల నవనిజనులు**
**నిందసేయంగ బ్రతుకు దుర్నీతిపరుని**
**వైభవంబౌర! యని మెచ్చువాఁడెవండు?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 74

తా. కవి ఈ పద్యములో ఒక దుర్నీతిపరునిగురించి చెప్పుచున్నాడు. ఓ వేణుగోపాలదేవా! తన తల్లియందే తప్పొనరించినవానికి గురుపత్నిని చెఱచి గురుద్రోహముమొనరించుట ఎంతపని? జంకుకొంకులు లేక గురువుగారికే కీడు చేయు కఠినాత్మునకు, పరులు తనకొనరించిన మేలు మఱచిపోవుట యెంతపని? మంచిచెడు లెఱుగక మహాపాప చిత్తముతో నున్నవానికి మిత్రునకు ద్రోహమొనరించుట ఎంతపని? పరమమిత్రులన్నవారిని బాధించు దుశ్చరిత్రునకు,

ప్రజల నందఱను బాధపెట్టుట యెంతపని? అని ఆ పనులు చేసినవాడు తన ప్రవర్తనను ప్రజలు దూషించుచుండుగా వినుచు జీవించుచున్న నీతివిహీను డెంతవైభవమును గడించినను, దానిని "ఔరా!" అని మెచ్చుకొనువాడెవడు? ఎవడును మెచ్చడు. తొలిపాదమున తప్పునటించుట కాదు. తప్పుఘటించిన అని యుండనగును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పదములు "రామలింగేశ శతకము"లో భిన్నముగా నున్నవి. "తప్పు నటించిన" = "తప్ప నటించిన"; "కొంకింతయును లేక" = "కొంకొకింతయు లేక"; "కష్టపఱచుటెంత?" = "బాధపఱుచుటెంత?"; "తన చరిత్రంబులన్" = "తనదు చరిత్రంబులు" (ఇక్కడ "తన చరిత్రములన్" అను పాఠమే బాగున్నది); "బ్రతుకు దుర్నీతిపరుని" = "బ్రతుకు దుర్నీతినృపుని"; "మెచ్చువాఁడెవండు?" = "మెచ్చువాఁడె జడుఁడు!"

***సీ॥ జలధివేష్టిత మహీచక్రమేలెడి రాజు-**
**వెంట జేనెడుభూమిఁ గొంచుఁబోఁడు;**
**కొండంత ధనరాశిఁ గూర్చు సంపన్నుండు-**
**వెంటఁ దానొక్కటైనఁ గొంచుఁబోఁడు;**
**అతిధాన్యరాసుల నార్జించు నాతండు-**
**వెంట సోలెడు కొల్చికొంచుఁబోఁడు;**
**బహుమాల్యవస్త్ర సంపాదకుం డగువాఁడు-**
**వెంట వ్రేలెడు గుడ్డఁ గొంచుఁబోఁడు;**
**తే॥గీ॥ ఇన్నియు నెఱింగి దుర్ణయుండెందుకొఱకు**
**త్యాగభోగంబులుడిగి లుబ్ధత వహించు?**
**వాని జన్మంబు జన్మమే వసుధలోన!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 75**

**తా.** ఓ స్వామీ! వేణుగోపాలా! నాలుగు సముద్రాలతో చుట్టబడిన భూమినంతటినీ

పరిపాలించిన చక్రవర్తికూడ మరణించునపుడు జేనెడునేలకూడ వెంట తీసికొని పోలేడు. కొండంతటి ధనరాశిని కూర్చిన సంపన్నుడైనను, చివఱకు తనవెంట ఒక్క రూపాయి ధనమైనను తీసికొనిపోలేడు. ధాన్యరాసుల నెన్నింటినో సంపాదించినవాడుకూడ, సోలెడు గింజలను కొలిచి తనవెంట తీసికొని పోలేడు. అనేక హారములు దండలు – విలువైన వస్త్రములు సంపాదించినవాడుకూడ ఒక వ్రేలెడంత గుడ్డ పీలికను తనవెంట తీసికొని వెళ్ళలేడు. ఇన్ని విషయములు తెలిసికూడ దుర్నీతిపరులుగా సంచరించుట యెందుకు? గడించిన ధనమును త్యాగమొనర్చి దానధర్మములు చేయవలె. లేదా తాను సుఖముగా అనుభవింపవలె. ఈ రెండును లేని పిసినారి తన మేల పొందవలెను? భూమిపై అటువంటివారి జన్మము కూడ ఒక జన్మమేనా? అనగా కాదు.

ఈ పద్యమున, ప్రతిపాదమునను రెండవ భాగమున యతి స్థానములు తప్పిపోయినవి. "వెంట జేనెడు నేల గొంచు బోఁడు" అన్న పాదమునకు "కోరి జేనెడు నేలఁ గొంచుఁబోఁడు" అన్నచో, యతి కుదురును.

'వెంటఁ దానొక్కటైనఁ గొంచుఁబోఁడు' అన్న పాదము, "కొలఁది యైనను వెంటఁ గొంచుఁ బోఁడు" అన్న సరిపోవును.

"వెంట సోలెడు కొల్చి కొంచుఁబోఁడు" అన్న దానిని కొంచెము మార్చి "కొలిచి సోలెడు వెంటఁ గొంచుఁబోఁడు" అన్న సరిపోవును.

"వెంట వ్రేలెడు గుడ్డ కొంచుఁబోఁడు" అన్నదానిని "గుడ్డ వ్రేలెడు గూడఁ గొంచుఁ బోఁడు" అనిన సరిపోవును.

తేటగీతి పంచపాది. ఇట్టి పద్యములు ఇతర శతకములందెన్నియో యున్నవి. పైగా, మొదటి పాదములోని అర్థమునందు, గజపాదమున సర్వపాదములడగి పోవునటుల అణగిపోవును. నాల్గు సముద్రములచే చుట్టబడిన భూమినేలిన రాజు ఏమీ తీసికొని పోలేడు అన్న తరువాత, ధాన్యరాసులు, ధనము మొదలగు వానిని గూర్చి వేరుగా చెప్పనేల?

**సం.వ్యా.** పై సీసపద్యములోని నాలుగు పాదములలోను రెండవ దళములో యతి తప్పెనదని గుర్తించిన పరిష్కర్త శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు కొన్ని సవరణలు

కూడ సూచించినారు. కాని దీనికి మూలమైన అడిదము సూరకవి రామలింగేశ శతకములో సీసపద్యపాదములలోని రెండవ దళములో "కొంచుఁబోదు" అను పదమునకు బదులుగా "కొంటుఁబోఁదు" అనుపదమున్నది. అప్పుడు యతిదోషము సంభవింపదు. "వెంట–కొంటు" అని ప్రాసయతి సరిపోవును. "తీసికొనిపోవు" అను నర్థములో "కొంచుఁబోవు" – "కొంటఁబోవు" అని రెండు పదములున్నవి. (చూ.శ్రీహరి నిఘంటువు) వీనిలో "కొంటఁబోవు" అనునది మాండలికము. దీనిని తాళ్ళపాక అన్నమాచార్యులవారు తమ సంకీర్తనలలో ప్రయోగించారు. దీనినే సూరకవి "కొంటుఁబోఁదు" అని ప్రయోగించినాడు. భిన్నముగానున్న మఱికొన్ని పదములు – పాదములు: "వెంట జేనెడు భూమిఁ కొంచుఁబోదు" = "వెంటఁ జేరెడు భూమిఁ గొంటుఁబోఁదు"; "వెంటఁ దానొక్కటైన" = "వెంటఁ గానొక్కటైన"; "అతిధాన్యరాసుల నార్జించు" = "బహుధాన్యరాసు లుపార్జించు"; "బహుమాల్యవస్త్ర సంపాదకుండు" = "బహుమూల్యవస్త్ర సంపాదకుండు"; "త్యాగభోగంబులుడిగి" = "త్యాగయోగంబులుడిగి".

***సీ॥ అబ్బిన వానియిల్లాలు గట్టఁగఁ జూచుఁ,**
**దానియ్యవలసినఁ దలఁపఁ డీఁగ;**
**నలుసైనవాని యిల్లాక్రమింపఁగఁ జూచుఁ,**
**దనకుఁ గీడయినఁ బాదములు పట్టు;**
**అణువుగాఁ జూచుఁ గొండంతైనఁ దన తప్పు,**
**గోరంత యొరుతప్పుఁ గొండసేయు;**
**బంధుల కిదరంచుఁ బరుల దూషించును,**
**దనయిల్లు సొచ్చినఁ దడక వెట్టు;**
**తే॥గీ॥ దుర్ణయుల దుర్గుణంబులఁ ద్రోయరాదు,**
**దానికి ఫలంబు యమసన్నిధానమునను**
**దేటపడుఁగాక, యొరులకుఁ దెలుపవశమె?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 76**

**అర్థములు:** 'ఈఁగన్ = ఇచ్చుటకు'; దుర్ణయులు = దుర్నీతిపరులు; త్రోయరాదు= పోగొట్టలేము.

**తా.** ఓ వేణుగోపాలదేవా! ఊరక లభించినచో తన భార్య మంచి వలువలు కట్టగా చూచును. కాని తానీయవలసినచ్చినచో ఇచ్చుటకు అంగీకరింపడు. అలుసైనవానియిల్లు ఆక్రమించుకొనజూచును. తనకేమాత్రము కీడు జరుగనున్నను ఇతరుల కాళ్లు పట్టుకొనును. తాను చేసిన తప్పు కొండంతటిదైనను, దానిని అణువుగా చూచును. పరులు చేసిన తప్పు గోరంతయైనను దానిని కొండంతటిదిగా ప్రచారము సేయును. బంధువుల కేమియు ఇయ్యరని పరులను నిందించును. తనయింటికి బంధువులు వచ్చినచో, వారు లోపలకు రాకుండ తడక నడ్డము పెట్టును. అనగా తలుపులు మూయును. దుర్నీతిపరుల దుర్గుణాలను పోగొట్టుటకు సాధ్యము కాదు. వారి దుర్గుణములకు ఫలము యమధర్మరాజు సన్నిధిలో నరకమున జరుగును గాన, ఆతడిట్టి ఫలము పొందెనని చెప్పుట కెవ్వరికిని సాధ్యము కాదు. ఎత్తుగీతి పద్యము పంచపాది.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పాదములు–పదములు "రామలింగేశశతకములో భిన్నముగా నున్నవి: "అబ్బినవాని యిల్లాలు గట్టఁగ జూచు" = "అచ్చినవాని యిల్లరకట్టఁగాఁజూచు"; "అచ్చు" = అప్పుపడు, బాకీయుండు (శబ్దార్థచంద్రిక); "అచ్చుకొను" = బాకీపడు (శ్రీహరినిఘంటువు); "తనకు బాకీపడినవాని యింటిని అడ్డుకొన (జప్తుచేయ) జూచును" అను నర్థము ఈ సందర్భమున బాగుగా సరిపోవును. "తలపఁడీఁగ" = "తప్పఁజూచు"; "తనకుఁ గీడయిన" = "తనకు గడ్డైన" (గడ్డ=కష్టము); "బంధుల కిడరంచుఁ బరుల దూషించును" (బహువచనము) = "బంధుల కిడడంచుఁ బరుని దూషించును" (ఏకవచనము); "తడకవెట్టు" = "తరిమికొట్టు"; "తేటపడుఁగాక" = "తేటపడుఁగాని".

***సీ॥ కందిరీఁగలపట్టుఁ గడఁగి రేఁపఁగవచ్చు–**
**మానిపింపఁగరాదు దానిపోటుఁ;**
**జెట్లలో బెబ్బులిఁ జెనకి రావచ్చును–**
**దప్పించుకొనరాదు దానికాటుఁ;**

**బలుచునశ్వము తోఁకఁబట్టి యీడ్వఁగ వచ్చుఁ-**
**దప్పించుకొనరాదు దానితన్నుఁ;**
**గాఁకచేఁ బొరుగిల్లుఁ గాల్చి రావచ్చును-**
**దనయిల్లుఁ గాపాడఁ దరముగాదు;**
**తే॥గీ॥ దుర్ణయులు మీఁదెఱుంగక దుండగమునఁ**
**గార్యతతులెల్లఁ జేసి తత్కార్యఫలము**
**లనుభవింపుదు రయ్యయి అవసరముల;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 77**

**తా.** శ్రీ వేణుగోపాలా! కందిరీగల తుట్టెను కదిలింపవచ్చును; కాని, దాని పోటును తప్పించుకొనుట సాధ్యము కాదు. చెట్లలో ఎక్కడో ఉన్న పెద్దపులిని కదిలించి రావచ్చును; కాని దాని కాటునుండి తప్పించుకొన శక్యము కాదు. దాని పంజా దెబ్బతో చచ్చుననుట. పరుగెత్తుచున్న గుఱ్ఱముతోకను పట్టుకొని లాగవచ్చును; కాని దాని తన్నును మాత్రము తప్పించుకొనరాదు. అగ్గిచే పొరుగుననే ఉన్న ఇతరుల యిల్లు కాల్చి రావచ్చును; కాని తనయిల్లు కాలకుండ రక్షించుకొనుట సాధ్యముకాదు. క్రిందు మీదు తెలియక గర్వముతో దుర్నీతిపరులు దుండగములు చేయుచుందురు. తాము చేసిన కర్మఫలముల నాయా వేళలందు తామే అనుభవింతురు.

పులి పంజాదెబ్బను 'కాటు' అనుట ప్రసిద్ధము కాదు. పామునకు 'కాటు' అనుట ప్రసిద్ధము. పులికి "పంజా దెబ్బ" అనుటయే ప్రసిద్ధము.

**సం.వ్యా.** పై పద్యములో కొన్ని పదములు-పాదములు రామలింగేశ శతకములో భిన్నముగా నున్నవి. మొదటిపాదములో "కందిరీఁగల పట్టు.... మానిపింపగరాదు దానిపోటు" = "కణుఁదురీఁగల పట్టు.... దప్పించుకోరాదు దాని పోటు"; చెట్లలో బెబ్బులిఁ జెనకి రావచ్చును" అను పాదదళము లేదు. దీనికి బదులుగా "పుట్టలోపలి త్రాచుఁ గట్టెఁదట్టఁగవచ్చు" అని యున్నది. మూడవ పాదములో

గుఙ్ఞమును గురించి చెప్పుచు "తప్పించుకొనరాదు దాని తన్ను" కు బదులుగా "తప్పించుకోరాదు దాని తాఁపు" అని ఉన్నది. "తన్ను-తాఁపు" సమానార్థకములు (పాదతాడనము). నాల్గవ పాదములో "తనయిల్లుఁ గాపాడఁ దరముగాదు"కు బదులుగా "తనయిల్లుఁ గాచుకోఁ దరముగాదు" అని ఉన్నది. ఎత్తుగీతిలో "కార్యతతులెల్లఁజేసి" అనుదానికి "కార్యములు మించఁజేసి" అని యున్నది. "అయ్యయి అవసరముల" = "ఆయాయి యవసరముల". రెండు మూడు సీసపాదములలో "తప్పించుకొనరాదు" కు బదులుగా "తప్పించుకోరాదు" అని యున్నది (వ్యావహారిక రూపము).

***సీ॥ కన్నంబు త్రవ్వి తస్కరుఁ డింటివానికి**
**వాడ లేదని ముంతవైచి చనునె?**
**తెరవాటుకాఁడు చింతించునె కట్టిన**
**బట్ట నూడ్చిన మానభంగమనుచు?**
**వలఁబడ్డ మెకము చూల్వహియించె నంచును**
**విడువంగఁ జూచునే వేఁటకాఁడు?**
**జారుండు పరకాంత శయ్యపైఁ దారిచి**
**వావిగాదని పల్కి వదలి చనునె?**
**తే॥గీ॥ ఆత్మజను గుత్తరూకల కమ్మునాతఁ**
**దరణము నొసంగ జూచునే యల్లునకును?**
**నెఱుఁగ రింతియె కాక పరేంగితమ్ము;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 78**

**తా.** ఓ వేణుగోపాలా! దొంగ ఇంటికి కన్నము వేసి, ఆ యింటిలోనివారు వాడుకొనుటకు లేదని ఒక పాత్ర (ముంత) నచట విడిచి తీసికొనిపోకుండ నుండునా? దారులుగొట్టు దొంగ ఒక వ్యక్తి కట్టుపుట్టములూడ్చించి యెత్తుకొని పోవునుగాని, అయ్యో! ఈతని కట్టుపుట్టములు లాగుకొన్నచో నీతనికి

మానభంగమగునని ఆలోచించి విడచునా? తన వలలో పడ్డ మృగము చూలుతోనున్నదని దయతలచి దానిని వేటకాడు వదలివేయునా? ఒకవిటుడు పరస్త్రీని తన శయ్యమీదకు చేర్చుకొని, ఈమె నాకు వరుసకాదని విడిచిపెట్టి పోవునా? తన కుమార్తెను గంపగుత్తగా డబ్బులకమ్ముకొన్నవాడు అల్లునకు కట్న మీయ తలంచునా? ఈ విషయమున ఇతరుల ఆలోచనలను తెలిసికొనజాలరు. ఇంటికి కన్నమును వేసిన దొంగ, మట్టిముంతలను తీసికొనిపోవునా? ఇట్టివి కొంచెమెబ్బెట్టుగా గోచరించును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పాదములు రామలింగేశ శతకములో నిట్లున్నవి: "కన్నంబు త్రవ్వి తస్కరుఁ డింటివానికి" = "కన్నంబుఁద్రవ్వ తస్కరుఁ డింటివారికి"; "కట్టినబట్ట నూడ్చిన" = "కట్టినబట్ట దుల్చిన"

***సీ॥ గోముఖవ్యాఘ్రంబుఁ, గూరలో నిడు నాభి**
**కప్పకూఁతలు గూయు కాలభుజగ;**
**మెఱచిలోపలి గాల, మేటిలోపలి యూబి,**
**పైఁ బూరిఁగ్రమ్మిన పాడునుయ్యి;**
**పైఁ బండ్లుఁ గలిగి లోపలఁ బుచ్చు తరుశాఖ,**
**గొంగళిమూలఁ దాకొలుపు ఱాయి;**
**చొర నేమరించి ముంచుకొను ప్రవాహంబుఁ,**
**గునుకు పట్టినఁ జుట్టుకొను దవాగ్ని;**
**తే॥గీ॥ దుర్జనుఁడు, వాని నమ్మినఁ దొడరకున్నె**
**హాని యెంతటివానికినయిన జగతిఁ?**
**దలఁదడవి బాసఁజేసినఁ దగదు నమ్మ!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 79**

**అర్థములు:** ఎఱచి = మాంసము; దుర్జనుడు = దుర్మార్గుడు; వానిన్ = మొదలగువానిని; నమ్మినన్ = నమ్మినచో; జగతిన్ = లోకములో; ఎంతటివానికిన్

+ అయినన్ = ఎంత గొప్పవానికైనను; హాని = కీడు; తొడరకున్నె? = కలుగకుండునా? తప్పక కలుగునని భావము. "తలదడవి బాసఁజేయు" – ఇది తెలుగు నుడికారము.

**తా.** ఓ వేణుగోపాలదేవా! ముఖము మాత్రము సాధువగు గోవుముఖము గలిగి మిగిలిన దేహము గుణములు పెద్దపులివిగా నున్నవానిని; కూరలో వేసి వండిన నాభి (నాభియనగా విషము. మనుజుని చంపునది. ఈనాటివారి కెందరికో నాభియన తెలియుటలేదు); కప్పగొంతుతో కూసెడు కాలసర్పము – ఎఱలోపల నున్న గాలము – ఏటిలోపలనున్న ఊబి (అనగా భయంకరమై లోతెఱుంగని బురద. అందు కాలు వేయగనే దిగిపోదురు); పైని (బావియొక్క పైభాగము) అంతయు అల్లిబిల్లిగా తీగలు – గడ్డి అల్లుకొని కనిపించకుండ నున్న పాడుబావి; పైని పండ్లతోనుండి లోపల పుచ్చిపోయిన చెట్టుకొమ్మ; గొంగడిమూల కన్పించకుండ కట్టి విసరగా సమీపించిన రాయి; మోసముగా మనుష్యులను తనయందు ప్రవేశింపనిచ్చి ఒక్కసారి ముంచివైచెడి ప్రవాహము; నిద్రపోయినవేళ చుట్టుముట్టిన కార్చిచ్చు, దుర్జనుడు – మొదలగు వానిని నమ్ముకొన్నచో, లోకములో ఎంతటివానికైనను హాని కలుగకుండునా? తప్పక కీడు సంభవించును. తలపై చేయిపెట్టుకొని బాసచేసినను, గోముఖవ్యాఘ్రమును, కూరలోని నాభిని, కప్పకూతలు కూయు కాలసర్పము మొదలగు వానిని నమ్మరాదు.

***సీ॥** **తనతల్లి శిశువుల దలఁద్రుంచివైచినఁ–**
**జెడుముండ యనుచు భాషింపరాదె?**
**తనతండ్రి యొరులవిత్తము నపహరించిన–**
**నన్యాయవర్తనుఁ డనఁగరాదె?**
**తనదేశికుఁడు పరదారసంగ మొనర్పఁ–**
**బాపకర్ముండని పలుకరాదె?**
**తనరాజు ప్రజలపట్లను దప్పఁ జూచినఁ–**
**గ్రూరాత్ముఁడనుచు వ్రాక్రువ్వరాదె?**

**తే॥గీ॥ యిట్టి పలుకులు తప్పుగా నెన్నునట్టి**
**కుటిలచిత్తుల గర్వంబుఁ గొంచెపఱుప**
**మీకుగా కన్యులకు శక్యమే తలంప?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 80**

**తా.** శ్రీ వేణుగోపాలదేవా! తనతల్లియే శిశువుల తలలను నరికివేసినచో నామెను చెడుముండయని ఏల చెప్పరాదు? తనతండ్రి పరులవిత్తము నపహరించినచో ఆతనిని అన్యాయ వర్తనుడని ఏలయనరాదు? తనగురువు పరునిభార్యను రతికి దార్కొనినచో ఆతడు పాపకర్ముడని ఏల పలుకరాదు? తమప్రభువే ప్రజలపట్ల సక్రమముగా వర్తింపనిచో క్రూరాత్ముడని ఆతని నేల చెప్పరాదు? అట్లు పలికిన పలుకులను తప్పుగా భావించుచున్న కుటిల మనస్కుల గర్వమును నీవే హరింపవలయును.

'తనతండ్రి యొరుల విత్తము నపహరించిన' గణభంగమైనది.

'తనతండ్రి యొరుల విత్తమును హరించిన' అనియుండతగును.

**సం.వ్యా.:** పై పద్యములో కొన్ని పదములు – పాదములు రామలింగేశ శతకములో భిన్నముగానున్నవి: "భాషింపరాదె?" = "వచింపరాదె?"; "అపహరించిన" = "ప్రమోషించిన" (ప్రమోషించు=దోఁచుకొను); "తనరాజు ప్రజలపట్లను దప్పఁజూచిన" = "తనరాజు జగదుపద్రవకారియైనను"; "మీకుగాకన్యులకు శక్యమే తలంప?" = "నీక కా కన్యులకు బోలునే వచింప?"

***సీ॥ ఆశకు ముదిమియు, నర్థికి సౌఖ్యంబు,**
**ధనపరాయణునకు ధర్మపోఁత;**
**కఠినమానసునకుఁ గరుణాపరత్వంబు,**
**వెఱ్ఱిమానిసికి వివేకగరిమ;**
**యల్పవిదునకు నహంకార దూరతయును,**
**జారకామినికి లజ్జాభరంబు;**

**బహుజనద్వేషికిc బరమాయు రభివృద్ధి,**
**గ్రామపాచకునకు గౌరవంబు;**
**తే॥గీ॥ తామసగుణాఢ్యునకును సత్త్వగుణయుక్తి,**
**పాపభీరుత సంతానబాహ్యునకును,**
**గలదనెడు వార్త గలదె లోకములయందు?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **81**

**తా.** ఓ వేణుగోపాలా! ఆశకు ముసలితనము లేదు. ఎంతటి ముదుసలియైనను ఆశతో కూడిన కోరిక లుండును. యాచించెడి యాచకునకు సుఖము లేదు. కఠినచిత్తునకు దయయుండదు. పిచ్చివానికి వివేకజ్ఞానముండదు. అల్ప విద్వాంసుడు అహంకారదూరుడు కాడు. అహంకారముతోనే యుండును. వేశ్యాస్త్రీకి సిగ్గు ఉండదు. అనేక ప్రజలచే ద్వేషింపబడువానికి అధికమైన ఆయుర్వృద్ధి కలుగదు. గ్రామములోని వంటవానికి గౌరవముండదు. తమోగుణ భూయిష్ఠుడైన వానికి సత్త్వగుణము రాదు. సంతానములేని గొడ్డుమోతువానికి పాపభీతి యుండదు. ఇవి ఉన్నవని లోకమున వార్తలున్నవా? లేవు.

'ధర్మపోcత' అనునది వైరిసమాసము. ధర్మమును పోత పోసినట్లని అర్థము.

'అల్పవిదునకు నహంకారదూరతయును' – అను పాదమున రెండు లఘువులు ఎక్కువైనవి. 'అల్పవిదునకు నహంకారదూరత' అని యున్న చాలును.

**సం.వ్యా.:** పై పద్యములోని కొన్ని పదములు –పాదములు రామలింగేశ శతకములో భిన్నముగా నున్నవి: "ధర్మపోత" = "ధర్మచింత"; "కఠినమానసునకు" = "కఠిన మానవునకు"; "అల్పవిదునకు నహంకారదూరతయును" = "అల్పవిద్యునకు నహంకారశూన్యత"; "తామస గూణాఢ్యునకును సత్త్వగుణయుక్తి" = "తామస గుణాఢ్యునకును నుత్తమగుణంబు"; "కలదనెడు వార్త గలదె" = కలుగుననువార్త గలదె".

*సీ॥ శక్తిచాలనివాఁడు సాధుత్వము వహించు,
విత్తహీనుఁడు ధర్మవృత్తిఁ దలఁచు;
వ్యాధిపీడితుఁడు దైవతభక్తి దొరలాడు,
ముండ పాతివ్రత్యమునకుఁ జొచ్చు;
నాపద ప్రాపింప నన్యార్తికిఁ గృశించు,
భారంబు పైఁబడ్డ బరువెఱుంగు;
రమణి లేకున్న విరక్తి మంచిదియను,
బనిపోవ మౌనవర్తనముఁ దాల్చు;
తే॥గీ॥ నీ యభావవిరక్తుల కేమి ఫలము?
తినక చవిఁ, జొరకయె లోఁతుఁ దెలియఁబడునె
యెంతవానికినైన మహీస్థలమున?
మదరిపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 82

**తా.** ఓ వేణుగోపాలదేవా! ఎదిరించిపోరాడుటకు శక్తి సామర్థ్యములు లేనివాడు సజ్జనునివలె సాధుభావమును పూనును. వ్యాధితో మిక్కిలిగా బాధపడువాడు దైవభక్తియందే పొరలాడుచుండును. ఇది నిజమైన భక్తి కాదు. వ్యాధి తగ్గింపుమని దైవమునందు తాత్కాలిక భక్తిని పొందుట. ముండ (విధవరాలు) పాతివ్రత్యమునకు పూనుకొనును. అంతకు ముందామె ప్రవర్తన మంచిదికాదు. విధవరాలైనది. వృద్ధత్వము వచ్చినది. విటులెవ్వరును ఆమెవంక చూడరు. అందుకే 'వృద్ధనారీ పతివ్రతా' అను ఆర్యోక్తి కలిగినది. ఆపద కలిగినపుడు ఏమగునోయని అన్యచింతలతో చిక్కిపోవును. భారము పైనిబడినపుడే దాని బరువు తెలియును. అంతకుముందు, అదేమున్నది? అనుచు తేలికగా భాషించును. భార్య లేకున్నచో వైరాగ్యమే మంచిదని బోధించును. ఉద్యోగము పోయిన తరువాత మౌనముగా నుండును. అంతకు ముందు అదరిపడుచుండునని భావము. వీరి విరక్తులన్నియు వైరాగ్యముచే నిజముగా కలిగినవి కాక, సాపేక్షకములు. కనుక నిటువంటి వట్టి

విరక్తుల వలన ఫలమేమి? ఫలములేదని భావము. తినకుండా పదార్థముయొక్క రుచి ఎట్లు తెలియును? దిగకుండ లోతు ఎట్లు తెలియు? ఎట్టివారికైనను ఈ లోకములో నాయాకార్యము లాచరింపక వానిలోతు తెలియదుగదా!

'చెల్లియుండియు సైరణచేయు నతఁడు' గొప్పవాడని భారత వచనము. ఎక్కువమంది శక్తిలేకయే సాధుత్వము వహింతురు. డబ్బులేనివాడు ధర్మవృత్తిని పాటించును. ధనవంతుడైనచో ఎదిరివానిని ధనముతో సాధింపబూనును గాని ధర్మపన్నములు చెప్పడు.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పదములు – పాదములు రామలింగేశ శతకములో భిన్నముగా నున్నవి: "ధర్మవృత్తిఁదలఁచు" = "పాపవృత్తిఁదలఁచు"; "దైవతభక్తి దొరలాడు" = "దైవతభక్తిఁ బొరలాడు"; "ముండ పాతివ్రత్యమునకుఁ జొచ్చు" = "ముదిమి పాతివ్రత్యమునకుఁ జొచ్చు"; కాని "ముదిమి" అను పదమునకు "ముసలితనము" అని అర్థము కాని, "ముసలిది" అనునర్థము లేదు. "వృద్ధురాలు" అనునర్థములో "ముది" అనవలెను. "ముదియుఁ బాతివ్రత్యమునకుఁజొచ్చు" అని యుండవచ్చును. "పనిపోవ మౌనవర్తనముఁ దాల్చు"="తనివార మౌనివర్తనముఁ దాల్చు". (తనివారు = తృప్తినొందు); పై పద్యములో తేటగీతిలో ఒక్క మకుటమును తప్పించి, తక్కినదంతయును (మూడు పాదములును) రామలింగేశశతకములో పూర్తిగా వరుసక్రమముతో సహా భిన్నముగా నున్నది. వేణుగోపాలశతకములోని పాదములు:

**తే॥గీ॥ "నీ యభావ విరక్తులకేమి ఫలము?**
**తినక చవిఁ, జొరకయె లోఁతుఁ దెలియఁబడునె**
**యెంతవానికినైన మహీస్థలమున?"**

రాలింగేశశతకములోని పాదములు:

**తే॥గీ॥ "ఎంతవారలకైన మహీతలమున**
**నిట్టి భావవిరక్తుల కేమిఫలము?**
**తిన రుచియుఁ, జొర లోఁతును దెలియఁబడదె!"**

***సీ॥ తల్లి సేవించిన దైవతార్చన మేల?**
**తండ్రి గల్గిన పెన్నిధానమేల?**
**దీనరక్షణమున్నఁ దీర్థాటనంబేల?**
**విద్యాధికతయున్న వేషమేల?**
**పరమమిత్రుండున్న బంధువర్గంబేల?**
**పతిభక్తి కలిగిన వ్రతములేల?**
**రసికత్వమున్నను రత్నభూషణమేల?**
**ఘనసాహసంబున్నఁ గవచమేల?**
**తే॥గీ॥ యిష్టసంసిద్ధిఁగన దంతినెక్కనేల?**
**కవితగలిగిన రాజ్యాధికారమేల?**
**తగు వినయమున్న వశ్యౌషధంబులేల?**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 83**

**తా.** శ్రీ వేణుగోపాలదేవా! తల్లిని భక్తితో నిత్యము సేవించువాడు దైవతార్చన మేలచేయవలె? దేవతార్చన వలన కలుగు ఫలము తల్లిని సేవించిననే కల్గును. తండ్రిగారున్నచో నిధి ఎందులకు? నిధివలన గలుగు ప్రయోజనములన్నియు దండ్రివలననే కలుగును. అందుకే తల్లిదండ్రులు ప్రత్యక్షదైవము లందురు. దీనులను రక్షించుగుణమున్నచో తీర్థయాత్రలకు తిరుగవలసినపని యేమున్నది? తీర్థయాత్రలవలన సిద్ధించు పుణ్యము దీనరక్షణముచేతనే కలుగును. విద్యాధికుడైన విద్వాంసునకు వేషపటాటోపమెందుకు? ఆయన విద్యచేతనే గుర్తింపబడును. అల్పవిద్వాంసుడు ప్రజలనాకర్షించుటకు డాబైన వేషములు వేయును. మంచి స్నేహితుడున్నచో బంధువర్గములెందుకు? బంధువర్గముచే కలుగు ప్రయోజనము లన్నియు ఒక్క పరమమిత్రునితోనే జరుగును. భర్తపదభక్తి గలిగిన స్త్రీకి వ్రతము లెందులకు? వ్రతములవలన చేకూరు ఫలము పతిభక్తితోనే కలుగును. మంచి రాసిక్యమున్నచో రత్నభూషణములెందుకు? కవితారాసిక్యము – దానరాసిక్యాదులు

రత్నభూషణములకన్న గొప్పవి. అధికమైన సాహసమున్న వీరునకు కవచముతో నేమి ప్రయోజనము? కవచమనగా యుద్ధరంగములలో శత్రువుల ఆయుధపు దెబ్బలు తగులకుండ వీరులు తొడుగుకొను లోహనిర్మితమైన చొక్కా. సాహసమే ఆతనిని కవచముగా కాపాడును. కోరికలన్నియు తీరినవానికి ఏనుగునెక్కుటేల? ఆ గొప్పతనమెప్పుడో అన్యకార్యములచే సిద్ధించినది. మంచి కవిత్వము గలవానికి రాజ్యాధికారమెందులకు? వినయసంపదగలవానికి వశ్యౌషధమెందులకు? ఆతని వినయముచేతనే అందరు ఆతనికి వశ్యులగుదురు. ఇంక వానికి వశ్యౌషధమేటికి?

"సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్" అను భర్తృహరి వాక్యము "కవిత గల్గిన రాజ్యాధికారమేల?" అయినది. జాషువా మహాకవి అన్నట్లు "సుకవి జీవించు ప్రజల నాలుకలయందు".

***సీ॥ అర్థాతురునకుఁ గృత్యాకృత్యములు లేవు,**
**కవిజనంబుల కెఱుంగనివి లేవు;**
**కుక్షింభరుఁడుగాని కూటికి రోయఁడు,**
**కామాతురుం దర్థకాంక్ష విడఁడు;**
**వెలిచవుల్గనుకాంత వెఱవదు నిందకు,**
**నీఁతకు మిక్కిలి లోఁతు లేదు;**
**పాపశీలికి దయాపరత యెందును లేదు,**
**వెఱ్ఱివానికి సాధువృత్తి లేదు;**
**తే॥గీ॥ మద్యపానుల కనరాని మాటలేదు,**
**గ్రామ్యునకుఁ గల్గదెందు నాగరికముద్ర,**
**తప్పెఱుంగకపోవఁ డుత్తమకులజుఁడు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 84**

**తా.** శ్రీ వేణుగోపాలదేవా! ధనమునం దధికవాంఛ కలిగినవానికి ఇది చేయవచ్చు – ఇది చేయరాదు అను మంచి – చెడు వివక్ష ఉండదు. మహాకవులైనవారికి

తెలియని విషయములు లేవు. కవి ఈశ్వరశబ్దవాచ్యుడు కనుక కవులు సర్వజ్ఞులనుట. పొట్టపోసికొనుటయే ప్రధానమనుకొను కుక్షింభరుడు కూటి కోసమెల్లప్పుడు వెదకుచుండును. కోరికలు కలిగినవాడు డబ్బునందు కోరికను విడువలేడు. బయటిరుచుల కలవాటుపడిన స్త్రీ – అనగా పరపురుషులతో వ్యభిచరించెడు స్త్రీ ఎవరు నిందించినను భయపడదు. చక్కగా ఈదగలిగిన గజయీతగానికి, స్వశక్తికి మించిన లోతు ఉండదు. పాపస్వభావునకు ఏ విషయమునందును, నెవ్వరియందును దయ ఉండదు. పిచ్చివానికి సత్త్వగుణ ముండదు. త్రాగుబోతులు ఈ మాట అనవచ్చు ఈ మాట అనరాదు అను జ్ఞానమును కలిగియుండరు. ఎంతమాటైనను, ఎవరినైనను అందురు. గ్రామ నివాసికి నాగరికత కలుగదు. ఉత్తమకులజుడైన బ్రాహ్మణుడు తప్పొప్పుల నెఱుగక వర్తింపడు.

"నాగరికత" శబ్దము సాధువు కాదు. 'నాగరకత' సాధురూపము. నగరము యొక్క భావము కదా! కవి ఎక్కువగా తేటగీతులను పంచపాదులుగా వ్రాయుచున్నాడు. చెప్పదలచిన భావము నాలుగు పాదములలో ఇమడనప్పుడు ఇట్లు చేయును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పాదములు రామలింగేశ శతకములో కొంచెము వేరుగానున్నవి: "ఎఱుంగనివి లేవు" = "ఎఱుంగనిది లేదు"; "అర్థకాంక్ష విడఁడు" = అర్థకాంక్షఁబడఁడు; "వెలిచవుల్గను కాంత" = "వెలిచవుల్గొను కాంత"; "పాపశీలికి దయాపరత యెందును లేదు" = "పాపశీలునకు దయాపర్వతము లేదు"; "మద్యపానులకు" = మద్యపాయికి". "మద్యపానులకు" అనుట తప్పు; "మద్యపాయులకు" అనుట ఒప్పు. సంస్కృత వ్యాకరణము ప్రకారము మద్యపానము చేయువాడు "మద్యపాయి" అగును కాని, "మద్యపాని" కాడు.

***సీ॥ మరణంబు మే లవమాన మొందుటకంటెఁ,**
**గొంచెమైనను బంచి కుడుచు టొప్పుఁ;**
**దన విత్తహాని యొరుల మదిఁదలఁపక,**
**హితవున్నచోట నప్పియ్యఁదగదు;**

విత్తంబు చాలని విభవంబు కొఱగాదు,
కుదువఁబెట్టఁగరాదు కుందనమ్ము;
ఆలస్య మొనరింప నమృతంబు విషమగుఁ,
దగవు దప్పిన మాటఁ దలపఁరాదు;
తే॥గీ॥ వదలవలయు నుపద్రవంపువృత్తి,
విడువవలయును భయదపృథ్వీతలేంద్రుఁ,
ద్రోయవలయును గపటవృత్తులను భువిని;
మదరిపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 85

**తా.** ఓ వేణుగోపాలా! అవమానపడుటకంటెను మరణము మేలు. కొంచెమే పదార్థమున్నను దానిని అందఱు పంచుకొని తినుట తగినది. తన ధనము పోవునని మనస్సులో భావింపక, హితవు కలిగినచోట అప్పునీయరాదు. అనగా పరుల కప్పిచ్చినచో నా ధనము మరల వచ్చునో రాదో? అని హితులైనవారికి (తప్పక తన డబ్బు తిరిగి వచ్చునని) అప్పు నీయరాదు. అప్పు ఇచ్చి ముప్పు దెచ్చుకొనుటయని పెద్దలందురు. డబ్బులేనివానికి వైభవము పనికిరాదు. వైభవమును విని యాచకులు అర్థులు వత్తురు. వారికేమియు నీయనిచో అపకీర్తి వచ్చును. బంగారము నెప్పుడును తాకట్టు పెట్టరాదు. (తాకట్టు పెట్టుకొన్న వాని కత్యాశ కలిగి యే యఘాయిత్యమునకైనను పాల్పడునని భావము). ఆలస్యము చేసిన కొలదిని అమృతము విషముగా మారును. మంచిదనుకొన్న పనిని వెంటనే చేయవలెనని భావము. న్యాయమును తప్పినమాట నెప్పుడును పలుకరాదు. కీడును కలిగించువృత్తి యెట్టిదైనను వదలవలయును. భయంకరుడైన భూపతి కొలువును వదలిపెట్టవలెను. మోసపు వృత్తులను త్రోసివేయవలయును.

"ఆలస్య మమృతం విషమ్" అను ఆర్యోక్తిని ఒక పాదమున కవి ప్రయోగించెను. ఒకే పద్యమున నీ కవి ఒకటి రెండు విధివాక్యములను, మిగిలినవి నిషిద్ధ వాక్యములుగను చెప్పును. అటులనే అనేక విధివాక్యముల మధ్య ఒకటి రెండు నిషిద్ధవాక్యములు చెప్పును.

**సం.వ్యా.** రామలింగేశ శతకములో కొన్ని పాదములు భిన్నముగా నున్నవి: "మరణంబు మేలవమాన మొందుటకంటె" = "మరణంబు మేలగు మానము చెడుకంటె"; "కుడుచుటొప్పు" = "కుడువమేలు"; "తన విత్తహానియౌనని మదిఁదలఁపక" = "తన విత్తహాని కోర్చిన పూట పడవలె"; "ఉపద్రవంపు వృత్తి" = "నృపోద్రవంపు వృత్తి"; "కపట వృత్తులను భువిని" = కపట బంధువులమైత్రి"

***సీ॥ పాపాత్మునకుఁ బారుపత్తె మియ్యఁగరాదు,**
**చాలనిపనికిఁ గాల్చాఁచరాదు;**
**తప్పుసేయనివాని దండింపఁబోరాదు,**
**చేసిన కృత్యంబు సెప్పరాదు;**
**పలుగాకివానితో భాషింపఁగారాదు,**
**చెడ్డవానికి మేలుసేయరాదు;**
**ఆదాయ మెఱుఁగని యప్పుసేయఁగరాదు,**
**పలువురతో ద్వేషపడఁగరాదు;**
**తే॥గీ॥ పరుల ధనసంపద కసూయ పడఁగరాదు,**
**తనదు లేమికి ఖేదమందంగరాదు,**
**సాధువర్తన లివిగదా! చర్చసేయ;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 86**

**అర్థములు:** పారుపత్తెము=పన్నువసూలు చేసెడి అధికారము; పలుగాకి = దుష్టుడు.
**తా.** ఓ వేణుగోపాలదేవా! పాపాత్ముడైనవానికి ప్రజలనుండి పన్నులును వసూలు చేయు నధికారమీయరాదు. ఆతడు ప్రజలను మిక్కిలిగా బాధించును. ఎక్కువ వసూలుచేసి స్వార్థమునకు పాల్పడును. చాలని పనికి కాలుచాపరాదు. అనగా చిన్న చిన్న పనులకు ఆశపడకూడదని భావము. ఏమియు తప్పుచేయని వ్యక్తిని శిక్షించుటకు పూనుకొనరాదు. తాను చేసిన మంచిపనులు గొప్పపనులు చెప్పుకొనరాదు. వానిని ఇతరులు చెప్పిన కీర్తి గలుగును. తానే చెప్పుకొన్న

నెల్లిదముగా చూచెదరు. దుష్టులతో మాటాడకూడదు. చెడ్డవాని కెప్పుడును మేలుచేయరాదు. పాముకు పాలుపోసినను కాటువేయక మానదు. తనరాబడిని చూచుకొనకుండ అధికమైన అప్పుచేయకూడదు. తన స్వల్ప ఆదాయముతో అప్పు తీర్పజాలదు. పలువురతో ద్వేషమును పూనరాదు. ఇతరుల ధనసంపద చూచి అసూయచెందరాదు. తనకు లేదని దుఃఖపడరాదు. చర్చించినచో అట్లు చేయకుండుటలు సాధువర్తనములు కదా!

**సం.వ్యా.** రామలింగేశ శతకములో – "చేసిన కృత్యంబు సెప్పరాదు" = "చేసిన సుకృతంబుఁ జెప్పరాదు"; "పలువురతో ద్వేషపడఁగ రాదు" = "పలువుర ద్వేషము పడఁగరాదు"

***సీ॥ ఎరవు సొంతంబౌనె? యిల్లౌనె పందిరి?**
**యిల నెండమావులు జలములౌనె?**
**వరవుడిల్లాలౌనె?, వాఁపు బలంబౌనె?**
**కులటతనూజుండు కొమరుఁడౌనె?**
**మెఱపు దీపంబౌనె?, మేఘంబు గొడుగౌనె?**
**స్వాంగవాద్యములు తూర్యంబులౌనె?**
**కంతి తల్గడయౌనె?, కల యథార్థంబౌనె?**
**పెనుదిబ్బ ముక్కాలిపీఁట యౌనె?**
**తే॥గీ॥ కానివస్తువుఁ బెట్టుకోఁ గాంక్షచేతఁ**
**బెనఁగు మాత్రంబెగాని లభింపదేమి,**
**దాని కొడఁబడఁ డింగితజ్ఞానశాలి;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 87**

**అర్థములు:** వరవుఁడు = దాసి; స్వ + అంగ = స్వాంగ = తన శరీరావయవములతో; వాద్యములు = ధ్వనిచేయుటలు.

**తా.** ఓ వేణుగోపాలదేవా! అరువు తెచ్చుకొన్న సొమ్ము సొంతమగునా? కాదు.

పందిరి ఇల్లగునా? కాదు. ఎండమావులు నీరములగునా? కావు. దాసి భార్యయగునా? కాదు. వాపు బలమగునా? కాదు. వేశ్యకుమారుడు కొడుకగునా? కాదు. మెఱపుతీగ దీపమగునా? కాదు. మేఘమెంతనీడనిచ్చినను గొడుగగునా? కాదు. నోటితో చేతులతో వేసెడి తాళములు మొదలగునవి మంగళవాద్యములగునా? కావు. వెనుక వైపున మెడమీద పెద్ద కంతి ఉన్నను, అది తలక్రింద నుంచుకొను దిండు అగునా? కాదు. స్వప్నము సత్యమగునా? పెద్ద మట్టిదిబ్బ కూర్చుండు ముక్కాలిపీటయగునా? తనదికాని వస్తువును కోరికతో పెట్టుకొనినను, దానివలన పెనుగులాట (కలహము) అగును గాని కొంచెము కూడ లబ్ధి జరుగదు. ఇంగిత జ్ఞానమున్నవాడు అట్టి వాని నంగీకరింపడు.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పదములు-పాదములు శతకమంజరిలోని "వేణుగోపాలశతకము"లో కొంచెము భిన్నముగా నున్నవి. "ఎరవు సొంతంబౌనె?" = "ఎరవు సతంబౌనె?"; "ఇల నెండమావులు" = "అల యెండమావులు"; "కులట తనూజుండు" = "కులటాతనూజుండు"; "పెనుదిబ్బ ముక్కాలిపీఁట యౌనె? = "పెనుబొఱ్ఱయును దస్కుపెట్టె యౌనె?" ఇవి రెండును పండితులు మార్చివేసిన పాదములు.

రామలింగేశ శతకములోని పాఠములిట్లున్నవి: "ఎరవు సొంతంబౌనె?" = "ఎరవు నిత్యంబౌనె?"; "పెనుదిబ్బ ముక్కాలి పీఁటయౌనె?" = "పెనుబుడ్డ ముక్కాలి పీఁట యగునె?" (ఇదియే కవి వ్రాసిన అసలు పాఠము); "కాని వస్తువుఁ బెట్టుకో" = "కాని వస్తువుఁ బట్టుకో" (ఇదియే సాధుపాఠము).

***సీ॥ పొరుగూరి కేఁగినఁ బోవునే దుర్దశ?**
**కాదె పెండిలి సన్నెకల్లు దాఁచ?**
**డొంకలో డాఁగఁ బిడుగుపాటు దప్పునె?**
**కాలొడ్డ నిలుచునే గాంగఝరము?**
**కుమతిచేఁ జెడునె యెక్కుడుమంత్రి యత్నంబు?**
**లింకిపోవునె యనావృష్టి జలధి?**
**ధవుఁడు పిన్నైన వైధవ్యంబు దప్పునే?**
**మనఁడె దీర్ఘాయువు మందులేక?**

**తే॥గీ॥ అర్కు దుదయింపఁ జెడునె గుహాతిమిరము?**
**తాళమెత్తుకపోవ మందసములోని**
**విత్తమలవడకుండునే వెచ్చమునకు?**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 88**

**తా.** ఓ వేణుగోపాలా! ఒక వ్యక్తికి తనయూరిలో కలిసిరాక దుర్దశలో నున్నాడు. అట్టివాడు పొరుగూరికి పోయిన తనకు పట్టిన దుర్దశ మారిపోవునా? మారిపోదని భావము. పెండ్లిలో వధూవరుల పాదపీడనమునకును గంధము తీయుటకును సన్నెకల్లు కావలయును. దానిని దాచుకొని యియ్యకున్నచో పెండ్లి ఆగిపోవునా? ఆగదుగాక ఆగదు. ఇంటిలో ఉన్నచో పిడుగు పడునని డొంకలోనికి పోయి దాగుకొన్నచో పిడుగుపాటు తప్పునా? తప్పదు. కాలు అడ్డముపెట్టినచో గంగా ప్రవాహ మాగిపోవునా? ఆగదు. గొప్ప అధికారముగల మంత్రి చేయదలచుకొన్న ఒక మంచి పని, చెడ్డబుద్ధిగల వాడొకడు, ఎంత ప్రయత్నము చేసినను ఆగిపోవునా? ఆగదు. అనావృష్టిదోషమున – అనగా వర్షములు పడకపోవుటచేత సముద్రము ఇంకిపోవునా? ఇంకదు. భర్త చిన్నవయస్సువాడైన మాత్రమున ఆతని భార్య విధవాత్వమును పొందదా? మరణమునకు పిన్న – పెద్ద భేదమేమున్నది? దీర్ఘాయువుకలవ్యక్తి ఔషధములేక బ్రదుకడా! బ్రదుకును. సూర్యుడుదయింపగనే గుహాంతరాళమందలి చీకట్లు తొలగిపోవునా? తొలగిపోవు. పెట్టెతాళ మెత్తుకొని పోయినంత మాత్రమున, పెట్టెలోని ధనము వెచ్చములు కొనుటకు లభింపదా? లభించును.

**సం.వ్యా.** రామలింగేశ శతకములోని పాదములు "కుమతిచేఁ జెడునె యెక్కుడు మంత్రి యత్నంబు?" = "కుంఠితంబౌనె యొక్కఁడు దుమ్మఁ గ్రతుయత్నము?"; "ఎక్కుడు" = ఆధిక్యము.

***సీ॥ ఆరగింపంగ యోగ్యముగాక యుండునే**
**పైతోలు బిరుసైన పనసఫలము?**

**మాధుర్య మెడలునే మామిడిపండుకుఁ**
**దొడిమపట్టున జీడి తొరలియున్న?**
**గేదంగి నెతిమౌళిఁ గీలింపకుందురే**
**అగ్రభాగమున ముళ్ళలమికొన్న?**
**నఖిలాంగసీమ యొయ్యారంబుఁ గల్గిన**
**యతివకు వాల్గన్నులైననేమి?**
**తే॥గీ॥ గుణము బహుళంబు, దోషంబు కొంచెమైనఁ,**
**గొదవఁ జెందక యుండు నెక్కుడు గుణంబు,**
**తాఱుమారైన నిదియె పద్ధతి తలంప;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 89**

**తా.** ఓ వేణుగోపాలదేవా! పనసపండుపైనుండు తోలు చాల కఠినముగా నున్నప్పటికిని, పనసతొనలు తినుటకు యోగ్యములు కావా? యోగ్యములే! మామిడిపండు తొడిమదగ్గఱ జీడియున్నంత మాత్రమున మామిడిపండులోని తీపి తగ్గిపోవునా? తగ్గదు. మొగలిరేకుపైని ముళ్లు ఉన్నంతమాత్రమున వానిని తలలమీద పెట్టుకొనకుందురా? పెట్టుకొందురని భావము. శరీరమంతయు యొయ్యారము సౌకుమార్యముగల యువతికి వాలుచూపులున్నంతమాత్రమున ఆమె దేహసౌందర్యము చెడునా? చెడదు. గుణము లెక్కువగా ఉండి దోషములు తక్కువగా నున్నచో కొదువ యేమున్నది? ఎక్కుడు గుణములే పాటియగును. అట్లుగాక అవగుణము లెక్కువయుండి గుణములు తక్కువయైనచో, అవగుణములే పాటింపబడును.

**సం.వ్యా.** పై పద్యములో ఒకటి రెండు పదములు, ఒక పాదము శతకమంజరిలో కొంచెము భిన్నముగా నున్నవి: “పై తోలు” = “పైతొక్క”; “గేదంగి నెతిమౌళి” = “గేదంగివిరి మౌళి”; “అతివకు వాల్గన్నులైనేమి”? = “విడుతురే యొకవంక పడఁతి కున్న?”. రామలింగేశ శతకములోని పాఠములు: “పైతోలు” = “పైత్వక్కు”; “పనసఫలము” = “పనసపండు”; “మామిడి పండుకు” = “మామిడిపంటికి”; “జీడి తొరలియున్న” = “జీడి తొడరుమాత్ర”; “గేదంగి నెతిమౌళి” = “గేదంగివిరి

మౌళి"; "ముండ్లలమికొన్న" = "ముండ్లలముమాత్ర"; "అఖిలాంగసీమ యొయ్యారంబుఁగల్గిన యతివకు నాల్గన్నులైననేమి?" = "అఖిలాంగసీమ నొయ్యారంబు తిలకించు నతివకు వాల్చన్నులనఁగ నేమి?"

***సీ॥ గోవధఁ గావించి, గోరోజనమ్ము రో**
**గార్తుల కొసఁగఁ, బుణ్యాత్ముఁడగునె?**
**ఫలశాఖఁ బడమొత్తి, ఫలము లేఱించి, భూ**
**సురల కర్పించిన, సుకృతి యగునె?**
**నిండుతటాకంబు ఖండించి, చేపల**
**మత్స్యభుక్కులఁ దన్ప, మాన్యుఁడగునె?**
**గుడిఁగొట్టి, యిటుకలు గూరిచి, తులసి తి**
**న్నెలు రచించిన, ధర్మనిరతుఁడగునె?**
**తే॥గీ॥ ప్రబలపాతకపూర్ణుఁ డల్పంబు సుకృత**
**మునను శుద్ధుండు గాకుండు ననుట నిక్క,**
**మాడుఁగాకేమి యిచ్చకం బనృతవాది;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **90**

**తా.** ఓ వేణుగోపాలదేవా! ఆవును చంపి, దాని కడుపులోనుండి గోరోజనమును తీసి రోగగ్రస్తుల కొసంగినచో ఆతడు పుణ్యాత్ముడగునా? కాదని భావము. బాగా పండ్లున్న చెట్టుకొమ్మను నరికించి, ఫలముల నేరించి, బ్రాహ్మణులకు సమర్పించినచో నాతడు పుణ్యపురుషుడగునా? కాదు. చెఱువు నిండుగా ఉన్నది. ఆ చెఱువు కట్టలు తెగగొట్టి చేపలను పట్టించి చేపలు తినువారికి తృప్తిగా నిచ్చిన నాతడు గౌరవపాత్రుడగునా? కాదని భావము. గుడిని పడగొట్టి ఆ గుడి యిటుకలు తీసికొనిపోయి తులసికోటలు కట్టిన మాత్రమున ఆతడు ధర్మపరుడగునా? కాదు. అధికపాపమును చేసి అల్పమైన పుణ్యకార్యమొనర్చినను ఆతడు పరిశుద్ధుడు కాదు. అనృతములు పలుకువాడు ఇచ్చకముగా సత్యము పలికినను ఆతడు సత్యవంతుడగునా? కాదు.

**సం.వ్యా.** రామలింగేశ శతకములో సీసపద్యపాదముల చివర "ఔనె?" అని యున్నది; పై పద్యములో "అగునె?" అని యున్నది. నాల్గవపాదము చివర "ధర్మనిరతుఁడగునె?" = "పుణ్యనిలయుఁడౌనె?"

***సీ॥ మందు ద్రాఁకిడి గండమాల మాన్పఁగలేఁడు,**
**చక్కఁజేయగలండె నక్కనోరు?**
**వ్రేలివంకరమీఁద వీఁగ నొత్తఁగ లేఁడు,**
**కుదురుసేయఁగలండె గూనివీపుఁ?**
**ద్రోయఁజాలఁడు కుక్కతోఁక వంకరయైన,**
**నేటివంకలు దీర్ప నెట్టులోఁపుఁ?**
**దనవారి యొచ్చెంబుఁ దాను దీర్పఁగఁ జాలఁ,**
**దొరుల యొచ్చెముఁ దీర్ప నోఁపుటెట్లు?**
**తే॥గీ॥ దైవకృతమైన వంకరఁ దలఁగఁద్రోయ**
**వశముగాకుండుఁ గన నెంతవానికైనఁ,**
**బొరలు దాని నెఱుంగఁడు బుద్ధి జడుఁడు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల 91**

**అర్థములు:** గండమాల = మెడచుట్టు గడ్డలు లేచెడు వ్రణవ్యాధి విశేషము; ఒచ్చెము = కొఱఁత, అవమానము, హైన్యము; తలఁగు = తొలఁగు, తొలఁగించు.

**తా.** ఓ వేణుగోపాలా! "గండమాల" యను రోగమును మందుద్రాఁకులనిచ్చి తగ్గింపలేడు. నక్కనోటిని చక్కగా తీర్చి దిద్దగలడా? లేదు. వ్రేలి వంకర పోవునట్లుగా నొత్తలేడు. వీపుమీద ఏర్పడిన గూనిని కుదురుగా చేయగలడా? చేయలేడు. కుక్కతోక వంకరను ఎన్ని ప్రయత్నముల చేతను పోగొట్టలేడు. ప్రవహించు నదియొక్క వంకర లేవిధముగా సరిచేయగలడు? తనవారి దోషములనే తాను సరిచేయనేరడు. పరుల దోషముల నేవిధముగా తీర్పగలడు? దైవవిధిచే సహజముగా వంకరలైన వానిని చక్కచేయుట యెంతవానికిని వశము కాదుగదా! బుద్ధిజాడ్యముగలవాడు దాని నెఱుగనేరక వానిని సరిచేయుదునని పొరలాడుచుండును.

**సం.వ్యా.** శతకమంజరిలో –"మ్రాఁకిడి" = మాఁకిడి"; "నక్కనోటి" = "నక్కమోము"; రామలింగేశ శతకములో – "మ్రాఁకిడి" = "మాఁకిడి"; "మాన్పఁగలేఁడు" = "మాన్పగలండె?"; "కుక్కతోఁక వంకరయైన" = కుక్కతోఁక వంకరమాత్రము"; "వశము గాకుండుఁ గన నెంతవానికైన" = "వశము గాకుందుగద యెంతవారికైన".

***సీ॥ ఋణశేషమున్నను, రిపుశేషమున్నను,**
**వహ్నిశేషంబున్న వచ్చుఁ గీడు;**
**భుక్తి, వధూజనరక్తి, నిద్రాసక్తి,**
**యగ్గలంబైనఁ గీడావహిల్లుఁ;**
**గుత్సితాత్మునితోడ, గోపనజనముతోఁ,**
**గొండికవానితో గోష్ఠి తగదు;**
**అర్భక, పశు, మందిరాంగ, రక్షలయందు**
**నేమఱపాటొంద నెగ్గుఁజెందు;**
**తే॥గీ॥ నిట్టి నయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి**
**నట్లు చరియించువానికి హాని వచ్చు,**
**నాడికలు గల్గు, నిది నిక్క మరిసి చూడ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 92**

**అర్థములు:** రిపువు = శత్రువు; గోపనము = దాచుట, కాపాడుట; గోపనజనము = రహస్యములను కాపాడు జనము (స్త్రీలు); కొండికవాడు = చిన్నవాడు (బాలుదు); ఎగ్గు = కీడు, అపకారము; అర్భక–పశు–మందిర + అంగరక్షలు = పసిపిల్లలను – గోవులను – పట్టణమును (రాజధాని నగరమును) – చతురంగ బలములను (రథ గజ తురగ పదాతులను) రక్షించుట; ఆడికలు = దూఱులు, నిందలు.

**తా.** ఓ వేణుగోపాలా! అప్పుతీసికొని దానిని తీర్చునపుడు దానిని నిశ్శేషముగా తీర్చివేయవలెను. కొంచెమే అని మిగిల్చినచో అది వడ్డీలమీద వడ్డీలుగా పెరిగి మొదట తీసికొన్న దానికన్న అధికమగును. శత్రువులను సంహరించి, అందరు చనిపోయిన తరువాత పిల్లవాడే గదా! అని ఆ శత్రుశేషమును మిగిలియుండ

నీయరాదు. ఆతడే పెద్దవాడై పదిమందిని గూర్చుకొని వచ్చి ఆ గెలిచినవారిని సంహరింపగలడు. నిప్పునంతయు ఆర్పి, ఒక్క రవ్వేగదా! యని దానిని మిగిలించినచో అది రగిలి రగిలి ఊరువాడలను కాల్చును. కావున ఋణశేషమును – శత్రుశేషమును – అగ్నిశేషమును మిగులనీయరాదు. తినుటయందు, స్త్రీ సంగమమునందు, నిద్రయందు, అధికమైన ఆసక్తి ఉన్నచో దానివలన కీడుగలుగును. కుట్రబుద్ధి కలిగిన కుత్సితమనస్కులతోను – రహస్యములను కాపాడవలసిన స్త్రీలతోడను, బాలురతోడను గోష్ఠిసేయుట తగదు. అనగా వారితో కూడియుండుట తగదు. గోపనస్త్రీలు అనగా రాజకాంతలని లేదా యజమానుని కాంతలని ప్రకరణార్థము. పసిపిల్లల రక్షణమునందును గోవుల రక్షణమునందును, మందిర రక్షణమునందును, చతురంగబల రక్షణమునందును పొరపాటు చేసినచో కీడు కలుగును. ఇటువంటి నీతిమార్గము నెఱుగక ఇష్టము వచ్చినట్లు ప్రవర్తించు వారికి కీడు కలుగును. నిందలేర్పడును. అరసిచూడ నిది నిశ్చయము.

**సం.వ్యా.** "గోపనజనముతో" = "గోపిజనముతోడ" (రామలింగేశ శతకము)

**సీ॥ నంబికవిత్వంబుఁ, దంబళజోస్యంబు,**
**వలనొప్పఁ గోమటి వైష్ణవంబు;**
**వరుసనే యుప్పరివాని సన్న్యాసంబుఁ,**
**దరువాత శూద్రసంతర్పణంబు;**
**రజకుని గానంబు, రండాప్రభుత్వంబు,**
**వెలయఁగా వెలమల వితరణంబు;**
**సాతానిపండిత శాస్త్రవాదము, వేశ్య**
**తనయుఁ దబ్బకుఁబెట్టు తద్దినంబు;**
**తే॥గీ॥ నుభయ భ్రష్టత్వములు గాన నుర్విలోన,**
**రాజసభలందు నెన్నఁగా రాదు గదర!**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 93**

**అర్థములు:** నంబి = విష్ణుపూజకుడు; తంబళ = శివార్చనచేసి బ్రతికెడు జాతి

(తంబళవాఁడు, తంబళది); సాతాని (చాతాని, చాతని) = వైష్ణవమత మవలంబించు నొక జాతివాఁడు (శబ్దార్థచంద్రిక); శిఖాయజ్ఞోపవీతములు ధరింపని వైష్ణవుఁడు (శబ్దరత్నాకరము) (సాతానివాఁడు, చాత్తానివాఁడు, చాతనివాఁడు).

**తా.** ఓ వేణుగోపాలదేవా! విష్ణ్వాలయములలో అర్చకత్వము చేయు నంబివాని కవిత్వము – శివాలయములలో అర్చన చేయు తంబళవాని జోస్యము – కోమటి కులస్థులు తీసికొన్న వైష్ణవము – ఉప్పరికులస్థుడు తీసికొను సన్న్యాసమును – శూద్రకులస్థులు చేయు అన్నసంతర్పణములును – చాకలివాని గానము – విధవరాలి ప్రభుత్వము – వెలమవారి దానగుణము – సాతాని పండితుని శాస్త్రవాదము – వేశ్య కొడుకు తండ్రికి పెట్టు తద్దినము (ఎవరికి పుట్టెనని నిర్ణయింపగలరు) – ఇవి ఉభయ భ్రష్టత్వములు. అనగా కవిత్వము చదువు నంబి –దానిని వినువారు, జోస్యమునుచెప్పు తంబళవాడును–ఆ జోస్యమును విను వాడును, కోమటివారికి వైష్ణవమిచ్చున వారును – తీసికొచ్చినవారును ఉభయులయందును భ్రష్టత్వము పట్టును. ఇటులనే అన్నిటినీ భావింపగలరు. కావున వీనినిగురించి రాజసభలలో ప్రస్తావింపరాదు.

**సీ॥ భట్టరాచార్యుల బట్టలు కాఁగానె–**
**మడిఁగట్టుకొను పట్టుమడతలగునె?**
**అల రాచ కూఁతురు నధరంబు కాఁగానె–**
**తేనెఁజిల్కునె యనుపానమునకు?**
**అల్ల యేలేశ్వరోపాధ్యాయు బుఱ్ఱయు–**
**రాచూరి పెద్దఫిరంగి యగునె?**
**అలతాళ్లపాక చిన్నన్న రోమములైనఁ–**
**దంబుఱదండెకుఁ దంత్రులగునె?**
**తే॥గీ॥ హుంకరించిన యెటువంటి మంకునైనఁ**
**దిట్టవలయును గవులకు దిట్టమిదియె**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 94

**తా.** భట్టరాచార్యులు – ఏలేశ్వరోపాధ్యాయులు – తాళ్ళపాక చిన్నన్న అనువారు ప్రసిద్ధులు. కనుక వారిని గూర్చి చెప్పుచున్నాడు. ఓ వేణుగోపాలదేవా! భట్టరాచార్యుడు ధరించిన బట్టలు కాగానే అవి మడికట్టుకొనదగిన పట్టు వస్త్రములగునా? రాజుగారి కుమార్తె ఐనంత మాత్రమున ఆమె క్రిందిపెదవి అనుపానమునకు తేనెలను చిందదుకదా! ఆయుర్వేదములో మందున కనుపానముగా తేనెగాని – అల్లపురసముగాని చెప్పుదురు. అనగా అసలు ఔషధమునకు అనుపానమును జేర్చి తీసికొనవలెను. దాని ననుపానమందురు. ప్రసిద్ధుడైన ఏలేశ్వరోపాధ్యాయు బుఱ్ఱయైనను రాచూరి పెద్దఫిరంగి యగునె? కాదు. తాళ్ళపాక చిన్నన్న వెంట్రుకలైనను అవి తంబురకు తీగలగునా? కావు కదా! కనుక ఎంతవాడైనను హుంకరించి వచ్చిన మంకుపట్టుగల వానినైనను తిట్టవలయును. ఇదియే కవులకు దిట్టతనము.

'దిట్ట మిదియె' అనునది సరియగు ప్రయోగము కాదు. 'దిట్ట' శబ్దమునకు ధైర్యము కలవాడని అర్థము. దిట్టతనమనగా ధీరత్వమని భావము.

ఈ పద్యము తొలుతటి రూపము ఇది కాదు. ఇది సవరించిన రూపము.

"భట్టరాచార్యుల వట్టలు కాఁగానె
యెలదోఁట కూశ్మాండ ఫలము లగునె?" కూశ్మాండఫలమనగా "గుమ్మడికాయ" అని అర్థము.

"అల్ల యేలేశ్వరోపాధ్యాయు పిత్తైన
రాచూరి పెద్దఫిరంగి యగునె?
అల తాళ్లపాక చిన్నన్న శ–లములైనఁ
దంబురా దండెకుఁ దంత్రులగునె?"

అనునది శతకమును నిషేధింపక పూర్వమున్న పద్యస్వరూపము. తరువాత సవరించి వ్రాయబడినది పై పద్యము. ఏలేశ్వరోపాధ్యాయుడు మహాశాస్త్ర విద్వాంసుడుగా ప్రసిద్ధుడు. ఆయన ఏది చెప్పునో అది ఆధికారికము. మరి ఆయన అపానము (పిత్తు) రాచూరుపెద్ద ఫిరంగి ధ్వనినిచ్చునా? తాళ్ళపాక చిన్నన్న సంగీతవిద్యలో తలస్పర్శమొనర్చినవాడు – సాహిత్యమున గూడ – అంతసంగీత విద్వాంసుని మొల వెంట్రుకలు తంబురకు తంత్రులుకాలేవు కదా!

**సం.వ్యా.** కవివ్రాసిన పద్యములో అశ్లీలపదములుండుటవలన పండితులు ఈ

పద్యమును - ముఖ్యముగా మొదటి రెండు సీసపద్యపాదములను పూర్తిగా మార్చివేసినారు. అసలు పద్యము శతకవాఙ్మయ సర్వస్వములో నున్నది:-

"భట్టరాచార్యుల వట్టలు కాఁగానె/పొసఁగ శ్రీచూర్ణపుబుఱ్ఱలౌనె?
అలరాచకూఁతు స్మరాలయంబైనను /పూజకు దాసాని పుష్పమౌనె?"

మిగిలిన పాదములలో పండితులు మార్చివేసిన పదములు "అల్ల యేలేశ్వరోపాధ్యాయు బుఱ్ఱయు" = "అల్లయేలేశ్వరోపాధ్యాయు శి-ంబు"; "చిన్నన్న రోమములైన" = "చిన్నన్న శ-ములైన"; "హుంకరించిన" = "హంకరించిన" (రెండు శబ్దములును సరియైనవే)

**సీ॥ వెల్లుల్లివనములో వెలయంగ జోటీఁగ**
**పికము, పాడూరను బెస్త రాజు;**
**సాలెజేంద్రలలోన సాతాని పండితుం,**
**దంధులలోన నేకాక్షి శ్రేష్ఠుఁ;**
**దతిలోభి రాజున కర్థంబు నడుగని**
**వాఁడెపో పండితవర్యుఁ దరయఁ;**
**గాఁపు మంత్రులలోనఁ గాటేరి దైవంబు,**
**కొక్కరాయిలలోనఁ గొంగ ఘనము;**
**తే॥గీ॥ గుడిసె వేటుల నిల్లాలు గుత్తలంజె,**
**కనుక నీరీతిఁ బెక్కులు కలవు తలఁప;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 95**

**అర్థములు:** "కొక్కరాయి" = వక్కుకొంగ, బక్కడిల్లిన (కృశించిన) కొంగ (శబ్దరత్నాకరము); "గుడిసెవేటు" = కులట, రూపాంతరము "గుడిసెవాటు".

**తా.** ఓ వేణుగోపాలా! వెల్లుల్లిపాయల తోటలో జోరీగయే కోకిల. పాడుబడిన యూరులో బెస్తయే రాజు (శ్రేష్ఠుడు). బెస్త అనగా చేపలుపట్టుకొని జీవించు కులము. నేతనేసికొని జీవించు సాలెకులస్థులలో సాతాని పండితుడు. అసలు రెండు కన్నులు లేని అంధులలో ఒక్క కన్నుగల ఏకాక్షి శ్రేష్ఠుడు. మిక్కిలి పిసినారి

వాడైన రాజునకు, డబ్బునడుగనివాడే మహాపండితవర్యుడు. కాపు మంత్రులలో కాటేరిదైవము శ్రేష్ఠుడు. ఈ శబ్దమును విచారించినచో కాటి + ఱేడు = కాటిఱేఁడు – కాత్రేడు అను రూపము లేర్పడును. దీనికర్థము శ్మశానమునకు అధిపతియైన శివుడు. కొక్కిరాయిల జాతిలో కొంగ శ్రేష్ఠము. కులటలలో ఇల్లాలు అందఱకు గుత్తకుగొన్న లంజె. కనుక ఈ విధమైన వెన్నియో కలవు.

***సీ॥ పెట్టిపోసిననాఁడె చుట్టాల రాకడ,**
**కలిమివేళనె వారకాంత వలపు;**
**సేవచేసిననాఁడె క్షితినాథు మన్నన,**
**వయసు గల్గిననాఁడె వనిత రక్తి;**
**విభవంబు గలనాఁడె వెనువెంటఁ దిరుగుట,**
**పనియున్ననాఁడె మావారలనుట;**
**పోఁడిమి గలనాఁడె పొరుగింటి పోరచి,**
**మగుడింపఁ గలనాఁడె తగవు సూటి;**
**తే॥గీ॥ ఆత్మశక్తి తొలంగిన యవసరమునఁ**
**దనకు నెవ్వరుఁగా రిది తథ్యమరయ**
**బలిమిచే నవయవములు పనికిరావు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 96**

**అర్థములు:** క్షితినాథుడు = భూమికి అధిపతి (రాజు); పోఁడిమి = సంపద; పోరచి = కానుక; తగవు = న్యాయమునందు; సూటి = గురిఏర్పడుట.

**తా.** ఓ వేణుగోపాలా! పెట్టిపోసినంతకాలమే చుట్టాలు వచ్చుట. పెట్టుపోతలాగి పోతే బంధువులు రారు. సంపదలున్నంతకాలమే వేశ్య ప్రేమను పంచును. సంపద లుడిగిపోయిన, వానిని వేశ్య ప్రేమింపదు. ఆమెకు కావలసిన దాతని సంపదయే కాని, ఆతడు కాదు. చక్కగా సేవించినప్పుడు మాత్రమే రాజు మన్నించును. మంచి వయస్సునందున్నప్పుడే స్త్రీలయం దనురక్తి కలుగును. ధనము వైభవము కలిగిననాడాతని వెంట నలుగురు తిరుగుదురు. ఆ వైభవము పోయిన తరువాత

ఎవ్వడును ఆతని వెంట నుండడు. ఒక వ్యక్తితో తమకు పనియున్నప్పుడే ఆతనిని మావాడందురు. పనిలేకపోయినచో ఆతడెవరో! సంపదలు కలనాడే పొరుగింటి కానుకలు లభించుట. ధనహీనుని పొరుగింటివారు లెక్కింపరు. ఎవ్వరినైనను ఒప్పింపజేయగల సమర్థత ఉన్ననాడే న్యాయము చెప్పగలడను గురి ఏర్పడును. తన ఆత్మశక్తి తొలగిపోయిన సమయమందు ఎవ్వరూ తనకు కారు. ఇది సత్యము. కేవలము బలముచేతనే అవయవములు పనికిరావు కదా!

**సం.వ్యా.** రామలింగేశ శతకములోని పాఠాంతరములు:– "చుట్టాల రాకడ" = "చుట్టాల చేరిక"; "కలిమివేళనె వారకాంతవలపు" = "కలిమిగల్గిననాఁడె కాంతవలపు"; "బలిమిచే నవయవములు పనికిరావు" = "బలిమివో నవయవములె పనికిరావు" (ఈ పాఠము బాగున్నది – బలముపోయినపుడు మన అవయవములే మనకు పనికిరావు.)

***సీ॥ చెఱువులో నీరు నిల్చినఁ బానయోగ్యమౌ,**
**నదె యబ్ధిఁజేరఁ బానార్హమగునె?**
**యుదక మల్పంబైన నుచ్చులోఁ బడుఁ జేప,**
**చెఱువు నిండినవేళఁ జిక్కదట్లు;**
**చరణాయుధాండంబు చట్టిదౌ నోర్చిన,**
**నవియంగఁ జేసిన నల్పభుక్తి;**
**వహ్ని యల్పంబైనవలన నేమనఁగూడ,**
**దదియు ధాటింప మేదంత గాల్చు;**
**తే॥గీ॥ నాక్రమింపఁగఁ దగినచో నరి వధింపఁ**
**దగు, ఫలాపేక్ష కొద్దియే ధర్మమునకు,**
**వసుధతత్త్వంబుఁ బరికింపవలయుఁ జూడ;**
**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 97**

**అర్థములు:** ఉచ్చు = ఉరి, వాగుర (వల); చరణాయుధము = చరణములే (కాళ్ళే) ఆయుధముగా కలది (కోడి); చరణాయుధ + అండంబు = కోడిగ్రుడ్డు;

అవియంగఁజేయు = పగులగొట్టు; (అవియు = పగులు); చట్టి = నోరు వెడల్పుగల చిన్న మట్టి కుండ, దాక; ధాటింపన్ = దాడిచేయగా; అరి = శత్రువు.

**తా.** ఓ వేణుగోపాలా! నీరువచ్చి చెఱువునందు చేరినచో ఆ నీరు త్రాగుటకు పనికివచ్చును. అదే నీరు సముద్రమున చేరినచో ఉప్పగా ఉండి త్రాగుటకు యోగ్యము కాదు. నీరు కొద్దిగా ఉన్నప్పుడు చేప "ఊఁత"లో చిక్కును. ("ఊఁత యను దానిని క్రింద వెడల్పు పైని రానురాను సన్నగా అల్లుదురు. నీరు తక్కువగా ఉన్నప్పుడు దానిని చెఱువులో వేయుచు, పై నుండి చేయిపెట్టి చేపలను పట్టెదరు. నీరెక్కువగా ఉన్నప్పుడు "ఊఁత" వేయుటకు వీలుగాదు. దానిని కవి "ఉచ్చు" అనుట ప్రమాదము. ఉచ్చులు మృగములకు వేయుదురు గాని చేపలకు వేయరు). చెఱువు నిండిన వేళ చేప చిక్కదు కదా! కోడిగ్రుడ్డును చక్కగా వండినచో చట్టెడు కూరయగును. "చట్టి" యనునది మట్టితో చేసిన పాత్ర. దానిని "దాక" అని కూడ అందురు. ఆగ్రుడ్డును పగులగొట్టినచో స్వల్పమైన భుక్తియగును. నిప్పు చాల స్వల్పమైనను అట్లే ఉండిన నేమియు కాదు. అది రగిలినచో మేడ నంతటిని కాల్చివైచును. ఆక్రమింపవచ్చిన శత్రువును వధింప తగును. ఫలాపేక్షను బట్టి ధర్మముండును. లోకతత్త్వమునుబట్టి చూడవలయును.

**సం.వ్యా.** రామలింగేశ శతకములోని పాఠాంతరములు: "అబ్ధిఁజేర" = "వార్ధిఁజేర"; "ఉచ్చులోఁబడుఁ జేప" = "ఊబిలోఁబడుఁ జేప". సీసములోని నాల్గవ పాదమంతయు భిన్నముగా నున్నది: "వహ్నియల్పము దీని వలన నేమనఁగూడ / దదియు రాఁజింపఁ వీడంతఁగాల్చు" (ఈ పాఠము బాగున్నది). ఎత్తుగీతి అంతయును భిన్నముగా నున్నది:

తే.గీ. "ఆశ్రయింపంగఁ దగినచో టరి వధింపఁ,
దరుఫలాపేక్ష కోర్మి, యౌద్ధత్యమునకు
వస్తుతత్త్వంబుఁ బరికింప వలయుఁ బ్రౌఢ" ఈ పాఠము కూడ ఉత్తమమైనది.

***సీ॥ చేరువ పగయును, దూరపు మైత్రియుఁ,**
**గావించెనేనియుఁ గార్యహాని;**
**స్వనృపుతో వైర, మన్యనృపులతో మైత్రి,**
**యొనరించెనేనిఁ గీడొదవకున్నె?**

**త్యాగంబునకు, నాత్మభోగంబునకుఁ గాని**
**విత్తార్జనంబుఁ గావింపనేల?**
**బాసకు లోనైన ప్రతిభాష లాడిన**
**పొలఁతితో భాషింపఁ బోవఁదగదు;**
**తే॥గీ॥ ఇట్టి నయమార్గ మెఱుఁగక యిచ్చవచ్చి**
**నట్లు చరియించు వానికి హానివచ్చు,**
**నాడికలు గల్గు, నిది నిక్క మరసిచూడ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** 98

**తా.** ఓ వేణుగోపాలా! సమీపమున శత్రువులును, ఎక్కడో దూరముగా మిత్రులును గలిగిన వ్యక్తికి పనులు చెడిపోవును. తనరాజుతో విరోధమును పూని, అన్యనృపునితో స్నేహముగా నున్న వ్యక్తికి కీడు జరుగకుండ ఉండునా? ఉండదు. కీడు జరుగును. త్యాగము సేయుటకును అనగా దానధర్మములకును లేదా స్వయముగా తాను సుఖములనుభవించుటకును పనికిరాని డబ్బు నెంతసంపాదించిన నేమి ఫలము? చేసిన బాసకు (ఒట్టుకు) బదులు వ్యతిరేకముగా మాటాడిన స్త్రీతో మాటాడుటకు పోరాదు. ఇటువంటి నీతిమార్గ మెఱుగక యిష్టమువచ్చినట్లు చరించువానికి కీడు కలుగును. తప్పక నిందలు కల్గును.

**సం.వ్యా.** పై పద్యములోని కొన్ని పాదములు శతకమంజరిలో కొంచెము భిన్నముగా నున్నవి: 'స్వనృపుతో వైర మన్యనృపులతో మైత్రి / యొనరించెనేనిఁ గీడొదవకున్నె?"="అల్పుతో వైర మన్యనృపాలుతో మైత్రి / యొనరించెనేనియుఁ నొదవుఁ గీడు"; "విత్తార్జనంబుఁ గావింపనేల?"="విత్తార్జనంబుఁ గావింపరాదు!"; "చరియించువానికి" = "చరియించువారికి". రామలింగేశ శతకములోని పాఠాంతములు: "ఆత్మభోగమ్మునకు రాని విత్తార్జనంబుఁ గావింపనేమి?" తేటగీతిలోని మూడవ పాదము పూర్తి భిన్నముగా నున్నది: ''దాని కొడఁబడఁడింగితజ్ఞానశీలి".

***సీ॥ సూర్యుండు దశశతాంశువులఁ బోఁదఱిమినఁ,**
**గలుగవే గుహలు చీఁకటులు దాఁగ;**

ఝంఝానిలము దాడిసలుప, దీపమునకుఁ
గలుగదే వసియింపఁ గలశమొకటి;
వని సాళువంబు గువ్వను బాఱఁ దఱిమినఁ,
దరుకోటరము లేదె దానిఁ బ్రోవ;
గరుడుండు వెనుదాఁకఁ, గాకోదరముఁ డాఁగఁ
గలుగదే వల్మీకబిల మొకండు;
తే॥గీ॥ బలము గలవాఁడు దుర్బలుఁ బాఱఁదఱుమ,
దైవ మొక ప్రాపుఁ గల్పింపఁ దలఁపకున్నె?
పొరలు నే ప్రొద్దహంకారమున నరుండు;
మదరిపువిఫాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 99

**అర్థములు:** దశశత + అంశువులు = వేయి కిరణములు; ఝంఝానిలము = (ఝంఝా + అనిలము) = వానతో కూడిన పెద్దగాలి, తుపాను; సాళువము = డేగ; గువ్వ = అడవిపావురము; తరుకోటరము = చెట్టుతొఱ్ఱ; కాకోదరము = పాము; వల్మీకము = పుట్ట; బిలము = రంధ్రము, బొఱియ;

**తా.** ఓ వేణుగోపాలా! సూర్యుడు తన వేయికిరణములతో తరిమినను చీకటులు దాగుకొనుటకు కొండగుహలు లేకున్నవా? ఉన్నవి. గాలివాన దాడిసేయగా దీపము కొండెక్కకుండ (ఆరిపోకుండ) నుండుటకు కలశము లేకున్నదా? ఉన్నది. కుండవంటి గాజుకుప్పెలో నున్న దీపము కొండెక్కదని భావము. గువ్వను డేగ చంపుటకు వెంటబడి తరిమినను గువ్వను కాపాడుటకు చెట్టుతొఱ్ఱ లేదా? ఉన్నది. గరుత్మంతుడు పామును చంపుటకు తఱుముకొని రాగా, పాము దాగుకొనుటకు పుట్టకన్నము లేదా? పుట్టలో దూరి పాము తనను తాను కాపాడుకొనును. బలవంతుడు బలహీనుని పాఱద్రోలగా దుర్బలునకు దైవమొక రక్షణ కల్పింప తలపోయడా? తలపోయును. ఎల్లప్పుడును అహంకారముతో మానవుడు పొరలుచుండినను, దైవమెక్కడికక్కడ బలహీనులను కాపాడుట కవకాశములు కల్పింప తలంచును.

**సం.వ్యా.** పై పద్యములో మొదటిపాదములోని “దశశతాంశువుల” అను

పదమునకు బదులుగా రామలింగేశశతకములో "తన శీతాంశువుల" అని కలదు. "తన వాడియైన కిరణముల" కన్న "వేయికిరణములే" సమంజసముగా నున్నది. సూర్యునకు "సహస్రకిరణుడు" "సహస్రాంశువు" అను పేర్లు ప్రసిద్ధము కదా! రామలింగేశ శతకములో సీసములోని నాల్గవపాదము కొంచెము భిన్నముగా నున్నది: "గరుడుండు వెనుచనఁ గాకోదరమునకుఁ / గలుగదే వల్మీక బిలమునొకటి"; తేటగీతి మొదటిపాదములో "బలముగలవాఁడు" = "ప్రబలుఁడగువాఁడు"; మూడవపాదము కొంచెము భిన్నముగా నున్నది: "పొరలు నేప్రొద్దహంకారమున నరుండు" = "పొరలుగాక నహంకారమున నరుండు".

**సీ॥ తండ్రి మధ్వాచారి, తనయుఁడారాధ్యుండు,**
**తల్లి రామాన్జమతస్థురాలు;**
**తనది కూచిమతంబు, తమ్ముఁడు బౌద్ధుండు,**
**సర్వేశ్వరమతంబు సడ్డకునిది;**
**ఆలు కోమటిజాతి, అక్క జంగమురాలు,**
**బావగారిది లింగబలిజ కులము;**
**ఆఁడుబిడ్డ సుకారి, యల్లుఁడు పింజారి,**
**మఱఁదలుఁ గోడలు మారువాడి;**
**తే॥గీ॥ కలియుగంబున వర్ణసంకరము ప్రబలి,**
**యుత్తమకులంబు లొకమూల నొత్తిగిల్లె***;
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **100**

**అర్థములు:** సడ్డకుడు లేక షడ్డకుడు=తోడియల్లుడు; సుకారి = ఎద్దులమీఁద సరకెత్తించుకొని, ఊరూరు తిరిగి, వర్తకము చేసెడి ఒక నీచజాతి (శబ్దార్థ చంద్రిక); పింజారి = దూదేకులవాఁడు.

**తా.** ఓ వేణుగోపాలా! తండ్రి మధ్వాచార్యుల ద్వైతమతానుయాయి. కొడుకు ఆరాధ్యుడు (శైవుడు). తల్లి రామానుజుల విశిష్టాద్వైత ప్రవర్తకురాలు. తాను కూచిమతస్థుడు (వైష్ణవమున వామాచారము). తమ్ముడు బౌద్ధుడు. తన షడ్డకుడు

సర్వేశ్వర మతస్థుడు. భార్య కోమటి కులస్థురాలు. అక్క జంగమురాలు. బావగారు లింగబలిజ కులస్థుడు. ఆడుబిడ్డ సుకారి కులస్థురాలు. అల్లుడు పింజారి (దూదేకుల కులము). మఱదలు – కోడలు – మారువాడీలు. ఈ విధముగా కలియుగమున వర్ణసంకరము అధికమై ఉత్తమ కులము లన్నియు ఒక మూలకు తప్పుకొనెను. ఇందు కవి మతములను, కులములను కలగాపులగము చేసెను.

**సం.వ్యా.** ఈ సీసపద్యములో ఎత్తుగీతియైన తేటగీతిలో రెండవపాదము డా॥ శ్రీరంగాచార్యగారిప్రతిలో "మూలనిక్షేపంబు మునిగినట్లు" అని తప్పుగానున్నది. ఇది ఈ పద్యములోనిది కాదు. దీని తరువాత వచ్చెడి 101 సీసపద్యములో మొదటి పాదములోని రెండవదళము. (సీసపద్యములోని రెండవదళము తేటగీతి పాదములో నెట్లు ఇముడును?) "ఉత్తమ కులంబు లొకమూల నొత్తిగిల్లె" అనునది సరియైన పాదము. దీనిని అకాడెమీ ప్రతినుండి గ్రహించితిని. శతకమంజరిలో కూడ నిట్లేయున్నది.

మేము (అనగా నేను, మిత్రులు శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు) 2013లో డా॥ శ్రీ రంగాచార్యగారి సంపాదకత్వములో శ్రీ పాండురంగయ్యగారు ప్రచురించిన "వేణుగోపాల శతకము"ను అనుసరించినాము. దురదృష్టవశాత్తు ఆ శతకమున ఎన్నియో తప్పులు దొర్లినవి. ఆ తప్పులలో పైన తెల్పిన తప్పు ఒకటి.

**సీ॥ తల్లిఱంకునఁ దండ్రిధనము పోయినయట్లు,**
**మూలనిక్షేపంబు మునిఁగినట్లు;**
**కూఁతురి ముడుపెల్లఁ గొల్లవోయినయట్లు,**
**కాణాచి పల్లెలు కాలినట్లుఁ;**
**దనయాలి గడనెల్ల దండుగకైనట్లుఁ,**
**దండ్రితద్దినమేమొ తప్పినట్లు;**
**చెల్లిపైఁబడి దొంగ చెఱచిపోయినయట్లుఁ,**
**గొడుకు నప్పుడె తలఁగొట్టినట్లు;**
**తే॥గీ॥ దిగులువడి చూచి, మూర్ఛిల్లి, తెప్పిఱిల్లి,**
**కవుల కియ్యంగవలదని కన్నుమీటు;**

**మదరిపువిఘాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!** **101**

**తా.** (కవి ఎన్నియో పద్యములలో వలెనే ఈ పద్యములో కూడ దుష్టమంత్రి స్వభావమును నిందించుచున్నాడు) ఓ వేణుగోపాలా! ఉత్తముడైన రాజు కవులను సన్మానింప జూచును. కాని ఆతని దగ్గరనుండు దుర్మార్గుడైన మంత్రి ఈ క్రింది విధముగా బాధపడి, కవులకు ధనమీయవలదని రాజుకు కన్నుగీటి చెప్పును. తన సొమ్మంతయు పోయినట్లు ఈ క్రింది రీతిని గిలగిలలాడును:-

తన తల్లి చేసిన అంకుతనమువలన తన తండ్రి ధనమంతయు పోయినట్లు - తన మూలనిధి అంతయు మునిగిపోయినట్లు - తన కూతురి సొమ్మంతయు కొల్లగొట్టబడినట్లు - చిరకాలము నివసించిన పల్లెలు కాలిపోయినట్లు - తన భార్య సంపాదనమంతయు వ్యర్థమైనట్లు - తండ్రికి పెట్టవలసిన తద్దినము తప్పిపోయినట్లు - దొంగ తన చెల్లెలిపైబడి ఆమెను చెఱచి పోయినట్లు - కొడుకు తలనరికినట్లు - దిగులుపడి చూచి - మూర్ఛచెంది - తెప్పరిల్లుకొని కవుల కీయవద్దని కన్నుగీటును. రాజు కవులకిచ్చెడి ధనము ఆ మంత్రిది కాదు; రాజధనము - అయినను ఆ దుష్టమంత్రి తన సొంతధనము పోయినట్లు విలవిలలాడును.

**సం.వ్యా.** పై సీసములోని ఈ మొదటి పాదము డా॥ శ్రీ రంగాచార్యగారి ప్రతిలో లేదు. శతకమంజరిలోను, అకాడెమీప్రతిలోను ఉన్నది. వానునుండి దీనిని గ్రహించితిని. శతకవాఙ్మయ సర్వస్వములోని పాఠములు: "తల్లిఁఅంకునఁ దండ్రిధనము పోయినయట్లు" = "తల్లి అంకున పుండ్లు తాఁకి వచ్చినయట్లు" ''చెల్లెలపైఁబడి దొంగ చెఱచిపోయినయట్లు''; ''చెల్లెలిపైఁబడి దొంగ చేసినపోయినయట్లు" ఈ శతకవాఙ్మయసర్వస్వములో అధికముగా నున్న పద్యము:

**సీ॥ వయసు దీఱిన కాంత వక్షోజముల భంగి,**
**సంగమంబైన శి-ంబు కరణి;**
**గర్భిణియగు వారకాంత యుండెడితీరు,**
**పాండురోగి ముఖంబు భంగి; ముసలి**
**యెద్దు ముడ్డిని పేడ ఎళ్ళొచ్చుకైవడి,**
**ఈనఁబోయిన గాడ్దె యో- కరణి;**

**అగ్గిదాఁకినవాని యందాల పోలిక,**
**మగడు పోయిన లేమపగిది; లుబ్ధు**
**తే॥గీ॥ యాచకులఁజూచి తలవ్రేలవేసి, పెద్ద**
**సున్నఁ జుట్టుఁగదా! ముండగన్నకొడుకు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల!"**

దీనిని ఈ శతకములోని 106వ పద్యముగా గ్రహించవలెను. లేదా ఈ 106 పద్యముల సంఖ్యనుండి అడిదము సూరకవి 24 పద్యములను తీసివైచినచో, పోలిపెద్ది వేంకటరాయకవి రచించిన 82వ పద్యముగా స్వీకరింపవలెను. "ఎళ్ళొచ్చుకైవడి". "ఎడలుచు + వచ్చు కైవడి" పద్యము సులభముగా నున్నది. తాత్పర్యము అనావశ్యకము.

**సీ॥ బడవాకుఁ బ్రతియెన్న బహుమతు లేనూరు,**
**దళవాయి కొక యూర ధర్మచేట;**
**పడుపుతొత్తుకు మేలు పౌజుల కమ్మలు,**
**తాటాకు దుద్దులు తల్లిచెవుల;**
**దండెదాసర్లకుఁ దాజీత వాజము,**
**కవివరులకుఁ గన్నగాని దుమ్ము;**
**బైనీని సుద్దికి బారిశాలువజోడు,**
**విద్వాంసులకు బేడ వెలితిగుడ్డ;**
**తే॥గీ॥ ఘనము నీచం బెఱుంగక కలియుగమున**
**నవని నడతురు మూఢులైనట్టి దొరలు;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 102**

**అర్థములు:** బడవా = తార్చునది, తార్చువాడు; పడుపు = వ్యభిచారము చేయు; తొత్తు = బానిస, దాసి, లంజె.

**తా.** ఓ వేణుగోపాలా! కలియుగమున నీ భూమియందు పరిపాలకులు మూఢులై ఉచ్చనీచము లెఱుంగక సంచరింతురు. దానికి తార్కాణముగా, తార్పుడుగత్తెకు ఐదువందల బహుమతులిత్తురు. (అనగా లెక్కలేనన్ని అని భావము); సేనాధిపతికి ధర్మసంబంధమైన పొగడ్తలు. వేశ్యకు శ్రేష్ఠమైన బంగారు చెవికమ్మల సమూహములు; దాని తల్లి చెవులకు తాటియాకులవంటి దుద్దు లిత్తురు. దండెమును పట్టుకొను దాసర్లకు మేలు కుళాయిలతో కూడిన విందులిత్తురు; లేదా! పోషణకు సరిపోవు జీతము లిత్తురు. కాని కవి శ్రేష్ఠులకు మాత్రము దొంగలకిచ్చు దుమ్ము మాత్రమే. సుద్దులను చెప్పు బైనీనికి శ్రేష్ఠమైన శాలువల జత; (పూర్వము రాజులు కవులకుగాని, ఎవరికైనను రెండు శాలువలిచ్చెడివారు. ఒకటి తలను చుట్టుకొనుటకును, రెండవది పైని ధరించుటకును. వానినే "దోఃశాలువలు" అనేవారు. దానినే "దుశ్శాలువ" అందురు. నేడు ఒక శాలువనే కప్పుచు దుశ్శాలువాతో సత్కరించుచున్నామనుచున్నారు. 'దుః'శాలువా అనుదానికి శ్రేష్ఠమైన శాలువా అని భావించి నేడిట్లు పలుకుచున్నారని తలంపవచ్చును.) మహా విద్వాంసులకు రెండణాల విలువగలిగిన వెలసిపోయిన వస్త్రము లిత్తురు. ఈ పద్యమున "ధర్మచేట– జీతవాజము – బైనీని" వంటి పదములానాటి మాండలికములు. అవి నిఘంటువులలో చేరలేదు. వాజమనగా అన్నము గనుక ఊహించి వ్రాయుట యైనది. ధర్మచేట – వైరిసమాసరూపము.

**సం.వ్యా.** "దండె దాసర్లు", "బైనీలు" లేక "బవనీలు" – వీరు జానపద వృత్తి గాయకులు. దాసర్లు దండాకారముగా నుండు వాద్యమును వాయింతురు. బైనీలు "జముకులు" వాయింతురు. వీరిని "జముకులవారు" అని కూడ పిలుతురు. వీరు పరశురాముని కథలను పాడుదురు. క్రీడాభిరామములో వీరి ప్రసక్తి కలదు. "కన్నగాని దుమ్ము" = "కన్నగాని మన్ను" (అకాడెమీప్రతి)

**సీ॥ వసుధాధిపతికి విశ్వాసగుణంబు, జా**
**రునకు సత్యంబుఁ, జోరునకు భయము;**
**లంజెకు మోమోట, పంజెకు ధైర్య, మెం**
**గిలి కెగ్గు, మద్యపాయులకు సిగ్గు;**

**ద్రవ్యాధికులకును దానధర్మములపై**
**దృష్టియు, జారిణిస్త్రీకి వావి;**
**పలుగాకులకు మేలు, పందగొడ్డుకుఁ బాలు,**
**మానికిఁ గఱవుఁ, గోమటికిఁ బరువు;**
**తే॥గీ॥ మేఁక మెడచన్నులకుఁ బాలు, మేడిపూలు,**
**లేవు త్రిభువనంబులను గాలించి చూడ;**
**మదరిపువిఫాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 103**

**అర్థములు**: పంజె = పిఱికివాఁడు, రూ.పంజియ; పలుగాకి = దుష్టుఁడు; పంద = పిఱికి; మాని = మానముగలవాఁడు.

**తా.** ఓ వేణుగోపాలా! భూమిని పాలించు రాజునకు విశ్వాస గుణము – విటునకు సత్యము వచించు స్వభావము – దొంగకు భయము – లంజెకు (వ్యభిచారిణికి లేదా వేశ్యకు) మొగమాటము – పిఱికి వానికి ధైర్యము – ఎంగిలికూడు తినువానికి ఎగ్గు – త్రాగుబోతులకు సిగ్గు– అధికసంపన్నులకు దానధర్మములు చేయుదృష్టి – వేశ్యలకు (వ్యభిచరించెడు స్త్రీకి) వావి – పలుగాకులకు మేలు – పిఱికి గొడ్డుకు పాలు – అభిమానవంతునకు కఱవు – కోమటికి గౌరవము – మేక మెడచన్నులకు పాలు – మేడిచెట్టునకు పూలు – మూడు లోకములందు గాలించి చూచినను కనిపింపవు.

**సీ॥ వ్యాసాదులగు మౌనివర్యులు తపమెల్లఁ**
**బోఁగొట్టుకొనుట సంభోగమునకె;**
**జలజాతభవ శివాదులుఁగూడ భ్రమఁగొని**
**మురియుట యీ పాడుభోగమునకె;**
**నేర్తుమంచని నెఱ్ఱనీల్గుచు విద్యలు**
**కోటి నేర్చుట పొట్టకూటికొఱకె;**
**ఏకచక్రమ్ముగ నేలిన రాజైనఁ**
**గడ కేడుజేనల కాటికొఱకె;**

**తే॥గీ॥ కీర్తి యపకీర్తి దక్కఁ దక్కినవి నిల్వఁ**
**బోవు శాశ్వతమౌనట్లుఁ బుడమిమీఁద;**
**మదరిపువిషాల! మునిజనహృదయలోల!**
**వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 104**

**తా.** ఓ వేణుగోపాలా! వ్యాసుడు మొదలైన మునిశ్రేష్ఠులు తపశ్శక్తిని పోగొట్టుకొనుటకు స్త్రీ సంభోగ వాంఛయే కారణము – వ్యాసుడు ఘృతాచి – అంబిక – అంబాలికలతో సంభోగసుఖ మనుభవించెను. విశ్వామిత్రుడు మేనకతో సంభోగించి తపశ్శకిని పోగొట్టుకొనెను. వ్యాసమహర్షి తపశ్శక్తిని పోగొట్టుకొని నట్లెందును కానరాదు. బ్రహ్మ శివుడు మొదలైనవారు భ్రమతో స్త్రీలను చూచి మురియుట ఈ పాడు పనికోసమే కదా! బ్రహ్మ పార్వతిని చూచి కామించి పంచముఖములలో ఒక ముఖమును (గార్దభముఖమును) పోగొట్టుకొనెను. శంకరుడా తల నరికెను. శివకథలలో శంకరు డెందరో స్త్రీలతో విహరించిన గాథలు కలవు. మేము సర్వశాస్త్ర పారంగతులమని విఱ్ఱవీగుచు కష్టించి ఆ శాస్త్రముల నెల్ల నేర్చుకొనుట పొట్టకూటిని సంపాదించుకొనుటకొఱకే. ఏకచ్ఛత్రాధిపత్యముగా భూమండలమును పాలించిన చక్రవర్తి కూడ చివఱకు కాటిలో ఏడుజేనల భూమిలో పూడ్చవలసిన వాడే కదా! ఈ భూమిమీద వ్యక్తుల యొక్క కీర్తి – అపకీర్తులు మాత్రమే శాశ్వతముగా నిలిచియుండును. మిగిలిన వేవియు శాశ్వతములు కావు.

"కోటి విద్యలు కూటికే – ఎన్నాళ్ళు బ్రతికినా కాటికే "అను సామెతను రెండు పాదములలో కవి చక్కగా ఇమిడించినాడు.

**సం.వ్యా.** పై సీసపద్యములోని మొదటి రెండు పాదములను పండితులు పూర్తిగా మార్చివేసిన పాదములు – కవి వ్రాసిన అసలు పాదములు శతకవాఙ్మయ సర్వస్వములో నుదాహరింపబడినవి, చూడుడు:–

"వ్యాసాదులగు మౌనివర్యులు తపసెల్ల
పోగొట్టుకొన్నది – ఁకుకేను.
జలజాతభవ శివాదులు గూడ బ్రమయుట
దుర్గంధమగు నుచ్చదొండికేను"

సీ॥ సుంకరులకు, వర్ణసంకరులకుఁ, దన
పొత్తొసంగెడి తొత్తుముండలకును;
సారాయి నీళ్ళకు, జాతరగాండ్లకు,
బంగుభాయీలకు, బందెనకును;
బడవాలకును, లేని భడవాలకును, అంకు
రాట్నాలకును, శుంఠరండలకును;
గలిమి దండుగులకు, గారడీవిద్యకుఁ,
దోడcబోతుల, కాటదొమ్మరులకు;
తే॥గీ॥ లోభితనమున నేడ్చె నిద్రాభవాని,
గడన వీండ్లకెకాక సత్కవులకౌనె?
మదరిపువిఘాల! మునిజనహృదయలోల!
వేణుగోపాల! భక్తసంత్రాణశీల! 105

**అర్థములు:** తొత్తు = లంజియ; బందెన–బండెకాడు = చెఱలో వేయువాఁడు; బడవా = తార్చునది, తార్చువాఁడు; భడవ = ఒక తిట్టు (పై అర్థమే కావచ్చును); అంకులరాట్నము = ఉత్సవ కాలమునందు వేడుకకు బాలబాలికలను ఎక్కించి త్రిప్పించెడు, చుట్టు తొట్లేర్పఱచిన వలయాకారపు యంత్ర విశేషము (కాని ఇక్కడ "అంకులాడి – జారిణి" అను నర్థములో వాడబడినది); గడన = సంపాదనము.

**తా.** ఓ వేణుగోపాలస్వామీ! పన్నులు వసూలు చేయు ఉద్యోగులకును (లంచములు బాగుగా పట్టుదురు); రెండు కులములకు జన్మించిన వర్ణసంకరులకును (వారు మంచిచెడు లెఱుంగక గడింతురని భావము); అడిగినవారికి తనతో రతిసల్పుట కవకాశము కల్పించు తొత్తు ముండలకును; సారాయినీళ్ళు అమ్ముకొనువారికిని; జాతరలు చేసి అందు త్రాగి గంతులు వేయువారికిని (దేవతల పేర్లతో విరాళాదులు పోగుచేయుదురు); భంగు (గంజాయి) పట్టుపట్టెడు వారికిని; చెఱసాలలో వేయు ఉద్యోగులకును; స్త్రీలను పురుషులకు తార్చు తార్పుడు గత్తెలకును; భడవాలకును; అంకురాట్నాలకును (వ్యభిచరించుట కొఱకు రాట్నముల వలె తిరిగెడు స్త్రీలను అంకురాట్నములందురు); శుంఠలైన వ్యభిచారిణులకును (నియమము లేకుండ

ఎవనితో నైనను డబ్బునకు లోబడు వేశ్య శుంఠవేశ్య); ధనమును దండుకొనువారికిని; (అనగా తన న్యాయమైన పదవికి కావలసిన ధనముగాక, లంచముగా ఒక పనిని చేసిపెట్టుటకు ధనమును తీసికొనుటను "దండుకొనుట" యందురు); గారడీవిద్యలు చేసి ప్రజలను ఆనందపరచువారికిని; తోడుబోతులకును ("దొంగతోడుబోతులు" అందురు. అనగా దొంగలకు సహకరించెడి వారికిని); లుబ్ధత పిసినారితనముగల లోభికిని; నిర్దయననది యుండదు. నిద్రాహారములు లేని సంపాదన వారికేగాక, సత్కవులైనవారికి సంపద లేదు. సంపాదన లేదు.

ఇందెక్కువగా జారిణీ స్త్రీలను గురించియే చెప్పినాడు. శ్రీనాథుడొక చాటువున

**"కవితల్ సెప్పినఁ, బాడనేర్చిన, వృథా కష్టంబె, యీ బోగపుం**
**జవరాండ్రేకద భాగ్యశాలినులు, పుంస్త్వంబేల? పో పోచకా!**
**సవరంగా సొగసిచ్చి, మేల్యువతివేషంబిచ్చి, పుట్టింతువే,**
**నెవరే మెచ్చి ధనంబు లిచ్చెదరుగాదే! పాపపుం దైవమా!**

– అని వాపోయినాడు. అదే వేదనతో ఈ కవి తన శతకమును ముగించినాడు. ఇతడు "బందెన-భడవాలు" ("భడవాముండ" యను తిట్టు తెలుగులో ప్రసిద్ధము) వంటి మాండలికములను వాడియున్నాడు.

**సం.వ్యా.** పై సీసపద్యములోని మొదటిపాదము (కవి నిజముగా వ్రాసిన పాదము) ఈ విధముగా నున్నది: "సుంకర్లకును, వర్ణసంకర్ల కొకసారి / ముడ్డిచూపెడి తొత్తుముండలకును" (శతకవాఙ్మయ సర్వస్వము).



**అనుబంధము-1**

# పోలిపెద్ది వేంకటరాయకవి

## క్రీ.శ. 1800-1875

**- విద్వాన్ వేదము వేంకటకృష్ణశర్మ**

పోలిపెద్ది వేంకటరాయకవి (1) వేణుగోపాలశతకము (2) లావణ్య శతకములే కాక, తిట్లదండకమును గూడ చెప్పినాడు. ఇతఁడు వేణుగోపాలశతక మెవరి ప్రోత్సాహమునులేకయే, స్వబుద్ధిచేతనే వ్రాసినాఁడని తోఁచుచున్నది. పైఁగా నితఁడు తిట్లదండకములోఁ దాను వేణుగోపాలభక్తుఁడని చెప్పుకొనినాఁడు. ఆ భాగము మాత్రము:-

**"వేద వేదాంత తత్త్వజ్ఞుఁడన్, వైదిక శ్రేష్ఠుఁడన్, సజ్జన స్తవ్యుఁడన్, సాధుసాంగత్య మున్గల్గువాఁడన్, సదాచార శీలుండ, శ్రీ వేణుగోపాల సద్భక్తుఁడన్, పోలి పెద్దాన్వయాబ్ధీందుతుల్యుండ, శ్రీ వేంకనార్యుండ, నాస్థాన విద్వాంసుఁడన్, సత్కవీంద్రుండ, శ్రీకారువేటీపురాధీశు, శ్రీమన్మహామండేత్యాది వాక్యాళి సంశోభితున్, రాజరాజేశ్వరున్, మాక రాడ్వంశసంజాతు, శ్రీ వేంకట్పెరుమాళ్ల రాజాశ్రితుండన్, సదారాజ సన్మానితుండన్" -**

దీనినిబట్టి కవి సదాచారముగల వైదికశ్రేష్ఠుడనియుఁ గార్వేటినగర రాజేంద్రుఁడయిన మాకరాడ్వంశస్థుఁడగు శ్రీ వేంకట పెరుమాళ్ల రాజాస్థాన విద్వత్కవీశ్వరుఁడనియు స్పష్టమగుచున్నది.

కార్వేటినగరములో నెలకొన్న వేణుగోపాలస్వామి యీకవికి కులదైవమగుట చేత నప్పటి సంస్థానములోని యక్రమములనేకాక, సంఘములోఁ గనిపించు దురాచారములను దీవ్రముగా విమర్శించుచు నాదేవునిపేరనే మకుటరచన చేసినాఁడు. ఆ తరువాతనే యితనికి రాజాస్థానములోఁ బ్రవేశము దొరికినట్లు తెలియుచున్నది. అప్పటి ప్రభువైన శ్రీకుమార వేంకట పెరుమాళ్రాజులుంగారియొద్ద

మంత్రిగా నుండిన వ్యక్తి, తన్ను ముందుగా చూడనిదే, యెవరుగాని ప్రభుదర్శనము చేయరాదనే యహంభావము గలవాఁడట! ఆ వ్యక్తిపేరు కవి చెప్పలేదు. కాని యతని యవలక్షణములను గుఱించిమాత్రము వేణుగోపాలశతకములో నీ విధముగ వర్ణించినాఁడు:–

**"పీనుఁగ గంధపుమోము, పిల్లిమీసంబులు, కట్టెశరీరంబు, కాకినలుపు,**
**ఆర్చుకన్నులు, వెన్నునంటినయుదరంబు, నురుఁగు చారలముంపు నోటికంపు**
**చెయిచెయ్యి దిగరాచి చెక్కిళ్లురుద్దుట, దవడలు సొట్ట, పాదములు మిట్ట,**
**ఒరులీవిజూచి మేలోర్వలేకేడ్చుట, దౌర్భాగ్యగుణములు తగనియాస,**
**ఇట్టి యవలక్షణపుమంత్రి నేర్పరించ, దొరలకపకీర్తిఁదెచ్చు నాదుర్జనుండు"**
**(48వ పద్యము)**

తన కపకీర్తిదాయకమైన యీ వేణుగోపాలశతకమునుగూర్చి యామంత్రి విని సన్నిహితులయిన పండితులసలహాల ననుసరించి, వేంకట రాయకవికిఁ బ్రభువర్యుని 'భేటి' చేయించినాఁడని తెలియుచున్నది. ఈ కవీంద్రుని విద్వత్ప్రతిభకు మెచ్చుకొని, రాజుగారితనిని 'లావణ్యశతక'మను శృంగారవిషయకమయిన కృతిని నిర్మించుమనినట్లు కవియే తన లావణ్యశతకములోని మొదటి సీసపద్యములో దెలుపుకొనినాఁడు:–

**"శ్రీమదఖండలక్ష్మీ ప్రసన్నుఁడు మాకరాట్కులాంభోధి కైరవహితుండు,**
**సరసుఁడౌ వేంకట పెరుమాళ్ల రాజేంద్రుఁ డొకసారి కొలువుకూర్చుండి, నన్నుఁ**
**గని, పోలిపెద్ది వేంకటరాయ సుకవీంద్ర! రమ్మని ప్రేమమీఱంగఁ, బురుష**
**విరహంబు, శ్రీ హరిస్మరణ శృంగారంబుగను, జమత్కృతి శతకంబొనర్పు**
**మనిన, శారద నేకదంతుని భజించి నేరచించెదఁ బద్యముల్ నేర్చినటుల,**
**నీదుకృపలేక కృతిసేయ నేరికయిన వశమె శ్రీరామరామ! లావణ్యసీమ!"**

ఇతనికిఁ బ్రభువు 'నవరసాలంకార శృంగార వాణీవిలాసపుర' మను 'బేచరు' గ్రామమును వంశపారంపర్యముగా ననుభవించుకొను హక్కుతో శ్రోత్రియముగా ధారాదత్తము చేసినాఁడు. ఇది చిఱుతని తాలూకాలో నున్నది. జమీందారీ లెక్కలలో (ఆ కాలములో) పై పేరుతోడనే యాగ్రామము సూచింపఁబడుచుండునది. కొంతకాలమున కది భటవృత్తిమాన్యము క్రింద వారి 'రికార్డు'లలో 'దాఖలు'

కాఁజొచ్చినది. ఇప్పటికిని, ఆశ్రోత్రియమును కవిగారి మునిమనుమఁడు (అతని పేరుకూడ వేంకటరాయఁడే) 60 యేండ్లపడిలో నున్నవాఁడనుభవించుచున్నాఁడు.

కవికాశ్రయమిచ్చిన యీ కుమార వేంకట పెరుమాళ్ళాజులుంగారు కీ.శ. 1884 (తారణ) సంవత్సరములోఁ జనిపోయినట్లు "పద్మావతీ పరిణయ"మను సంస్కృతకావ్యములో నున్నది. ఆ పక్షమున నీ వేంకట పెరుమాళ్ళాజులుంగారు పందొమ్మిదవశతాబ్దపు ప్రథమపాదములోఁ బుట్టి, క్రీ.శ. 1860 ప్రాంతములోఁ బట్టాభిషిక్తులయి, యాతరువాత క్రీ.శ. 1884 వఱకు రాజ్యము పరిపాలించిరనుట సహేతుకము.

దీనికి మఱియొక యాధారముకూడ లేకపోలేదు. పై వేంకట పెరుమాళ్ళాజులుంగారి తమ్ములయిన తిరుమలరాజులుంగారికి గరుడాద్రి సుబ్రహ్మణ్యవిద్వత్కవి తనచే రచింపఁబడిన "శత్రుఘ్నవిజయ" మనుకృతినంకితము చేసినాఁడు. ఆ గ్రంథము శా.శ. 1786 (ప్రభవ) అనగా క్రీ.శ. 1864 సం॥ రం॥ పూర్తియయినట్లుగా గ్రంథాంతములో నున్నది. ఆ సమయములో శ్రీకుమార వేంకట పెరుమాళ్ళాజులుంగారే రాజ్యపాలకులు. ఆ తరువాత 20ఏండ్లు ప్రభువులుగా నుండి ముందుపేరాలో సూచించినట్లు క్రీ.శ. 1884లో మరణించిరను నిర్ణయము సత్యదూరముకాదు.

పై కాలనిర్ణయము ననుసరించి మనకవియు, నతనిపోషక ప్రభువునకు ఏవో కొన్నియేండ్ల తేడాతో, సమకాలికుఁడై యుండినాఁడనుటలో సందేహములేదు. ఈ సమకాలికత్వమును వారితరువాతి వంశపరంపర దృఢపఱచుచున్నది. శ్రీకుమార వేంకట పెరుమాళ్ళాజులుంగారికి బ్రహ్మ (బొమ్మ) రాజు, కావేరిరాజు, సింగరి రాజను ముప్వురు పుత్రులు. బ్రహ్మరాజుపుత్రుఁడు తిరుమలరాజు. అతనికిఁ గుమార వేంకట పెరుమాళ్ళాజు, కుమారస్వామిరాజు ననువారు పుత్రులు. వీరిరువురికిని సంతానము లేదు. అందు మొదటివారు (కుమార వేంకట పెరుమాళ్ళాజు) 25 సంవత్సరముల (దాదాపు) క్రిందట పట్టాభిషేకము చేసికొని నేటికి 6-7 సంవత్సరములకు పూర్వము గతించిరి. రెండవవారయిన కుమారస్వామి రాజా బహదరువారు 1951 సం॥న వయోజనవోటింగు ఎన్నికలలోఁ బ్రజాపార్టి పక్షమున మదరాసు శాసనసభకెన్నుకొనఁబడి 1952 సం॥రం నవంబరుమాసములో స్వర్గస్థులయిరి.

చెప్పవచ్చినదేమనఁగా, మొదటి కుమార వేంకట పెరుమాళ్రాజులుంగారికి రెండవ కుమార వేంకట పెరుమాళ్రాజులుంగారు మూఁడవతరమువారు. వేణుగోపాల లావణ్య శతకములకర్తయయిన వేంకటరాయనికి రెండవ (సజీవుఁడైన) వేంకటరాయఁడు మూఁడవతరమువాఁడు. కావున ప్రభువు యొక్క కవియొక్క వయస్సులలో నంతగా తేడా యుండదు.

ఈ పోలిపెద్ది వేంకటరాయకవి కవితాప్రౌఢిమ యసామాన్యమైనది. ఇతని శతకసీసపద్యముల గమకమే యొక క్రొంగ్రొత్త నాజూకుతనము సంతరించుకొనినది. నన్నయాది ప్రాచీనుల కావ్యములకుఁ, బెద్దనాది మధ్యకవుల ప్రబంధములకు నెంత భేదము కనిపించుచున్నదో యంత తేడా యితని సీసపద్యములకుఁ దక్కిన శతకకవుల సీసపద్యములకు అగపడును. జానుతెనుఁగు పలుకుబడులు, జాతీయములు మొదలైనవి ఈతని సొమ్ములు. అప్రయత్నముగా నట్టివి ఇతని పద్యములలో సందర్భానుసారముగా వచ్చి కూర్చుండును. అట్టి కవితకుఁ బ్రభువు ముగ్ధుఁడై నాడనిన నబ్బురమేమున్నది?

ఇతడు కుకవిదూషణ చేయుచు, తెలుఁగు జాతీయకవిత్వస్వరూపమును నిర్ణయించు సందర్భములోనిది ఈ క్రింది పద్యము:-

**"పాకంబునకుఁదగు ఫణితిఁగానక, కిరీటము వెట్టినట్లు నీమములులేక,**
**తెనుఁగు పోయెదుజాడ తెలియఁజాలక, పెక్కు శృంగారరీతులు చేతఁగాక,**
**గ్రామ్యదేశ్యమ్ముల క్రమము లెఱుంగక, జాతీయములుగూర్చు సరణిరాక,**
**పెళుచుమాటల దొంతిపేర్చుచు, సాధారణములౌ యతిప్రయోగములు లేక,**
**ఒకరి కయితను గని హేళనోక్తులాడు కుకవిశుంఠల మూతిపైఁ గొట్టునటుల**
**నేనొనర్చెదఁ బద్యముల్ నీదుకరుణ"** (లావణ్య శతకము)

తెనుఁగు పోయెదు జాడ తెలియవలెనఁట! గ్రామ్యదేశ్యమ్ముల క్రమము లెఱుగవలెనట! జాతీయములు గూర్చవలెనట! పెళుచు మాటల (చెత్తపదములేమో) దొంతి పేర్చరాదట! ఇవి యితని కవిత్వ నియమములు. తానీనియమములను బాటించుచునే తన రెండుశతకములను వ్రాసినాఁడని వానిని చదువువారికి స్పష్టమగును.

ఇతనికవిత్వములో భావగోపనమనునది యెక్కడను లేదు. ఏనీతినైనను, బూతునైనను, చెప్పవలసివచ్చినప్పుడు 'ఖరాఖండి'గా కచ్చితముగా సూటిగా

చెప్పువాఁడు. ఈ విషయములో నితఁడు "నీతులు బూతులు లోకఖ్యాతులురా" యనిన కవిచౌడప్ప కన్నయే యగును. జుగుప్స, రోత, యను వస్తువు లితని కేకోశమునను లేవు.

ఇతని మొదటికృతియైన వేణుగోపాలశతకమునకు "మదిరిపువిఫాల, మునిజనహృదయలోల, వేణుగోపాల, భక్త సంత్రాణశీల" – యనునది మకుటము. ఇందులో 100కి తక్కువగనే పద్యములున్నవి. ప్రాచీనపు వ్రాఁతప్రతులలో నెందులోనను 85 పద్యములకు మించిలేవు. 1900 సం॥లో రంగవిలాసము ద్రాక్షరశాలలో నచ్చయిన ప్రతిలో 83 పద్యములు మాత్రమే కలవు. మఱియొక ముద్రితప్రతిలో (చాల ప్రాఁతదియేకాని, ముందు వెనుక పుటలు లేనందున ఎప్పటిదో తెలియదు) 84 పద్యములున్నవి. ఇప్పటి ముద్రితప్రతులలో 90 పద్యములకు మించి యున్నవి (కాని 100కి లోపు). వీనిలోను ఇటువంటి తక్కిన 'బజారు' ప్రతులలోను, రామలింగేశాదిశతకముల సరుకు కొంతవఱకు గలసియున్నది.

నాయొద్దనున్న వేణుగోపాలశతకప్రతులేడింటిలోను మిక్కిలి ప్రాచీనమైనది. క్రీ.శ. 1880లో ముద్రింపఁబడినది. అర్వాచీనమైనది క్రీ.శ. 1949లో అచ్చువేయఁబడినది. మొదటిదానిలో 83 పద్యము లున్నవి. రెండవదానిలో 96 పద్యములున్నవి. మిగిలిన ప్రతులలో 80–90 పద్యములకు నడుమ పలు సంఖ్యలుగా నున్నవి. పైగా క్రీ.శ. 1880 ప్రతికి 1949 ప్రతికి పాఠభేదములు పరిశీలింపగా నా రెండు ప్రతులకును తేడా హస్తిమశకాంతరముగా గనిపించు చున్నది. మూలకవి భావములను బరిష్కర్త లంతుపట్టుటకు వీలులేని విధముగాఁ బాదములకుఁ బాదములే పూర్తిగా మార్చిరి. అట్లు చేయుటవలన, బొత్తిగ కవిభావములనే చాలచోట్ల ధ్వంసీకరించిరి.

పరిష్కర్తలైనవారు ప్రభుత్వము నిషేధించునను భయముచేత మూల గ్రంథములోని జుగుప్సాంశములను దొలగించి, యాకుకందని, పోఁకకుఁబొందని, తమ భావములను జొప్పించి, గ్రంథకర్తల యభిప్రాయములను హత్యచేయుటకంటె నాచోట్లలోఁ జుక్కలు పెట్టి విడిచివేయుట మేలు. లేదా, యాగ్రంథపుటూసే యెత్తక యుండుట యంతకంటె నుత్తమము. మన సారస్వతములో మహాకావ్యము లన్నిటికి నీయరిష్టము – కాదు – అంటుజాడ్యము పూర్తిగా వ్యాపించి, పరిపాటిగా

జరుగుచుండుట నరికట్టకున్న భాషామహాదేవికి, నామె నారాధించిన పూర్వ విద్వత్కవులకు నెంతయో ద్రోహము చేసినవార మగుదుము. ఉదాహరణముగాఁ గూచిమంచి జగ్గకవి చంద్రరేఖావిలాపమును దీసికొనిన జాలును. ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారపు వ్రాఁతప్రతికిని ముద్రితప్రతికిని పోలికయే లేదు. ఈ విషయమయి, యిదివఱకే మన పెద్దలు శ్రీగిడుగు వేంకటరామమూర్తి పంతులు గారివంటి మహావిద్వాంసులనేకులు నెత్తిని నోరుపెట్టుకొని ఘోషించినారు. కాని కాలపరిస్థితులనుబట్టి, యట్టివారి ప్రయత్నము లేటికెదురీతగను, గేవలమరణ్య రోదనముగను బరిణమించినది. ఇఁక నిప్పటి భాషాభ్యుదయకాము లీవిషయమున నొక యాందోళనము – మహావిప్లవము లేవఁదీయుట యెంతయైన నవసరము. దీనినిగూర్చి యీసందర్భమునఁ జెప్పుట యప్రస్తుతము. ప్రకృతమనుసరామః!

వేణుగోపాలశతకములోని పద్యములు పెక్కువిషయములకు సంబంధించినవి. అందులో ముఖ్యముగా నాకాలములోని రాజులను, ప్రభువులను, మంత్రులను, అధికారులను, వారి చర్యలను తీవ్రముగా నిరసించుచు చెప్పిన పద్యములు, సామాన్యనీతుల నుటంకించు పద్యములు నెక్కువగాఁ గనిపించుచున్నవి.

ఈ మహాకవి లోకవృత్తములను స్వానుభవముచేతఁ జక్కఁగా గ్రహించిన గొప్ప లౌక్యుఁడు. అద్భుతమేధాసంపన్నుఁడు. సీసపద్యములు నడపుటలో నీకవిధోరణి తక్కిన సీసశతకకారుల కలవడలేదనిన, నతిశయోక్తి యనిపించు కొనదు. అడిదము సూరకవి రవంత యితనితో మొగ్గుచూపునేమో? కాని గాటయిన శబ్దములు సూటిగా నెదుటివారి మనస్సులలో నాటుకొనునట్లు చేయుటలో నితఁ డతనికంటె ఘనుఁడు. అఖండుఁడు. ఇతనికి భావదాస్య శబ్దదాస్యము లేకోశమున లేవు. రసోచితాలంకారములతో శబ్దము లనర్గళముగ దొర్లుకొని పోవుచుండును. ఇంతటి యుద్దండకవీంద్రుఁ డేదైన కావ్యము రచింపకపోవుట తెలుగువారి దురదృష్టము. అయిన నాంధ్రభాషారమ కీతని వేణుగోపాలలావణ్య శతకద్వయము రెండుపేటల ముత్యాలహారము. అందులోని పదకమీతని తిట్లదండకము.

ఇతఁడు కవుల నిగ్రహానుగ్రహాదిక సామర్థ్యములను, వారియౌన్నత్యమును గూర్చి:–

**“కలకొద్దిలో వరములుదెల్పి మన్నించి యిచ్చినవాని దీవించవలయు,**
**సిరిచేతమత్తుఁడై పరువెఱుంగని లోభి దేబెను పెళ్లునఁ దిట్టవలయుఁ,**

**దిట్టిన నప్పుడే తెలిసి ఖేదమునొంది యింద్రుఁడైనను బిచ్చమెత్తవలయు**
**దీవించెనా, చాల దీర్ఘాయువును బొంది బీదైన నందలం బెక్కవలయు,**
**నట్టియాతఁడు సుకవి, లేనట్టియతని కవియనఁగ నేల? కవి మాలకాకి గాఁడె?"**
**(29వ పద్యము)**

అని వ్రాయుటవలనఁ దాను తన ప్రత్యర్థియైన కోవూరి రామయ్యయను రాజకీయోద్యోగిపైఁ జెప్పిన 'తిట్లదండకము' మూలమున నతని మరణమునకు కారకుఁడయియుండు ననుట రుజువగుచున్నది.*

ఇతఁడు రాజాస్థానమును బ్రవేశింపగనే ప్రభువు మంత్రులు తప్పఁ దక్కినవారందఱు లేచి గౌరవించువారఁట! ఒక దినమున నితఁడు సభకుఁ బోఁగా రాజుగారమితముగా నభిమానించు నొకానొక వేశ్యకాంత లేవలేదట! అపుడు రుద్రుఁడై కవియిట్లు చెప్పినాఁడఁట!

**"ఆస్థానమందు విద్వాంసులఁగని లేచి, మ్రొక్కఁబూనని వారమోహినులను,**
**దలఁగొఱిగించి, మెత్తిని నున్నమును బూసి, బొగ్గుగందంబున బొట్టమర్చి,**

---

*ఇతఁడు పైఁజెప్పిన శతకద్వయమేకాక 'తిట్లదండక' మను చిన్నకృతికూడ నితఁడు చేసెను. అందు వచ్చినతిట్టు మరలరాదు. అద్భుతమున ధారాధోరణి. ఇట్టి దండకమునకుఁ గారణమయిన యితివృత్తము నించుక తెలిసికొందము.

కార్వేటినగరమున ఆ కాలమున 'రాజనగరున నిత్యావసరవస్తుభాండారాధ్యక్షుఁడుగ (ఉగ్రాణాధికారిగ) కోవూరి రామయ్యయను నియోగి బ్రాహ్మణుఁడుండెడివాఁడు. ఆతని నివాసమందిర మగ్రహారమున మన కవియింటికిఁ బ్రక్కదే. ఒకానొకనాఁడు రామయ్యయింటి దొడ్డిలోని కూరపాదులలోని మొలకలను వేంకటరాయకవి బఱ్ఱె మేసి పోయినది. అది చూచిన రామయ్యభార్య, కామాక్షమ్మ క్రోధావేశమున గవిగారియింటికి బోయి వారితో దగవులాడెను. అప్పుడు కవి ఆమెంగని "అమ్మా, ఏదో తెలివిలేనిగొడ్డు చేసినపనికి ఇంత యల్లరెందులకు? దానిని స్వేచ్ఛగా మేతకు విడిచినతప్పు మాదే. నీతోఁటకూరమొలకల క్రయము వలసిన నిత్తును. పొరపాటును క్షమించుము" అని బతిమాలెను. కాని యీర్ష్యావరురాలయిన కామాక్షమ్మకు ఆమాటలు రుచింపమిచేఁ జీటికిమాటికి సాకునపోకున కవిని అతని కుటుంబమును దిట్టుచు నేయుండెను. అట్లొకసంవత్సరము గడచెను.

ఒకనాఁడు ప్రాతఃకాలమున మనకవి యెటకోపోయివచ్చుచు అమ్మలక్కలతో నింటివాకిట నిలిచి బిగ్గఱగాఁ దన్ను దూషించు కామాక్షమ్మనుజూచి క్రోధము పట్టజాలకయు, రజోద్యోగిభార్య కావునఁ దటాలున నేమియు జేయజాలకయు విసవిస ప్రభువుచెంతకేగి "రాజేంద్రా, కోవూరి రామయ్య భార్య స్వల్పదోషమును బురస్కరించి కొని మమ్మెల్ల నొక్కయేడాదిగా నాడిపోసికొనుచున్నది. దీనికి బ్రతీకారమేలేదా?" అని జరిగిన విషయమంతయు బూసగ్రుచ్చినట్లు నివేదించి "క్షత్రియ ప్రభువులైన తా మొక్కక్షణముగూడ నిట్టి యవినయ మోర్వరు. అప్పుడే తలదీయించియుందురు. బ్రాహ్మణుఁడను గనక నోర్వదిగినంతకాల మోర్చితి. ఇఁక నోర్వజాలను. క్షాత్రమునఁ బ్రతీకారము చేయింతురా? కాదేని బ్రాహ్మ్యమున నేనే చేయుదునా?" అనఁగానే

**చెప్పుల మెడఁగట్టి, చింపిచేటలఁ గొట్టి, గాడిదపైఁ బెట్టి, కాలమెట్టి,**
**తటుకున గ్రామప్రదక్షిణంబొనరించి, నిల్చినచోట పేణ్ణీళ్లు చల్లి,**
**విద్రదూషకులను వారివెంటనిచ్చి, సాగనింపించవలయును శమనుపురికి"**
**(19వ పద్యము)**

ఆ కాలపు రాజుల ప్రవర్తనలను, వారినాశ్రయించినవారి నడవడులను వివరించుచు, రాజులెట్లుండవలయునో బోధించినాఁడు. ఈ క్రింది పద్యములు రాజులకు సంబంధించినవి:-

**1. "కొండెసిగల్, తలగుడ్డలు, పాకోళ్లు, చలువవస్త్రములు, బొజ్జలు, కటార్లు,**
**కాసెకోకలు, గంపెడేసిజన్నిదములు, జాళువా జలతారు దాలువార్లు,**
**సన్నంపు తిరుచూర్ణపున్నీటునామాలు, జొల్లువిడెమ్ములు, వల్లెవాట్లు,**

---

యేలిక కవించూచి 'యేమి చేయుమందు' రనెను. కవియుఁ 'మీరైనఁ దలఁదీయింతురు. కాని అది బ్రాహ్మణ స్త్రీహత్య యగుటచే మనకిరువురకు నరకము తప్పదు. కానఁ దలగొఱిగింపుడు. చాలును' అని మనవిచేసికొనఁ బ్రభునకుఁ బచ్చివెలగకాయఁగుత్తుక నడఁచికొన్నట్లయి, కొంతసేపేమియుఁ బలుకకుండి, తుదకు "మేమట్టి కార్యమునకుఁ బూనుకొనుట భావ్యమా? లోకమేమనుకొనును? ఇక్కార్యము అపకీర్తికారకము గదా! శాంతింపుడు" అని ప్రాధేయపడెను. "అగుచో నేనే ఆమె తలగొఱిగించెదను. అంతవఱకు నాకు శాంతికలుగదు ప్రభూ! మన్నింపుడు" అనెను. అయినను రామయ్యను విచారించి మందలింతమను నూహతో రాజేంద్రుఁ డాతనికొఱకు హర్కారును బంపెను.
ఱేనియానతి ననుసరించి సత్వరముగ రామయ్య అతని సన్నిధానమునకు వచ్చుచుండ, అల్లంతదూరముననే ఆతనింగాంచి దండతాడిభుజంగమువలె వేంకటరాయకవి మండిపడి "ఛీఛీ, ఒరే పాతకా, ఘాతకా, ప్రేత" అని యారంభించి "కోవూరిరామా, అయో రామ రామా!" యని దండకము ముగించెను. దానిని బఠికించుచున్నంతసేపు నృపాలుఁడాకవివంక గ్రుడ్లప్పగించి చూచుచుండి నిట్టూర్పుపుచ్చి లేచి యంతిపురిం బ్రవేశించెను. కవీంద్రుఁడను రోషభారము తగ్గిపోవ శాంతించి యింటిదారినిబట్టెను. దురదృష్టవంతుడగు కోవూరి రామయ్య ప్రభునియెదుట దనకు జరిగిన పరాభవమునకు ఖేదమొందుచుఁ, దలవాంచి పరాకుతో నింటిని జొచ్చునపుడు ద్వారబంధము గాటముగ శిరమునకుఁ దగిలి గొప్పగాయమయి, పడుకఁబట్టి వేదనాదో దూయమానుడై కొలఁదిదినములలో మరణించెను. కవికోరికయు సిద్ధించెను.
ఈ చరిత్రముప్పదియైదేండ్లనాఁడు మాయూర (కార్వేటినగరమున) నాకు వేదాధ్యాపకగురువులుగ వెలసిన శ్రీతిప్పావఝుల అనంతయ్యగారు చెప్పగా వింటిని. వారి కప్పటి వయస్సు డెబ్బది దాటినది. చరిత్రకాలమున వారు చాలఁ జిన్నవారఁట
"తిట్లదండకము" నకయి నేనిరువది యేండ్లుగఁ బ్రయత్నింప నిప్పటికి దొరకినది. పుత్తూరు బోర్డు ఉన్నత పాఠశాలా ప్రధానాంధ్రపండితులగు విద్వాన్ శ్రీ టి. శ్రీనివాసరావుగారు సంగ్రహమగు పై చరిత్రతోఁ గూడ తిట్లదండకము సంపాదించి పంపినందులకు వారికెంతయుఁ గృతజ్ఞుడను.

శ్రీ వేదము వేంకట కృష్ణశర్మ
(త్రిలిఙ్గ 27 ఏప్రిలు 1953)

**దాడీలు, వెదుగాకుతరహా సొగసుకోర్లు, అంతకంతకు 'గార్లటంచుఁ'బేర్లు,**
**సమరమునఁజొచ్చి తొమ్ముగాయములకోర్చి, శత్రువులఁ జంపనేరని క్షత్రియులకు**
**ఏల? కాల్పనె? యీ వట్టి యెమ్మెలెల్ల" (30వ పద్యము)**

(ఇతని పోషక ప్రభువులగు కార్వేటినగరాధీశులు సూర్యవంశ క్షత్రియులు. కాన క్షత్రియప్రభువులనే యిందుఁబేర్కొనినాఁడు)

**2.** **"పరదళంబులఁగాంచి భయముచే నుతికిన రాజుగాఁడతదు గోరాజుగాని"**

**3.** **"పానంబు, జూదంబు, పరసతిపైబాళి, ధనకాంక్ష, మోహంబు, తగనియాస,**
**అనుదినంబును వేఁట, యధికనిద్దురఁగొంట, పేదతికంబును, పితికితనము,**
**అతిక్రౌర్యమును, మందగతి హెచ్చు, కోపము, అమితవాచాలత, అనృతములును,**
**ఖండితంబాదుట, గర్వంబు, ప్రజ్ఞలు, విడువని వైరంబు, విప్రనింద,**
**ఆప్తజనముల దూఱుట, నసురతిండి, మానవేంద్రులపదవికి హానులివ్వి"**
**(46వ పద్యము)**

**4.** **ఘనము నల్పంబు నెఱుఁగక కలియుగమున నవని నడుతురు మూర్ఖులైనట్టి దొరలు**

**5.** **క్ష్మాతలేంద్రులసేవ కష్టంబు, వారలిత్తురని గర్వమున నిక్కి యెగురరాదు"**

**6.** **"మద్యపాయులతోడ మచ్చికకారాదు, బడవాల గొప్పగాఁ బట్టరాదు;**
**శాత్రవునింట భోజనము సేయఁగరాదు, సన్న్యాసులను గేలిసలుపరాదు;**
**దేవభూసురవృత్తి తెరువునఁ బోరాదు, పరులాండ్రఁగని యాసపడఁగరాదు;**
**కంకోష్ఠునకు నధికారమీయఁగరాదు, చెలఁగి లోభిని చెంతఁ జేర్పరాదు;**
**లంచగాండ్రను దగవులకుంచరాదు, మాతృపితరులయెడ భక్తి మఱువరాదు"**
**(53వ పద్యము)**

**7.** **'రాజులమంచు బొఱ్ఱలు నివిరినఁ గాదు, అనిమొనలో నఱుకాడవలయు"**

**8.** **"ఏకచక్రముగ భూమేలినరాజైన కడ కేదుజేనెల కాటికేను"**

రాజోద్యోగులనుగూర్చి నిర్దాక్షిణ్యముగ ఖండించుటలో నీతఁడందెవేసిన చేయి. వారి యవినీతులను నిరసించుచు నితఁడు చెప్పిన యొక్కొక్క పద్యము నక్షరలక్షల విలువ కలవి. మంత్రులు, దివానులు, బక్షీలు, ముసద్దీలు, శిరస్తాలు, రాయసములు, తుదకు గ్రామాధికారులు కూడ నితని చేతిగంటముపోటు తప్పించుకొనలేకపోయిరి.

మంత్రికుండవలసిన లక్షణములనుగూర్చి యీ క్రింది పద్యములో కవి యుద్ఘాటించిన విధము చూడుcడు:-

**"కనుముక్కుతీరు, చక్కని కాంతిపొందిన శుభలక్షణంబును, సూక్ష్మబుద్ధి;**
**ఘనత, వివేకవిక్రమము, బాంధవ్యవిమర్శ, విలాసంబు, మానుషంబు;**
**సరసవాచాలత, సాహసం, బొకవేళ విద్యావిచక్షణ, విప్రపూజ;**
**వితరణ, మేలుభూపతియందు భయభక్తి, నీతియు, సర్వంబునేర్పునోర్పు;**
**స్నానసంధ్యాద్యనుష్ఠానసంపన్నత, గాంభీర్యము, పరోపకార చింత;**
**ఇట్టిమంత్రిని జేర్చుకొన్నట్టి దొరకు కీర్తి, సౌఖ్యము, సకలదిగ్విజయము,సిరి**
**గలిగియుండును, దోషముల్దొలcగి చనును" (27వ పద్యము)**

(ఇది పంచపాదిసీసము : ఎత్తుగీతమును పంచపాదియే).

ఇతడు దుర్మంత్రులను తెగతిట్టినాడు:-

**1."విద్యాధికుల రాజు వివరించి నిలిపెనా, ఇందరేమిటికంచుc గుందుచుండు;**
**మోయాను కుగ్రాణమును జెప్పc, గొట్లగింజలకు బరాతముల్ సరవివ్రాయు;**
**తిండికిc జేటుగాc బండితులేల? తెప్పున సెలవిమ్మని పోరుచుండు;**
**బారిసాల్వలు దెచ్చి బహుమతులిమ్మన్న, చలువకరీదు వస్త్రములనిచ్చు;**
**నిట్టి యపకీర్తిమంత్రిని బెట్టcదగదు, మంచిమాటల సాగనంపించవలయు"**
**(66వ పద్యము)**

**2."మంత్రులమనిబొంకుమాటలాడినc గాదు, ఇప్పింపనేర్చి తామీయవలయు"**

**3."యాచకులcజూచి, తలవ్రేలవైచి, పెద్దసున్నజుట్టcగదా ముండగన్నకొడుకు"**

**4. "రాజసభలc బరోపకారములు దెలుప, శ్రేష్ఠులకుcగాక దుష్టులు చెప్పcగలరె?"**

**5. "పలువమంత్రైన దొరలకు పరువులేదు"**

**6. "ధర్మవిదులైన రాజసంస్థానములను జేరు నొక్కొక్క చీవాట్లమారిశుంఠ"**

**7. "మానాభిమానముల్ మాని ప్రవర్తించు మంకుగులాములు మంత్రులైరి"**

**8. "పలువతో సరసంబు ప్రాణహాని యొనర్చు, దుష్టుcడు మంత్రైన దొరను జెఱచు"**

**9. తనకు గతిలేక ఒకరిచ్చుతతిని, వారిమతులc జెరచెడి రండకుc గ్రతువులేల?"**

రాజాస్థానమున నున్న యుద్యోగులలోc బ్రభువునొద్ద మిక్కిలి చనవుగల యొకానొక యధికారి తనకు గీడుసేయ, నీకవీశ్వరుడతని పుట్టుపూర్వోత్తరము

లన్నియు నేకరువు పెట్టుచు దూషించిన విధము గమనింపదగినది:–

**"పంచాంగములుమోసి, బడవాతనముజేసి, పల్లెకూటముజెప్పి, పసులఁగాచి;**
**హీనవృత్తిని బిచ్చమెత్తి, గోడలుదాఁటి, ముద్దకూళ్లకుఁ బోయి మొత్తులఁబడి;**
**విస్తళ్లు కుట్టి, కోవెలనంబివాకిటఁ గనవూడ్చి, లంజెలకాళ్లు పిసికి;**
**కన్నతొత్తుల తమ్మకళ్లెత్తి, గతిచెడి, ఆలుబిడ్డలఁ బరులంటఁజేసి;**
**నట్టి దేబెకు సిరిగల్గెనేని, వాడు కవివరుల దూఱు, బంధువర్గముల గేరు;**
**పరునిపని మీఱు, నౌకరిని జెఱుపఁగోరు"** **(42వ పద్యము)**

ప్రభుని సన్నిధానవర్తులైన దుష్టాధికారులను, వారిసంకుచిత బుద్ధుల నెట్లు వర్ణించినాడో చూడుఁడు:–

**"అవనీశ్వరుఁడు మందుఁడైన, నర్థులకీయ వద్దని, వద్ది దివాను చెప్పు;**
**మునిషీ యొకఁడుచెప్పు, బకిషీ యొకఁడు చెప్పు, తరువాత నామజుందారు చెప్పు;**
**తలఁద్రిప్పుచు శిరస్తా చెప్పు, వెంటనే కేలు మొగిడ్చి వకీలు చెప్పు;**
**దేశపాండ్యా తాను తినవలెనని చెప్పు, ముసరద్ది చెవిలోన మొనసిచెప్పు;**
**యశముఁగోరిన దొరకొడుకైనవాఁడు, ఇన్ని చెప్పులు గడద్రోసి యియ్యవలయు"**
**(16వ పద్యము)**

రాయసములు పిండములు తిను వాయసములట! (రాయసములకు రూపాంతరము వ్రాయసములు. ఈ రాయసములనఁబడువారు పూర్వము ప్రభువుసన్నిధానములో నెప్పుడు నుండువారు. సామ్రాజ్య వ్యవహారములలోఁ ప్రభువులు జారీచేయు ఫర్మానాలు, హుకుములు ఎప్పటికప్పుడు వీరే వ్రాయువారు. ఆంతరంగిక కార్యదర్శులు, అనఁగా నిప్పటి యున్నతోద్యోగులదగ్గర నుండు Private Secretaries వంటి వారు. అట్టివారినిగూర్చి కూడ వేంకటరాయకవీంద్రుడు విడవలేదు. రాయసముల వేషములనుగూర్చి యతడు చిత్రించిన విధ మెంత సహజముగా నున్నదో చూడుఁడు:–

**"వంకరపాగాలు, వంపుముచ్చెలజోళ్లు, చెవిసందు కలములు, చేరుమాళ్లు;**
**మీఁగాళ్లపై పింజలూఁగెడు ధోవతుల్, బిగితరంబైన పార్శీమొహర్లు;**
**చేఁపలవంటి పుస్తీమీసముల్, కలందాన్పెట్టె, లంగవస్త్రముల చుంగు;**
**సొగసుగా దొరవద్ద తగినట్టు కూర్చుండి, అంకులాంద్రకు సిఫారములుచేసి;**

**కవిభటుల కార్యములకు విఘ్నములుచేయు రాయసా ల్పిండములుదిను వాయసాలు"**
**(61వ పద్యము)**

కార్వేటినగర ప్రభువుల రాచటికపు దుస్తులలో "వకంకర పాగాలు" ఈనాఁటికిని ముఖ్యములయినవి. విజయదశమి దర్బారలంకరించు రాజబంధువుల కందఱికి నీపాగ గౌరవచిహ్నము.

ఈ కవి "కాఁపువానికి గ్రామాధికారమైన దేవభూసురవృత్తులు తీయఁగోరు" అన్నాడు. కాని యాంధ్రదేశమున ననేక గ్రామములలో నానువాయితిగా గ్రామాధికారము కాపులదిగనే కనిపించుచున్నది. ఈ విషయము చరిత్రలు కూడ రుజువుపఱచుచున్నవి.

లోభులను చాలనీచముగను, నలక్ష్యముగను నితడు నిందించిన పద్యములలో హాస్యరసము తొణికిసలాడుచున్నది.

**"తల్లిఱంకున పుండ్లు తాఁకివచ్చినయట్లు, మూలనిక్షేపంబు మునిఁగినట్లు;**
**కూతురి ముదుపెల్ల కొల్లబోయినయట్లు, కాణాచిపల్లెలు కాలినట్లు;**
**తనయాలి గడనెల్ల దండుగకయినట్లు, తండ్రితద్దినమేమొ తప్పినట్లు;**
**చెల్లెపైబడి దొంగ చేసిపోయినయట్లు, కొడుకు నప్పుడె తలగొట్టినట్లు;**
**దిగులుపడి చూచి, మూర్ఛిల్లి, తెప్పిటిల్లి, కవులకీయగ వద్దని కన్నుమీటు"**
**(101వ పద్యము)**

**"వయసు దీఱినకాంత వక్షోజములభంగి, సంగమంబైన శి-ంబు కరణి;**
**గర్భిణియగు వారకాంత యుండెడితీరు, పాండురోగి ముఖంబుభంగి, ముసలి**
**యెద్దు ముడ్డిని పేడ ఎళ్ళొచ్చుకైవడి, ఈనఁబోయిన గాడ్దెయోనికరణి;**
**అగ్గిదాఁకినవాని యండాలపోలిక, మగఁడు పోయిన లేమపగిది, లుబ్ధు**
**యాచకులఁజూచి, తలవ్రేలవేసి, పెద్ద సున్నజుట్టుఁగదా, ముండగన్నకొడుకు"**

అత్యంత జుగుప్సాకరములగు పదములనైన జంకుకొంకులు లేక ప్రయోగించి యెల్లరకును తేటతెల్లమగునట్లు నీతులను బోధించుట యితని ముఖ్యలక్ష్యముగా దోఁచుచున్నది. ఈ క్రిందివి యందుఁ గొన్ని,

1. **"తొడపల్చనగు నింతి నడిగండి బలుపెద్ద"**
2. **"చినిగిన దొండి బల్చెఱుకుల కళుకునా, వెస నూత్నబాలిక వెఱచుఁగాక"**

**3. "వ్యాసాదులగు మౌనివర్యులు తపసెల్ల పోగొట్టుకొన్నది–ఁకుకేను,**
**జలజాతభవ శివాదులుగూడ భ్రమయుట దుర్గంధమగు నుచ్చదొండికేను,"**

**4. "స్ఖలిత శి–ము వికాసంబులు కడుగొప్ప"**

**5. "సుంకర్ణకును, వర్ణసంకర్ణ, కొకసారి ముద్దిచూపెడి తొత్తుముండలకును,"**

**6. "భట్టరాచార్యుల వట్టలు కాఁగానె పొసఁగ శ్రీచూర్ణపు బుఱ్ఱలౌనె?**
**అల రాచకూఁతు స్మరాలయంబైనను పూజకు దాసాని పుష్పమౌనె?**
**అల్ల యేలేశ్వరోపాధ్యాయు శి–ంబు రాచూరి పెద్దఫిరంగియౌనె?**
**అల తాళ్లపాక చిన్నన్న శష్పములైన తంబురదండెకు తంతులౌనె?**
**హంకరించిన యెటువంటి మంకునైన తిట్టవలయును కవులకు**
**దిట్టమిదియె"** **(94వ పద్యము)**

ఇట్టి ప్రయోగముల కొక యంతుపొంతు, హద్దుపద్దు కనఁబడదు. మెఱికలవంటి యద్భుతములగు నీతులుగూడఁ బొంకముగఁ బాఠకులకు హృదయంగమములుగ రచించిన శతకవులలో నగ్రతాంబూలమున కీమహాకవి సర్వవిధముల నర్హుఁడు.

పరవధూకాంక్షను సకారణముగా నిరసించునది యీ క్రింది పద్యము:–

**"పరకాంతపై నాసపడెడి మానవులకు నగుబాటు, మనమునఁ దగని దిగులు;**
**నగడు, విరుద్ధంబు, నాచారహీనత, చేసొమ్ముపోవుట, సిగ్గుచెడుట;**
**అపకీర్తి, బంధుజనాళి దూషించుట, నీతియుఁ దొలఁగుట, నిద్రసెడుట;**
**పరలోకహాని, లంపటనొంది మూల్గుట, పరువుదప్పుట, దేహబలము చెడుట;**
**తనయాలిచేతి పోటునఁ గృశించుట, దాని వరుఁడు గన్గొనిన జీవంబుఁ గొనుట;**
**ముజ్జగములేలు నా విరాణ్మూర్తికైన కాని దుర్వృత్తి తగదెంత వానికైన"**
**(44వ పద్యము)**

అదృష్టవంతుఁడగు వాని కీక్రిందివన్నియు నమరిన నదియే భూతలస్స్వర్గమని కవి వివరించుచున్నాఁడు:–

**"అగ్రజన్మము, తీరమందు వాసంబును, వితరణ గుణము, వివేక గరిమ;**
**సంగీత సాహిత్య సంపన్నతయు, మతి రసయుత విబుధ సంరక్షణంబు;**
**అనుకూలయైన చక్కని భార్య, రాజసన్మానంబు, ప్రఖ్యాతి, మానుషంబు;**

**సౌందర్య, మతిదృఢశక్తి, విలాసంబు, జ్ఞానంబు, నీపదధ్యాననిష్ఠ;**
**ఇన్ని విధములనొప్పి, వర్తించు నరుఁడు, భూతల స్వర్గసుఖములు పొందుచుండు"**
**(11వ పద్యము)**

పైఁ జెప్పినట్లుకాక, దుఃఖభాగుడగు సంసారి కీక్రింది కారణములచే సన్న్యాసమే తగుననియు, నాప్తులే తనకవమానము తెచ్చుచో మానవంతుడయిన వాని కంతకంటె మించిన మార్గము లేదనియు, కవి యభిప్రాయము.

**"అబ్బ మేలోర్చలేనట్టి వాఁడైనను, మోహంబుగలతల్లి మూఁగదైన;**
**ఆలు రాకాసైన, అల్లుఁడనాథైన, కూఁతురు పెను అంకుఁబోతుదైన;**
**కొడుకు తుందుడుకైన, కోడలు దొంగైన, తనకు సాధ్యుఁడుగాని తమ్ముఁడైన;**
**గృహకృత్యములు పొరుగిండ్ల వెంబడిపోయి, చెప్పి యేడ్చెడి చెడ్డచెల్లెలైన;**
**నరునిఖేదంబు వర్ణింపఁదరముకాదు, యంతటను సన్న్యసించుటయైన మేలు"**
**(12వ పద్యము)**

కలియుగమున ధర్మములు తాఱుమాఱయినవని యీకవి యే విధముగా వాపోవుచున్నాఁడో చూడుఁడు:-

**"అక్షరం బెఱుఁగని యాకారపుష్టిచే వర్ణసంకరులు విద్వాంసులైరి;**
**బాజారి అంకుకు పంచాయతీచెప్పు పాతలంజలు వీరమాతలైరి;**
**గోమాత లఱువగ కోసివందుకతిను మాలమాదిగలు భూపాలులైరి;**
**మానాభిమానముల్ మాని ప్రవర్తించు మంకు గులాములు మంత్రులైరి;**
**అహహ!కలియుగధర్మ మేమనగవచ్చు? ఇన్నిటికినోర్చి యూరకయుండఁదరమె?"**
**(35వ పద్యము)**

**"వేదశాస్త్రంబులు వినసొంపులేదాయె, సంగీతవిద్య బల్ చౌకనాయె;**
**కవితారసజ్ఞత కలలోను లేదాయె, పారమార్థికబుద్ధి భస్మమాయె;**
**భూతలేంద్రులకు దుర్బుద్ధులే మెండాయె, నీచమహత్వంబె నెగడిపోయె;**
**వర్ణాశ్రమాచారవర్తన లేదాయె, హీనకులంబులు హెచ్చునాయె;**
**అవని నిఁకమీఁద నొక్కదుడ్డంత తళుకు యో-గల లంజముండగా నుండవలయు"**
**(72వ పద్యము)**

ఇట్టియభిప్రాయమునే శ్రీనాథకవిసార్వభౌముడుకూడ నీక్రింది చాటువులో వెల్లడించినాఁడు :-

**"కవితల్ చెప్పిన, పాడనేర్చిన వృథాకష్టంబె; యీ భోగపుం**
**జవరాండ్రేకద భాగ్యశాలినులు పుంస్త్వంబేలపో, పోఁచకా?**
**సవరంగా సొగసిచ్చి, మేల్ యువతివేషంబిచ్చి పుట్టింతువేని వరిష్ఠంబు" –**

అని. ఈ విధముగాఁ బరిశీలించుటకు మొదలు పెట్టిన నిది యింతట నంతటఁ దెమలు విషయము కాదు. కనుక దీని నింతటితో ముగించి, యితని ప్రయోగ విశేషములనుగూర్చి కొంచెము పరిశీలించుట మంచిది:-

ఇతని శతకములోని యొక్కొక్క పద్యపాదము నొక్కొక్క సామెతయనుటలో నతిశయోక్తిలేదు. ఉపమానములు చదువుచుండిన నుపమేయములను జదువవలసిన యవసరము లేకుండనే వెంటనే పాఠకులూహించుకొనునంత సన్నిహితత్వ మారెండింటికి నుండుట యీతని కవిత్వములో నొక విశిష్టత.

ఇందులో లాక్షణిక విరుద్ధ ప్రయోగములు పుంఖానుపుంఖములుగా నున్నవి. సహజకవులలో (చౌడప్ప, వేమన మొదలైనవారిలో) కూడ నిది యొక్కటే పెద్దలోపము. అయిన నట్టివారిలో నది దోషముగాఁ బరిగణించుటకంటె నిరంకుశత్వముగా సమర్థించుట యుక్తమని నాయభిప్రాయము.

ఇఁక నితని శతకములో (వేణుగోపాలశతకములో) దేశ్యములు, నన్యదేశ్యములు నగు శబ్దముల ప్రయోగములు గుదిగ్రుచ్చఁబడినట్లు (శతకము) కడవెడల నగపడుచున్నవి. జాతీయశబ్దములకు ఈతని శతకములు రెండును పెన్నిధులు. ఈ రాయలసీమకవికిఁ దెలిసినన్ని జాతీయములు, మన తెలుగునాఁట నడిగడ్డపయిన జీవించిన యేకవికిని దెలిసి యుండవని చెప్పుట సాహసము కాదు. నేటికి నట్టి జాతీయ కవులకు రాయలసీమ జన్మభూమి. శ్రీ గడియారమువా రట్టి వారిలో నొకరనిన సమ్మతింపని యాంధ్రుడుండఁడు.

ఈ వేంకటరాయకవి చేసిన జాతీయప్రయోగములు కొన్నింటినిట సూచించుట యుక్తము:-

లొట్టెడు (కల్లు), గుడిసెవేటి (జార), తుందుడుకు, బేగములు, కుట్టుపోఁగులు, అధికప్రసంగి, మూతినాకు (ఇచ్చకాలాడు), రద్ది, చంకనెక్కు, చాందిని, అమీరుసాహెబు, అతిరసాలు, దివాను, మునిషీ, బక్షీ, మజుందారు, శిరస్తా,

వకీలు, దేశపాండ్యా, ముసరద్ది, అంకులాడి, మాచకమ్మ, తగవర్లు, నెత్తిగీత, గొబ్రాలిముండ, నడిగండి, పోచీలు, బగిసి (సిగ్గు), జరీకుచ్చులజీని, పంగటించు, అంబలి, తెడ్డు, బజారురచ్చ, లాహిరికసరు, కొండెసిగలు, పాకోళ్లు, కఠారులు, కాసికోకలు, డాలువార్లు, వల్లెవాట్లు, తరహా, ఎమ్మెలు, గడికరణము, గ్రామదండుగ, మడియరండ, చౌడోలు, దరిబేసి, మంకుగులాము, బాజారి అంకు, పాతలంజ, పంచాయతి, ధగిడీ, కొణతంబు, నొష్ట, బదనిక, కూచిమతము, లంజకొడుకు, ముచ్చెలు, బడవాతనము, పల్లెకూటము, ముదిలంజ, దిడ్డికంత, ముష్టికూళ్లు మొత్తులు, తమ్మకళ్లు, దేబె, వస్తాదుతనం, అసురతిండి, రాయసము, దీర్ఘనత్తి, వకాలతు, ఉగ్రాణకాఁడు, బుగ్గ (నీటియూట) చట్టు, చీవాట్లమారి, బహదరి, బడవా, దళవాయి, ధర్మచేట, పడిసేటి తొత్తు, పౌజులకమ్ములు, తాటాకు దుద్దులు, కంకోష్ఠుడు, లంచకాండ్రు, పలువ, అచ్చినవాఁడు, హంకరింపు, చల్లడము, చౌకట్లు, మీర్జాకుళాయి, బులాకు, బాజిబందు, వంకరపాగాలు, చేరుమాళ్లు, పింజెలు, పార్షి మొహర్లు, కలందానుపెట్టె, సిపారసులు, సున్నచుట్టు, ఎంగిలియెగ్గు, పలుగాకులు, మేకమెడచన్నులు, బొండుమల్లెలు, బారాహజారి, పిసినారి, మోయీను, బరాతము, ఏడుజేనెల కాటికి, ముడ్డిచూపు, బంగిబాయీలు, రంకులరాట్నము, ద్రాబ, తెగతినడము, పోఁతురాజు, కాటేరి, కొక్కురాళ్లు, గుత్తలంజ.

ఇట్టి జాతీయములన్నియు మన భాషాశాస్త్రవేత్తలు పరిశోధించి, ప్రత్యేకముగా నొక కోశము తయారుచేసి, భాషాదేవికొక భూషణముగా సమర్పించుట యెంతైన నవసరము. అప్పుడుగాని మన సారస్వతమహత్వ మిట్టిదని, మన స్వతంత్రవాఙ్మయ సంపద యింతటిదని గ్రహింపఁజాలము. అట్టి సుదినమెన్నడో?

– శతకవాఙ్మయ సర్వస్వము
(ప్రథమ సంపుటము)
(౧౧౬౦-౧౭౬౦)
పుటలు: 266–280)



అనుబంధము-2

# శ్రీకృష్ణుని గురించిన కొన్ని ప్రసిద్ధ అష్టకములు

**తాత్పర్యరచన: శ్రీ గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రి**

## 2.1 జగద్గురు శ్రీకృష్ణస్తోత్రము

**శ్లో॥ వసుదేవసుతం దేవం, కంస చాణూర మర్దనమ్,**
**దేవకీ పరమానందం, కృష్ణం వందే జగద్గురుమ్! 1**

**తా॥** వసుదేవుని కుమారుడును; దేవుడును; కంసుని, చాణూరమల్లుని సంహరించిన వాడును; తల్లియైన దేవకీదేవికి మహాసంతోషమును కలిగించువాడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ అతసీపుష్ప సంకాశం, హారనూపుర శోభితమ్,**
**రత్నకంకణ కేయూరం, కృష్ణం వందే జగద్గురుమ్! 2**

**తా॥** నల్లని అవిసె పువ్వువలె నీలవర్ణముతో అందగించువాడును; మెడలో దండలు, పాదాలకు అందెలు కలిగి ప్రకాశించువాడును; ముంజేతులకు రత్నములు పొదిగిన కంకణములు (మురుగులు), భుజములకు రత్నములు పొదిగిన దండకడియములు ధరించినవాడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ మందారగంధ సంయుక్తం, చారుహాసం, చతుర్భుజమ్,**
**బర్హిపింఛావచూడాంగం, కృష్ణం వందే జగద్గురుమ్! 3**

**తా॥** మందారపుష్ప పరిమళము కలవాడును; అందమైన నవ్వు కలవాడును; నాలుగు భుజములు కలవాడును; సిగలో నెమలిపింఛము ధరించినవాడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ ఉత్ఫుల్లపద్మపత్రాక్షం, నీలజీమూత సన్నిభమ్,**
**యాదవానాం శిరోరత్నం, కృష్ణం వందే జగద్గురుమ్! 4**

**తా॥** చక్కగా వికసించిన తామరపూలవంటి కన్నులు కలవాడును; నీలమేఘమువలె నల్లనైనవాడును; యదువంశము వారందరికిని తలమానికము వంటివాడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ రుక్మిణీకేళి సంయుక్తం, పీతాంబర సుశోభితమ్,**
**అవాప్త తులసీగంధం, కృష్ణం వందే జగద్గురుమ్! 5**

**తా॥** భార్య అయిన రుక్మిణీదేవితో క్రీడించువాడును; బంగారు పట్టువస్త్రముతో శోభిల్లువాడును; తులసీదళముల సువాసనతో కూడినవాడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ గోపికానాం కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసమ్,**
**శ్రీనికేతం, మహేష్వాసం, కృష్ణం వందే జగద్గురుమ్! 6**

**తా॥** గోపికల చనుదోయినిగల కుంకుమ తన ఱొమ్మునకు అంటించుకొనినవాడును (గోపికలను కౌగిలించుకొనిన వాడని భావము); శ్రీదేవిని మందిరమున గలవాడును (సంపదలకు నిలయమైనవాడని భావము); గొప్పదియైన విల్లు ధరించినవాడును (రామావతారములో కోదండధరుడు. విష్ణుమూర్తి ధనువు పేరు "శార్ఙ్గము". శృంగము యొక్క వికారము – శార్ఙ్గము. "ఇషువు" అనగా "బాణము". ఇషు+ ఆసః = ఇష్వాసః = బాణమునకు ఆసనమైనది – విల్లు); సకల చరాచర జగత్తునకు గురువైనవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ శ్రీవత్సాంకం, మహోరస్కం, వనమాలా విరాజితమ్,**
**శంఖచక్రధరం, దేవం, కృష్ణం వందే జగద్గురుమ్. 7**

**తా॥** "శ్రీవత్స"మనెడి పుట్టుమచ్చ గుర్తుగాగలవాడును; విశాలమైన వక్షస్థలముతో ఒప్పువాడును; వనమాలతో ప్రకాశించువాడును (వనమాల= ఆకులు పువ్వులు చేర్చి కట్టిన తోమాలె); "పాంచజన్యము" అను శంఖమును, "సుదర్శనము" అను చక్రమును ధరించిన వాడును; దేవుడును; సకల చరాచర జగత్తునకు గురువైనవాడును –అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాతరుత్థాయ యః పఠేత్,**
**కోటిజన్మ కృతం పాపం స్మరణేన వినశ్యతి! 8**

తా॥ పుణ్యప్రదమైన ఈ కృష్ణాష్టకమును నిదురలేవగనే ఎవరు పఠించెదరో, వారికి కోటిజన్మలలో చేసిన పాపమంతయు; కృష్ణుని స్మరించినంత మాత్రమున నశించిపోవును!

## 2.2 మధురాష్టకము - వల్లభాచార్య

శ్లో॥ **అధరం మధురం, వదనం మధురం**
**నయనం మధురం, హసితం మధురమ్।**
**హృదయం మధురం, గమనం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 1

తా॥ మధురానగరమునకు ప్రభువైన శ్రీకృష్ణుని పెదవి, ముఖము, కన్నులు, నవ్వు, హృదయము, నడక - సర్వమును కూడ మధురాతిమధురమైనవే!

శ్లో॥ **వచనం మధురం, చరితం మధురం,**
**వసనం మధురం, వలితం మధురమ్।**
**చలితం మధురం, భ్రమితం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 2

తా॥ ఆ దేవదేవుని మాట, ప్రవర్తన (కథలు), ధరించిన వస్త్రము, పొట్టమీది ముడుతలు, కదలికలు, నృత్యభంగిమలు - సర్వమును మధురమైనవే!

శ్లో॥ **వేణుర్మధురో, రేణుర్మధురః**
**పాణిర్మధురః పాదౌమధురౌ।**
**నృత్యం మధురం, సఖ్యం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 3

తా॥ శ్రీకృష్ణుని చేతి పిల్లనగ్రోవి, అతని శరీరమునుండి వచ్చెడి సుగంధ పరాగములు, చేతులు, కాళ్ళు, నృత్యము, అతనితో స్నేహము-అన్నియును తీయనివే!

శ్లో॥ **గీతం మధురం, పీతం మధురం,**
**భుక్తం మధురం, సుప్తం మధురమ్।**
**రూపం మధురం, తిలకం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 4

**తా॥** శ్రీకృష్ణుని సామగానము, అతని నోటినుండి వెలువడెడి సన్నని స్వరము, అతని ఆహారము, నిద్ర, రూపము, నుదుట కస్తూరీతిలకము - అన్నియును తీయనివే!

**శ్లో॥ కరణం మధురం, తరణం మధురం,**
**హరణం మధురం, రమణం మధురమ్।**
**నమితం మధురం, శమితం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 5

**తా॥** శ్రీకృష్ణుని చేతిపనులు (సాధనము), తరింపజేసెడి స్వభావము, శత్రువులను సంహరించెడి తీరు, అతని అందము, అతని వంపుసొంపులు, శాంతము - సర్వమును మధురమైనవే!

**శ్లో॥ గుంజా మధురా, మాలా మధురా,**
**యమునా మధురా, వీచీ మధురా।**
**సలిలం మధురం, కమలం మధురం**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 6

**తా॥** శ్రీకృష్ణుడు ధరించిన సొగసైన గురివెంద తీగల దండ, ఇతర మాలలు (వనమాల మొదలైనవి), అతడు విహరించెడి యమునా తీరము, యమునపైనుండి వచ్చు తరంగములు, నీరు, అందులోని తామరలు - అన్నియును మధురమైనవే!

**శ్లో॥ గోపీమధురా, లీలామధురా,**
**యుక్తం మధురం, భుక్తం మధురమ్ ।**
**ఇష్టం మధురం, శిష్టం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥** 7

**తా॥** కృష్ణస్వామితో ఆడిపాడెడి గోపికలు, వారి లీలలు, తగినతీరు, తినెడి పదార్థము, అతడిష్టపడెడి వస్తువులు, వాటి పవిత్రత (గొప్పతనము) - అన్నియును తీయనైనవే!

**శ్లో॥ గోపా మధురా, గావో మధురా,**
**యష్టిర్మధురా, సృష్టిర్మధురా ।**

**దలితం మధురం, ఫలితం మధురం,**
**మధురాధిపతే రఖిలం మధురమ్॥ 8**

**తా॥** కృష్ణునితో నుండెడి గోపకులు, ఆవులు, అతని చేతిబెత్తము, అతనిని గురించిన అద్భుత దృశ్యాలు, అతని దండించెడి తీరు, సాధించెడి ఫలితాలు – అన్నియును కూడ మధురాతి మధురమైనవే!

## 2.3 గోకులేశాష్టకము – రఘునాథాచార్య

**శ్లో॥ నందగోప భూపవంశ భూషణం, విదూషణం,**
**భూమిభూతి భూరిభాగ్య భాజనం, భయాపహమ్ ।**
**ధేనుధర్మరక్షణావతీర్ణ పూర్ణవిగ్రహం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 1**

**తా॥** నందుని గోపాలక వంశమునకు ఆభరణము వంటివాడును; చెడును నిందించెడివాడును; సకలభూమికిని మహాసంపద సౌభాగ్యము కలుగుటకు పాత్రుడైనవాడును; సమస్త భయములను తొలగించువాడును; గోసంపదను, ధర్మమును కాపాడుటకే అవతరించిన పూర్ణపురుషుడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ గోపబాల సుందరీగణావృతం, కళానిధిం,**
**రాసమండలీ విహారకారి కామ సుందరమ్ ।**
**పద్మయోని శంకరాది దేవబృంద వందితం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 2**

**తా॥** గోప బాలబాలికల గుంపుతో కూడినవాడును; సకల కళలకు నిధివంటివాడును; రాసలీలలో విహరించెడి కడు సుందరుడైనవాడును; బ్రహ్మ, శివుడు మొదలైన దేవతాబృందముచేత నమస్కరింపబడెడివాడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ గోపరాజరత్నరాజి మందిరానురింగణం,**
**గోపబాలబాలికా కలానురుద్ధగాయనమ్ ।**
**సుందరీ మనోజభావ భాజనాంబుజాననం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 3**

**తా॥** గోపాలకుల రాజయిన నందుని రత్నాలకాంతులతో విరాజిల్లెడి మందిరములో ఆహ్లాదముగా విహరించెడివాడును; గోపబాలుర, బాలికల రాగములను అనుసరించి పాటలు పాడెడివాడును; సుందరీమణుల (గోపికల) శృంగార భావనలకు మూలమయిన తామరపువ్వువంటి ముఖము కలవాడును (గోపికల కామభావనకు ప్రేరకమయిన అందమైన ముఖము కలవాడని అర్థము); నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ కంస కేశి కుంజరాజ దుష్టదైత్య దారణం,**
**ఇంద్రసృష్ట వృష్టివారి వారణోద్ధృతాచలమ్ ।**
**కామధేను కారితాభిధాన గాన శోభితం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 4**

**తా॥** కంసుడు, కేశి, ఏనుగు ("కువలయాపీడము"), లేదా కుంజరాసుర, అజాసురలనెడి దుష్టరాక్షసులను సంహరించినవాడును; దేవేంద్రుడు సృష్టించిన వర్షధారలను అడ్డుకొనుటకు గోవర్ధనగిరినే యెత్తినవాడును; కోరినన్ని పాలు ఇచ్చెడి కామధేనువులవంటి ఆవులను సైతము సమ్మోహన పరచెడి గానముతో అలరారెడివాడును (సంగీతము వినిపించినచో ఆవులు ఎక్కువ పాలిచ్చునని ఇటీవల శాస్త్రీయముగా నిరూపింపబడినది); నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ గోపికా గృహాంత గుప్త గవ్య చౌర్య చంచలం,**
**దుగ్ధభాండభేద భీత లజ్జితాస్య పంకజమ్ ।**
**ధేనుధూళి ధూసరాంగ శోభిహార నూపురం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 5**

**తా॥** గోపికల ఇండ్లలో రహస్యముగా చొరబడి, పాలు, వెన్నలను దొంగిలించెడి చంచలుడును; పాలకుండలను పగులగొట్టుటచేత, భయము, సిగ్గులతో నిండిన పద్మమువంటి ముఖము కలవాడును; ఆవులమందలవలన రేగిన ధూళిచే ఎఱ్ఱబడి శోభిల్లుచున్న (దుమ్ము కప్పటం వలన మరొక రకముగానున్న) మెడలో దండలు, పాదాలకు గజ్జెలు కలవాడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ వత్సధేను గోపబాల భీషణాస్య వహ్నిపం,**
**కేకిపింఛ కల్పితావతంస శోభితాననమ్ ।**
**వేణునాద మత్తఘోష సుందరీ మనోహరం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 6**

**తా॥** దూడలుగల ధేనువులకు, గోపబాలురకు కలిగెడి భయము పాలిట అగ్నిముఖుడును (వీరి భయమును దహింపజేయువాడని భావము); నెమలి పింఛముతో ప్రకాశించెడి ముఖము కలవాడును (తలపై నెమలి పింఛము ఉన్నందున ఆయన ముఖము ఇంకను అందముగా నున్నదని భావము); పిల్లనగ్రోవి నుండి వినవచ్చెడి, మైకము కలిగించెడి నాదమువలన గోపికాసుందరీమణుల మనస్సులు హరించినవాడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ గర్వితామరేంద్ర కల్పితాన్న భోజనం,**
**శారదారవిందబృంద శోభిహంసజా రతమ్ ।**
**దివ్యగంధలుబ్ధ భృంగ పారిజాతమాలినం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 7**

**తా॥** గర్వించిన దేవతలరాజైన ఇంద్రుడు కల్పించిన అన్నశాకపాకములను నిరాటంకముగా భుజించినవాడును; తెల్లతామరల సమూహమున్న సరస్సులో శోభిల్లు హంసలయందు అభిరుచికలవాడును; మహత్తరమైన పరిమళమునకు ఆశపడెడి తుమ్మెదలను ఆకర్షించునట్టి పారిజాత పుష్పమాల ధరించినవాడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ వాసరావసాన గోష్ఠగాభిగోగణానుగం,**
**ధేనుదోహ దేహగేహ మోహ విస్మయక్రియమ్ ।**
**స్వీయ గోకులేశ దానదత్త భక్తరక్షణం,**
**నీల వారివాహ కాంతి, గోకులేశ, మాశ్రయే॥ 8**

**తా॥** సాయంకాలమునందు గోశాలలవైపు వెనుదిరిగి పోవుచున్న గోవులవెంట నడిచెడివాడును; పితుకుటకు సిద్ధముగానున్న ఆవులదేహమును, అవి ఉన్న ఇండ్లను (గోష్ఠములను) ఆశ్చర్యము కలుగునట్లు తగుక్రియలు సలుపువాడును; తన గోపాలకాధిపుడు ఇచ్చిన దానములతో భక్తులను రక్షించువాడును; నల్లని మబ్బువంటి కాంతిగలవాడును; గోకులమునకు ప్రభువైనవాడును – అయిన ఆ శ్రీకృష్ణుని నేను ఆశ్రయించెదను.

## 2.4 గోపీజనవల్లభాష్టకము – హరిదాస

**శ్లో॥ నవాంబుదానీక మనోహరాయ,**
**ప్రఫుల్ల రాజీవ విలోచనాయ ।**
**వేణుస్వనామోదిత గోపికాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 1**

**తా॥** తొలకరి మబ్బులవలె నల్లనై మనసులు హరించువాడును; బాగుగా వికసించిన పద్మములవంటి కన్నులు కలవాడును; వేణుగానముతో గోపికలను ఆనందింప జేయువాడును; గోపికాజనమునకు ప్రియుడయినవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ కిరీట కేయూర విభూషితాయ,**
**గ్రైవేయమాలామణిరంజితాయ ।**
**స్ఫురచ్చలత్కాంచన కుండలాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 2**

**తా॥** కిరీటమును, సందికడియములను ధరించినవాడును; కంఠహారములోని మణుల కాంతిచేత ఆకర్షింపబడెడివాడును (కంఠహారమణుల కాంతివలన అందరిని

ఆకర్షించువాడు – అని భావము); ప్రకాశించుచు అటునిటు కదలుచున్న బంగారు చెవికుండలములు గలవాడును; గోపికాజనమునకు ప్రియుడయినవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ దివ్యాంగనా బృంద నిషేవితాయ,**
**స్మితప్రభా చారు ముఖాంబుజాయ ।**
**త్రైలోక్య సంమోహన సుందరాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 3**

**తా॥** దేవతాస్త్రీల సమూహముచే బాగుగా సేవింపబడువాడును; చిరునవ్వుల కాంతిచేత అందమైన ముఖపద్మము కలవాడును; ముల్లోకములను సమ్మోహపరచగల సౌందర్యము కలవాడును; గోపికా జనమునకు ప్రియుడయిన వాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ రత్నాదిమాలాలయ సంగతాయ,**
**కల్పద్రుమచ్ఛాయ సమాశ్రితాయ ।**
**హేమస్ఫురన్మండల మధ్యగాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 4**

**తా॥** రత్నములు మొదలగునవి పొదిగిన హారములు ధరించువాడును (రత్నములకు ప్రథమ మూలస్థానమైన మణిద్వీపముతో సంబంధము కలవాడును); కల్పవృక్షము యొక్క నీడలో నుండువాడును; బంగారు కాంతులు విరజిమ్మెడి మండల (సూర్యమండల) మధ్యభాగమున నుండువాడును; గోపికాజనమునకు ప్రియుడయిన వాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ శ్రీవత్స రోమావళి రంజితాయ,**
**వక్షస్థలే కౌస్తుభ భూషితాయ ।**
**సరోజ కింజల్క నిభాంశుకాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 5**

**తా॥** "శ్రీవత్స"మను పుట్టుమచ్చతో కూడి, ఱొమ్మునుండి నాభివరకుగల నూగారుతో విరాజిల్లెడివాడును; వక్షస్థలమునందు "కౌస్తుభ" మనెడి మణిని

అలంకరించు కొనినవాడును; తామరపూలలోని కేసరములవంటి మిక్కిలి పలుచనైన, మనోహరమైన వస్త్రమును ధరించినవాడును; గోపికాజనమునకు ప్రియుడయిన వాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ దివ్యాంగుళీ యాంగుళి రంజితాయ,**
**మయూర పింఛచ్ఛవి శోభితాయ ।**
**వన్యస్రజాలంకృత విగ్రహాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 6**

**తా॥** విలువైన వజ్రములు మణులు పొదిగిన గొప్ప ఉంగరములు ధరించిన చేతివ్రేళ్ళతో రంజింపజేయువాడును; నెమలిపింఛపు కాంతిచేత ప్రకాశించువాడును; వనమాలచేత అలంకృతమయిన సుందరాకారము కలవాడును; గోపికాజనమునకు ప్రియుడయినవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ మునీంద్రబృందై రభిసంశ్రితాయ,**
**క్షరత్పయో గోకుల సంకులాయ ।**
**ధర్మార్థ కామామృత సాధకాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 7**

**తా॥** మునిశ్రేష్ఠులైన వారి గుంపులకు ఆశ్రయమైనవాడును; పాలు స్రవించెడి ఆవుల మందలో నుండువాడును; ధర్మ, అర్థ, కామములనెడి అమృతమును సాధించువాడును; గోపికాజనమునకు ప్రియుడయిన వాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

**శ్లో॥ ఏతత్సమస్తా మధిదేవతాయ,**
**భక్తస్య చింతామణి సాధకాయ ।**
**అశేషదుఃఖాభయ భేషజాయ,**
**నమోఽస్తు! గోపీజన వల్లభాయ ॥ 8**

**తా॥** ఈ సమస్తమునకును అధిదైవతమయినవాడును; భక్తులపాలిటి చింతించు వరములిచ్చు చింతామణిగా సాధకుడయినవాడును; అంతులేని దుఃఖముతోనున్న

వారికి అభయమిచ్చి కాపాడెడి వైద్యుడైనవాడును; గోపికాజనమునకు ప్రియుడయినవాడును – అయిన శ్రీకృష్ణునకు నమస్కారము.

## 2.5 బాలకృష్ణాష్టకము

**శ్లో॥ లీలయా కుచేలమౌని పాలితం కృపాకరం,**
**నీలనీల మింద్రనీల నీలకాంతి మోహనమ్ ।**
**బాల నీల చారు కోమలాలకం, విలాస గో –**
**పాలబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 1**

**తా॥** తన లీలలో ఒకటిగా తన బాల్యమిత్రుడయిన కుచేలబ్రాహ్మణుని కృపతో పాలించినవాడును; అతినీలమైన ఇంద్రనీలమువంటి నల్లని కాంతిగల శరీరముతో మోహనకరుడైన వాడును; పొట్టివై నల్లనై అందమైన సుకుమారమైన ముంగురులు కలవాడును; విలాసవంతుడును; బాలగోపాలురతో జారచోరకార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ ఇందు కుంద మందహాస, మిందిరాధరాధరం,**
**నందగోప నందనం, సనందనాది వందితమ్ ।**
**నందగోధనం, సురారి మర్దనం, సమస్త గో–**
**పాలబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 2**

**తా॥** చంద్రునివలె మొల్లలవలె స్వచ్ఛమైన మందహాసముకలవాడును; లక్ష్మీదేవి అధరామృతమును గ్రోలువాడును; నందగోపుని కుమారుడును; సనందన సనత్కుమారాది మునులచేత నమస్కరింపబడువాడును; నందునకు ఆవులసంపద తానే అయినవాడును (కృష్ణుడు లేకున్నచో నందుని గోవులన్నియు మాయమగును); రాక్షసులను సంహరించువాడును; సమస్తమును తానే అయినవాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ వారి హార హీర చారు కీర్తితం విరాజితం,**
**ద్వారకా విహార, మంబుజారి సూర్య లోచనమ్ ।**

**భూరిమేరుధీర, మాదికారణం, విశేషణం,**

**గోపబాల జారచోర బాలకృష్ణమాశ్రయే ॥ 3**

**తా॥** ప్రవాహమువలె (లేదా సరస్వతివలె), ముత్యాలపేరువలె, వజ్రమణులవలె– తెల్లగా అందముగా విస్తరించిన కీర్తితో మిక్కిలి ప్రకాశించువాడును; ద్వారకా నగరములో విహరించువాడును; చంద్ర సూర్య నేత్రములు కలవాడును; గొప్ప (ఎత్తైన) మేరుపర్వతముతో సమానమైన ధైర్యము కలవాడును; సమస్తమునకు మూలాధారమైనవాడును; శేషించువాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ శేషభోగశాయినం, విశేష భూషణోజ్జ్వలం,**

**ఘోషమాన కింకిణీ, విభీషణాది పోషణమ్ ।**

**శోషణీ కృతాంబుధిం, విభీషణార్చితం పదం,**

**గోపబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 4**

**తా॥** ఆదిశేషునిపై పవళించినవాడును; విశిష్టమైన ఆభరణాలంకారములచేత ప్రకాశించువాడును; మంజుల ధ్వనులు చేయు చిరుగజ్జెలు ధరించినవాడును; భీతావహులను రక్షించువాడును; (రామావతారములో) సముద్రమును శోషింపజేయుటకు సిద్ధపడినవాడును; విభీషణునిచేత పూజింపబడిన పాదములు గలవాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ పండితావరాస్య పుండరీక చండభాస్వరం,**

**కుండల ప్రభాసమాన తుండగండమండలమ్ ।**

**పుండరీక సన్నుతం, జగన్నుతం, మనోజ్ఞకం,**

**గోపబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 5**

**తా॥** శ్రేష్ఠమైన పండితుల ముఖములనెడి తెల్లదామరలకు ప్రకాశించెడి సూర్యుని వంటివాడను (సూర్యకిరణములు సోకగనే తామరపూలు వికసించును. కృష్ణతత్త్వము తెలిసిన జ్ఞానులైన పండితుల ముఖములనెడి తామరలు, కృష్ణుడనెడి సూర్యుని

చూడగానే వికసించును); కుండలముల కాంతిచేత నునుపుదేరి ప్రకాశించెడి చెక్కిళ్ళు కలవాడును; పుండరీకుడను మునిచేత చక్కగా స్తుతింపబడినవాడును; సకల జగత్తుచేత కొనియాడబడువాడును; మనోహరమైనవాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ ఆంజనేయ ముఖ్యపాల వానరేంద్ర కృంజనం,**
**కుంజరారి భంజనం, నిరంజనం, శుభాకరమ్।**
**మంజు కంజపత్ర నేత్ర రాజితం విరాజితం,**
**గోపబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 6**

**తా॥** ఆంజనేయుని ప్రభువైన సుగ్రీవునకు అభయమిచ్చినవాడును; మొరవెట్టుకొనిన గజరాజును పట్టిన మొసలిని సంహరించినవాడును; దేనియందును మనసు నుంచనివాడును (నిత్యసంతోషియైనవాడును); సకల శుభములకు నెలవయిన వాడును; సుకుమారమైన తామరపువ్వు రేకులవంటి కన్నులతో గొప్పగా ప్రకాశించెడివాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ రామణీయ యజ్ఞధామ భామినీ వరప్రదం,**
**శ్రీమనోహరం, గుణాభిరామ, మున్నతోన్నతమ్ ।**
**సామగాన వేణునాదలోల, మబ్జజాతకం,**
**గోపబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥ 7**

తా॥ సుందరియగు యాజ్ఞసేని (ద్రౌపది) అను భామినికి వరములొసగినవాడును; లక్ష్మీదేవి మనసు హరించినవాడును; సకల సద్గుణములచేత అందరిని ఆకర్షించువాడును; ఉన్నతులలో ఉన్నతమైనవాడును; సామగాన ప్రియుడును, వేణునాదలోలుడును; (గుండెలమీద) లక్ష్మీదేవిని కలిగిన వాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను.

**శ్లో॥ రంగదిందిరాంగ మంగళాంగ, శౌర్యభాసదా**
**సం, గదాసురోత్తమాంగ భంగక ప్రదాయకమ్।**

**తుంగవైభవాభిరామ, మంగనామృతం సదా,**
**గోపబాల జారచోర బాలకృష్ణ మాశ్రయే ॥** 8

**తా॥** కాంతిమంతమైన లక్ష్మీదేవి అవయవములకు మంగళము కూర్చు శరీరము కలవాడును (లక్ష్మీదేవిని కౌగిలింతతో తన్పెడి వాడును); శౌర్యగుణములకు దాసుడైన వాడును; గదాసురుని శిరమును ఖండించినవాడును; మహోన్నతమైన సంపదలచేత ఆకర్షణీయుడైనవాడును; ఎల్లవేళల గోపాంగనల పాలిట అమృతమూర్తి అయినవాడును; బాలగోపాలురతో జారచోర కార్యములు చేయువాడును – అయిన బాలకృష్ణుని నేను ఆశ్రయించెదను. (పై శ్లోకములో మూడవ పాదములో "అంగనామృతం సదా" అనునది "అంగనావృతం సదా" అని కూడ కావచ్చును. అప్పుడు "ఎల్లవేళల గోపాంగనలచేత పరివేష్టింపబడినవాడును" అని అర్థము చెప్పుకొనవలెను–సంపాదకుడు)

**శ్లో॥ బాలకృష్ణ పుణ్యనామ లాలితం, శుభాష్టకం,**
**మే పఠంతి సాత్వికోత్తమా స్సదా ముదాచ్యుతమ్।**
**రాజమాన పుత్ర సంపదాది శోభనాని తే**
**సాధయంతి విష్ణులోక మవ్యయం నరాశ్చితే ॥** 9

**తా॥** బాలకృష్ణుని పుణ్యనామముచేత లాలితమైనదియు, శుభములు కలిగించెడిదియు, అయిన ఈ అష్టకమును సాత్త్వికులైనవారు ఎవరు నిత్యమును సంతోషముతో పఠించెదరో, వారికి శోభిల్లు పుత్రులు, సంపదలు మొదలైన శుభములు కలుగును. అవ్యయమైన విష్ణులోకప్రాప్తి కలుగును.

## 2.6 శ్రీకృష్ణశరణాష్టకము – హరిరాయాచార్య

**శ్లో॥ సర్వసాధన హీనస్య, పరాధీనస్య సర్వతః ।**
**పాపపీనస్య దీనస్య, శ్రీకృష్ణశ్శరణం మమ ॥** 1

**తా॥** (జీవించుటకు/ముక్తిపొందుటకు) ఉన్న సాధనములన్నింటిని పోగొట్టుకొన్న వానిని (తరించుటకు ఏ సాధనములును లేనివానిని); (అన్నింటికిని) ఇతరులపై ఆధారపడినవానిని; అతిశయమైన పాపములు చేసినవానిని; దీనుడనగు వానిని;

అగు నాకింక శ్రీకృష్ణపరమాత్మయే శరణము (నేను శ్రీకృష్ణుని శరణు జొచ్చితిని).

**శ్లో॥ సంసారసుఖ సంప్రాప్తి సన్ముఖస్య విశేషతః ।**
**బహిర్ముఖస్య సతతం, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 2**

**తా॥**పరిపరివిధములుగా సాంసారిక సుఖములవైపు మాత్రమే మొగ్గుచూపిన వానిని (సంసారసుఖ లంపటుడను); ఎల్లవేళల వెలుపలి చూపులనే కలిగినవానిని (భౌతిక విషయములపైనే చూపు నిలిపినానే తప్ప, అంతర్ముఖుడనై, నాలోని పరమాత్మవైపు చూపు నిలుపనివానిని); అగు నాకింక శ్రీకృష్ణపరమాత్మయే శరణము (నేను శ్రీకృష్ణుని శరణు జొచ్చితిని).

**శ్లో॥ సదా విషయకామస్య, దేహారామస్య సర్వథా ।**
**దుష్టస్వభావ వామస్య, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 3**

**తా॥** ఎల్లప్పుడును విషయవాంఛలనే కోరుకొనువానిని; దేహమునందే భ్రాంతిగలవానిని (దేహమను నివాసములో సుఖవాంఛలందే లగ్నమయిన వానిని); దుర్మార్గపు ప్రవర్తననే అతిగా ఇష్టపడిన వానిని ("వామః" = సుందరమని – దుష్టవర్తనమే అందమైనదని, మంచిదని భావించిన వానిని); అగు నాకింక శ్రీకృష్ణపరమాత్మయే శరణము (నేను శ్రీకృష్ణుని శరణు జొచ్చితిని).

**శ్లో॥ సంసారసర్పదష్టస్య, ధర్మభ్రష్టస్య, దుర్మతేః ।**
**లౌకిక ప్రాప్తి కష్టస్య, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 4**

**తా॥** సంసారమను పాముకాటునకు గురైనవానిని; (మానవత్వముతో మెలగవలసిన ధర్మము, చతుర్విధ పురుషార్థసాధనము, ముముక్షుత్వము, దైవభక్తి, శాంతము, అహింస– ఇవి మానవుని ధర్మములు) ఈ ధర్మాచరణము చేయక భ్రష్టుడైనవానిని; చెడ్డబుద్ధిగలవానిని; పరమార్థమును విడిచి లోకమునకు (భౌతిక ప్రపంచమునకు) సంబంధించిన సుఖప్రాప్తికొఱకు మాత్రమే కష్టపడినవానిని; అగు నాకింక శ్రీకృష్ణపరమాత్మయే శరణము (నేను శ్రీకృష్ణుని శరణు జొచ్చితిని).

**శ్లో॥ విస్మృత స్వీయధర్మస్య, కర్మమోహిత చేతసః ।**
**స్వరూపజ్ఞాన శూన్యస్య, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 5**

**తా॥** మానవునిగా జన్మించిన ప్రతియొక్కడు ఆచరించి తీరవలసిన ధర్మములున్నవి. అవి: పరహితము, దైవచింతన, పారమార్థికావలోకనము, దయ, శాంతి, సత్యము, అహింస, అస్తేయము (–దొంగిలింపకుండుట) మొదలగునవి. ఇవి మానవుని స్వీయధర్మములు. ఇటువంటి స్వీయధర్మములను ఆచరించుట మరచిపోయిన వానిని (వీనికి భిన్నమైన దుష్టకర్మలలో చరించినవానిని – అని భావము); భౌతికవాంఛాప్రాప్తికొరకు చేయు కర్మలమీదనే వ్యామోహము చూపెడి మనసు కలవానిని (కామ్యకర్మాచరణమని భావము); (తన) నిజస్వరూపమేమియో తెలియని వానిని (ప్రతి మానవుడును భౌతిక ఆంతరిక స్వరూపములు కలవాడే. ఆంతరిక స్వరూపజ్ఞానమే "స్వస్వరూప జ్ఞానము") – ఆ అసలైన స్వరూపమును తెలిసికొనలేని మూర్ఖుడను; అగు నాకింక శ్రీకృష్ణుడే దిక్కు!

**శ్లో॥ సంసారసింధు మగ్నస్య, భగ్నభావస్య, దుష్కృతేః ।**
**దుర్భావలగ్నమనసః, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 6**

**తా॥** "సంసారము ఒక మహాసాగరము" ఆ సంసారమను సముద్రములోనే మునిగిపోయినవానిని (ఎల్లప్పుడును భార్యపిల్లలు, సుఖములు, దుఃఖములు, సంపాదన – ఇవియే వ్యాపకములు తప్ప, ఆ సముద్రమునుండి బయటపడి, "ముక్తి" తీరమును చేరెడి ప్రసక్తియే లేని వానిని – అని భావము); సకల శుభావహ భావములను వ్యతిరేకించినవానిని; దుష్టమైన (పాపపు) పనులు చేసిన వానిని (దుష్టమతినై మంచిభావములనన్నింటిని విడిచిపెట్టినవానిని – అని భావము); మనసునిండ చెడ్డభావములే ఉన్నవానిని (చెడువాసనలందే మనసు నిలిపినవానిని); అగు నాకింక శ్రీకృష్ణపరమాత్మయే శరణము.

**శ్లో॥ వివేక ధైర్య భక్త్యాది రహితస్య నిరంతరమ్ ।**
**విరుద్ధకరణాసక్తేః, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 7**

తా॥ మానవునకు వివేకము, ధైర్యము, భక్తి మొదలగు మంచి లక్షణములుండవలెను. ఇవియే మానవుని మహోన్నతుని, పారమార్థికపథగామిని చేయును. కాని నేను ఇవేవియు ఏనాడును లేనివానిని; ఎల్లప్పుడును దయారహితమైన విషయములలోనే ఆసక్తి కలవానిని; (ఇట్టి సర్వగుణరహితునకు లభించెడి శిక్ష ఏమిటి?) నేనిక

శ్రీకృష్ణపరమాత్మనే శరణువేడుచున్నాను. అతడే నాకు దిక్కు

**శ్లో॥ విషయాక్రాంత దేహస్య, వైముఖ్య హృతసన్మతేః ।**
**ఇంద్రియాన్వగృహీతస్య, శ్రీకృష్ణశ్శరణం మమ ॥ 8**

**తా॥** సమస్త విషయ వాంఛలతో (సకల సుఖాభిలాషతో) నిండిన దేహము కలవానిని (శరీర మంతయు సుఖవాంఛాభరితమే!); మంచి మనసు (ఆలోచనలు, భావనలు) పట్ల విముఖత్వము కలవానిని; కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు – అన్నియు కోరికలమయమై ఆక్రమింపబడినవానిని; (వేరుదారియేదియు లేనివానిని) – అగు నాకు శ్రీకృష్ణపరమాత్మయే శరణము!

**శ్లో॥ ఏతదష్టక పాఠేన హ్యేతదుక్తార్థ భావనాత్ ।**
**నిజాచార్య పదాంభోజ సేవకో దైన్యమాప్నుయాత్ ॥ 9**

**తా॥** ఈ ఎనిమిది శ్లోకములను పఠించుటచేతను, ఇందు ప్రతిపాదింపబడిన తాత్పర్యమును భావనచేయుటచేతను, తమ గురువర్యుల పాదపద్మముల సేవకు పాత్రుడై, పాఠకుడు శరణభావము నందుకోగలడు. అనగా శ్రీకృష్ణుని కృపకు పాత్రుడు కాగలడని భావము.

## 2.7 రాసక్రీడాష్టకము–(బిల్వమంగళ లీలాశుకుని “శ్రీకృష్ణకర్ణామృతము”నుండి)

**శ్లో॥ అంగనా మంగనా మంతరే మాధవో,**
**మాధవం మాధవం చాంతరే ణాంగనా।**
**ఇత్థమాకల్పితే మండలే మధ్యగః,**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥ 1**

**పల్లవికి అర్థము:**– దేవకీనందనః = దేవకి కుమారుడైన శ్రీకృష్ణుడు; వేణునా=తన పిల్లనగ్రోవితో; సంజగౌ = చక్కగా గానముచేసెను.

**తా॥** (ఇచ్చట శ్రీకృష్ణుడు పెక్కు ఆకారములు పొంది, ఒక్కొక్క స్త్రీకిని నడుమ తాను ఒక్కొక్కడుగా ఏర్పడి, మండలాకారముగా నిలుచుటయేగాక, ఆమండలమునకు నడుమను గూడ తానొక్కడు నిలిచి యుండెనని ఊహింపవలెను.) ఒక్కొక్క స్త్రీకిని నడుమ తానును, తన రెండు రూపుల నడుమను ఒక్కొక్కస్త్రీయునుగా,

మండలముగా తీరి నిలిచి, వారికి నడుమను గూడ తాను వేఱొకడై నిలిచి శ్రీకృష్ణుడు తన పిల్లనగ్రోవితో చక్కగా గానము చేసెను. (ఇద్దరు గోపికల మధ్యన ఒక కృష్ణుడు ఉన్నాడు. ఇద్దరు కృష్ణుల మధ్యన ఒక గోపిక ఉన్నది. ఈ విధంగా గుండ్రంగా – వలయాకారంగా నిలబడి ఉన్నారు. ఈ మండలం మధ్యలో మళ్ళీ ఒక కృష్ణుడు ఉన్నాడు. ఇటువంటి దేవకీనందనుడైన శ్రీకృష్ణుడు తన వేణువుతో చక్కగా గానం చేశాడు. – సంపాదకుడు.)

**శ్లో॥ కేకి కేకాఽఽద్రుతానేక పంకేరుహా**
**లీన హంసావళీ హృద్యతా హృద్యతా।**
**కంస వంశాటవీ దాహ దావానలః**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 2

**తా॥** కృష్ణుని దేహచ్ఛాయను జూచి మబ్బు అని నెమిళ్ళు కేకలిడగా, వర్షాకాలమని బెదరి పెక్కు తామరలందుండిన హంసలు లేవగా, మబ్బుకాదు శ్రీకృష్ణుడని తనధ్వనిచే తెలిపి, వానికి సంతోషమును కలిగించునట్టి పిల్లనగ్రోవిని గొని, కంసవంశమను అడవిని ('కంసుడనెడి వెదుళ్ళ అడవిని' అని కూడ చెప్పవచ్చును) కాల్చునట్టి కాఱుచిచ్చువంటివాడైన, దేవకీనందనుడైన శ్రీకృష్ణుడు తన పిల్లన గ్రోవితో సొగసుగా గానము చేసెను.

**శ్లో॥ క్వాపి వీణాభి రారావిణా కంపితః**
**క్వాపి వీణాభిరాకింకిణీ నర్తితః।**
**క్వాపి వీణాభి రామాంతరం గాపితః**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 3

**తా॥** శ్రీకృష్ణుడు ఒకచోట వీణలు వాయించుటకు అనుగుణముగా ఆడుచున్నాడు. ఒకచోట వీణాధ్వనులకు అనుగుణముగా చిఱుగంటలు మ్రోయించుచున్నాడు. ఒకచోట నడుమ నడుమ వీణలు వాయింపగా పాడుచున్నాడు. అటువంటి దేవకీనందనుడు తన వేణువుతో లెస్సగా గానము చేసెను.

**శ్లో॥ చారు చంద్రావళీ లోచనైశ్చుంబితో**
**గోప గోబృంద గోపాలికా వల్లభః।**

**వల్లవీ బృంద బృందారకః కాముకః**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 4

**తా॥** అందమగు నెమలి పింఛెములను పోలు గోపికల కన్నులచే ముద్దుపెట్టుకొనబడుచున్నవాడును; గోపాలురకును, ఆవులమందలకును, గోపికలకును ప్రియమైన నాయకుడును; గోపస్త్రీల గుంపులకు దేవతా సముడును; వారికి తమ విషయమున అనురాగము (కామము) కలవాడుగా (కాముకుడుగా) తోచువాడును, దేవకీ పుత్రుడును అయిన బాలకృష్ణుడు (గోపికలనడుమ) తన మురళితో జగన్మోహనముగా గానము చేసెను.

**శ్లో॥ మౌళిమాలా మిళిన్మత్త భృంగీలతా**
**భీత భీతప్రియా విభ్రమాలింగితః।**
**స్రస్తగోపీకుచాఽభోగ సమ్మేళితః**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 5

**తా॥** కృష్ణుని సిగయందు పూలమాల లున్నవి. వానిలోని తేనెను త్రాగుటకై ఆడుతుమ్మెదలు బారులు బారులుగా గుమిగూడినవి. వానిని చూచి మిక్కిలి భయపడిన గోపికలు కృష్ణుని విలాసముగా కౌగిలించుకొనినారు. అప్పుడు వారి పైటలు జారిపోయినవి. వారి గుండ్రని చన్నుగవల ఒత్తిడి అతనికి కలిగినది. మొదట భయపడిన గోపికల గాఢాలింగనము, తరువాత పైటలు జారిపోవుటచే వారి బలిష్ఠములైన కుచముల ఘట్టనము కృష్ణునకు నిర్భరానందహేతువగుటచేత అతడు శ్రావ్యముగా వేణుగానము చేసెను.

**శ్లో॥ చారు చామీకరాఽభాస భామావిభుః**
**వైజయంతీ లతా వాసితోరఃస్థలః।**
**నందబృందావనే వాసితా మధ్యగః**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 6

**తా॥** సుందరమైన బంగారు కాంతివంటి కాంతిగల సత్యభామకు ప్రభువైనవాడును, తీగెలవంటి 'వైజయంతి' అను వనమాలచేత పరిమళించుచున్న వక్షఃస్థలము కలవాడును, నందునియొక్క బృందావనమందలి గోపస్త్రీల మధ్యమున

నుండువాడును అయిన దేవకీనందనుడు తన పిల్లనగ్రోవిచేత వినసొంపుగా గానము చేసెను.

**శ్లో॥ బాలికా తాళికా తాళ లీలా లయా**
**సంగ సందర్శిత భ్రూలతా విభ్రమః।**
**గోపికా గీత దత్తావధానః స్వయం**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 7

**తా॥** తాళకర్తలైన గోపబాలికలు తమ చప్పట్లతో వేయు తాళములు ఎక్కువ తక్కువలు లేకుండ సరిగానుండునట్లు దిద్దుటకై కనుబొమలు సొగసుగా త్రిప్పుచున్నవాడును; (అదే సమయమున తన మురళీగానమునకు అనుగుణముగా) గోపికలు పాడుచున్న పాటలమీదకూడ తాను స్వయముగా తన అవధానమును నిలుపుచున్నవాడును అయిన దేవకీనందనుడు (కృష్ణుడు) తన వేణువుతో సమ్మోహనముగా గానము చేసెను.

**శ్లో॥ పారిజాతం సముద్ధృత్య రాధావరో**
**రోపయామాస భామా గృహస్యాంగణే ।**
**శీతశీతే వటే యామునీయే తటే**
**సంజగౌ వేణునా దేవకీనందనః॥** 8

**తా॥** రాధావల్లభుడైన శ్రీకృష్ణుడు, పారిజాతవృక్షమును ఇంద్రుని నందనవనము నుండి పెల్లగించి తెచ్చి, సత్యభామ యింటిముంగిట మొలచునట్లు నాటెను. అట్టి దేవకీనందనుడైన కృష్ణుడు యమునానది గట్టున మిక్కిలి చల్లనైన ("భాండీర"మనెడి) మఱ్ఱిచెట్టుక్రింద తన పిల్లనగ్రోవితో మనోహరముగా గానము చేసెను. (తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారు, ఇతర పండితులు నీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతమునకు వ్రాసిన వ్యాఖ్యలను పరిశీలించి, సంపాదకులు ఆచార్య తంగిరాలవారు వ్రాసికొనిన తాత్పర్యములు.)

## 2.8 గోపాలబాల పంచకము

**(బిల్వమంగళ లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతమునుండి)**

**శ్లో॥ సజలజలదనీలం, పల్లవీకేళిలోలం**
**శ్రితసుర తరుమూలం, విద్యుదుల్లాసి చేలమ్!**
**సురరిపుకులకాలం, సన్మనోబింబలీలం,**
**నతసురమునిజాలం, నౌమి గోపాలబాలమ్" 1**

**తా॥** నేను గొల్లపిల్లవానిని నుతించుచున్నాను (పొగడుచున్నాను-మొక్కుచున్నాను.) అతడు ఎట్టివాడనగా – నీటితో కూడిన మబ్బువలె నల్లగా నుండువాడు. గోపికలతో సరససల్లాపము లాడుటయందు ఆసక్తుడైనవాడు. కల్పవృక్ష మూలమును ఆశ్రయించినవాడు. మెఱపుతీగవలె తళుకు తళుక్కని మెఱయు పీతాంబరమును కట్టినవాడు. రాక్షసుల వంశమునకు కాలయముడైనవాడు (రక్కసులను నాశనము చేయువాడు). సజ్జనుల మనస్సులందు బింబరూపముగానుండు విలాసము కలవాడు (సత్పురుషుల హృదయములందు ప్రతిఫలించువాడు). నమస్కరించిన దేవతల యొక్కయు ఋషులయొక్కయు సమూహము కలవాడు. (అనేక దేవతలు, ఋషులు అతనికి నమస్కరించుచున్నారు).

**శ్లో॥ సజలజలదనీలం, దర్శితోఽదార లీలం,**
**తరతల ధృతశైలం, వేణునాదైరసాలమ్।**
**వ్రజజనకులపాలం, కామినీకేళిలోలం**
**కవితలలలితమాలం, నౌమి గోపాలబాలమ్॥ 2**

**తా॥** నేను గోపాలబాలుని నుతించుచున్నాను. (స్తుతించుచున్నాను-నమస్కరించు చున్నాను). అతడు ఎట్టివాడనగా-నీటితో కూడిన మబ్బువలె నల్లనివాడు. పూతనావధము మొదలైన అధికములైన విలాసములు చూపినవాడు. అరచేతియందు గోవర్ధన పర్వతమును ధరించినవాడు. వేణుధ్వనులచేత రసవంతుడైనవాడు (రసవంతములైన వేనుధ్వనులు కలవాడు – రసము చిప్పిలునట్లు వేణువు నూదువాడని భావము). వ్రేపల్లెయందలి జనసమూహముయొక్క పాలకుడైనవాడు.

కామవతులైన గోపికలతోడి క్రీడలయందు ఆసక్తుడైనవాడు. మనోజ్ఞమైన వనమాలను ధరించినవాడు.

**శ్లో॥ స్మితలలితకపోలం, స్నిగ్ధసంగీతలోలం,**
**లలిత చికురజాలం, సౌర్యచాతుర్య లీలమ్।**
**శతమఖరిపుకాలం, శాతకుంభాభచేలం,**
**కువలయదళనీలం, నౌమి గోపాలబాలమ్॥ 3**

**తా॥** నేను చిన్నికృష్ణుని నుతించుచున్నాను. అతడు ఎటువంటివాడు అనగా – చిఱునగవుచేత చెలువైన (అందమైన) చెక్కిళ్ళు కలవాడు. మనోజ్ఞమైన వేణుగాన రూపమైన సంగీతమునందు ఆసక్తుడైనవాడు. (లేదా, తనయందు భక్తి రూపమైన స్నేహముగల నారదాదులయొక్క గానమునందు ఆసక్తుడైనవాడు). సుందరమైన ముంగురుల సమూహము కలవాడు. నేర్పుతోకూడిన దొంగతనముయొక్క విలాసచేష్టలు కలవాడు (వెన్నను దొంగలించుట మొదలైన చతురములగు చోరలీలలు కలవాడు) అం....

**శ్లో॥ మురళినినదలోలం, ముగ్ధమయూర చూళం,**
**దళితదనుజజాలం, ధన్యసౌజన్యలీలమ్।**
**పరహితనవహేలం, పద్మసద్మానుకూలం,**
**నవజలధరనీలం, నౌమి గోపాలబాలమ్॥ 4**

**తా॥** నేను బాలగోపాలును నుతించుచున్నాను. అతడు ఎట్టి వాడనగా – పిల్లనగ్రోవి యొక్క నాదమందు (పిల్లన గ్రోవిని ఊదుటయందు) ఆసక్తుడైనవాడు. అందమైన నెమలికన్నును సిగలో చెరివినవాడు. రాక్షసుల సమూహమును చీల్చినవాడు. కృతార్థులైన తన భక్తులకు మంచి తనముతోకూడిన లీలలు చూపువాడు. ఇతరులకు మేలు కలిగించెడి క్రొత్త విలాసములు కలవాడు. (లేదా, శత్రువులకు పథ్యములైన విచిత్రములగు సంహరించుట మొదలైన విలాసములు కలవాడు.) తామరయందు నిసించెడి లక్ష్మికి అనుకూలనాయకుడైనవాడు. వానకురియని క్రొత్తమబ్బువలె నల్లనైనవాడు.

**శ్లో॥ సరసగుణనికాయం, సచ్చిదానందకాయం,**
**శమితసకలమాయం, సత్యలక్ష్మీసహాయమ్।**
**శమదమ సముదాయం, శాంతసర్వాంతరాయం,**
**సుహృదయజనదాయం, నౌమి గోపాలరాయమ్॥ 5**

**తా॥** నేను గొల్లవారికి రాయడైన (రాజైన) శ్రీకృష్ణుని నుతించుచున్నాను. అతడు ఎటువంటివాడు ్నగా – రసయుక్తములైన సౌందర్య సౌకుమార్యాది గుణముల సమూహము గలవాడు. సత్యము, జ్ఞానము, ఆనందము – అనెడి ఈ మూడింటిచేత నిర్మితమైన దేహము కలవాడు (అనగా కృష్ణుడు సచ్చిదానందస్వరూపుడని భావము). అడపబడిన సమస్తములైన మాయలు కలవాడు. సత్యస్వరూపయైన లక్ష్మికి సహాయుడైనవాడు. బహిరింద్రియ నివృత్తియొక్కయు (అనగా 'శమము' యొక్కయు అంతరింద్రియ నివృత్తియొక్కయు (అనగా 'దమము'యొక్కయు) సమూహమైన వాడు. నశించిన సమస్తములైన విఘ్నములు కలవాడు (సమస్త విఘ్నములను నశింపజేయువాడు) నిర్మలమైన ఆంతరంగముగల జనులకు పశుడైనవాడు.

(తంజనగరము తేవప్పెరుమాళ్ళయ్యగారి శ్రీకృష్ణకర్ణామృతవ్యాఖ్య ననుసరించి వ్రాసికొనిన తాత్పర్యములు – తంగిరాల)

## 2.9 శ్రీకృష్ణ మంగళగీతము – జయదేవుడు

**శ్రిత కమలా కుచమండల, ధృత కుండల, అయి,**
**కలిత లలిత వనమాల, జయ జయ దేవ హరే! 1**

**తా॥** లక్ష్మీదేవి స్తనములను ఆశ్రయించినవాడా! (లక్ష్మీదేవిని కౌగిలించినవాడా – అని భావము); కుండలములను ధరించినవాడా! వక్షమునుండి పాదములవరకు మనోహరమైన తులసిమాలను ధరించినవాడా! అయి = ఓ, దేవా! = దివ్యమైన ఆనందము కలవాడా; హరే! (హరీ!) = ఆశ్రయించినవారి పాపములను హరించువాడా! ఓ శ్రీకృష్ణా! నీకు జయము! జయము! (జేజేలు పలుకుట).

**దినమణి మండల మండన, భావఖండన, అయి,**
**మునిజన మానస హంస, జయ జయ దేవ హరే! 2**

తా॥ సూర్యమండలమునకు అలంకారమైనవాడా! సంసారబంధములను తొలగించువాడా! మునుల సమూహముయొక్క మనస్సులో (మానస సరస్సులో) సంచరించెడి హంసము (పరబ్రహ్మము) అయినవాడా! ఓ దేవా! హరీ! నీకు జేజే!

**కాళియ విషధర గంజన, జనరంజన, అయి,**
**యదుకుల నలిన దినేశ, జయ జయ దేవ హరే! 3**

**తా॥** కాళీయుడనెడి విషసర్పమును నిరసించినవాడా! (దాని గర్వమును అణచినవాడని భావము). భక్తజనులను సంతోషపరచెడి వాడా! యాదవకులమనెడి పద్మముల పాలిట సూర్యుడా! (సూర్యుని కిరణములతో పద్మములు వికసించును. యాదవుల ముఖములను సంతోషముతో వికసింపజేయువాడు శ్రీకృష్ణుడు) ఓ దేవా! హరీ! నీకు జేజే!!

**మధు, ముర, నరక విభంజన, గరుడాసన, అయి,**
**సురకులకేళి నిధాన, జయ జయ దేవ హరే! 4**

**తా॥** మధు, ముర, నరక మొదలగు రాక్షసులను నాశనము చేసినవాడా! ("మధువైరి" – "మురారి" – "నరకాంతక" అని శ్రీకృష్ణుని పేర్లు). గరుత్మంతునిపై కూర్చొని విహరించేవాడా! ("గరుడ వాహనుడు" – "గరుడాసనుడు" అని శ్రీకృష్ణుని పేర్లు). దేవతల ఆనందకేళికి హేతువైనవాడా! (దేవతలు, దానవులవలన బాధితులు. అందువలన విచారముఖులు. ఆ దానవులను చంపినవాడు హరి. వారు చావగానే సురలకు ఆనందము కలిగినది. ఆ విధముగా దేవతల ఆనందమునకు మూలమైనవాడు హరి). ఓ దేవా! హరీ! నీకు జయము! జయము!!

**అమల కమలదళ లోచన, భవమోచన, అయి,**
**త్రిభువన భవన నిధాన, జయ జయ దేవ హరే! 5**

**తా॥** నిర్మలమైన (స్వచ్ఛమైన) తామరరేకులవంటి కన్నులు కలవాడా! భవ బంధములను (సంసార బంధములను) విడిపించువాడా! ముల్లోకములలోని భవనములందు (భక్తకోటి గృహములందు) నివసించెడివాడా! (ఆ యిండ్లలో

పెన్నిధి అయినవాడా!) ఓ దేవా! హరీ! నీకు జేజే!!

**జనకసుతా కృత భూషణ, జిత దూషణ, అయి,**
**సమర శమిత దశకంఠ, జయ జయ దేవ హరే! 6**

**తా॥** జనక మహారాజు పుత్రికయైన సీతాదేవి వక్షస్థలముపై పవళించెడివాడా! (సీతాదేవి స్తనములకు అలంకారమైనవాడా!); దూషణుడు అను రాక్షసుని జయించినవాడా! (అడవులలో నుండగా రాముడు ఖరదూషణులను చంపినాడు. ఇతరుల దుర్మార్గపు నిందలను లెక్కచేయనివాడు – అని కూడా భావింపవచ్చును.) యుద్ధమునందు దశకంఠుడైన రావణుని చంపినవాడా! ఓ దేవా! హరీ! నీకు జేజేలు!

**అభినవ జలధర సుందర, ధృతమందర, అయి,**
**శ్రీముఖ చంద్ర చకోర, జయ జయ దేవ హరే! 7**

**తా॥** క్రొత్త వానమబ్బు (తొలకరి నల్లని మబ్బు) వంటి నీలమైన శరీరముతో అందమైనవాడా! మందరపర్వతమును ధరించినవాడా! (పాలసముద్రమును చిలుకునప్పుడు తాబేలై మందరపర్వతము మునిగిపోకుండ మోసినవాడు); లక్ష్మీదేవి ముఖమనెడి చంద్రునకు చకోరపక్షివంటివాడా! ("చకోరము" లేక "వెన్నెల పులుగు" చంద్రుని కిరణములను త్రాగునని కవి సమయము. చంద్రుని వెన్నెల అంటే చకోరమునకు ఇష్టమని; అట్లే చకోరమును చూచుట చంద్రునకు ఇష్టమని దీని అర్థము.) ఓ దేవా! హరీ! నీకు జేజేలు!!

**తవ చరణే పతితా కయమితి భావయ, అయి,**
**కురు కుశలం ప్రణతేషు, జయ జయ దేవ హరే! 8**

**తా॥** ఓ దేవా! శ్రీకృష్ణా! నీ పాదములపైబడి నమస్కరించినవారిగా మమ్ము భావింపుము. నమస్కారము చేసిన మాకు మంగళమును ప్రసాదింపుము. ఓదేవా! హరీ! నీకు జయము! జయము!!

**శ్రీ జయదేవ కవే రుదిత మిదం, కురుతే ముదమ్,**
**మంగళ మంజుల గీతం, జయ జయ దేవ హరే! 9**

**తా॥** జయదేవ కవి రచించిన ఈ మంగళకరమైన మహత్తర గీతము సంతోషమును కలిగించుచున్నది. (కవికిని, శ్రీకృష్ణునకును, వినువారికిని ఆనందమును కలిగించుచున్నదని భావము).

## 2.10 శ్రీకృష్ణ మంగళగీతము - నారాయణతీర్థులు

**ధ్రువపదమ్: జయమంగళం - నిత్యశుభమంగళమ్ ।**

**శ్లో॥ మంగళం రుక్మిణీరమణాయ, శ్రీమతే,**
**మంగళం రమణీయ, మూర్తయే, తే,**
**మంగళం శ్రీవత్సభూషాయ, శార్‌ఙ్గిణే,**
**మంగళం నందగోపాత్మజాయ - ॥జయ॥ 1**

**తా॥** శ్రీపతివి = శోభతో/బుద్ధితో/సంపదతో కూడినవాడవు; రుక్మిణీనాథుడవు; అందమైన ఆకారము కలవాడవు; శ్రీవత్సమనెడి అందమైన పుట్టుమచ్చ అను భూషణము కలవాడవు; "శార్‌ఙ్గ"మను విల్లును ధరించినవాడవు; నందగోపుని కుమారుడవు - అయిన నీకు జయముతో కూడిన మంగళము! ఎల్లప్పుడును శుభమును కలిగించు మంగళము!!

**పూతనా కంసాది పుణ్యజన హారిణే,**
**పురుహూత ముఖదేవ హితకరాయ,**
**సూతాయ విజయస్య, సుందర ముఖాబ్జాయ,**
**శీతకిరణాదికుల భూషణాయ - ॥జయ॥ 2**

**తా॥** పూతన, కంసుడు మొదలగు రాక్షసులను సంహరించినవాడవు; ఇంద్రాది దేవతలకు మేలు కలిగించినవాడవు; అర్జునునకు సారథి అయినవాడవు; పద్మమువంటి అందమైన ముఖము కలవాడవు; చంద్రవంశమునకు ఆభరణమైన వాడవు - అయిన నీకు మంగళము!

**కాళీయ మౌళి మణి రంజిత పదాబ్జాయ,**
**కాలాంబుద శ్యామ దివ్యతనవే,**
**కారుణ్య రసవర్షి నయనారవిందాయ,**

**కల్యాణ గుణరత్న వారినిధయే - ॥జయ॥ 3**

తా॥ కాళీయుని మర్దించెడివేళ అతని పడగలపైనున్న మణుల కాంతులచేత ప్రకాశించిన పద్మములవంటి పాదములు కలవాడవు; నల్లని మబ్బువలె నీలవర్ణమైన దివ్యదేహము కలవాడవు; కరుణరసము కురిసెడి తామరలవంటి కన్నులు కలవాడవు (స్వామి కన్నులు నిత్యము కరుణారసార్ద్రములు); శుభములు కలిగించెడి మంచిగుణములనెడి మణులకు సాగరము వంటివాడవు (సముద్రమునకు "రత్నాకరము" - రత్నములకు నిలయము-అని పేరు); - అయిన నీకు మంగళము!

**నవనీత చోరాయ, నందాది గోపగో**

**రక్షిణే, గోపికావల్లభాయ,**

**నారద మునీంద్రనుత నామధేయాయ, తే,**

**నారాయణానందతీర్థ గురవే - ॥జయ॥ 4**

**తా॥** వెన్నదొంగవయినవాడవు; నందుడు మొదలైన గోపకులను, వారి అనంత గోసంపదను కాపాడినవాడవు; పదహారు వేలమంది గోపికలకు వల్లభుడవు (ప్రియుడవు) అయినవాడవు; దేవముని అయిన నారదునిచేత కీర్తింపబడెడి చక్కని పేర్లు కలవాడవు; నారాయణ తీర్థులకు గురువయిన (ప్రభువయిన) వాడవు; - అయిన నీకు మంగళము! శుభమంగళము!!

---

**శ్లో॥ బాలాయ, నీలవపుషే, నవకింకిణీక-**

**జాలాభిరామజఘనాయ, దిగంబరాయ,**

**శార్దూల దివ్య నఖభూషణ భూషితాయ,**

**నందాత్మజాయ, నవనీతముషే, నమస్తే!**

**(శ్రీకృష్ణకర్ణామృతము,2-74)**

**తా॥** పసివాడవును; నల్లని ఒడలు కలవాడవును; కొత్త చిరుగంటల గుత్తులచేత అందగించిన మొలకలవాడవును; దిస్సమొలవాడవును; (మెడలో) మంచి పులిగోరు పతకముతో అలంకరింపబడినవాడవును; నందుని కొడుకువును; వెన్నదొంగిలించు వాడవును - అయిన ఓ బాలకృష్ణా! నీకు నా నమస్కారం!

---

అనుబంధము-3

# శ్రీకృష్ణ అష్టోత్తరశతనామస్తోత్రము

శ్లో॥ శ్రీకృష్ణః కమలానాథో వాసుదేవ స్సనాతనః,
వసుదేవాత్మజః పుణ్యో లీలామానుషవిగ్రహః. 1

శ్లో॥ శ్రీవత్సకౌస్తుభధరో యశోదావత్సలో హరిః,
చతుర్భుజాత్త చక్రాసి గదా శంఖాద్యుదాయుధః. 2

శ్లో॥ దేవకీనందన శ్శ్రీశో నందగోపప్రియాత్మజః,
యమునావేగసంహారీ బలభద్రప్రియానుజః. 3

శ్లో॥ పూతనాజీవితహర శ్శకటాసురభంజనః,
నందవ్రజచరానందీ సచ్చిదానందవిగ్రహః. 4

శ్లో॥ నవనీతవిలిప్తాంగో నవనీతనటోఽనఘః,
నవనీతనవాహారీ ముచికుందప్రసాదకః. 5

శ్లో॥ షోడశ స్త్రీసహస్రేశ స్త్రిభంగీ మధురాకృతిః,
శుకవాగమృతాబ్ధీందు ర్గోవిందో యోగినాంపతిః. 6

శ్లో॥ వత్సపాలనసంచారీ ధేనుకాసురభంజనః,
తృణీకృతతృణావర్తో యమళార్జునభంజనః. 7

శ్లో॥ ఉత్తాలోత్తాలభేత్తా చ తమాలశ్యామలాకృతిః,
గోపగోపీశ్వరో యోగీ కోటిసూర్యసమప్రభః. 8

శ్లో॥ ఇళాపతిః పరంజ్యోతి ర్యాదవేంద్రో యదూద్వహః,
వనమాలీ పీతవాసాః పారిజాతాపహారకః. 9

శ్లో॥ గోవర్ధనాచలోద్ధర్తా గోపాలస్సర్వపాలకః,
అజో నిరంజనః కామజనకః కంజలోచనః. 10

శ్లో॥ మధుహా మధురానాథో ద్వారకానాయకో బలీ,
బృందావనాంతసంచారీ తులసీదామభూషణః. 11

శ్లో॥ స్యమంతకమణేర్హ ర్తా నరనారాయణాత్మకః,
కుబ్జాకృష్ణాంబరధరో మాయీ పరమపూరుషః. 12

శ్లో॥ ముష్టికాసుర చాణూర మల్లయుద్ధవిశారదః,
సంసారవైరీ కంసారి ర్మురారి ర్నరకాంతకః. 13

శ్లో॥ అనాది బ్రహ్మచారీ చ కృష్ణావ్యసనకర్శకః,
శిశుపాలశిరశ్ఛేత్తా దుర్యోధనకులాంతకృత్. 14

శ్లో॥ విదురాక్రూరవరదో విశ్వరూపప్రదర్శకః,
సత్యవా క్సత్యసంకల్ప స్సత్యభామారతో జయీ. 15

శ్లో॥ సుభద్రాపూర్వజో విష్ణు ర్భీష్మముక్తి ప్రదాయకః,
జగద్గురు ర్జగన్నాథో వేణునాదవిశారదః. 16

శ్లో॥ వృషభాసురవిధ్వంసీ బాణాసురకరాంతకృత్,
యుధిష్ఠిరప్రతిష్ఠాతా బర్హిబర్హావతంసకః. 17

శ్లో॥ పార్థసారథి రవ్యక్తో గీతామృతమహోదధిః,
కాళీయఫణిమాణిక్యరంజిత శ్రీపదాంబుజః. 18

శ్లో॥ దామోదరో యజ్ఞభోక్తా దానవేంద్రవినాశనః,
నారాయణః పరబ్రహ్మ పన్నగాశనవాహనః. 19

శ్లో॥ జలక్రీడాసమాసక్త గోపీవస్త్రాపహారకః,
పుణ్యశ్లోక స్తీర్థపాదో వేదవేద్యో దయానిధిః. 20

శ్లో॥ సర్వతీర్థాత్మక స్సర్వగ్రహరూపీ పరాత్పరః,
ఇత్యేవం కృష్ణదేవస్య నామ్నా మష్టోత్తరం శతమ్. 21

శ్లో॥ కృష్ణేన కృష్ణభక్తేన శ్రుత్వా గీతామృతం పురా,
స్తోత్రం కృష్ణప్రియకరం కృతం తస్మాన్మయా పురా. 22

శ్లో॥ కృష్ణనామామృతం నామ పరమానందదాయకమ్,
సర్వోపద్రవదుఃఖఘ్నం పరమాయుష్యవర్ధనమ్. 23

శ్లో॥ దానం శ్రుతం తపస్తీర్థం యత్కృతం త్విహ జన్మని,
పఠతాం శృణ్వతాం చైవ కోటికోటి గుణం భవేత్. 24

---

మ. కనియెన్ రుక్మిణి, చంద్రమండలముఖున్, కంఠీరవేంద్రావల
గ్ను, నవాంభోజదళాక్షుఁ, జారుతర వక్షున్, మేఘసంకాశదే
హు, నగారాతి గజేంద్ర హస్తనిభ బాహుం, జక్రిఁ, బీతాంబరున్,
ఘన భూషాన్వితుఁ, గంబుకంఠు, విజయోత్కంఠున్, జగన్మోహనున్.
(–పోతన భాగవతము)

**తా॥** – రుక్మిణి శ్రీకృష్ణుని చూచింది. ఆయన ఎలా ఉన్నాడో వర్ణిస్తున్నాడు కవి. చంద్రబింబంవంటి ముఖం కలిగిన వాడు. శ్రేష్ఠమైన సింహం యొక్క నడుమువంటి నడుము కలవాడు. అప్పుడే వికసించిన తామరరేకులవంటి కన్నులు కలవాడు. చాలా అందమైన ఱొమ్ముగలవాడు. నల్లమబ్బును పోలిన శరీరవర్ణం కలవాడు. ఇంద్రుని ఐరావతంయొక్క తొండంతో సమానమైన భుజములు కలవాడు. చేతిలో చక్రం కలవాడు. పసువన్నె పట్టుబట్ట (పీతాంబరం) కట్టుకున్నవాడు. గొప్పగొప్ప ఆభరణాలు ధరించినవాడు. శంఖంలాంటి కంఠం గలవాడు. విజయమునందు వేడుక (విజయోత్సాహం) కలిగినవాడు. లోకాలను మోహింపజేసేవాడు. ఇటువంటి కృష్ణుణ్ణి (మొట్టమొదటిసారిగా) రుక్మిణి చూచింది.

అనుబంధము-4

# శ్రీకృష్ణ అష్టోత్తరశతనామావళి

ఓం శ్రీకృష్ణాయ నమః

ఓం కమలానాథాయ నమః

ఓం వాసుదేవాయ నమః

ఓం సనాతనాయ నమః

ఓం వసుదేవాత్మజాయ నమః

ఓం పుణ్యాయ నమః

ఓం లీలామానుష విగ్రహాయ నమః

ఓం శ్రీవత్సకౌస్తుభధరాయ నమః

ఓం యశోదావత్సలాయ నమః

ఓం హరయే నమః **10**

ఓం చతుర్భుజాత్త చక్రాసి గదా
శంఖాద్యుదాయుధాయ నమః

ఓం దేవకీనందనాయ నమః

ఓం శ్రీశాయ నమః

ఓం నందగోపప్రియాత్మజాయ నమః

ఓం యమునావేగ సంహారిణే నమః

ఓం బలభద్రప్రియానుజాయ నమః

ఓం పూతనాజీవిత హరాయ నమః

ఓం శకటాసుర భంజనాయ నమః

ఓం నందవ్రజజనానందినే నమః

ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః **20**

ఓం నవనీత విలిప్తాంగాయ నమః

ఓం నవనీత నటాయ నమః

ఓం అనఘాయ నమః

ఓం నవనీత నవాహారాయ నమః

ఓం ముచికుంద ప్రసాదకాయ నమః

ఓం షోడశస్త్రీ సహస్రేశాయ నమః

ఓం త్రిభంగినే నమః

ఓం మధురాకృతయే నమః

ఓం శుకవాగమృతాబ్ధీన్దవే నమః

ఓం గోవిందాయ నమః **30**

ఓం యోగినాంపతయే నమః

ఓం వత్సపాలన సంచారిణే నమః

ఓం అనంతాయ నమః

ఓం ధేనుకాసుర భంజనాయ నమః

ఓం తృణీకృత తృణాపర్తాయ నమః

ఓం యమళార్జున భంజనాయ నమః

ఓం ఉత్తాల తాలభేత్రే నమః

ఓం తమాల శ్యామలాకృతయే నమః

ఓం గోపగోపీశ్వరాయ నమః

ఓం యోగినే నమః **40**

ఓం కోటిసూర్యసమప్రభాయ నమః

ఓం ఇలాపతయే నమః

ఓం పరంజ్యోతిషే నమః
ఓం యాదవేంద్రాయ నమః
ఓం యదూద్వహాయ నమః
ఓం వనమాలినే నమః
ఓం పీతవాససే నమః
ఓం పారిజాతాపహారకాయ నమః
ఓం గోవర్ధనాచలోద్ధర్త్రే నమః
ఓం గోపాలాయ నమః 50
ఓం సర్వపాలకాయ నమః
ఓం అజాయ నమః
ఓం నిరంజనాయ నమః
ఓం కామజనకాయ నమః
ఓం కంజలోచనాయ నమః
ఓం మధుఘ్నే నమః
ఓం మధురానాథాయ నమః
ఓం ద్వారకానాథాయ నమః
ఓం బలినే నమః
ఓం బృందావనాన్త సంచారిణే నమః 60
ఓం తులసీదామ భూషణాయ నమః
ఓం శమంతక మణేర్హర్త్రే నమః
ఓం నరనారాయణాత్మకాయ నమః
ఓం కుబ్జాకృష్ణాంబరధరాయ నమః
ఓం మాయినే నమః
ఓం పరమపురుషాయ నమః
ఓం ముష్టికాసుర చాణూర మల్లయుద్ధ విశారదాయ నమః
ఓం సంచారవైరిణే నమః
ఓం కంసారయే నమః
ఓం మురారయే నమః 70
ఓం నరకాన్తకాయ నమః
ఓం అనాది బ్రహ్మచారిణే నమః
ఓం కృష్ణావ్యసన కర్శకాయ నమః
ఓం శిశుపాల శిరచ్ఛేత్త్రే నమః
ఓం దుర్యోధన కులాన్తకాయ నమః
ఓం విదురాక్రూరవరదాయ నమః
ఓం విశ్వరూపప్రదర్శకాయ నమః
ఓం సత్యవాచే నమః
ఓం సత్యసంకల్పాయ నమః
ఓం సత్యభామారతాయ నమః 80
ఓం జయినే నమః
ఓం సుభద్రాపూర్వజాయ నమః
ఓం విష్ణవే నమః
ఓం భీష్మముక్తి ప్రదాయకాయ నమః
ఓం జగద్గురవే నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం వేణునాద విశారదాయ నమః
ఓం వృషభాసుర విధ్వంసినే నమః
ఓం బాణాసుర కరాన్తకాయ నమః
ఓం యుధిష్ఠిర ప్రతిష్ఠాత్రే నమః 90
ఓం బర్హిబర్హావతంసకాయ నమః
ఓం పార్థసారథయే నమః
ఓం గీతామృత మహోదధయే నమః
ఓం అవ్యక్తాయ నమః

ఓం కాళీయఫణి మాణిక్య మండిత
శ్రీ పదాంబుజాయ నమః
ఓం దామోదరాయ నమః
ఓం యజ్ఞభోక్త్రే నమః
ఓం దానవేన్ద్ర వినాశకాయ నమః
ఓం నారాయణాయ నమః
ఓం పరబ్రహ్మణే నమః 100
ఓం పన్నగాశన వాహనాయ నమః
ఓం జలక్రీడా సమాసక్త గోపీవస్త్రాప
హారకాయ నమః
ఓం పుణ్యశ్లోకాయ నమః
ఓం తీర్థపాదాయ నమః
ఓం వేదవేద్యాయ నమః
ఓం దయానిధయే నమః
ఓం సర్వతీర్థాత్మకాయ నమః
ఓం సర్వగ్రహరూపిణే నమః 108
ఓం పరాత్పరాయ నమః

---

**శ్లో॥ రక్షంతుత్వామ్, అసితజలజై రంజలిః పాదమూలే,**
**మీనానాభీసరసి, హృదయే మారబాణా మురారేః।**
**హారాః కంఠే హరిమణిమయా, వక్త్రపద్మే ద్విరేఫాః,**
**పింఛాపీడాశ్చికుర నిచయే, ఘోషయోషిత్కటాక్షాః॥**

**(-శ్రీకృష్ణకర్ణామృతము, 3-86)**

**తా॥** - (కృష్ణుడు నిలబడి ఉన్నాడు. ఎదురుగా గొల్లపడుచులు ఉన్నారు. వారు వలపు నిండిన కడగంటి చూపులతో కృష్ణుని నఖశిఖ పర్యంతమూ చూస్తున్నారు. ఆ చూపులు ఎలా ఉన్నాయో కవి వర్ణిస్తున్నాడు.) గోపికల కడగంటి చూపులు కృష్ణుని పాదాలపై ప్రసరించినప్పుడు, నల్లకలువల దోసిళ్ళవలె ఉన్నాయి! నాభిపై పడినప్పుడు, నాభి అనే సరస్సులో ఈదుతున్న చేపలవలె ఉన్నాయి! గుండెలమీద పడినప్పుడు, మన్మథుని బాణాలవలె ఉన్నాయి! కంఠంమీద ప్రసరించినప్పుడు, మెడలో ఇంద్రనీలమణిహారంలా ఉన్నాయి, ముఖపద్మంమీద ప్రసరించినప్పుడు తుమ్మెదలవలె ఉన్నాయి, కురుల సమూహంమీద పడినప్పుడు నెమలికన్నులవలె ఉన్నాయి! అటువంటి గోపికల కడగంటి చూపులు నిన్ను రక్షించుగాక! (స్త్రీల చూపులు నల్లగా ఉంటాయని భావించి వాటిని నల్లకలువలతోను, చేపలతోను, మన్మథుని బాణాలతోను, ఇంద్రనీలమణులతోను, తుమ్మెదలతోను, నెమలి కన్నులతోను పోల్చడం కవి సమయం.)

---

అనుబంధము-5

## పింగళి సూరన విరచిత

# శ్రీకృష్ణదండకము

(కళాపూర్ణోదయము 1-80)
(ప్రతిపదార్థ తాత్పర్య సహితము)

దండకము:

శ్రీ కామినీ కామితాకార! సాకార కారుణ్య ధారా నవాంకూర శంకాకరా శోణరేఖా మయూఖాళి కిమ్మీరి తాలోక నాలోక! లోకైక సంస్తుత్య నిత్య ప్రభావా! విభా వైభ వాధిక్య ధిక్కారి తానంత మార్తాండ కోటీక! యాటీక మానామలాస్తంభ శుంభ ద్యశఃపూర కర్పూర సౌరభ్యమైత్రీ పవిత్రీకృ తామ్నాయ వాయు ప్రచారా! నిశాపాది తాపార సంసార సంతాప నిర్వాపణా! పాప నిర్వాపణోపాయ నామ ప్రశంసానుభావా! భవాభావ లోభాకులీభూత చేత స్సుధీ వ్రాత నిర్ణీత సంప్రాప్త సద్భక్తి మార్గైక విశ్రామ భూమీ భవ త్తత్త్వ రూపా! సురూపావళీ దుర్నిరూప స్వరూపా! గురూపాసనాసాదితా నారతానన్య సాంకర్య కైంకర్య మాధుర్య ధుర్య ప్రపన్నా! ప్రపన్నావళీమాన సోదస్తభోగాపవర్గాభిలాషా! హృషీకేశ! యీశాన వాణీశ ముఖ్యుల్ సువిఖ్యాత మైనట్టి నీ దివ్య చారిత్ర చారు ప్రచారంబు పారంబు ముట్టన్, నుతింపంగ లేరంచు నెంచంగ, వించు బ్రపంచ స్వభావంబు, భావంబునన్ మాన కిట్లేము నీ ముందటన్ జాటు వాచాలతల్ చూపుచున్నార; మిన్నేరముల్ మన్ననం జేసి సైరింపు మో వాసుదేవా! సదానంద! గోవింద! నీ విందు మా విందవై, డెంద మానంద మొందింప, నెందున్ విచారంబు లేమిన్, వచో గోచరాగోచరత్వంబు లూహింపలేమైతిమోదేవ! మీ పాద సేవాదరంబున్

మదిం గోరుచున్, వేదవాదుల్ శమాదుల్ కదుం జాల నార్జించి, భోగేచ్ఛ వర్జించి, నానా తపశ్చర్య లాశ్చర్య తాత్పర్య పర్యాకులత్వంబునం గైకొనన్, మాకు నే యత్నముల్ లేక, యో కృష్ణ! యీ కైవడిన్ మీ కృపాలోక సంసిద్ధి సిద్ధించుటల్, బుద్ధిఁ దర్కింప నత్యంత చిత్రంబు గాదే? జగన్నాథ! యీ రీతిఁ జెన్నార, మున్నే ఋషుల్ మిమ్ముఁ గన్నారఁ గన్నారు, మా కన్ను లెన్నంగ నే పుణ్యముల్ చేసెనో యీ విశేషంబుఁ గాంచెన్, విరించ్యోదయస్థాన నాభీ సరోజా! సరోజాత జాతాండముల్ తండతండంబులై యుండ, నొండొండ నీ రోమ కూపంబు లేపారఁగాఁ దాల్చుటల్ చెప్పఁగా, నీవు గోవర్ధనం బెత్తి తంచున్, వరాహావతారంబునన్ ధారుణీచక్రముం దాల్చితంచున్, మహాకూర్మ భావంబునన్ మందర గ్రావమున్ మోచి తంచున్, జగంబుల్ సమస్తంబు ద్రైవిక్రమ ప్రక్రియా వేళఁ బాదత్రయిం జాలఁ బూరించి తంచున్ నుతింపంగ యుక్తంబె? భక్తప్రజాధీన! దీనిన్ వివేకించి లోకంబులోఁ గొంద ఱార్యోత్తముల్ సర్వవేదంబులున్ సర్వవాదంబులున్, సర్వయాగంబులున్, సర్వయోగంబులున్, సర్వమౌనంబులున్ సర్వదానంబులుం జూడ, నీ దాస దాసాను దాసాంఘ్రి సంసేవలోఁ గోటి కోట్యంశముం బోలఁగాఁ జాలవంచుం, ద దాచారముం బూని వర్తింతు రత్యున్నతిన్; సత్య సంకల్ప నిత్యోదయా! యేము నీ నామ మాత్రంబు మా నాలుకం జేర్చుటల్ దక్క నొక్కింతయుం దక్కు త్రోవల్ భవన్మాయ దాఁటంగలే మవ్యయా! భవ్య యోగీంద్ర, సాంద్రాదరాకాంక్షి తైకాంత సంసేవనా! భావనాతీత కల్యాణ! నానా గుణశ్రీ సముద్భాసితాంగా! మముం గేవలంబైన కారుణ్యదృష్టిం గటాక్షించి రక్షించు, లక్ష్మీమనోవల్లభా! దేవదేవా! నమస్తే నమస్తే! నమస్తే! నమః!

**ప్రతిపదార్థము:** (1) శ్రీ కామినీ = లక్ష్మీదేవి (యొక్క), కామిత + ఆకారా! = కోరిన రూపాన ఉండేవాడా! (2) స + ఆకార = ఆకరముతో కూడిన (తాల్చిన) కారుణ్యధారా! = కరుణకు (కరుణకు స్వార్థ తద్ధితరూపం కారుణ్యం) ధార

వంటివాడు = నిరంతరం కరుణ స్రవించే (మనస్సు) కలవాడా! (3) నవ + అంకూర = కొత్తగా మొలచినట్టు, శంక = అనుమానించతగ్గ, ఆకరా= ఆధారములతో, శోణరేఖా = రక్తపు చారలుగల, మయూఖ + ఆళి = కిరణముల సమూహముతో, కిమ్మీరిత + ఆలోకన + ఆలోక = చిత్రవర్ణములతో చూచుటకు దృశ్యమైనవాడా! (ఉదయ సూర్యుడైన జ్యోతి స్వరూపుడని తాత్పర్యం) (4) లోక + ఏక సంస్తుత్య = లోకములో ఒక్కడే ఐన (ఈతని) స్తుతి చేయదగిన, నిత్య = నిరంతరము, ప్రభావవా = ప్రభావము కలవాడా! (5) విభా = కాంతియొక్క, వైభవ + ఆధిక్య = వైభవ అతిశయముచే, ధిక్కారిత = ధిక్కరించిన, అనంతమార్తాండ = అంతులేని సూర్యులను, కోటీక = కోటి సంఖ్యలో కలవాడా! (6) ఆటీకమాన = సంచరించుచున్న, అమలస్తంభ = స్వచ్ఛంగా శ్వాసను స్తంభనం చేసి, శుంభత్ = ప్రకాశించు, యశఃపూర = కీర్తిచే నింపబడిన, కర్పూర సౌరభ్య = కర్పూరపు గుబాళింపుగల, మైత్రీ = సదృశమైన, పవిత్రీకృత = పవిత్రము చేయబడిన, ఆమ్నాయ = వేదములనెడు, వాయుప్రచారా! = నిశ్వాసలు గల్గినవాడా! "ఉచ్ఛ్వసితావై వేదాః" అని ప్రమాణము. (7) నిశా + ఆపాదిత = రాత్రివలె (లేదా చీకటివలె) ఆపాదించబడిన (స్వప్నము వంటి భ్రాంతిమంతమైన), అపార = ఒడ్డులేనట్టి (ముగింపులేనట్టి), సంసార = (ఈ) లోకములోని, సంతాప = దుఃఖములను, నిర్వాపణా! = తొలగించేవాడా! (8) పాప నిర్వాపణ + ఉపాయ = పాపములను తొలగించు సాధనమైన, నామ ప్రశంస = పేరు జపించుటకైన, అనుభావా = మహత్తు కలవాడా! (9) భవ + అభావ = పుట్టుకలేనట్టి, లోభ + ఆకులీభూత = ఆకాంక్షచే నిండబడిన, చేతః + సుధీవ్రాత = మనసులు గల్గిన మంచిబుద్ధికలిగిన జనుల సమూహముచే, నిర్ణీత సంప్రాప్త = నిశ్చయముగా పొందిన, సద్భక్తిమార్గ + ఏక = మంచి భక్తి అనే ఒకేఒక మార్గము అనెడు, విశ్రామభూమి = విశ్రమించే చోటు అనబడు, భవత్తత్త్వరూపా = నీదైన తత్త్వము (భగవత్తత్త్వము) రూపముగా గల్గినవాడా! (10) సురూప + ఆవళీ = సురూపులైన దేవతల సమూహముచే, దుర్నిరూప = నిరూపింప శక్యముకాని (వర్ణింపశక్యముకాని), స్వరూప = (భగవత్) రూపము కలవాడా! (11) గురు + ఉపాసన + ఆసాదిత = గురువులను (ఆశ్రయించి), ఉపాసించి, పొందిన, స

+ అరత = అయిష్టము కానట్టి (మిక్కిలి ఇష్టమైన), అనన్య సాంకర్య = ఇతర (విషయ) ములందు సంకరము (మిశ్రమము) కానట్టి, కైంకర్య = సేవాభావముచేత (భక్తులు పొందు), మాధుర్య = తీపిని (ఆస్వాద్యమును), ధుర్య = వహించిన (పొందిన), ప్రపన్నా! = శరణాగతులను కల్గినవాడా! (12) ప్రపన్న + ఆవళీ = శరణాగతుల సమూహము యొక్క, మానస = మనస్సులందు, ఉదస్త = ఎగురగొట్టబడిన, భోగ + అపవర్గ + అభిలాషా = భోగముల తొలగించు కోరికలు కలవాడా! (భోగభాగ్యములపై ఇష్టమును ఎగురగొట్టి, వైరాగ్యమును భక్తులకు ప్రసాదించేవాడని అర్థము), (13) హృషీక + ఈశా = ఇంద్రియములకు ప్రభువైనవాడా (వాటిని నియంత్రించేవాడా!) (14) ఈశాన = శివుడును, వాణీ + ఈశ = సరస్వతీదేవి భర్తయైన బ్రహ్మ, ముఖ్యుల్ = మొదలైనవారు (బ్రహ్మ రుద్రాది దేవతలు), సువిఖ్యాతమైనట్టి = బాగా ప్రసిద్ధిగాంచిన, నీ దివ్యచారిత్ర చారు ప్రచారంబు = నీ గొప్పదైన చరిత్ర (కథలన్ని) చక్కగా ప్రచారము, పారంబు ముట్టన్ = అంతు ముట్టేలా (ప్రచారములు విస్తృతపరచి కథాసాగరంలో ఈదులాడి అవతలి ఒడ్డుకు చేరేలా అని అర్థం), నుతింపంగ లేరంచున్ ఎంచంగ వినుచున్ = పొగడుట ఎవరితరం కాదని భావించగా వింటున్న (మేము), ప్రపంచ స్వభావంబు = ఈ ప్రపంచంతో జీవికి ఉన్న సంబంధాన్ని, భావంబునన్ మానక = మనసులో తొలగించక (జ్ఞానం పొందీ, బంధవిమోచనం పొందలేక), ఇట్లు, ఏము, నీ ముందటన్ = ఇలా మేము నీ ముందు (స్తోత్రరూపముగా) చాటు, వాచాలతలు = అందంగా మాటలతో కవిత్వము (వాచాలత్వాన్ని) చూపుచున్నారము. ఇన్నేరములు (ఈ+నేరములు) = ఈ తప్పులు, మన్ననన్ చేసి = కాచి, సైరింపుము + ఓ వాసుదేవా = ఓ వాసుదేవా! రక్షించుమయ్యా!, సదానంద = ఎల్లవేళల ఆనందరూపుడైనవాడా, గోవింద = గోవులకు అధిపతీ! (ధర్మానికి అధికారీ!), నీవు + ఇందు, మా + విందవై = నీవు ఈ దినము మాకు దాతవై, డెందము + ఆనందము + ఒందింప = హృదయము సంతోషముతో నిండగా, ఎందున్ విచారంబు లేమిన్ = ఏ విషయంలోనూ చింత లేకుండా, వచః గోచర + అగోచరత్వంబు = మాటలతో కనబడీ కనబడనితనము (నీ దృశ్యాదృశ్యత్వము), ఊహింపలేము + ఐతిమి + ఓ దేవా! = భావించలేము ఓ దేవా!, మీ పాదసేవ

+ ఆదరంబున్ = మీ చరణములు సేవించుటకై ఇష్టము కల్గి, మదిన్ + కోరుచున్ = మనస్సులో కోరిక గల్గి, వేదవాదుల్ = వేదములు నేర్చిన (జ్ఞానము సంపాదించిన) వారు, శమ + ఆదుల్ = ఓరిమి మొ॥ సుగుణములు, కడున్ చాలన్ ఆర్జించి = మిక్కిలిగా సంపాదించి, భోగ+ఇచ్ఛ+వర్జించి = భోగములమీది కోరిక వదిలివేసి, నానాతపః చర్యలు=వివిధములైన శరీరమును శుష్కింపచేసే పనులు (తపః = శుష్కింపచేయుట) తపస్సులు, ఆశ్చర్య = వింత గొలిపేలా, తాత్పర్య = తత్పరత (భగవంతునిలో తత్పరత) కల్గి, పరి + ఆకులత్వంబున్ = విశేషంగా ఏమీ తోచనిస్థితి (వెర్రివాని స్థితి), కైకొనన్ = స్వీకరించగా (వారు ఋషులు, మునులు, తపస్సులు చేసి ఏమీ సాధించక బిక్కమొగం వేయగా), మాకు = మావంటి అజ్ఞానులకు, ఏ యత్నముల్ లేక = ఎలాంటి ప్రయత్నము సాధనలేక, ఓ కృష్ణా! ఈ కైవడిన్ = ఈవిధంగా, మీ కృప + ఆలోక + సంసిద్ధి = మీ దయతో కూడిన చూపుల పొందిక, సిద్ధించుటల్ = దొరకుట, బుద్ధిన్ తర్కింపన్ అత్యంత చిత్రంబుగాదె! = మనసులో ఆలోచించగా అద్భుతంగా ఉందిగదా! (జ్ఞానం లేకున్నా, తపస్సు వంటి ఆచరణలు లేకున్నా కృష్ణకృప లభించుట ఆశ్చర్యం!), జగన్నాథ! = జగత్తుకంతటికి ప్రభువైన ఓ కృష్ణా!, ఈ రీతిన్ – చెన్నార = ఈ విధంగా శోభించగా, మున్ను + ఏ ఋషుల్ + మిమున్ – కన్ను + ఆర = పూర్వం ఏ మునులు మీ (దివ్యమంగళ) రూపాన్ని కన్నుల నిండుగ, కన్నారు = చూచారో!, మా కన్నులు + ఎన్నంగన్ + ఏ పుణ్యముల్ చేసెనో = మా కండ్లు (లెక్కిస్తే) ఎంత పుణ్యం చేసాయో కాని, ఈ విశేషంబు గాంచెన్ = ఈ భూమిపై (ద్వారకాధిపతిరూపంలో నిన్ను) చూచాము, విరించి + ఉదయస్థాన + నాభీ సరోజా = బ్రహ్మపుట్టిన చోటైన బొడ్డునందు కమలము ఉన్నవాడా! (విష్ణుమూర్తి అవతారము కృష్ణుడని అర్థము. "ధాతాబ్జయోనిర్ద్రుహిణో విరిఞ్చిః కమలాసనః" – అని అమరము),

సరోజాత + జాత + అండముల్ = బ్రహ్మనుండి పుట్టిన విశ్వగోళములు = బ్రహ్మాండములు, తండ తండంబులై యుండ = కుప్పలు తెప్పలుగా ఉండగా, ఒండొండ నీ రోమ కూపంబులు + ఏ పారగాన్ + తాల్చుటల్ చెప్పగా = పై బ్రహ్మాండములన్నీ నీ విశ్వశరీరములోని వెంట్రుకల మొదళ్లలో విలాసంగా

ధరించినావని నీ విశ్వరూపమును (పెద్దలు) చెప్పగా, నీవు గోవర్ధనంబు + ఎత్తితి + అంచున్ = (కృష్ణావతారంలో) గోవర్ధనమనే పేరుగల కొండను (చిటికెనవ్రేల) ఎత్తినావని, వరాహ + అవతారంబునన్ + ధారుణీ చక్రమున్ + తాల్చితి + అంచున్ = వరాహరూపంలో అవతరించి భూగోళమును (కోరలపై) ధరించినావని చెప్పగా, మహాకూర్మ భావంబునన్ = కూర్మావతారంలో పెనుతాబేలువై, మందర గ్రావమున్ = మందర పర్వతమును, మోచితి + అంచున్ = మోసినావని, జగంబుల్ సమస్తంబు = సర్వ (చతుర్దశ) భువనాలు, త్రైవిక్రమ ప్రక్రియా వేళ = మూడుమార్లు తన పాదంతో విక్రమించిన వామనావతార సందర్భాన, పాదత్రయిన్ చాలన్ = మూడు పాదములతో నిండుగా, పూరించితి + అంచున్ = నింపినావు అని, నుతింపంగ యుక్తంబె? = పొగడుట సరియా? (సర్వలోకములు తనరూపంగా ఉన్నవని ఈ పద్ధతిలో చెప్పడం ఎంతవరకు సమంజసం?), భక్తప్రజాధీన = భక్తులైన ప్రజలకు (అంతరూపం ఉండీ) అధీనమైన (వశమైన) వాడా!, దీనిన్ వివేకించి = ఈ సృష్టి రహస్యమును అర్థం చేసికొని, లోకంబులో, కొందరు + ఆర్య + ఉత్తముల్ = ఈ భూమిపై కొందరు జ్ఞానులైన పెద్దలు (శ్రేష్ఠులు), సర్వవేదంబులున్ = అన్ని వేదాలు (నాలుగు వేదాలు, ఆరు వేదాంగాలు, సకల ఉపనిషత్తులు), సర్వవాదంబులున్ = పూర్వమీమాంసాది సకల దర్శనశాస్త్రాలలోని భగవంతుడెవ్వడనే అభిప్రాయాలు, సర్వయాగంబులున్ = అశ్వమేధ, వాజసనేయ, సోమ, పుత్రాకామేష్టి, అతిరుద్రాది వివిధ యాగములును, సర్వయోగంబులును = సారూప్య, సామీప్య, సాలోక్య, సాయుజ్యాది (భగవంతునిలో లీనమయ్యే విధానంలోని) యోగాలు, సర్వమౌనంబులున్ = సకల మౌనక్రియలు (ముని పని మౌనం, మౌనం ఒక తపశ్చర్య – వాగ్బంధనం), సర్వదానంబులున్ = సువర్ణ, గో, భూ, హిరణ్యాది షోడశదానాలు, చూడన్ = పోల్చగా, నీ దాస, దాస + అనుదాస + అంఘ్రి – సంసేవలో = విష్ణు (కృష్ణు) దాసుల, వారి అనుదాసుల పాదసేవ చేసిన పుణ్యఫలంలో, కోటికోట్యంశములన్ పోలగాన్ చాలవంచు = కోటికోట్ల అంశ (లేదా భాగము)తో సరిపోల్చజాలమని, పాదసేవ ఇతర ఆరాధనలకంటే గొప్పదని; తత్ + ఆచారమున్ పూని వర్తింతురు + అత్యున్నతిన్ = పాదసేవలనే ఆచారాన్ని గొప్పగా ఆచరిస్తారు ("శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనం అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనం" అని తపస్సు

సాధ్యంకాని వారికి సులభమైన నవవిధ భక్తిమార్గములు సదా ఆచరణీయాలు అని భాగవతం చెపుతోంది). సత్యసంకల్ప + నిత్య + ఉదయా = సత్యమునే పలికే మనోభావనలోనుండే ఎల్లప్పుడూ జన్మించేవాడైన భగవంతుడు ("సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" అనే వేదోక్తి), ఏము నీ నామమాత్రంబు మా నాలుకన్ + చేర్చుటల్ తక్క = మేము నీ పేరును మాత్రం ఉచ్చరిస్తూ (ఇతర జ్ఞానమార్గాలు ఆచరించక, ఉచ్చరించక), ఒక్కింతయున్ తక్కు త్రోవలు = కొంచమైనా వేరే మార్గాలతో, భవత్ + మాయన్ దాటంగలేము = నీ మాయను దాటలేము. అవ్యయా = వ్యయము (తగ్గిపోవుట, నష్టపోవుట, మృతిచెందుట వంటివి) లేనివాడా! = భగవంతుడా!, భవ్యయోగి + ఇంద్ర = గొప్ప యోగశ్రేష్ఠులచే; సాంద్ర + ఆదర + ఆకాంక్షిత + ఏక + అంత + సంసేవన = మిక్కిలి ఆదరంతో కూడిన కోరికతో ఒంటిగా సేవించబడేవాడా!; భావన + అతీత కళ్యాణ = ఆలోచన పరిధికి మించిన శుభముల గూర్చేవాడా! (భావనకు అతీతమైంది మోక్షం. దాని లబ్ధి గొప్ప కల్యాణ కారకము), నానా-గుణశ్రీ- సముద్భాసిత + అంగ = అనేకవిధములైన ఉత్తమ గుణసంపదలచేత ప్రకాశించుచున్న శరీరము కలవాడా! (అనేక గుణములను ప్రదర్శించు అవయవములు కలవాడా!); మమ్మున్ + కేవలంబైన - కారుణ్య దృష్టిన్ - కటాక్షించి - రక్షించు! = మమ్ము కైవల్యసంబంధ (మోక్షసంబంధ)పు దయగల చూపులతో అనుగ్రహించి (భవసాగరమునుండి) రక్షించుమయ్యా!; లక్ష్మీమనోవల్లభా! = లక్ష్మీదేవి మనస్సును ఏలేవాడా!, దేవదేవా! = దేవతలకు దేవుడా! నమః తే, నమః తే, నమః తే = ఆధిభౌతిక, ఆధిఆత్మిక, ఆధిదైవికమైన, తే = నీకు - నీ త్రిమూర్త్యాత్మక స్వరూపమునకు, నమః = వందనము.

**తాత్పర్యము:** కృష్ణా! లక్ష్మీదేవికి కోరిన రూపంలో ఉండే వాడా! కరుణధార రూపా! కొత్తవైన ఎర్రని కిరణ సమూహముతో చిత్రవర్ణములు గలిగిన సూర్యరూపుడా! కాంతిలో కోటిసూర్యసమానుడా! కీర్తి అనే కర్పూర పరిమళములు వెదచల్లే పవిత్ర వేదములు ఉచ్ఛ్వాస నిశ్వాసములైన వాడా!

సకల లోకాల్లోను ఏకైక నిరంతరమైన గొప్పప్రభావం కలవాడా! కలవంటి మాయామోహితమైన అంతులేని సంసార దుఃఖాలను తొలగించేవాడా! ఉచ్చరించిన మాత్రాన్నే సర్వపాపాలు హరించే పవిత్ర నామం కలవాడా!

మోక్ష కాంక్షచేత నిండిన మనసులుకల బుద్ధిమంతులు ఆచరించే భక్తి మార్గమునకు నెలవైన తత్త్వము కల్గినవాడా! దేవతలు సైతము వర్ణింపలేని రూపము కలవాడా! గురువులను ఆశ్రయించి పొందిన జ్ఞానంచేత మధురభక్తితో సేవించే భక్తులకు శరణాగతి రక్షణనిచ్చేవాడా!

నిన్ను శరణుకోరిన వారికి వైరాగ్యమును (భోగవిముఖతను) ప్రసాదించేవాడా! సకలేంద్రియములను వశములో ఉంచుకొన్నవాడా! వాణీశివ బ్రహ్మాదులు నీ గొప్ప చరిత్రను తుదముట్టగా వర్ణింపలేక పోయినారని విన్నాము. ప్రపంచంలో ఉన్న మోహబంధాన్ని తొలగించుకోలేక, కేవలం కవిత్వాత్మక స్తుతితో సరిపెట్టుకొంటున్నాము. మా తప్పులను మన్నించు.

ఓ వాసుదేవా! మమ్ము రక్షించు. ఆనందరూపుడవై, ధర్మమునకు అధిపతివై మాకు ఆనందాన్ని ప్రసాదించు. విచారం, దుఃఖం తొలగించు. నిన్ను మాటలతో వర్ణింపలేము. నీ రూపాన్ని మనసుతో ఊహించలేము.

నిరంతరానందరూపా! గోవులకు అధిపతీ! మా హృదయములలో ఎల్లవేళలా నిండిన దుఃఖాన్ని పోగొట్టి సంతోషాన్ని నింపు. వేదజ్ఞానాన్ని సంపాదించి, శమదమాదులు కలిగి, భోగములు విసర్జించి శరీరమును శుష్కింపజేసి తపస్సులు చేసే మునులకు కూడా దొరకని నీవు, మావంటి అజ్ఞానులకు ఏ సాధనలు లేకుండానే దొరకు నీ దయావీక్షణాలు లభించుట ఆశ్చర్యంకాదా!

జగత్ప్రభూ! ఋషులు, మునులు కన్నులారా దర్శించిన మీ దివ్యమంగళ రూపాన్ని ఈ భూమిపై ఇక్కడ ద్వారకాధీశుని రూపంలో చూసే భాగ్యం కల్గింది. పద్మనాభా! బ్రహ్మాండాది విశ్వగోళములు నీ రోమకూపములు. గోవర్ధన పర్వతాన్ని చిటికెనవ్రేల నెత్తినావు, వరాహరూపంలో కోరలపై భూమిని ఉద్ధరించినావు, కూర్మావతారంతో మందర పర్వతమును వీపుపై మోసినావు, చతుర్దశభువనాలు మూడు అడుగులలో ఒక్కోఅడుగుగా త్రిలోకవిక్రమంగా పాదంతో విస్తరించి వామనావతారమున నిండినావు అని పొగడగలమే? వీటి అంతరార్థం గ్రహించి లోకాలన్నీ నీవేనని ఈ సృష్టిరహస్యమును పెద్దలు తెలుపగా చతుర్వేదాలు, షడంగాలు, పురాణాలు, ఉపనిషత్తులు, సర్వవేదములు, సకల యాగములు, సర్వయోగములు, సర్వదానాలు నీ దాసులను సేవించిన పుణ్యఫలములో ఒక కోటి అంశమైనా కాదు – అని నీ దాసులను పాదసేవనముచే కొలుస్తారు.

సత్యమునందు నిరంతరం ఉండే నీవు, నీ నామజపం తప్ప అన్యమార్గాలలో నీ మాయను దాటలేము.

నాశములేనివాడా! యోగులచే సేవించబడేవాడా! మా ఆలోచనలను అతిక్రమించిన శుభములు కూర్చేవాడా! ఉత్తమగుణ సంపదలచే ప్రకాశించేవాడా! కేవల కారుణ్యదృష్టితో మమ్ము రక్షించి, భవసాగరంనుండి తరింపజేయుమయ్యా! లక్ష్మీవల్లభా! ఆధిభౌతిక, ఆధ్యాత్మిక, ఆధిదైవికమైన నీ త్రిమూర్త్యాకస్వరూపమునకు నమస్కారములు!

**ఈ రగడలోని విశేషాలు**

(i) సింహావలోకన ముక్తపదగ్రస్తం బహుధా పాటించబడింది.

(ii) యమకాది శబ్దాలంకార శోభితము.

(iii) ఇది సంస్కృతాంధ్రాల్లో వ్రాయబడిన ద్విభాషా దండకం, (ఆంజనేయుని దండకం "శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం"మధ్యలో తెలుగుభాషలోకి మారుతుంది. అదే విధానం.)

(iv) ఇది తగణ దండకం + చివర గురువు

U U I   U U I   UUI U

(న) మస్తేన, మస్తేన, మస్తేన మః

త   త   త  గ

వరుసగా ఎన్ని తగణాలైనా వేయవచ్చు. ఈ దండకంలో 289 తగణాలు + 1 గురువు వేసి సూరన వ్రాశాడు.

(v) దండకం గానప్రక్రియ. అందుకే కంఠస్థం చేసి, కలభాషిణి తన మధుర (కల)మైన గొంతుతో గానం చేసింది.

(vi) ప్రబంధాల్లో ఈ దండకం నియమంగా వ్రాసేవారు.

(vii) తెలుగు సాహిత్యంలో కృష్ణదండకం అరుదుగా లభించేది.

**– డా॥ సంగనభట్ల నరసయ్య**

**చరవాణి: 94400 73124**



అనుబంధము-6

# దాతలకు కవితాశీస్సులు

## 6.1 శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారి ప్రశంస

**రచన: కీ.శే. దేవులపల్లి చెంచుసుబ్బయ్యగారు**

(ఈ శతక ముద్రణకు మరొక గ్రంథ ముద్రణకు కలిపి ఉదారహృదయంతో రూ. 50,000/- లు విరాళమిచ్చిన వారు శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు. వీరు 'ఉయ్యాలవాడ'లో 2009లో "రేనాటి సూర్యచంద్రుల స్మారక సమితి"ని స్థాపించి, దానికి అధ్యక్షులుగా కొనసాగుతున్నారు. నంద్యాలలో "భారతి సీడ్స్" అను విత్తనసంస్థద్వారా రైతులకు అపారమైన సేవలు అందిస్తున్నారు. 'మధురకవి' దేవులపల్లి చెంచుసుబ్బయ్యగారు 2013లో రచించిన "రేనాటి వీరభారతం" అనే పద్యకావ్యాన్ని అంకితం పొందిన శ్రీ బ్రహ్మానందరెడ్డిగారు దానిని ముద్రించి వెలుగులోకి తెచ్చారు. ఆ కావ్యంనుండి ఈ క్రింది పద్యములు గ్రహింపబడినవి - సంపాదకుడు: తంగిరాల)

**సీ. శ్రీ వేంకటేశ్వర శ్రీకరపాదాబ్జ, చింతనానంద సచ్చిత్తుఁడతఁడు**
**శ్రీశైలమందిర శ్రీమల్లికార్జున, పాదాబ్జ సేవక భక్తుఁడతఁడు**
**సౌజన్య పూర్ణుండు సౌభాగ్యవంతుండు, కారుణ్యనిలయుండు ఘనుఁడతండు**
**"పోచా" కులాంభోధి పూర్ణశశాంకుండు, వేదాంత విజ్ఞాన విలసితుండు**

**గీ. శ్రీ విరాజిత మోటాటి రెడ్డివరుఁడు**
**వాసిఁగాంచిన ఉయ్యాలవాడవాసి**
**కర్షకోత్తముఁడాతఁడు ఘనయశుండు**
**ఆత్మతత్త్వంబెఱింగిన యమృతమూర్తి**
**శ్రితజనసురభి "వేంకటరెడ్డి"వరుఁడు.** 1

గీ. అమ్మహోత్ముని యర్ధాంగి యమలచరిత
సద్గుణోపేత సాధ్వి సౌజన్యభరిత
అమలగుణపూర్ణ యతిథుల కన్నపూర్ణ
ఈశుపదముల మదినమ్ము "నీశ్వరమ్మ". 2

గీ. అమ్మహోత్ముల పూర్వపుణ్యముల పంట
సుగుణ విభ్రాజి సాంద్రయశోవిరాజి
సదమలకుల నందన హరిచందనంబు
ప్రియసుతుండు "బ్రహ్మానందరెడ్డి" వరుఁడు. 3

సీ. "పోచా"కుల సుధాబ్ధి పూర్ణశశాంకుఁడై, ప్రభవించినాఁడు సౌభాగ్యమూర్తి
వ్యవసాయశాస్త్రంబు నాపోసనముఁబట్టి, యందరి మన్ననల్ పొందినాఁడు
"భారతీ సీడ్స"ను భవ్యమౌ సంస్థను, స్థాపించినాఁడు ప్రశస్తిఁగూర్పఁ
బ్రముఖమౌ శ్రీశైల పబ్లికు స్కూలునుఁ, బురమున నెలకొల్పి పొలుపుఁ గాంచె

గీ. పోసఁగ సత్కళా సాహిత్య పోషణంబు
సలుపు చౌదార్యధుర్యుఁడై చెలువు మీఱ
ఔర! నంద్యాల పురమునఁ బేరుఁగాంచె
శ్రీవిరాజి బ్రహ్మానందరెడ్డివరుఁడు. 4

గీ. రైతుబాంధవుఁడనగ విఖ్యాతిఁగాంచె
బాలవిద్యాభివృద్ధికై పాటుపడియె
మధుర హృదయుఁడు, సౌజన్య మాన్యఁవరుఁడు,
శ్రీయుతుండు బ్రహ్మానందరెడ్డివరుడు 5

చం. కలియుగ దానకర్ణుడయి ఖ్యాతినిఁగాంచిన వేంగళాఖ్య స
న్నిలయము నందుఁబుట్టె సతి నిర్మలచిత్తకు వేంకటమ్మకున్
నెలవగు "పోచ" వంశమున నిశ్చల భావుఁడు పుట్టినాఁడు, వా
రల సుగుణంబులన్నియు విరాజిలుగా మన రెడ్డియందునన్. 6

సీ. విద్యానవద్యుఁడై విద్యాభివృద్ధికిఁ, బాఠశాలను నిల్పెఁ బట్టణమున
సద్బీజములఁగూర్చి సహకార మందించి, వ్యవసాయదారుల బంధువయ్యె
పరిశోధనము సల్పి బహుఫలంబుల నెర్గి, యధిక దిగుబడుల నరయఁగూర్చెఁ
బాత్రోచితంబుగా బహుదానముల సల్పి, పురి మహాదాతగాఁ బొలుపుఁ గాంచె

గీ. బహువిధోన్నత సద్భావబంధురుండు
ధీరశాంత స్వభావుం దుదారగుణుఁడు
ప్రముఖుఁడు పరోపకారపరాయణుండు
శ్రీవిరాజి బ్రహ్మానందరెడ్డివరుఁడు. 7

కం. "రేనాటి సూర్యచంద్రుల"
నేనాటికి మరువకుండ నీనాటికినిన్
దానొక స్మార సమితిని
మానుగ నెలకొల్పినాడు మాన్యుండగుచున్. 8

ఉ. లేదను మాటరాదు గద! లేనిదియైనను దెచ్చియిచ్చుఁ దా
గాదన దేమి యడ్గినను గల్పమహీరుహమౌను నర్థులౌఁ
బేదల సాదలన్ గనును వేదనఁ బాపును బ్రేమమూర్తియై
మోదముఁగూర్చు నెల్లరకు ముందుగ సార్థకనామధేయుఁడై 9

కం. హితముగ మితముగఁ బ్రియముగ
జతురతతోఁ బల్కు నతడు సజ్జనహితుఁడై
వితరణశీలుండాతఁడు
సతతము వ్రతముగ సలుపును సత్కార్యంబుల్. 10

చ. పలుదేశంబుల కేఁగినాఁడు, పలుభాషల్ నేర్చి భాషించుగా
విలువల్ బెంచును సత్యమూర్తియగుచున్ విజ్ఞానపూర్ణుండునై
సలుపున్ నిత్యము సత్ప్రజాహిత మహాసౌభాగ్య సత్కార్యముల్
ఫలముల్ గోరని కర్మయోగి యితఁడే భాగ్యంబులున్ గల్గెడున్. 11

కం. తెలియదు "లా"కేత్వము, మఱి
తెలియదుగద "ద"కునుఁగొమ్ము ధీమంతునకున్!

దెలియును మిగిలిన వన్నియు
నిల బ్రహ్మానందరెడ్డి కెల్లరుఁ బొగడన్. 12

మ. ప్రతివర్షంబును సత్సభన్ జరుపు సౌభ్రాతృత్వ మొప్పారఁగా
హితులన్ బాత్రుల ఛాత్రులన్ బ్రజలనున్ హేరాళమౌ రీతిగా
నతిమోదంబునఁ బిల్వఁబంచి యిట బ్రహ్మానందరెడ్డీంద్రుఁడు
న్నత భావంబున సంస్మరించు మదిలో నానందసంధాతలన్. 13

మ. కవితానంద వినోద లాలసుఁడు, సత్కల్యాణ శీలుండు, శ్రీ
ధవ పాదాంబుజ షట్పదంబు, వర విద్యావంతుఁ డౌదార్య స
న్నవ భావాన్విత భవ్యమానసుఁడు, నానాగ్రంథ విజ్ఞానియున్,
వ్యవసాయజ్ఞుఁడు, కీర్తిఁగాంచె భువి బ్రహ్మానందరెడ్డీంద్రుఁడున్. 14

గీ. ఆశ్రయంబెందు లేని విద్యావిరాజి
తాంధ్ర సుకవి శుకపికాళి కాశ్రయంబు
నిచ్చి కల్పతరువుగఁ బోషించు నెపుడు
శ్రిత కవిజన మందార మీ రెడ్డివరుఁడు. 15

కం. ఉయ్యాలవాడ కీ ధర
కయ్యా! గుర్తింపుఁ దెచ్చి యందటితోడన్
నెయ్యంబున మెలగెదవుగ
వెయ్యేండ్లిల వెలుగుమింక విజ్ఞతతోడన్. 16

మ. సరసోదాత్త గుణాకరున్, బుధవరున్, సౌజన్య సంశోభితున్,
వర కర్తవ్యపరాయణున్, మధుర సౌభ్రాతృత్వ సద్భావు, స
చ్చరితున్, నిత్య పరోపకారగుణు, భాషాభిజ్ఞు, ధీరోత్తమున్,
హరి శ్రీరాముఁడు బ్రోచు నెప్పుడును బ్రహ్మానందరెడ్డీంద్రునిన్. 17

కం. జయమగు బ్రహ్మానందా!
జయమగు శుభమగు సతతము సద్ఘనకీర్తీ!
జయమగు శ్రీహరి బ్రోచును
జయము జయంబగును నీకు జనహిత! రెడ్డీ! 18

## 6.2 తావిగల మేలిమి బంగారం

జుంటితేనెవంటి తీయని పలుకుల్లో
చల్లని పిల్లతెమ్మెరల హాయి!
బూరుగుదూదివంటి మెత్తని మనసులో
విరిసిన పండువెన్నెల రేయి!
సింపుల్ ఖాదీలుంగీ,
ఖాదీ లాల్చీ,
మెడచుట్టూ సిల్కుకండువా!
బొండుమల్లెల రాశిలా
తెల్లని దుస్తుల సింగారం!
నిండైన ఆయన వ్యక్తిత్వంముందు
ఓడిపోతుంది మేలిమి బంగారం!

తన్మయీభూత శ్రీరామభక్తి,
చిన్మయానంద వేదాంతరక్తి,
విరామరహిత సమాజ సంసేవానురక్తి,
కవిపండిత పోషణాభివ్యక్త సంపత్తి!
"రిచ్‌మండ్ సర్కిల్"లోని
సువర్ణవ్యాపార పారావారానికి
ఆయన 'ప్రతిభ' ఒక లైట్‌హౌస్!
బెంగుళూరు ఆర్యవైశ్యప్రపంచానికి
ఆయన నాయకత్వం ఒక వైట్‌హౌస్!

**50** వసంతాల మా చెలిమి,
పాతిక విశ్వనాథ జయంతుల కలిమి,

సౌమ్య సౌజన్య సౌహార్ద సౌమనస్యాల బలిమి!
ఒక నవరసభరిత లలితకళాగోష్ఠి,
శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠి!!

బంగారానికి పరిమళాన్ని
జోడించలేకపోయాడు బ్రహ్మ!
ఆ లోపాన్ని సరిచేసుకోవాలని,
సకలసద్గుణ సంపన్నులైన
మా శ్రేష్ఠిగారిని సృష్టించాడు
ఆ పరమేష్ఠి!!

ఆర్యా!

కూతుళ్ళు, అల్లుళ్ళు
కొడుకులు, కోడళ్ళు,
మనుమలు, మనుమరాండ్రు,
మునిమనుమలు, మునిమనుమరాండ్రు,
నిండు కుటుంబ నందనవనంలో విహరిస్తూ
ఆయురారోగ్య భోగ్యభాగ్యాలతోడ
వర్ధిలుడు మీరు నూరు సంవత్సరాలు!

("దానరాధేయ" శ్రీసకలా నరసింహులుశ్రేష్ఠిగారికి)

– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

# 6.3 'సూరీడు' కాదు - వెన్నెలరేడు

మా 'శ్రీరస'కు పెట్టనికోట మీరు!
మా ప్రవచనమందిరాన్ని 'మయసభ'లా తీర్చిదిద్దిన ఘనులు మీరు!
మాకు ఆప్యాయంగా 'భరద్వాజవిందు' లిచ్చే అపూర్వ దంపతులు మీరు!
మా 'వెండిపండుగ' సంచికకు వెన్నుదన్ను మీరు!
ఏది కోరినా వెంటనే తీర్చే కల్పవృక్షం మీరు!
నిండుపున్నమి చంద్రునివంటి గుండ్రటిముఖం
నుదుటిపై తొలిపొద్దువంటి ఎర్రటికుంకుమబొట్టు
పెదవులపై చెరగని చిరునవ్వులవెన్నెల
ముఖమంతా వెలిగే బ్రహ్మవర్చస్సు
పేరు 'సూరీడు' కాని మాకు మాత్రం వెన్నెలరేడు!
శేషశైలవాసునిపై విశేషభక్తి
దిక్కుదిక్కుల పుణ్యక్షేత్రాలన్నీ చుట్టివచ్చిన మోక్షరక్తి
సుమనస్కులైన మీరు మాకొక విశిష్టవ్యక్తి!
మీకివే మా నమస్సుమనస్సులు!
వినయవిధేయతలు మూర్తీభవించిన అపరఅన్నపూర్ణ
సొట్టబుగ్గల సుందరఅర్ధాంగి 'పర్వతవర్ధని'గారి
వెన్నెలనవ్వుల మల్లెపూల జల్లులతో,
కొండంత అనురాగం కురిపించే
కొడుకుతో, కోడలితో,
కూతుళ్ళతో, అల్లుళ్ళతో,
మనుమలతో, మనుమరాండ్రతో
నిండు కుటుంబ కుసుమవనంలో విహరిస్తూ
ఆయురారోగ్య భోగభాగ్యాలతోడ
వర్ధిలుదు మీరు నూరు సంవత్సరాలు!!
(శ్రీమతి పర్వతవర్ధని – శ్రీ నారపరాజు సూర్యనారాణయణ దంపతులకు)

– ఆచార్య తంగిరాల వెంకట సుబ్బారావు

## 6.4 శ్రీ వి.ఎ.కె. రంగారావుగారు

### ఆశుకవిత

**ఆ.వె. పలుకు పలుకునందు చిలుకుచుండు సుధలు**
**మాట పలికినంత మరులు గొందు**
**నిన్ను జూచినంత వెన్నెలగును ఎండ**
**రాధప్రియుని ప్రియుడ! "రంగరాయ"!!**

– "ఆశుకవిశేఖర" – "అవధాన చక్రవర్తి"

**కీ.శే. బులుసు వేంకట రామమూర్తిగారు**

సేకరణ: **కీ.శే. బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డిగారు**

## ఈ గ్రంథ ముద్రణకు ఉదార హృదయంతో విరాళాలు ఇచ్చిన మరికొందరు దాతలు

32. శ్రీ రుద్రరాజు వెంకట సూర్యనారాయణరాజుగారు, గణపవరం, పశ్చిమ గోదావరి జిల్లా.
33. శ్రీమతి చక్రావధానుల పద్మ–శ్రీ లంక చంద్రశేఖరం దంపతులు, బెంగుళూరు.
34. డా॥ ఎం. రుక్మాంగదనాయుడుగారు, బెంగుళూరు.
35. శ్రీ తాళ్ళపాక అన్నమాచార్యులవారి పెద్దసేవకుడు, చెన్నై.
36. ప్రొ॥ మలయవాసిని – ప్రొ॥ కోలవెన్ను పాండురంగ విఠలమూర్తి దంపతులు, విశాఖపట్టణము.
37. శ్రీ మోపూరు వేణుగోపాలయ్యగారు, నెల్లూరు.
38. శ్రీ కె. గంగరాజుగారు, బెంగుళూరు.
39. శ్రీ కొండూరు మోహనరాజుగారు, బెంగుళూరు.
40. శ్రీ ఎన్. భాస్కరరాజుగారు, కార్వేటినగరం, చిత్తూరుజిల్లా.

**గమనిక: –** కొందరు మిత్రులు పంపిన విరాళాలు ఈ గ్రంథ ముద్రణ పూర్తి అయ్యాక అందాయి. అందువల్ల ఆ ధనాన్ని నా "కాటమరాజుకథలు–మూడవ సంపుటం" ముద్రణకు ఉపయోగించాను. వారి పేర్లు ఫోటోలు ఆ గ్రంథంలో చూడవచ్చు.

## మథురానగరంలో ప్రవేశించిన శ్రీకృష్ణుడు

సీ॥ వీఁడఁటే! రక్కసి విగతజీవిగఁ జన్నుఁ
బాలు ద్రావిన మేటి బాలకుండు!
వీఁడఁటే! నందుని వెలఁదికి జగమెల్ల
ముఖమందుఁ జూపిన ముద్దులాఁడు!
వీఁడఁటే! మందలో వెన్నలు దొంగిలి
దర్పించి మెక్కిన దాఁపరీఁడు!
వీఁడఁటే! యెలయించి వ్రేతల మానంబు
చూఱలాడిన లోకసుందరుండు!

తే॥ వీఁడు లేకున్న పుర మటవీస్థలంబు!
వీనిఁ బొందని జన్మంబు విగతఫలము!
వీనిఁ బలుకని వచనంబు విహగరుతము!
వీనిఁ జూడని చూడ్కులు వృథలు వృథలు!

(–పోతన భాగవతము, 10–1248)

# I. భగవాన్ శిఖిపింఛ మౌళిః




తిరుమల గర్భగుడిలో ఉన్న నవనీత కృష్ణుడు (రజత విగ్రహము)



మథురలోని రాధాకృష్ణులు



సుభద్రా బలభద్ర సమేత శ్రీజగన్నాథస్వామివారు, పూరి



పండరీపుర కృష్ణుడు (పాండురంగడు)



ఉడుపి కృష్ణుడు



శ్రీహిమవద్ వేణుగోపాలస్వామివారు,
గుండ్లుపేట, మైసూరుజిల్లా



శ్రీకేశవస్వామివారు, తణుకు, పశ్చిమగోదావరిజిల్లా



మా ఊరిలో మా తాతగారు కట్టించిన శ్రీవేణుగోపాలస్వామిగుడి (1925), కాకుల ఇల్లిందలపఱ్ఱు, తణుకుతాలూకా, పశ్చిమగోదావరిజిల్లా.



మా తల్లిదండ్రులు ప్రతిష్ఠించిన వేణుగోపాలుడు, బలరాముడు (25.12.1925)



కార్వేటినగరం శ్రీవేణుగోపాలస్వామివారి ఉత్సవమూర్తులకు
అభిషేకం చేస్తున్న అర్చకులు



అభిషేకానంతరం ఉత్సవమూర్తులు



అలంకరణతో ఉత్సవమూర్తులు



అర్చకస్వాములతో ఉత్సవమూర్తులు



అర్చకస్వామితో ఉత్సవమూర్తులు



అలంకరణతో ఉత్సవమూర్తి శ్రీవేణుగోపాలస్వామివారు.



అలంకరణతో ఉత్సవమూర్తులు



భక్తితన్మయత్వంతో స్వామివారికి నాట్యార్చన చేస్తున్న
శ్రీ.వి.ఎ.కె. రంగారావుగారు.

## II. వ్యాఖ్యాతలు – సంపాదకుడు – పండితులు



విద్వాన్ గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు



శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారు



డా॥ సంగనభట్ల నరసయ్యగారు



ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావుగారు



ఆచార్య శలాక రఘునాథశర్మగారు



కృష్ణభక్తుడు శ్రీ వి.ఎ.కె. రంగారావుగారు

## III. దాతలు - కృతిస్వీకర్తలు




"రైతుబాంధవుడు" శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు
నంద్యాల పార్లమెంటు సభ్యులు



శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారు - ధర్మపత్ని శ్రీమతి పుల్లమ్మగారు



డా॥ కాదరబాద్ రవీంద్రనాథ్‌గారు -
ధర్మపత్ని శ్రీమతి జ్ఞానప్రసూనగారు



శ్రీ నారపరాజు సూర్యనారాయణగారు–
ధర్మపత్ని శ్రీమతి పర్వతవర్ధనిగారు



"దానరాధేయ" శ్రీ సకలా నరసింహులుశ్రేష్ఠిగారు



**ఆచార్య తంగెడ కిషన్‌రావుగారు**



**60 వసంతాల అంబికగారితో...**



**90శరత్తుల పెద్ది సత్యనారాయణగారితో...**



**సాహిత్యమే ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా కలిగిన**
**శ్రీమతి కామేశ్వరి - శ్రీ కె.బి.జె. శ్రీనివాస్ దంపతులు**



డా॥ తెన్నేటి రాజశ్రీ మీనలోచనగారు



శ్రీమతి అయినంపూడి శ్రీలక్ష్మిగారు



శివకవి ఎన్. శివగౌడుగారు
(1932–2001)



శ్రీమతి బి. శ్రీకృష్ణవేణిగారు



డా॥ ఎం. రుక్మాంగదనాయుడుగారు



డా॥ పి.యు.బి. శర్మగారు
(డా॥ పోతుకూచి ఉమాభట్టీశ్వరశర్మగారు)



సాహిత్యమే పంచప్రాణాలుగా బ్రతికిన దంపతులు
కీ.శే. శేషగిరి సత్యనారాయణగారు (1931–2017) –
శ్రీమతి లక్ష్మీప్రసన్నాంబగారు



80 శరత్తుల 'తమ్ముడు' శంకరరావుతో...



శ్రీ మల్లాప్రగడవారిని సత్కరిస్తున్న శ్రీ ఎన్. జగన్నాథగౌడుగారు



శ్రీమతి మారుతి శ్రీలత - శ్రీవి. సురేంద్రనాథ్ దంపతులు

